# జర్నలిస్టుల కోసం




గోవిందరాజు చక్రధర్





Media House

Publications

# అక్షరాభిషేకం . . .



పాత్రికేయత్వాన్ని నరనరాన జీర్ణించుకున్న
మానవతావాది, సామాజిక సేవాభిలాషి

ఐ.ఎ.ఎస్. స్టడీ సర్కిల్ డైరెక్టర్

**శ్రీ ఆర్. సి. రెడ్డి. బి. గారికి**

ప్రేమతో .... గౌరవంతో...

మానవతావాది, సామాజిక సేవాభిలాషి

# శ్రీ ఆర్. సి. రెడ్డి

**జ**ర్నలిస్ట్‌గా జీవితాన్ని ప్రారంభించి పరిస్థితుల ప్రాబల్యంతో యాదృచ్ఛికంగా రంగం మారినా నరనరాన పాత్రికేయత్వాన్ని జీర్ణించుకుని ఆ అభిరుచికే అంకితమైన మానవతావాది, సామాజిక సేవాభిలాషి శ్రీ ఆర్. సి. రెడ్డి. న్యూఢిల్లీలో న్యూవేవ్, సోషలిస్ట్ ఇండియా పత్రికలకు 70వ దశకంలో జర్నలిస్ట్‌గా పనిచేసిన శ్రీ రెడ్డి దిహిందూ తదితర దినపత్రికలలో, మ్యాగజీన్‌లలో ఇప్పటికీ వ్యాసాలు రాస్తూ, ఫ్రీ లాన్స్ జర్నలిస్ట్‌గా కొనసాగుతున్నారు. దీంతో పాటు కరంట్ ఈవెంట్స్ అండ్ ఎనాలసిస్ అనే పీరియాడికల్‌కు ఎడిటర్‌గా ఉన్నారు. ఈ పీరియాడికల్ ఐ.ఎ.ఎస్ పరీక్షలు రాసే విద్యార్థులలో విశేష ప్రాచుర్యం, ఆదరణ పొందింది. ఢిల్లీలో సైతం శ్రీ ఆర్.సి.రెడ్డికి మంచి పేరు తెచ్చింది.

మానవ సమాజ మనుగడకు మానవతావాద దృక్పథాన్ని మించింది లేదని ఆయన ప్రగాఢంగా విశ్వసిస్తున్నారు. ''నీ మంచికోసం మంచిగా ఉండు మంచివాడితో - మోసగాడు ఏ మతస్తుడయినా ఏ కులస్తుడయినా ఏ భాషవాడయినా నిన్ను ముంచుతాడని తెలుసుకో'' అన్నది ఆయన నినాదం.

వ్యక్తులకంటే వ్యవస్థలు, విధానాలు ముఖ్యమని నమ్మే శ్రీ రెడ్డి, రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థలలో మార్పులు తీసుకురావడానికి తద్వారా మానవ సమాజ మనుగడకు తన శక్తిమేరకు పాటుపడుతున్నారు. ప్రజా సమస్యల గురించి స్పందించడం, పరిష్కార మార్గాలు సూచించడం, అమలుకోసం ప్రయత్నించడం సాగిస్తున్నారు. త్వరితగతిన పేదరిక నిర్మూలన అనే వ్యాసం ఆయన విశ్లేషణాత్మక ప్రతిభకు అద్దం పడుతోంది. విద్యకు ఆహారం పథకం కోసం పరితపించారు. నేరపూరిత రాజకీయాల నిరోధానికి స్వయం ప్రతిపత్తిగల నేర పరిశోధక శాఖకోసం తన పరిధిలో కృషి చేశారు.

మరో పక్క రెండు దశాబ్దాలుగా ఎందరో విద్యార్థులు ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్ ఇతర సివిల్‌సర్వీస్ అధికారులు కావటానికి తోడ్పడుతున్నారు. కడప జిల్లా నందలూరు గ్రామంలో శ్రీ భూమనరెడ్డి మల్లారెడ్డి, శ్రీమతి భవానమ్మ దంపతులకు 1948 డిసెంబర్ 15న జన్మించిన శ్రీ ఆర్.సి.రెడ్డి నిగర్వి, నిరాడంబరుడు. తాను సాధించినదానితో సంతృప్తి చెందక సామాజిక సేవారంగంలో చేయాల్సినదెంతో ఉందని నిరంతరం ఆరాటపడే తత్వం ఆయనది.

ఇది ఓ మానవతావాదికి, సామాజిక సేవాభిలాషికి, నిరంతర అధ్యయన శీలికి పదేళ్ల సాన్నిహిత్యంతో అభిమానపూర్వకంగా చేస్తున్న అక్షరాభిషేకం.

**- గోవిందరాజు చక్రధర్**

# అక్షర శిల్పులకు అపురూప కానుక

వార్తా సేకరణ నుంచి

వ్యవహార సరళివరకూ

వార్తారచన నుంచి

వర్తమాన ధోరణుల వరకూ

చక్కగా రాయటం గురించి

సూటిగా, స్పష్టంగా చెప్తోందీ పుస్తకం

ఇంకా ఎడిటర్లతో ఇంటర్వ్యూలు

మోహన్ కార్టూన్లు, శంకర్ కేరికేచర్లు

***కాలంతో పరుగులు తీసే***

***అక్షర శిల్పులకు ఇదొక***

***అపురూప కానుక***

*ఒక గొప్ప పుస్తకం చదివినపుడు*

*ఓ కొత్త స్నేహితుడు దొరికినంత సంబరం*

*ఆ పుస్తకాన్ని మళ్లీ ఓ సారి చదివితే*

*చిరకాల మిత్రుని కలిసినంత ఆనందం*

*– గోల్డ్ స్మిత్*

# ఇలా చదవండిక ..

# ఈ పుస్తకం ఎందుకు చదవాలి



## బూదరాజు రాధాకృష్ణ

ప్రిన్సిపల్, ఈనాడు జర్నలిజం స్కూల్

**ఈ** శతాబ్ది మొదటి దశాబ్దంనుంచీ తెలుగులో దినపత్రికలుకూడా వెలువడ్డాయి. అంతకుముందు రకరకాల తెలుగు పత్రికలు వచ్చాయి. జర్నలిజం ఒక శాస్త్రంగా, వృత్తివిద్యగా, విద్యగా అవతరించిన చాలా కాలం తరవాత మన విశ్వవిద్యాలయాల్లో బోధన విషయమయింది. కాని శాస్త్రాన్ని ఇంగ్లీషులో చదువుకొని తెలుగులో అర్థంచేసుకోవలసిన పరిస్థితి ఇప్పటికీ ఉంది. తెలుగు బోధన మాధ్యంగా జర్నలిజంనేర్పే సంస్థల సంఖ్య చాలా తక్కువ. ఇటీవలి కాలంలో భాషాసాహిత్య విద్యార్థులకు జర్నలిజాన్ని ప్రత్యేక విషయంగా బోధించటం మొదలయింది. ఇప్పుడిప్పుడే తెలుగులో జర్నలిజాన్ని గురించి వివరించే గ్రంథాలు వెలువడుతున్నా వాటి పరిధితక్కువ, వ్యాప్తి తక్కువ. ఇంగ్లీషులో వందలకొద్ది గ్రంథాలు లభ్యమవుతుంటే తెలుగులో పదుల సంఖ్యలోకూడా అవిలేవు. ఇలాంటి పరిస్థితిలో గోవిందరాజు చక్రధర్ రాసిన ''జర్నలిస్టులకోసం'' అనే పుస్తకం వెలుగు చూస్తున్నది. గ్రంథకర్తను అభినందిస్తూ గ్రంథానికి స్వాగతం చెప్పవలసివుంది. ఇదో మంచి పరిణామం.

ఏభాష ఎప్పుడు పుట్టిందన్నది అంత ముఖ్యవిషయం కాదు. అది లిపి బద్ధమైనప్పుడు కొంత అభివృద్ధి సాధించిందని చెప్పవచ్చు. ఇప్పటికీ సొంతలిపిలేని భాషలు ప్రపంచంలో వందల సంఖ్యలో ఉన్నాయి. లిపి ఏర్పడ్డ తరవాత భాషా పరిణామం కొంత మందగించినా, అది సాహిత్యదశకు చేరుకొని స్థిరరూపం సంపాదించే ప్రయత్నంలో పడుతుంది. నోటిమాటకన్నా అక్షరరూపంలో ఉన్న మాటకు సమాజంలో గౌరవస్థానముంటుంది. వాగ్రూపంలోని భాష క్రమపరిణామంలో సాహిత్య భాషగా ఎదిగిన తరవాత అంతటితో ఆగిపోదు. మానవసమాజం దాన్ని అన్ని రంగాల్లోనూ భావవ్యక్తీకరణకు ఉపయోగిస్తుంది. భిన్న వృత్తుల్లో సంపాదించిన పరిజ్ఞానాన్ని, అనుభవాన్ని లిఖిత రూపంలో పెట్టే ప్రయత్నంలో అదొక ప్రత్యేక శాస్త్రంగా, శాస్త్ర భాషగా అభివృద్ధి చెందుతుంది. శాస్త్ర సాహిత్యం ఎంత విస్తృతంగా ఉంటే భాష అంత ఆధునికమవుతుంది. భాషను నవీకరించాలంటే ఆభాష మాట్లాడే సమాజం దాన్ని తనకు తెలిసిన అన్ని రంగాల్లోనూ నోటిమాటల్లో, లిఖిత గ్రంథాల్లో ఉపయోగించాలి.

ప్రపంచ భాషలుగా ఉన్న ఇంగ్లీషు వంటివి అపార శాస్త్ర సాహిత్య భాషలుగా ఆధునిక భాషలుగా పేరు సంపాదించాయి. తమ మాతృభాషలో ఆయా శాస్త్రాలను అధ్యయనం చేసిన ఇంగ్లీషు బాలబాలికలు తమ భాషలోనే ఆలోచించి, తమకు తట్టిన కొత్త ఆలోచనలనూ, భావనలనూ ఆభాషలోనే వ్యక్తీకరించి భాషాభివృద్ధితోబాటు విజ్ఞానాభివృద్ధినికూడా సాధించ గలుగుతున్నారు. ఈ నిరంతర పరిణామం ఇంగ్లీషును ఆధునిక భాషల్లో అగ్రస్థానంలో నిలుపుతున్నది. తెలుగులో ఆయాశాస్త్రాల్లో మంచి పుస్తకాలు లేనందువల్ల తెలుగు

విద్యార్థులు ఇంగ్లీషుద్వారా శాస్త్రజ్ఞానం సంపాదించవలసివస్తున్నది. అందువల్ల వారి భావనాశక్తి ఎంతో కొంత కుంటుపడుతున్నది. స్వభాషలో ఆలోచించి కొత్తభావనలను సహజ ధోరణిలో వ్యక్తీకరించే సామర్థ్యం దెబ్బతింటున్నది. ఫలితంలో తెలుగుభాషలో శాస్త్ర సాహిత్యం చాలా తక్కువై భాషాభివృద్ధి మందగించి ఆధునికీకరణ అస్తవ్యస్తమై పోతున్నది. ఈలోపాన్ని పరిహరించాలంటే తెలుగువిద్యార్థులు నేర్చుకుంటున్న సమస్త శాస్త్రాల్లోనూ పాఠ్యగ్రంథాలూ పరామర్శ గ్రంథాలూ వెలువడాలి.

ఒక జాతి వాడే భాష ఆజాతి కన్నా గొప్పదీకాదు, తక్కువదీకాదు. జాతి గౌరవ సామర్థ్యాలకు దాని మాతృభాషే నిదర్శనం. అదెంత సంపన్నమయితే జాతి అంత ప్రసిద్ధ మవుతుంది. తెలుగుభాష తొలి దశలో - చరిత్రకందిన తొలిదశలో - చాలా వరకు సంస్కృతం నుంచీ కొంత వరకు ప్రాకృతం నుంచీ మాటలనూ అవి వ్యక్తీకరించే భావనలనూ ఎరువుతెచ్చుకుంది. దిక్కుతోచనంతగా తెచ్చుకుంది. ఉదాహరణకు ఉత్తర దక్షిణాలూ దిక్కు, దిశ అనే మాటలూ సంస్కృతం నుంచి దిగుమతి అయినవే. తూర్పుపడమరలు మాత్రమే తెలుగు మాటలు. అది తప్పుకాదుగాని వలను / వైపు / కడ వంటి తెలుగు మాటలు వాడుక నుంచి తొలగిపోయేంతగా ఎరువుమాటలు వ్యవహారంలో నిలిచాయి. మధ్యయుగాల్లో హిందీ / ఉర్దూ నుంచీ, గడచిన మూడువందల సంవత్సరాలుగా ఇంగ్లీషునుంచీ మాటలనేగాక కొత్తభావనలనుకూడా తెలుగువాళ్లం తెచ్చుకొని సొంతం చేసుకున్నాం. అది అగౌరవ హేతువుకాదు. ప్రపంచ భాషగా పేరుమోసిన ఇంగ్లీషులో నిఘంటువులకెక్కిన ఆరులక్షల పైచిలుకు మాటల్లో ఏడుశాతం మాత్రమే ఆంగ్లోశాక్సన్ అనే దేశవాళీ పదజాలం. ఆభాషకూడా ల్యాటిన్ గ్రీకు భాషల నుంచేగాక బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగాలయిన నానాదేశాల భాషలనుంచి అసంఖ్యాకంగా మాటలు ఎరువు తెచ్చుకొంది.

మాటలు కట్టుగుడ్డల్లాంటివి. వాటిని మారుస్తుండవచ్చు — కొత్తదనం కోసం, శుభ్రతకోసం, అవసరాల నిమిత్తం. మారకూడనిది వాటిని ధరించే శరీరం — అందులోని ఆత్మ. వయసుతోబాటు శరీరం పెరిగినట్లే భాషకూడా కాలక్రమాన విస్తరిస్తుంది — కొంత ఎరువు మాటలవల్ల, కొంత కొత్తగా సృష్టించుకున్న మాటల, వాటి అర్థాలవల్ల. భాషకు వాక్యరచన ఆత్మవంటిది. ప్రతి ఒక్క భాషకూ దానికే ప్రత్యేకమైన, విలక్షణమైన వాక్య నిర్మాణ పద్ధతి ఒకటుంది. సామెతలు, జాతీయాలు, నుడికారాలు, పదబంధాలు, పదకల్పనలు వగైరా దాని సహజ శోభను పెంచుతుంటాయి. అన్యభాషల నుంచి ఏరకంగా ఎన్ని పదాలనూ నూతనభావనలనూ సంగ్రహించినా తెలుగువాక్యంలో అవి ఒదిగి పోయినప్పుడు అవి తెలుగైపోతాయి. ఆ పదాలూ భావాలూ సాహిత్యానికి సంబంధించినవైతే

తెలుగు సాహిత్యభాషగా అభివృద్ధమై ఆధునికమవుతుంది. శాస్త్ర భావనలూ పరిభాష చేరితే తెలుగులో శాస్త్రసాహిత్యం విస్తరించి భాష నవీకృతమవుతుంది.

తెలుగులో హృదయాన్ని కదిలించే సాహిత్యం ఎక్కువ. బుద్ధిని వికసింపజేసే శాస్త్రసాహిత్యం చాలా తక్కువ. నన్నయ భారతమూ పావులూరి మల్లన గణితమూ ఇంచుమించు ఒకే కాలంలో వెలువడ్డా, కేవల సాహిత్యంపొందిన ఆదరాభిమానాలను శాస్త్ర సాహిత్యం సాధించలేక పోయింది. అది మన దురదృష్టం. మాతృభాషలో ఆలోచించినంత సహజంగా, సమర్థంగా ఇతరభాషల్లో సాధ్యంకాదనే మూల సూత్రం ప్రకారం మాతృభాషలో విద్యాబోధన కావాలనే వాదం పుట్టింది. బోధనకు పాఠ్యగ్రంథాలు ఉపకరణాలు. కాబట్టి మంచి పాఠ్యగ్రంథాలు లేకుండా మాతృభాషలో విద్యాబోధన కుదరదు. పాఠ్యాంశాలు మాత్రమే విజ్ఞానార్జనకు చాలవు కాబట్టి ఆయా శాస్త్రాల్లో రకరకాల గ్రంథాలను వెలువరించ వలసిన అవసరముంది. విద్యాసంస్థల్లో ప్రవేశించే అవకాశంలేనివాళ్లు కొల్లలు. వారి ఉపయోగార్థం ఆయాశాస్త్రాల్లో నిఘంటువులు, పరిశోధనరచనలు, జనరంజక గ్రంథాలు చాలా అవసరం. ఈ దృష్టితో చక్రధర్ గ్రంథాన్ని సాదరంగా ఆహ్వానిస్తున్నాను. తెలుగుభాషను సుసంపన్నం చేయాలంటే ఇటువంటి గ్రంథాలు ఎంతో అవసరం.

ఏదో ఒకగ్రంథమో అనేక గ్రంథాలో ఒక శాస్త్రంలో రావచ్చు. వాటిని చదవాలన్నా అర్థం చేసుకోవాలన్నా నిఘంటువులూ, ప్రత్యక్షంలో బోధకులూ అందరికీ దొరకడం కష్టం. ఆయా గ్రంథాలు ఎంత సులభంగా సరళంగా సూటిగా విషయబోధ చేయగలిగితే అంత మంచిది. నిజానికి సులభంగా రాయాలంటే రచయితకు ఆ విషయంలో స్పష్టమైన అవగాహన ఉండాలి. ఆలోచన ఎంత స్పష్టంగా ఉంటే అభివ్యక్తి అంత స్పష్టంగా ఉంటుంది. భాషలోని మాటల్లో ఏవి పాతవో, ఏవి కొత్తవో, ఏమాట ఎంత స్పష్టంగా సులభంగా బోధపడుతుందో బోధపరుస్తుందో తెలిసిన రచయిత మాత్రమే సులభ సుందరంగా రాయగలడు. ఇదొక నైపుణ్యం. అది అభ్యాసంవల్ల, చిత్తశుద్ధివల్ల, ప్రయత్నబలంవల్ల సిద్ధిస్తుంది. తన రచన సరళంగా సాఫీగా స్పష్టంగా ఉండాలని చక్రధర్ విశేషకృషి చేసినట్లు ఈ రచన నిరూపిస్తుంది.

జర్నలిజాన్ని ఒక శాస్త్రంగా బోధించే (విశ్వ) విద్యాలయాలు ఆశాస్త్రం ఏ క్రమంలో ఎక్కడెక్కడ ఎన్ని విధాల అభివృద్ధి సాధించిందో నిరూపించే చరిత్రకూ, రచనలో పారిభాషిక పదాలకూ ఇచ్చే ప్రాముఖ్యం చాలా ఎక్కువ. ఏశాస్త్రాన్నయినా వివరించటానికి భాషే మాధ్యం. భాషద్వారానే వివరణ బోధనలు సాధ్యం. అయినా భాషా నైపుణ్యాలను నేర్పే ప్రయత్నం చాలా తక్కువ. ఏదో ఒక శాస్త్రంలో పట్టపరీక్షలో ఉత్తీర్ణులయిన వారికి జర్నలిజం బోధిస్తున్నారుగాని, ఆ విద్యార్థులు వృత్తిరీత్యా ఏదో ఒక భాషలో ఏదో పత్రికలో

పనిచేయకతప్పదని తెలిసికూడా వారి భాషాజ్ఞానాన్ని, రచనా నైపుణ్యాన్ని అభివృద్ధిపరిచే మార్గాలు ఆలోచించటంలేదు. వాస్తవంలో భాషాపటిమగల వ్యక్తి అనుభవపూర్వకంగా జర్నలిజం గురించి కావలసినంత మాత్రం నేర్చుకొని వృత్తిలో రాణించగలుగుతున్నాడు. ఆ శక్తి లేకపోయినా శాస్త్ర పరిభాషనూ తర్కవితర్కాలనూ నేర్చిన జర్నలిజం విద్యార్థి, కేవలం భాషా నైపుణ్యం లేనందువల్ల పత్రికా పరిశ్రమలో ఉపయోగపడలేక పోతున్నాడు. ఇది గమనార్హం.

మరో విశేషముంది. రేడియో టీవీలు – ముఖ్యంగా టీవీలు – సాధించిన, సాధిస్తున్న జనాకర్షణ కారణంగా, శాస్త్ర సాంకేతిక విధానాలవల్ల అక్షరరూపంలో మాత్రమే ఉన్న పత్రికలు పోటీ తట్టుకోలేని పరిస్థితి దాపురిస్తున్నది. జాతీయాంతర్జాతీయ రంగాల్లోని ప్రధాన వార్తలను ఉపగ్రహ విజ్ఞానాన్ని ఉపయోగించి టీవీలు దృశ్య శ్రవ్య రూపాల్లో అందించగలుగుతున్నాయి. ఎంత సాంకేతిక పరిజ్ఞానం, సాధన సంపత్తి అందుబాటులో ఉన్నా లిఖిత పత్రికలు ఆ పోటీకి నిలవలేవు. అది ప్రధాన కారణంగా, సాధారణ పాఠకులు తమ చుట్టపక్కల సాటివారికి వచ్చిపడే కష్టనష్టాలనే ఎక్కువగా అభిమానించి ఆసక్తితో చదువుతుంటారన్న వాస్తవ పరిస్థితిని గుర్తించినందువల్లా, నేటి దినపత్రికలు స్థానిక వార్త లందించటంవైపు మొగ్గు చూపుతున్నాయి. ఇది తప్పనిసరి పరిస్థితి. మన దేశంవంటి గ్రామీణ వాతావరణంగల భాషా ప్రాంతాల్లో స్థానిక వార్తలు సేకరించే గ్రామీణ విలేఖరుల అవసరం చాలా పెరిగింది.

వార్తాసేకరణ ప్రధానంగాని శాస్త్రవిజ్ఞానం అంత ముఖ్యంకాదని గుర్తించినప్పుడు గ్రామీణ విలేఖరులను దృష్టిలో పెట్టుకొని, వారికి వృత్తి నైపుణ్యాలను కల్పించాలంటే సులభభాషలో వాళ్ల కర్తవ్యాలేమిటో తెలియజెప్పాలి. వార్తలను ఎలా సేకరించాలో, సేకరించిన వార్తలను ఎలా కథనరూపంలో పెట్టాలో, రాయటంలో ఏయే మెళకువలను పాటించాలో, ఏవిధంగా రాయాలో వివరించాలి. వార్తా సేకరణలో ఎదుర్కొనే సాధక బాధకాలను, వ్యక్తులను ఏవిధంగా తెలుసుకొని ఎలా వ్యవహరించాలో విశదీకరించాలి. ఎంత వారయినా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక తప్పు చేయక తప్పదు. చేసిన తప్పులను దిద్దుకొనే మార్గాలు కూడా తెలుసుకోవటం మంచిది. గ్రామీణ విలేఖరుల్లో అసంఖ్యాకులు పెద్దగా చదువుకున్నవారు కాకపోవచ్చు. ఏదో ఒక శాస్త్రంలో నిష్ణాతులైనా వారికి రచనానుభవం లేకపోవచ్చు. అలాంటి అనుభవమున్నా వార్తాసేకరణ పద్ధతులు తెలిసివుండకపోవచ్చు. ఈ అభిప్రాయాలన్నిటినీ దృష్టిలో పెట్టుకొని ఈ గ్రంథరచన సాగింది. హర్షించాలి.

వృత్తిమీద అభిమానం, చేసే పనిలో ఏకాగ్రత జర్నలిస్టులకు ప్రధానావసరాలని రచయిత గుర్తించారు. వార్తాకథనం విపులంగా విస్తరంగా సాగితే ప్రచురించగల వార్తల సంఖ్య

తగ్గుతుంది. అతి విస్తరంవల్ల పొరపాట్లు పెరుగుతాయి. పాఠకులకు విసుగు పుట్టవచ్చు. అందువల్ల క్లుప్తంగా రాయటం చాలా ముఖ్యమని రచయిత ఒకటికి రెండుసార్లు హెచ్చరించారు. "Brevity is the soul of wit" అనే ఇంగ్లీషుమాట ఉండనే ఉంది. ''అల్పాక్షరములననల్పార్థ రచన'' ఉత్తమమార్గమని పాల్కుర్కి సోమనాథుడు ఏనాడో చెప్పాడు. ఒక అమెరికన్ పత్రికా రచయిత్రి ఇదే విషయాన్ని ఆకర్షకరంగా చెప్పింది : "A press release should be the length of a woman's skirt, short enough to attract attention and long enough to cover the subject". పత్రికా రచనకిది ఆదర్శం. అనుసరించటం అవసరం.

రచనలో మాటలకు ఏసందర్భంలో ఏ అర్థాలుంటాయో శబ్ద స్వరూపమేమిటో తెలుసుకొని వాడటం పాత్రికేయుడి ధర్మం. అంటే పదపరిజ్ఞానం లేని రచన అభిప్రాయ / వార్తా/ సమాచార వ్యక్తీకరణకు నిరుపయోగకరం. కొన్ని సమయాల్లో పరువునష్టం దావాలు తెచ్చిపెట్టగలవుకూడా. ఏం రాస్తున్నారో రచయితలకు స్పష్టంగా తెలియకపోయినా పాఠకులకు బోధపడుతుందనుకోవటం భ్రమ. ఈ లక్షణాన్నే 'అవగాహన' అంటారు. రాయటానికి నేర్పు కావాలి. తప్పులు సవరించుకుంటూ తిరగరాయటానికి ఓర్పుకావాలి. ఆలివర్ గోల్డ్‌స్మిత్ వంటి ఆంగ్లమహాకవి, గెథే వంటి జర్మన్ నాటకకర్త, గురజాడ వంటి తెలుగు మహారచయితలు తీరికగా సాహిత్య సృష్టిచేసికూడా మొదటిరాతలను సరిచూసుకొని సరిదిద్దుకొన్నవాళ్లే. అవిశ్రాంతంగా, పరిమితస్థలంలో, పరిమిత కాలంలో వార్తారచన చేయవలసిన విలేఖరులూ ఉప సంపాదకులూ మరింత ఓర్పుతో మంచి ప్రతులను సిద్ధం చేయాలో గ్రహిస్తే ఓర్పుకున్న ప్రాముఖ్యం తెలుస్తుంది. ఈ కర్తవ్య నిర్వహణకు 'సంకల్పబలం' చాలా అవసరమని గ్రంథకర్త గుర్తించారు.

పడికట్టుమాటలు వాడవద్దనీ, అనవసరంగా విశేషణాలను ప్రయోగించవద్దనీ, మామూలు వాడుకలోని పదాలనే వాడమనీ రచయిత నిదర్శన పూర్వకంగా విశదీకరించారు. పునరుక్తులు అసలే పనికిరావని హెచ్చరించారు. వార్తాకథనాన్ని క్లుప్తంగా పాఠకులకు పరిచయంచేసే మార్గాలు సూచించారు. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అని ధైర్యం చెప్పారు. ఇవన్నీ జర్నలిజం మూలతత్వాన్ని బోధించే మాటలే. కొసమెరుపుగా అక్షరదోషాలను పేర్కొని సవరణలు ప్రతిపాదించారు. అదనంగా అయిదు ఇంటర్వ్యూలున్నాయి.

తెలుగులో వచనరచనలు ఈశతాబ్దంలోనే సంఖ్యాధికంగా వెలువడ్డాయి — వెలువడు తున్నాయి. నిజమేగాని వచన రచనాసంప్రదాయం ఇంకా బలపడ్డట్లులేదు. శాస్త్ర వాఙ్మయంకూడా ఎంతో విస్తరిస్తేగాని ఆ లోపం తీరదు. నేటి జర్నలిస్టులు

సాహితీరచయితలుగా మాత్రమే వ్యవహరించలేరు. నానావిధ శాస్త్ర వార్తలను సేకరించి ప్రచురించవలసినందువల్ల పరిభాషను అప్పటికప్పటికి తెలుగులో సృష్టించుకోవటం, ఎరువు మాటలయితే అవి తెలుగువాక్యాల్లో అతికినట్లు కుదుర్చుకొనే మార్గాలు అన్వేషించటం, జర్నలిస్టులకున్న కాలస్థల ప్రతిబంధకాలవల్ల మార్గదర్శకుల్లేని లోపంవల్ల కష్టసాధ్యమవుతున్నాయి. తప్పులు దొర్లుతున్నాయని ఆక్షేపించే శాస్త్రజ్ఞులు ఒప్పుగా తెలుగులో రాసే విధానాలు చెప్పటంలేదు. రాసిచూపటం లేదు. శాస్త్రవార్తల ప్రచురణ తెలుగులో నలిగిన బాటకాదు. అందువల్ల శాస్త్ర విజ్ఞానాభివృద్ధిసాధించే ఎంత చిన్న తెలుగురచననైనా ప్రోత్సహించటం భాషాభిమానులందరికీ కర్తవ్యం. ఈదిశలో ఈరచన చక్కని ప్రయత్నం.

గ్రంథం చదివిస్తుంది. సులభసుందరంగా నడిచింది. జర్నలిస్టులకేగాక ఇతర సాహితీపరులందరికీ ఇది ఆమోదయోగ్యమవుతుందని విశ్వసిస్తున్నాను. కావాలని ఆశిస్తున్నాను.

హైదరాబాద్
3-3-1997

- బూదరాజు రాధాకృష్ణ

## భాషా చాపల్యం వదులుకోండి

పత్రికా రచనకు ప్రపంచమంతటా కొన్ని కట్టుబాట్లున్నాయి. వారికి కమ్యూనికేషనే ప్రధానంకాని భాషా చాపల్యం ఉండకూడదు. ప్రతి విశేషణమూ నామవాచకానికి శత్రువు. అయితే అయిదు రూపాయల భారీ విరాళం అనీ ఘోర అగ్నిప్రమాదంలో ఒక కోడి మరణం అని కొన్ని శీర్షికలు పత్రికల్లో కనిపించే మాట నిజమే. అవి తెలియని తనం వల్ల వచ్చేలోపాలు. నీళ్లపీపాలో పడి ఒక శిశువు మరణిస్తే "పాపం పీపాలో పాప" లాంటి శీర్షికలు పెట్టే చాపల్యానికి కూడా అదే కారణం. కొంపలకు అగ్గి అంటుకుంటే భస్మీపటలం, పరశురామ ప్రీతి లాంటి ప్రయోగాలకు కూడా భాషా చాపల్యమే కారణం.

- రాంభట్ల కృష్ణమూర్తి

# చక్కగా ఎలా రాయాలి



అక్షరం అమ్మ ఒడి
అది ప్రేమగా లాలిస్తుంది
అక్షరానిది అజేయశక్తి
అది జీవన తేజోదీప్తి

ఆయుధశక్తికన్నా అక్షరశక్తి మిన్న. అందుకే చదువు నేర్చిన సమాజం చకచకా అడుగులు వేస్తోంది. ప్రపంచ పోకడలను పుణికి పుచ్చుకుంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే అక్షరమే జనజీవన ఆత్మ. ఈ సమాజం పోకడలపై మీ మదిలో మొగ్గ తొడిగే భావాలను పదుగురికీ చేరవేయటానికి అక్షర దండలు అల్లకతప్పదు. ఏభావమైనా, సమాచారమైనా, పరిజ్ఞానమైనా పరివ్యాప్తికావాలంటే అక్షర రూపం తొడగాల్సిందే. పెళ్లానికి రాసే ప్రేమ లేఖ నుంచి పోటీ పరీక్షల దాకా, యదార్ధ జీవిత సత్యాలనుంచి కల్పిత కథలదాకా, అల్లం మురబ్బానుంచి అంతరిక్ష సమాచారం దాకా సమస్తం అక్షరాల వంతెనలపై నడిచి వస్తాయి. మన ముంగిట నిలుస్తాయి. మనోపరిధిని విస్తరింప చేస్తాయి.

సమాచార రంగం వడివడిగా అడుగులు వేస్తూ ముందుకు సాగుతోంది. ఇటు పత్రికలు ఎడిషన్లతో విస్తరిస్తున్నాయి. అటు రేడియో, టీవీ చానెల్స్ రోజుకొకటిగా వెలుస్తున్నాయి. కన్పించే, విన్పించే మాధ్యమాలలో సైతం అక్షర విన్యాసాలు తప్పడంలేదు. ఈ మాధ్యమాలకూ అక్షర శిల్పుల అవసరం రోజురోజుకూ పెరుగుతూ వస్తోంది.

ఎదుటివారికి సులభంగా అర్థమయ్యేలా విడమరచి మాట్లాడే మనమే ఆ భావాలనే కాగితంపై పెట్టేసరికి నానా ప్రయాస పడిపోతాం. కలం కదలదు. అనుకున్న భావం రూపుతొడగదు. తీరా కష్టపడిరాసినా అసంతృప్తి వెన్నాడుతూనే ఉంటుంది. రాయటమే వృత్తిగా కలిగిన వారికి ఇది మరీ సమస్యగా పరిణమిస్తుంది. కాలంతో పరుగులు తీస్తూ అక్షరాల్లోకి భావాలను మలిచే ప్రయత్నంలో ఎన్నో ప్రయాసలు. అలసి సొలసిన అక్షర శిల్పులను సేదతీర్చే యత్నమిది. చక్కగా రాయటం గురించి, వార్తాసేకరణ, వార్తారచనల గురించి తెలియచెప్పే చిరు ప్రయత్నమిది.

## ఉగ్గుపాలతో అబ్బిన విద్య

చక్కగా రాయటం ఎలా అన్న ప్రశ్నకు అంత తేలిగ్గా సమాధానం లభించదు. దీనికి సరళ సమాధానం కూడా ఉండదు. అయినప్పటికీ మనమంతా ఎప్పుడో ఒకసారి ఈ ప్రశ్న గురించి ఆషామాషీగాగాని సీరియస్‌గాగాని ఆలోచించే ఉంటాం. అందులో సందేహం లేదు. నిజానికి రెండో తరగతిలో ఉన్నప్పుడే దీనిగురించి ఆలోచించి ఉంటాం. అంటే మన టీచర్లు పేరా గ్రాఫులు విడగొట్టండర్రా, ఫుల్ స్టాపులు కామాలు పెట్టండర్రా అన్నప్పుడే చక్కగా రాయటం ఎలా? అన్న ప్రశ్నగురించి మనం ఆలోచించామన్నమాట. ఆ తర్వాత నాలుగో తరగతిలోకి రాగానే కొద్దిగా వ్యాకరణ సూత్రాలు నేర్చుకున్నప్పుడే చక్కగా రాయటం గురించి కొన్ని మూల సూత్రాలు తెలుసుకున్నాం. ఇక పాఠశాల బయటి విషయాల కొస్తే, మనలో చాలా మంది చిన్నప్పుడే స్నేహితులకు, బంధువులకు ఉత్తరాలు రాసేవాళ్లం. రాయడానికి అట్టే విషయాలుండవు కనుక పోస్టుకార్డుల్లో క్లుప్తంగా రాసే వాళ్లం.

## ఏకాగ్రతే తొలిమెట్టు

ఒక దశలో మనం నేర్చుకున్న మొదటి పాఠం ఏమిటంటే - రాయటంలో సరదా, సంతృప్తి, ఆనందం ఉన్నా రాయటం అంత తేలికైన పనేమీకాదు. ఈ రాయటం అన్నది ఒక్కోసారి మనల్ని మహాకలవరపరుస్తుంది కూడా. ''రాయటమంటే మాటలుకాదు, టేబుల్‌ముందు కూచుని కలం పట్టుకొని నరాలు తెగేలా ఆలోచించాలి'' అన్నారొక రచయిత.

ఇంతకూ ఆ రచయిత చెప్పదల్చుకున్నదేమిటంటే - రాయటం కష్టమైన పనేకాదు,

రచనకు అంకిత స్వభావం కూడా అవసరం. రాసినంతసేపూ రచనకు పంచేంద్రియాలనూ అంకితం చేయాల్సిందే. రాస్తున్నప్పుడు మనం ఇతర విషయాల గురించి బొత్తిగా ఆలోచించలేం. ఏ ఇతర పనీ చేయలేం. రచించడంపై సర్వశక్తులనూ కేంద్రీకరించాల్సిందే. అతిశయోక్తిగా కనిపించొచ్చు గాని రచన తపస్సులాటిది. ఏకాగ్రత సాధించలేని వాడు రచనకు శ్రీకారం కూడా చుట్టలేడు. ఈ ముఖ్య అంశాన్ని గ్రహిస్తే చక్కగా రాయటం ఎలా అన్న ప్రశ్నకు సమాధానంలో మొట్టమొదటి సూత్రాన్ని ఒంటపట్టించుకున్నట్లే.

## పదాలతో పొపు పెట్టటం ఎలా?

అయితే మొదటి సూత్రం నేర్చుకోవడంతోనే అంతా అయిపోయినట్లు కాదుసుమా. మీరు పాఠకుడికి ఏదైనా ఒక సమాచారాన్నో, భావాన్నో, అనుభూతినో చేరవేయాలనుకుంటారు. ఇలా చేరవేయడానికి అవసరమైన పదాలు (లేక మాటలు) ఏవి? వాటిని ఎలా ఎంపిక చేసుకోవాలి? ఎంపిక చేసుకున్న పదాలను దారంలో పూలలా ఎలా అందంగా గుదిగుచ్చాలి? అంటే చక్కగా రాయటం ఎలా?

ముఖ్యంగా ప్రచార సాధనాల కోసం చక్కగా రచించడమంటే, రాసిందేదో స్పష్టంగా ఉండాలి. సరళంగా ఉండాలి, సుబోధకంగా ఉండాలి. రచనలో అనవసర అంశాలను చేర్చనే కూడదు. మీ రచన పాఠకుడికి మీరనుకున్న సమాచారాన్ని లేక భావాన్ని, లేక అనుభూతిని నేరుగా అందించాలి. మధ్యలో మరో వ్యాఖ్యాత అవసరం ఉండకూడదు. మీ రచనలో అతిశయోక్తులు సైతం ఉండకూడదు. అతిశయోక్తులు పాఠకుడి అవగాహనకు ఒక్కోసారి ఆటంకంగా తయారవుతాయి. మాటలతో బొమ్మల్ని చిత్రించి పాఠకుడి కళ్ల ముందుంచాలి.

మంచి రచనలో ఎప్పుడూ పదాలు కనీస సంఖ్యలోనే ఉంటాయి. ఉండాలి. అనవసరంగా ఎక్కువ పదాలు వాడి పాఠకుడి సమయాన్ని హరించే హక్కు మనకులేదు. ''కవిత్వంలోనూ, జీవితంలోనూ economy of words and thoughts లేక పోవడం దేశభక్తికన్న హీనమైన పాపం'' అంటాడు చలం మహాప్రస్థానానికి రాసిన పరిచయంలో. ఈ సూక్తి అన్ని రకాల రచనలకూ వర్తిస్తుంది.

మంచి రచన అన్నది ఎప్పుడూ కచ్చితంగా, నిర్దిష్టంగా ఉంటుంది. అంటే చెప్పదల్చుకున్నది మాత్రమే చెప్పాలి. ఏ పదాలు ఏ అర్థాన్ని ఇస్తాయో తెలుసుకొని వాటినే వాడాలి. నిర్లక్ష్యంగా, నిష్కారణంగా మాటలను (లేక పదాలను) ఒలకపోయకూడదు. మోతాదుకి మించి ఔషధం పుచ్చుకొంటే ఆశించిన ఫలితం లభించదు. అలాగే పదాలను అనవసరంగా వాడినా ఆశించిన ఫలం దక్కదు.

మంచి రచన అన్నది ఎప్పుడూ స్ఫటికంలా స్పష్టంగా ఉంటుంది; ఉండాలి. అది

పాఠకుడి మనసులో గందరగోళం సృష్టించదు; సృష్టించకూడదు. అనుకున్న అర్థాన్నే బట్వాడా చేస్తుంది; చేయాలి.

అవును మంచి రచనలో విశేష ఆకర్షణ బదులు వినమ్రత ఉంటుంది. అది పాఠకు. తనవైపు లాక్కోకుండా, చెప్పే విషయంపై శ్రద్ధ వహించేలా ఉంటుంది. మంచి రచన రచయిత తాలూకు జ్ఞానాన్ని కానీ అజ్ఞానాన్ని కానీ ప్రదర్శించదు. ఇలా ప్రదర్శించక పోతేనే పాఠకుడు ఆ రచనలోని సందేశాన్ని నేరుగా, సులువుగా గ్రహిస్తాడు. చదవడంలో గొప్ప ఆనందం ఉంది. ఒక్కో పుస్తకం చదువుతోంటే మనసు ఆహ్లాదంలో మునకలు వేస్తుంది. పంచేంద్రియాలూ లగ్నం చేసి ఆనందంగా చదువుతోంటే పరిసరాలను పూర్తిగా మరచి పోతాం. పరవశులమై పోతాం. పాఠకుని ఆహ్లాద పరచని రచన రచనేకాదు.

## చక్కటి రచనకు చిట్కాలు

అయితే పాఠకుల్ని ఆనందంలో ఓలలాడించే రచన ఎలా చేయడం? చక్కగా రచించడం నేర్పే సూత్రాలేమైనా ఉన్నాయా? లేకేం ఉన్నాయి. చక్కగా, పాఠకుడి మనస్సుకు హత్తుకునేలా రచించడమెలాగో బోధించేపుస్తకాలు, కరపత్రాలు ఇంగ్లీషులో బోలెడున్నాయి. తెలుగులో అలాటివి బొత్తిగా లేవు అనలేంగానీ చాలా తక్కువ. ఒకటోరెండో ఉంటే గొప్పే. చక్కగా రాయడానికి నాలుగు ముఖ్య సూత్రాలున్నాయి.

**1. సాధన సంపత్తి:** వడ్రంగికి బాడిస ఎప్పుడు, ఎలా ఉపయోగించాలో, రంపం ఎప్పుడు వాడాలో విధిగా తెలిసివుండాలి. ఆ విషయం తెలియకపోతే అతడు పనివాడు కాలేడు. రచయితకు కూడా ఈ విషయం వర్తిస్తుంది. రచయిత ముందస్తుగా తన పనిముట్ల గురించి తెలుసుకోవాలి. అంటే అతడికి పదాల ప్రాముఖ్యం గురించి క్షుణ్ణంగా తెలియాలి. అంతో ఇంతో వ్యాకరణ జ్ఞానం ఉండాలి. మంచి డిక్షనరీ ఎప్పుడూ అందుబాటులో ఉండాలి. రచయితకు ఏపదం ఎప్పుడు వాడాలో తెలియాలి. ఏ పదం ఏ సందర్భంలో ఏ అర్థం ఇస్తుందో తెలుసుకోగల ఇంగితం ఉండాలి. చిన్న పదం అవసరమైన చోట పెద్ద పదం వాడనేకూడదు. తెలిసిన ప్రతి పదమూ వాడాల్సిన అవసరం రాకపోవచ్చు, అది వేరే విషయం. మొత్తం మీద అతడి పదజాలం విస్తృతమైనదిగా ఉండాలి.

రచయితకు భాషగురించి తెలిసి వుండడమే కాక, భాష గురించి మంచి అవగాహన అవసరం. అతడికి రక్తగతమైన ఆసక్తి ఉండాలి. చర్మగతమైన ఆసక్తిచాలదు. రచనలో పదాలు శక్తిమంత ఆయుధాల వంటివి. పదాలు (లేక మాటలు) మనుషులను బలీయంగా ప్రభావితంచేస్తాయి. పద్దెనిమిదో శతాబ్దం చివరి పాదంలో ప్రజ్వలించిన ఫ్రెంచ్ విప్లవానికి పుస్తకాలే ఉత్తేజంగా పనిచేశాయంటారు మేధావులు. మాటల ప్రభావం తెలియని వారు మంచి రచయిత కాలేరు. మాటల ప్రాధాన్యంతెలిసిన వారే భాషను చక్కగా వాడుకొంటారు. భాష అనేది బ్యాంక్‌లో అకౌంట్ లాటిది. దాన్ని అనవసరంగా దుబారా చేయకూడదు.

**2. విషయావగాహన :** మీరు రాయదల్చుకున్న విషయంపైన మీకు స్పష్టమైన అవగాహన ఉండాలి. మీరు రాస్తున్న దేమిటో మీకే స్పష్టమైన అవగాహన లేకపోతే మీరు రాసింది పాఠకులకు మాత్రం ఎలా అర్థమవుతుంది? చాలా మంది రచయితలకు ఈ మూల సూత్రం గురించి తెలీదు. ఎలా రాసినా పాఠకులకు స్పష్టంగా అర్థమవుతుందని కొందరు రచయితలు అనుకుంటారు. ప్రచారసాధనాల కోసం రాసే అనుభవజ్ఞులైన కొందరికి సైతం ఏ అంశంపై రాస్తున్నామన్న స్పృహ వుండక పోవడంకద్దు. కొంత మంది జర్నలిస్టులు పూర్వాపరాలగురించి ఆలోచించకుండా, సాధ్యమైనన్ని ఎక్కువ వర్గాలతో సంప్రదించకుండా ఘటనలపై వార్తలు రాస్తూంటారు. కొంతమంది అడ్వర్‌టైజ్ మెంట్ రచయితలు తాము ఏ సరుకు గురించి రాస్తున్నామో తెలుసుకోకుండా ఆ సరుకు తాలూకు వినియోగదారులెవరో గ్రహించకుండా వ్యాపార ప్రకటనలు రాస్తూంటారు. ఇలా రాయటం వల్ల అసలు విషయం మరుగున పడుతుంది. అలాటి రచన గందరగోళంగా కంగాలీగా తయారయ్యే ప్రమాదం ఉంది. అలాటి రచన, ఆలంకారికంగా చెబితే, గురితప్పిన బాణం లాటిది.



మీకు అర్థంకాని దాని గురించి రాస్తున్నప్పుడు, రాయటం కాసేపు ఆపి రాయదల్చుకున్న విషయం గురించి ఆలోచించి అవగాహన చేసుకోడానికి ప్రయత్నించండి. ఆ విషయం గురించి అవగాహనవున్న వారిని అడిగి తెలుసుకోండి. అందులో తప్పేమీలేదు. అందరికీ అన్ని విషయాలు తెలీవు. ఎవ్వడూ సర్వజ్ఞుడు కాడు. ఇంగ్లీషులో Nobody is Mr know all అన్న నానుడి ఉంది. అందుకని ఇతరుల్ని అడిగి తెలుసుకోవడం తప్పుకాదు. ఆ ఇతరులు అందుబాటులో లేనప్పుడు సొంత పరిశోధన, పరిశీలన శరణ్యమవుతాయి. మీరు రాయదల్చుకున్న విషయంపై స్పష్టమైన అవగాహన ఉంటేే తప్ప రచనలో స్పష్టత ఉండదు. రచన స్పష్టాతిస్పష్టంగా ఉంటేే తప్ప పాఠకుడికి లేక శ్రోతకు స్పష్టంగా అర్థమవదు.

3. నేర్పు, ఓర్పు : ఇది చాలా ముఖ్య సూత్రం. మీరు కాగితంపై మాటలు పేర్చితే తప్ప రచనా సౌధం తయారు కాదు. అయితే రాయడానికి ముందు ఆ అంశం గురించి తీవ్రంగా ఆలోచించాలి, ఇతరులతో చర్చించాలి, సంప్రదించాలి, ఏదో అలవోకగా, ఆషామాషీగా కాదు మెదడు కరగిపోతుందేమో అనిపించేలా గాఢంగా ఆలోచించాలి. ఒక్కమాటలో చెప్పాలంటే రచనకు పునాది ఆలోచన. ముందు పదాలను స్వీకరించి వాక్యాలుగా, పేరాగ్రాఫులుగా రాయడం ఆరంభిస్తే తప్ప రచయితకాలేరు. అంటే ఆలోచనా క్రమం ముగిశాక రచనా క్రమానికి శ్రీకారం చుట్టాలన్న మాట.

## మూడ్ రాలేదనకండి

చక్కగా రాయటమంటే అంత తేలికైన పనేమీకాదు. చాలా తక్కువ మంది మాత్రమే చాలా తేలిగ్గా చక్కగా రాయగలుగుతారు. అవలీలగా రాయటం కొందరికే చేతనవును. చాలా మందికి రచించడమంటే దాదాపు యజ్ఞం నిర్వహించడంలాటిది. రచయితకు క్రమశిక్షణ అవసరం. ముఖ్యంగా జర్నలిస్టులకు 'మూడ్'తో అవసరం వుండకూడదు. వృత్తి జర్నలిస్టు అన్నవాడు ఏ సమయంలోనయినా ఎలాటి ప్రతికూల పరిస్థితుల్లో అయినా రాయగలగాలి, చక్కగా రాయగలగాలి.

రాయటం మనసుకే కాదు శరీరానికీ శ్రమే. అందులో సందేహం లేదు. ఒకే చోట కూచుని చాలా సేపు ఏకాగ్రతతో రాయటంలో చాలా శారీరక శ్రమ వుంది. విషయంగురించి గాఢంగా ఆలోచించడం అధ్యయనం చేయడం, మానసిక శ్రమ అయితే ఒకే చోట కూచుని శ్రద్ధగా రాయడం దైహిక శ్రమ. ఆధునిక కాలంలో ఎక్కువమంది ఉత్తరం రాయాల్సిన సందర్భాల్లో సైతం మిత్రులతో బంధువులతో ఫోన్లలో మాట్లాడడానికి ప్రధాన కారణం రాయటంలో మానసిక, శారీరక శ్రమ ఉండడమే.

రాయడంలో మరో ఇబ్బంది కూడా లేకపోలేదు. రచన ప్రారంభించిన ప్రతి సందర్భంలోనూ కృతకృత్యులం కాగలమన్న హామీ ఎవరూ ఇవ్వలేరు. చక్కగా రాయనూవచ్చు. రాయలేకపోనూవచ్చు. మనసులో కదిలే అందమైన భావాలన్నీ కలం పట్టుకోగానే మాటల్లోకి ఒదిగి వస్తాయన్న హామీ ఎవరిస్తారు. అంటే రచయితలు అప్పుడప్పుడు అనుకున్నరీతిలో రాయలేకపోయే ప్రమాదం ఉంటుందన్నమాట.

అయితే ప్రచార సాధనాల కోసం రాసే రచయితల పరిస్థితి దీనికి కాస్త భిన్నంగా ఉంటుంది. ఎందుచేత నంటే రాయటమేవారి కర్తవ్యం. ఎలాటి ప్రతికూల పరిస్థితుల్లో నయినా సాధ్యమైనంత చక్కగా రాయటమే వారి వృత్తి. వారు తమ దైనందిన కార్యక్రమంలో ఫలానా సమయానికి రాయటం పూర్తి చేయాలన్న బాధ్యత నిరంతరం నెత్తిమీద

క్షూమునివుంటుంది. ఈ పరిస్థితి మామూలు రచయితలకు సాధారణంగా ఉండదు. కనుక జర్నలిస్టులు (లేక ప్రచారసాధనాల కోసం రాసే ఇతర రచయితలు) ఒక విధమైన క్రమశిక్షణకు అలవాటు పడివుంటారు. ఈ క్రమశిక్షణ వారికి వరంలాటిది.



**4. సంకల్పమే సగం బలం :** ''అనగననగ రాగ మతిశయిల్లుచు నుండు, తినగ తినగ వేము తీయనుండు'' అన్నాడు వేమన. రాసిందే మళ్లీ రాస్తే అది చక్కటి రచనగా తయారయ్యే అవకాశం వుంటుంది. నిజానికి రాయటం ఎంత కష్టమైన పని అంటే మనలో ఎక్కువమంది ఒకసారి రాశాక దాన్ని తిరగరాయడానికి ప్రయత్నించం. ఒకసారి రాసే సరికే నరాలు తెగాయికదా మళ్లీ రెండోసారి రాయడమా? అనుకుంటారు చాలా మంది. అయితే మంచి రచయితలు ఇందుకు భిన్నం. వారు రాసిన దాన్ని మళ్లీ చదివి తిరగ రాయడానికి ప్రయత్నిస్తారు. రాసినదాన్ని ఒకసారి చదివి మళ్లీ రాస్తే, ఆ రచన తప్పనిసరిగా చక్కగా వుంటుంది. తిరగరాయాలంటే మనం రాసిన రచననుకాస్త విమర్శనాత్మకంగా చదవకతప్పదు. ఎంత చక్కగా రాశానో అని తన్ను తాను పొగడుకోటానికి రచయితలు మళ్లీ చదవకూడదు. మరింత స్పష్టంగా మరింత సమర్థంగా మరింత నిర్దిష్టంగా, మరింత నిర్దుష్టంగా రాయాలన్న సంకల్పంతోనే తిరిగి చదవాలి. రచన సరిగా లేకపోతే ఆ విషయం నిస్సంకోచంగా అంగీకరించాలి. 'ఇక్కడ స్పష్టత లోపించింది' అని ఒప్పుకోవాలి. 'ఇక్కడనేను అనుకున్న భావం బట్వాడా కావటంలేదు' అని ధైర్యంగా అంగీకరించాలి.

ప్రచార సాధనాల కోసం రాసే రచయితలకు మరో సౌకర్యం కూడా ఉంటుంది. వారు రాసింది సహచర సిబ్బందిలో ఎవరో ఒకరు చదివి సలహాలివ్వడం ఈ వృత్తిలో పరిపాటి. సహచరులిచ్చిన ఉత్తమ సలహాలమేరకు తిరగరాస్తే అది తప్పనిసరిగా చక్కటి రచనగా తయారయ్యే అవకాశం వుంటుంది. అయితే సాయంత్రం లేక రాత్రి ఫలానా గంటకు రాత ముగించాలన్న 'డెడ్‌లైన్' ఈ వృత్తిలో సామాన్యం కనుక రాసిన ప్రతిని అలాగే హడావుడిగా

పంపడమూ కద్దు. అంటే 'డెడ్‌లైన్' మంచి రచనకు తరచుగా అవరోధంగా పరిణమిస్తూ వుంటుంది.

కొందరు రచయితలు అవసరంవున్నా లేక పోయినా విశేషణాలు వాడుతుంటారు అలాటి వారిని హెచ్చరిస్తూ సుప్రసిద్ధ జర్నలిస్టు పోతన్ జోసఫ్ ఇలా రాశారు. ''బ్రాకెట్‌లో రాసింది వాక్యానికి ఎంత శత్రువో అనవసరమైన విశేషణం అన్నది నామవాచకానికి అంతే శత్రువు.'' అంటే విశేషణం (adjective) అన్నది విశేష్యానికి (Noun) శత్రువన్నమాట.

## రచించడం ఒక కళే

రచించడం ఒకకళ. ఆకళను మెరుగుపరచుకోడానికి కొన్ని సూచనలున్నాయి. వాటిని మీరు సూచనలంటారో చిట్కాలంటారో అది మీ ఇష్టం. ఈ కింది సూచనలను దృష్టిలోపెట్టుకోవటం అవసరం. ఇందులో ప్రతిసూచనా ప్రతిసందర్భంలో ఉపయోగపడి తీరుతుందనుకోవడం పొరపాటు. ఈ సూచనలు వేదవాక్కులు కాకపోయినా వీటికున్న విలువ వీటికుంటుంది.

**అ) సరళంగా రాయండి:** సరళంగా రాసే ప్రక్రియకు ప్రత్యామ్నాయమేదీలేదు. ఎల్లప్పుడూ సరళంగా రాయడానికే ప్రయత్నించండి. అనవసర అలంకారాల జోలికి పోకుండా సాధ్యమైనంత నిరాడంబరంగా, సరళంగా రాయడం అలవాటు చేసుకోండి. సరళంగా రాయడానికి పెద్ద తెలివితేటలేమీ అక్కర్లేదు. రాస్తున్నప్పుడు ఆసూచన గుర్తుపెట్టుకొంటే చాలు. మామూలు విద్యార్థులుసైతం సరళంగా రాయొచ్చు. స్పష్టంగా సరళంగా రాయడం బ్రహ్మ విద్యేమీకాదు. ఇలా రాయటం వృత్తిరచయితలకే సాధ్యమని భావించడం పొరపాటు.

**ఆ) తేలిక పదాలు వాడండి:** చిన్న పదాలు, తేలిక పదాలు వాడడమే మంచిది. బండరాళ్లలాటి పెద్దపెద్ద పదాలను, సమాసాలను దూరంగా ఉంచండి. అవి పాఠకుని తమ వైపే ఆకర్షించి అర్థస్పష్టతను హరిస్తాయి. 'మోడరన్ ఇంగ్లీష్ యూసేజ్' అన్న సుప్రసిద్ధ గ్రంథంలో హెన్రీ ఫోలర్ ఇలా అంటారు: 'పొట్టి పదాలు వాడడానికి అనువుగా వుండడమేకాక అవి సూటిగా సందేశాన్ని చేరవేస్తాయి. పెద్ద పెద్ద పదాలు సందేశంలోని శక్తిని తగ్గిస్తాయే కానీ పెంచవు. 'పిల్లులు పోట్లాడుకొంటున్నాయి' అన్న వాక్యంలో ఉన్నంత స్పష్టత, సూటిదనం 'మార్జాలాలు పరస్పరం ఘర్షించుకొంటున్నాయి' అన్న వాక్యంలో లేవు. 'సర్వులకూ విదితమే' అనడంకంటే 'అందరికీ తెలిసిందే' అంటేనే వినడానికీ, అర్థంచేసుకోడానికీ హాయిగా ఉంటుంది. చాలా మందికి చిన్న పదాల్లోని సొగసు తెలీదు. పాఠకుని హడలగొట్టాలన్న భావంతో పెద్ద పెద్ద పదాలు వేస్తుంటారు. పాఠకుని హడలగొట్టడం ఎందుకు? అతనికి మీరు చెప్పదల్చుకున్న విషయం సూటిగా చెప్పాలిగాని. పాఠకునితో అనుబంధం పెంచుకోవాలంటే అతనికి మీరు చెప్పింది తేటతెల్లంగా అర్థం అవ్వాలి. ఒక

కొత్త విషయాన్ని తెలుసుకోవటంలో, అర్థం చేసుకోవటంలో ఎంతో ఆనందం వుంటుంది. అది గ్రహించలేని రచయితలే దీర్ఘసమాసాలు, పెద్ద పెద్ద పదాలు వాడుతుంటారు. బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఇలా అంటారు. 'స్పష్టంగా రాయాలంటే సరళ పదాలనే ఎంపిక చేసుకోవాలి'. పెద్దపెద్ద బండరాళ్ల కంటె చిన్న చిన్న గులకరాళ్లే అందంగా వుంటాయి. ఆ అందాన్ని గుర్తించడంలోనే వుంది రచయిత ప్రతిభ.

ఇ) సరళ వాక్యమే మంచిది: సరళవాక్యమే శరణ్యం అన్నంత మాత్రాన సంశ్లిష్టవాక్యాలను వాడనే రాదని అర్థం చేసుకోకూడదు. సరళవాక్యంలో ఉన్న సొగసు ఏమిటంటే - ఇందులో కర్త, కర్మ, క్రియ వరుసగా ఉంటాయి. కనుక తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. పొడుగాటి వాక్యాల కంటె చిన్న వాక్యాలే అన్ని విధాలా ఉత్తమం. చిన్న వాక్యాల్లో సాధారణంగా గందరగోళం, అయోమయం ఉండదు. వాక్యాలు పొడుగయ్యేకొద్దీ స్పష్టత లోపిస్తుంది, పోనీ లోపించే ప్రమాదం ఉంటుంది.

అతడు, ఆమె, ఆయన, వారు లాటి సర్వనామాలను (Pronouns) అప్పుడప్పుడు వాడితే బాగుంటుంది. కొందరు తెలిసో తెలీకో ప్రతివాక్యంలోనూ ప్రధాని దేవెగౌడ అని రాస్తుంటారు. మొదటి వాక్యంలో ప్రధాని దేవెగౌడ అన్నాక తరువాతి వాక్యాల్లో 'ఆయన' అనొచ్చు. 'ఆయన' పదం కొన్ని సార్లు వాడాక మళ్లీ ప్రధాని అనొచ్చు. ప్రచారమాధ్యమాల కోసం రాసే కొందరు రచయితలు 'విభక్తి' (Preposition) వాడడంలో పొరపాట్లు చేస్తుంటారు. పై, మీద, గురించి, తో, వల్ల వగైరా విభక్తులను ఎప్పుడు వాడాలో తెలుసుకోవాలి.

'నుడికారం' రచనకు సహజసిద్ధ అలంకారం. భగీరథ ప్రయత్నం, తలప్రాణం తోకకొచ్చింది, తలలు బద్దలు కొట్టుకున్నారు, వగైరా నుడికారాలు సందేశాన్ని సూటిగా చేరవేస్తాయి. జాతికి వారసత్వంగా లభించిన సామెతలను వాడితే వాక్యం అందంగానూ ఉంటుంది, అర్థవంతంగానూ ఉంటుంది. రెండు మూడు వాక్యాలు చెప్పలేని భావాన్ని ఒక చిన్న సామెత స్పష్టంగా చెబుతుంది.

ఈ) అనవసరంగా పదం వాడొద్దు: రచనలో అట్టే అనుభవం లేనివారు అవసరమైనదానికంటె ఎక్కువ పదాలు వాడుతుంటారు. ఒక్కోసారి అనుభవజ్ఞులు కూడా ఈ విషయంలో తప్పటడుగులు వేస్తుంటారు. ఏభావాన్ని లేక సమాచారాన్ని తెలియచేయడానికయినా పదాలను కనీస సంఖ్యలోనే వాడాలి. రాతలో చిన్న పదాలవాడుకను సిఫార్సు చేస్తూ తాపీ ధర్మారావు ఇలా రాశారు.

చిన్న మాటలనె గొప్ప భావములు చెప్పగలిగితే రాతా,
మిన్ను విరిగినటు ధ్వనించి భావం సున్న చుట్టితే రోతా

ముఖ్యంగా ప్రచార మాధ్యమాల కోసం రాసేవారు సాధ్యమైనన్ని తక్కువ పదాలు, చిన్న పదాలు వాడడం అలవాటు చేసుకోవాలి.

**ఉ) సంక్షిప్తత:** రచనలో సంక్షిప్తత ప్రాణం వంటిది. సంక్షిప్తత అన్నంతమాత్రాన ప్రతి సమాచారాన్నీ సందేశాన్నీ తక్కువ పదాల్లోనే చెప్పితీరాలని కాదు. అసలు పాయింటు ఏమిటంటే అవసరమైన దానికంటె ఎక్కువ పదాలు వాడడం హానికరం. అనవసరమైన ప్రతి పదమూ పాఠకుడి అవగాహనకు అడ్డంకిగా నిల్చేదే. పెద్దపెద్ద పదాలు వాడినా అంతే. పెద్దపదాలు పాఠకుడి దృష్టిని తమ మీదికి మళ్లించుకొంటాయి. చేరాల్సిన విషయం పాఠకుడికి చేరదు.

**ఊ) పడికట్టుపదాలు పనికిరావు:** రచయిత తప్పనిసరి అయితే తప్ప పడికట్టు పదాలను వాడకూడదు. శాస్త్రవేత్తలకు, కమ్యూనిస్టుపార్టీలకు, స్పోర్ట్స్ రచయితలకు, బిజినెస్ రంగ రచయితలకు పడికట్టుపదాలు ఉంటాయి. అయితే జర్నలిస్టుకానీ ప్రచార సాధనాల కోసంరాసే ఏ రచయిత కానీ సాధ్యమైనమేరకు మామూలు పాఠకుడికి అర్థమయ్యే విధంగానేరాయాలి. పాఠకులకిలేక శ్రోతలకి అర్థమయ్యేలా రాస్తేనే వారికి ఆ విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. పాఠకులు మీదగ్గరకు రాలేకపోతే మీరే వాళ్లదగ్గరకు వెళ్లాలి. పాఠకులకు అర్థంగాని భాష రాసి ప్రయోజనం ఏమిటి? మీరు రాసిందంతా పాఠకులకు అర్థమయినప్పుడే రచన సఫలమైనట్లు. 'ఎద్దుచచ్చినా వాత కుదిరింది' అన్నాడట వెనకటికొకడు. ఎద్దును బతికించడానికే వాత వేస్తారు. అది చచ్చాక వాత చక్కగా పడితే ప్రయోజనం ఏమిటి? కాబట్టి రాయటం కంటె పాఠకుడికి అర్థమయ్యేలా రాయటం ముఖ్యం. ఒకసారి అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్‌కు ఆయన సెక్రెటరీ రాసి ఇచ్చిన ప్రసంగంలో ఈ వాక్యం ఉందట.

''సర్వులకూ సంక్షేమం సిద్ధించే నవసమాజాన్ని నిర్మించడానికి ప్రయత్నిద్దాం'' ఈ వాక్యాన్ని రూజ్వెల్ట్ ఈ విధంగా తిరగరాశారట.

''అందరికీ మేలు జరిగే సమాజాన్ని నిర్మిద్దాం'' నిజానికి రూజ్వెల్ట్ వాడిన చిన్న పదాలే భావాన్ని సమర్థంగా తెలియచేస్తున్నాయి. అన్నట్టు తెలుగులో సరైన పదం ఉన్నప్పుడు ఇంగ్లీషు పదం వాడడం అవివేకం. సరైన పదం లేకపోతే సరే. ఈ సూత్రం సంస్కృతానికీ వర్తిస్తుంది. పొదరిల్లు అంటే అందరికీ అర్థమవుతుంది. 'లతానికుంజం' అంటే ఎంత మందికి తెలుస్తుంది?

**ఎ) తెలిసిన పదాలే వాడండి:** రచనలో తెలిసిన పదాలనే వాడాలి. పాఠకుడికి పరిచయంలేని పదాలను పదేపదే వాడి అతడిని డిక్షనరీ వెతుక్కునేలా చేసే హక్కు మీకు

లేదు. పదేపదే నిఘంటువు కోసం పరుగులుతీస్తే పాఠకుడి ఆసక్తి ఆవిరైపోయే ప్రమాదం ఉంది. అత్యవసరమైతే తప్ప, అనివార్యమైతే తప్ప పరిచయంలేనిపదాలను ప్రయోగించకూడదు. జర్నలిస్టుల పదజాలం (Vocabulary) సాధారణంగా పరిమితమైందిగానే ఉంటుంది. పాఠకుడి పదజాల పరిధినిపెంచే పని మీది కాదు. ఆ పనికి ఇతరులున్నారు. పాఠకుల భాషాజ్ఞానం, పదజాలం పెంచడానికి ఉపయోగపడే పుస్తకాలు వేరే ఉంటాయి. అవసరమనుకున్న పాఠకులు అవి చదువుకుంటారు.

ఏ) **ఒకే రకం వాక్యాలు వద్దు:** ఎప్పుడూ ఒకే రకం వాక్యాలను వాడితే విసుగొస్తుంది. వాక్యాలనిడివికూడా ఒకే రకంగా వుండకూడదు. ఏమైనా ఏవాక్యంలోనూ ఇర్వై పదాలకు మించడం మంచిదికాదు. కాసేపు ఏడెనిమిది పదాల వాక్యాలు, ఇంకాసేపు పదిపన్నెండు పదాలవాక్యాలు, మరికాసేపు ఇంకొంచెం ఎక్కువ పదాలు అలా మారుస్తూపోవాలి. అలా అయితే పాఠకులకు విసుగుపుట్టకుండా హాయిగా ఉంటుంది. ఈ విధంగా రకరకాల వాక్యాలను రాయటం రచయితకూ బాగుంటుంది, పాఠకుడికీ బాగుంటుంది. ప్రచారసాధనాలకోసం రాసే వారు సాధారణంగా చిన్న వాక్యాలు రాయడమే శ్రేయస్కరం. ఉదాహరణకు రేడియోలో ప్రసంగిస్తున్నప్పుడు చిన్నవాక్యాలేమేలు. ఎందుకంటే వాక్యం చేంతాడంత పొడుగుంటె మీరు వాక్యం ప్రారంభంలో ఏం చెప్పారో శ్రోతకు గుర్తుండక పోవచ్చు. మీ ప్రసంగం వింటూంటేే చదువురాని వాళ్లకి కూడా హాయిగా అర్థమైపోవాలి. అర్థం చేసుకోడానికి శ్రోత లేక పాఠకుడు కసరత్తు చేయాల్సిన అవసరం ఉండకూడదు. అంతా అయిపోయాక 'ఇంకాసేపు వింటే హాయిగా ఉండేదే' అనిపించాలి పాఠకుడికి. అక్షరాల్లో, పదాల్లో, వాక్యాల్లో, 'లయ' ఉంటుంది. రచనలో ఒక విధమైన 'తూగు'ను 'లయ'ను ప్రవేశపెడితే ఎంత సేపయినా విసుగులేకుండా చదివించొచ్చు. మల్లాది రామకృష్ణశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, కొడవటిగంటి కుటుంబరావు, బుచ్చిబాబుల వచనం హాయిగా చదువుకోవచ్చు. జర్నలిస్టులు ఇతర ప్రచార సాధనాల రచయితలు సైతం చక్కటి వచనం రాయడానికి ప్రయత్నించాలి. చక్కగా రాసినప్పుడే రాతలోని విషయం పాఠకుడికెక్కుతుంది.

ఐ) **ఇది మీకు తెలుసా?** ఏభాషలో అయినా నామవాచకాలు, క్రియలు చాలా శక్తిమంతంగా ఉంటాయి. వాటికున్న శక్తి మిగతా వాటికి ఉండదు. వాక్యాన్ని నామవాచకాలతోనూ క్రియలతోనూ నింపాలి. విశేషణాలూ, సహాయక క్రియలూ వాడకూడదనికాదు. వాటిని సాధారణంగా నామవాచకాలకు, క్రియలకు బలం చేకూర్చేవిగానే వాడాలి. ముఖ్యంగా ప్రచారసాధనాల కోసం రాసేవారు విశేషణాలు, సహాయక క్రియల జోలికి పోకూడదు. విశేషణాలగురించి పోతన్ జోసఫ్ ఏమన్నాడో వెనక్కి వెళ్లి మళ్లీ చదవండి.

క్రియలను వాడే సందర్భంగా ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఎప్పుడూ సకర్మక

క్రియల (active verbs)ను వాడడానికే ప్రయత్నించాలి. 'చంపాడు' అన్నది సకర్మక క్రియ. 'చంపబడ్డాడు' అన్నది కర్మణ్యర్థక క్రియ. 'చంపాడు' అనడంలో ఉన్న శక్తి, బలం, 'చంపబడ్డాడు'లో లేవు.

మంచి రచయిత సరైన క్రియా రూపాలను ఎంపిక చేసుకుంటాడు. మంచిరచనలో ప్రారంభంనుంచి సమాప్తందాకా ఏకరూపత (Unity) ఉండాలి. మీరు రాసిన ప్రతి అక్షరం, పదం, వాక్యం, పేరాగ్రాపు అన్నీ ఒక ముఖ్య విషయాన్ని లేదా సమాచారాన్ని లేదా సందేశాన్ని పాఠకుడికి తెలియచేయడానికే అన్న స్పృహ ఉండాలి. పాఠకుడికి అనవసరంగా సొల్లుకబుర్లు చెప్పకూడదు. మాటలను మంటలుగా, కత్తులుగా, పూలమాలలుగా, మార్చడం తెలుసుకోవాలి. శ్రీశ్రీ మహాప్రస్థానానికి రాసిన యోగ్యతా పత్రంలో గుడిపాటి వెంకట చలం ఇలా అంటారు.

*''మాటల్ని కత్తులూ, ఈటెలూ, మంటలుగా మార్చడం అతనికే చేతనవును. పద్యాలు చదువుతోంటే, ఇవి మాటలుకావు, అక్షరాలు కావు - ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు - అతని హృదయంలోంచి మన హృదయంలోకి Directగా పంపిన ఉత్సాహాలు, నెత్తురు కాలవలనిపిస్తుంది.''*

## 'సాధనమున పనులు సమకూరు'

అవును సూత్రాల సంఖ్య కాస్త పెరిగినట్లుంది. అయినా పర్వాలేదు. ఇందులో కొన్ని సూత్రాలను గుర్తుంచుకున్నాచాలు. ''చదువు మనిషిని సమగ్ర వ్యక్తిగా మారిస్తే రాత మనిషిలో నిర్దిష్టతత్వం పెంచుతుంది'' అంటాడు ఇంగ్లీషు వ్యాస సామ్రాజ్య చక్రవర్తి ఫ్రాన్సిస్ బేకన్. అంటే రాత మనిషి దృక్పథంలో కచ్చితత్వాన్ని పెంపొందిస్తుందన్నది ఆయన భావం. మనం అనుకున్న భావాలను రాయలేకపోతే అయ్యో అని కుంగిపోతాం. అనుకున్న భావాలను చక్కగా రాయగలిగితే ఆనందంతోపొంగిపోతాం. రాత ఒకరోజులోనో రెండ్రోజుల్లోనో అభివృద్ధి చెందేదికాదు. రాయటం అనేదాన్ని మెరుగుపరచుకోవాలంటే నిరంతర సాధన అవసరం. 'సాధనమున పనులు సమకూరుధరలోన' అన్న సూక్తిరాతకు చక్కగా వర్తిస్తుంది. మొదటి ప్రయత్నంలో సరిగా రాయలేకపోయినంత మాత్రాన నిరాశపడక్కర్లేదు. మళ్ళీ మళ్లీరాస్తే అదే చక్కటి రచనగా తయారవుతుంది. సాధనంవల్ల సృజనాత్మక రచయితలుగా తయారు కావడం సాధ్యంకాకపోయినా చక్కగా రచించడం మాత్రం సాధ్యమే.

శరీరం పెరుగుదలకు ఆహారం ఎంత ముఖ్యమో రచన మెరుగుదలకు చదువు అంతే

ముఖ్యం. నిరంతరం శ్రద్ధగా, విమర్శనాత్మకంగా చదివితే తప్పు రచన రాణించదు. డాన్ క్విక్జాట్ అనే విశ్వవిఖ్యాత నవల (స్పానిష్) రాసిన సెర్వాంటెస్ 'కలం అంటే మెదడుకు నాలుక' అన్నాడు.

## ఎవరి కోసం రాస్తున్నాం?

మంచి రచన అంటే మంచిరచనే. అందులో తేడాలంటూలేవు. చక్కటి వార్తా కథనం, మిత్రునికి రాసిన ఉత్తరం, వ్యాపార సరుకు కోసం రాసే నాలుగుముక్కలు. ఏవైనా కావచ్చు. చక్కగా రాసిందేదయినా మంచిరచనే. జవహర్‌లాల్ నెహ్రూ తన కూతురు ఇందిరాగాంధీకి రాసిన లేఖలు ఎంత చక్కగా ఉన్నాయో మనకు తెలిసిందే. ప్రయోజనాన్నిబట్టి రచనా స్వరూపం మారుతుందికానీ స్వభావంలో మాత్రం మార్పు రాకూడదు. అంటే వార్తా కథనం, వ్యాసం, లేఖ, ఏదిరాసినా అందంగా వుండాల్సిందే. ఆ విషయంలో రాజీపడకూడదు.

ప్రచార మాధ్యమాల ( దినపత్రికలు, వారపత్రికలు, రేడియో, టెలివిజన్, వ్యాపార ప్రకటనలు వగయిరా) కోసం రాసే రచనకూ ఇతర రచనలకూ తేడా వుంటుంది. ప్రచార మాధ్యమాలకోసం రాసే సందర్భంగా ఈ కింది నాలుగు అంశాలను దృష్టిలో వుంచుకోవాలి.

**అ) విషయం:** విషయాన్నిబట్టి రచనా స్వరూపం మారుతుంది. విషయం వార్తాకథనం కావచ్చు, ఫీచర్ కావచ్చు, ప్రత్యేక వ్యాసంకావచ్చు, సంపాదకీయం కావచ్చు, దినపత్రికలో ప్రచురణకోసం రాసినలేఖ కావచ్చు, వ్యాపార ప్రకటనలు కావచ్చు, రేడియోలో ప్రసారం చేసే ప్రసంగ వ్యాసం కావచ్చు. గ్రంథ సమీక్ష కావచ్చు.

**ఆ) ప్రయోజనం:** ప్రచారసాధనాలకోసం రాసేప్పుడు రెండుముఖ్య ప్రయోజనాలుంటాయి. ఒకటి - సమాచారం అందజేయడం, రెండు-సమాచారం ద్వారా పాఠకుడి లేక శ్రోత చైతన్య పరిధిని పెంచడం. ఒక్క మాటలో చెప్పాలంటే వారిజ్ఞానాన్ని పెంచడం. ఫ్రాన్సిస్ బేకన్ Knowledge is power అన్నాడు. జ్ఞానం శక్తి వంటిది, జ్ఞానం అధికారం వంటిది.

**ఇ) పాఠకలోకం:** పాఠకుల ప్రపంచం విస్తృతమైనది అన్న విషయాన్ని రచయిత దృష్టిలో వుంచుకోవాలి. వారికీ మీకు మధ్య నిరంతర ఆదాన ప్రదానం జరిగే అవకాశం ఉంటుంది. మీరు రాసిన దానితో ఏకీభవించే వారున్నట్లే, విభేదించే వారూ ఉంటారు. కనుక ఏది రాసినా ఆలోచించిరాయాలి. రాసిందేదో చక్కగా రాయాలి. మీరు పొరపాట్లు రాస్తే వేలెత్తిచూపేపాఠకులు కూడా ఉంటారు. మీరు చక్కగా రాస్తే, మీ రచనలో మరికొన్ని అంశాలు జోడించి ఉంటే బాగుండేది అని సూచించే పాఠకులు కూడా ఉంటారు. చిన్న

ఉదాహరణ: ఇంగ్లీషు దినపత్రిక 'దిహిందూ'లో లేఖలు చూడండి ఎంత అందంగా ఉంటాయో! ఆలేఖల్లో విషయమెంత బాగుంటుందో, చెప్పేతీరూ అంతే అందంగా వుంటుంది. ఒక లేఖ చదివితే అన్ని లేఖలూ ఆసక్తిగా చదవబుద్దేస్తుంది.

ఈ) ప్రతికూల పరిస్థితులు : ముఖ్యంగా పత్రికల్లో పనిచేసేవారు రోజూ ప్రతికూల పరిస్థితుల్లో రచనను కొనసాగించాల్సి వుంటుంది. ఇతరులు మాట్లాడుకుంటుంటారు, టెలిఫోన్లు మోగుతుంటాయి, మరోవైపు డెడ్‌లైన్ ముంచుకొస్తూంటుంది. అయితే ఇంట్లో కూచొని రాసే ఫ్రీలాన్స్ జర్నలిస్టులకు ఈ ప్రతికూల పరిస్థితులుండని మాట నిజం. ప్రతికూల పరిస్థితుల్లో రాసేవారు కూడా వాటిని లక్ష్యపెట్టకుండా చక్కగా రాయడానికి ప్రయత్నించాలి. రాయిబాబూ అంటే పెద్దన కవిలాగా డిమాండ్లు పెట్టకూడదు. అల్లసాని పెద్దనను కావ్యం రాయమని శ్రీ కృష్ణదేవరాయలు పురమాయిస్తే ఆయన ఇలా సమాధానమిచ్చాడట:

''నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడెమాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే''

ఈ డిమాండ్లు కవులకు, సృజనాత్మక రచయితలకు చెల్లుగానీ ప్రచార సాధనాల కోసం రాసే రచయితలు ఇలాటి గొంతెమ్మ కోరికలు కోరడం భావ్యంకాదు.

## రచనా సాధం - కృషితోనే సాధ్యం

చక్కగా రాయడం తేలికైన పనికాదు అన్నంత మాత్రాన అది అసాధ్యమైన కర్తవ్యమేమీకాదు. కృషిచేస్తే చక్కగా రాయడం అందరికీ సాధ్యమే.

శ్రద్ధగా చదువుతూ రోజూ రాస్తూంటే రచన తప్పకుండా మెరుగుపడుతుంది. రచన దైవదత్త ప్రతిభయేమీ కాదు. సాధన ద్వారా అందరూ మంచి రచయితలు కావచ్చు. కేవలం కృషివల్లనే సృజనాత్మక రచయితలుగా తయారుకావటం అసాధ్యమే అయినా సాధనవల్ల రచనాస్థాయిని మెరుగుపరచుకోవడం అందరికీ సాధ్యమే.

రచన అన్నది నిరంతర క్రమం. దానికి కొన్ని సూచనలు, చిట్కాలు ఉన్నమాట నిజమే అయినా కేవలం నిత్యసాధనవల్ల రచనను పరిపుష్టం చేసుకోవడం సాధ్యమే. రాయడం మీ జీవితంలో అంతర్భాగమైనప్పుడు రచన రాణించక తప్పదు.

రచనకు క్రమశిక్షణ అవసరం. క్రమశిక్షణ లేని రచయిత రాణించడు. చక్కగా రాయడం ఒక విధంగా కష్టమే. ఎంత కష్టం అంటే చాలా మంది కలంపట్టుకోవాలంటేనే

భయపడతారు. రెండుముక్కల ఉత్తరం రాయాలన్నా బద్ధకించడానికి ప్రధాన కారణం చక్కగా రాయలేము అన్న భయమే. చక్కగా రాయడంలో శారీరక శ్రమ, మానసిక శ్రమ ఉన్నాయి. సర్వేంద్రియాలనూ కేంద్రికరిస్తే తప్ప అందంగా రాయడం సాధ్యంకాదు.

చక్కగా రాయటం రోజుల్లో అలవడదు. ఇటుకపై ఇటుక పేర్చితే తప్ప భవనం తయారుకాదు. ప్రతిరోజూ సాధనచేస్తే తప్ప చక్కగా రాయడం అబ్బదు. పదాలను, వాక్యాలను ఇటుకల్లాగా పేర్చుకొంటూ పోతేతప్ప రచనా సౌధ నిర్మాణం పూర్తికాదు. రచనా సౌధం నిర్మించాలంటే ఎంతో శ్రమ పడక తప్పదు. అయితే ఆ శ్రమలో ఒక విధమైన ఆనందం ఉంటుంది. చక్కగా తయారైన రచన చదివితే రచయితకు చెప్పరాని ఆహ్లాదం దక్కుతుంది. ఆ ఆహ్లాదం కోసం ఎంత శ్రమనయినా ఓర్చుకోవచ్చు. రాయటంలోని ఆనందాన్ని అనుభవించడం మొదలెడితే ఇక ఆ ఆనందానికి బానిసలమైపోతాం.



కార్టూన్ చూస్తున్నారా

# ఏ లక్షణాలు ఉండాలి



**మా**మూలు రచనకూ, ప్రచార మాధ్యమాల కోసం చేసే రచనలకూ తేడా ఉంది. ప్రచార మాధ్యమాల కోసం రాసే సందర్భంగా రచయితలు మూడుముఖ్య లక్షణాలను తప్పనిసరిగా దృష్టిలో వుంచుకోవాలి. అవి 1. నిర్దిష్టత 2. స్పష్టత 3. సంక్షిప్తత. ఇందులో ఎక్కువ ముఖ్యమైనది నిర్దిష్టత.

## నిర్దిష్టత

ప్రచార మాధ్యమాల రచయితల ప్రధాన లక్షణం నిర్దిష్టత. నిర్దిష్టత అంటే వాస్తవాలను మాత్రమే రచించడం. ఘటనకు సంబంధించిన వాస్తవాలనే రచయిత చిత్రించాలి. అవాస్తవాలను, ఊహాపోహలను ఎలాటి పరిస్థితుల్లోనూ రాయకూడదు. రచయిత వాస్తవాలను గ్రహించడానికి ఎక్కువ సమయాన్ని కేటాయించక తప్పదు. ఒక్కోసారి ఎంతో మందిని ఆశ్రయిస్తే తప్ప ఎన్నో వర్గాలను సంప్రదిస్తే తప్ప వాస్తవాలు బయటపడవు. వదంతులే వాస్తవాలుగా కనిపించే ప్రమాదం కూడా ఉంటుంది. రచయిత చాలా ఓపిగ్గా శ్రద్ధగా పరిశోధిస్తేనే సత్యం అవగతమవుతుంది. ఆ సత్యాలను వివరించడానికి అవసరమైన, అనుగుణమైన భాషనూ, శైలినీ మాత్రమే వాడాలి. ఒకసారి రాశాక చదువుకొని కాపీ అన్ని విధాలా నిర్దిష్టంగా వుందో లేదో చూసుకోవాలి. అంటే కథనంలో వాస్తవాలున్నాయా? కథనానికి అనువైన భాష, శైలి వున్నాయా? ఎక్కడయినా భాషా దోషాలున్నాయా?

అనవసరమైన వర్ణన ఎక్కడయినా చొరబడిందా? వగైరా ప్రశ్నలు వేసుకొని పరిశీలించి అవసరమైతే తిరగ రాయాలి. నిర్దిష్టత (accuracy)కు ప్రథమ ప్రాధాన్యమివ్వడానికి చాలా కారణాలున్నాయి. మన సమాజం సత్య సంధతకు, చిత్త శుద్ధికి అనాదినుంచి ఎక్కువ విలువ ఇస్తున్నది. హరిశ్చంద్రుడంటే మనకు ఇప్పటికీ ఎంతో గౌరవం ఉండడానికి కారణం ఆయన సత్యంకోసం ఆలుబిడ్డలను సైతం త్యాగం చేయడమే. ఎన్ని వత్తిళ్లు వచ్చినా ఆయన ఒక చిన్న అబద్ధం చెప్పడానికి సైతం నిరాకరించి నిర్భయంగా కడగండ్లు, కష్టాలు అనుభవించాడు. అంతేకాదు మన ప్రచార సాధనాల మీద ప్రజలకు ఇప్పటికీ గొప్ప విశ్వాసం ఉంది. పత్రికల్లో వస్తున్న వార్తల్లో, ప్రత్యేక కథనాల్లో, వ్యాసాల్లో వాస్తవమే ఉంటుందని పాఠకులు, శ్రోతలు నమ్ముతున్నారు. కనుక ప్రచారసాధనాలు తమ మీదున్న ప్రజా విశ్వాసాన్ని కాపాడుకోవాలి. టెలివిజన్లలో తాము చూసిందంతా, పత్రికల్లో తాము చదివిందంతా సత్యమే అని నమ్ముతున్నారు. ఆ విశ్వసనీయతను కాపాడుకోవడం ప్రచార సాధనాల విధి. ప్రచార సాధనాలు విశ్వసనీయతను పరిరక్షించుకోవాలంటే ప్రచార సాధనాల రచయితలు వాస్తవాలు మాత్రమే రాయాలి. రచనల్లో అవాకులు చెవాకులు, అనవసరవ్యాఖ్యలు, ఊహలు, నీలాపనిందలు చోటుచేసుకోకూడదు.

నిర్దిష్టత పాటించాలనడానికి మరో కారణం కూడా ఉంది. ప్రజలు తాము చదివే పత్రికల్లో అవాస్తవాలు, అతిశయోక్తులు ఉంటాయని భావించిన మరుక్షణమే ఆ పత్రిక చదవడం మానేస్తారు. టీవీలో రేడియోలో అవాస్తవాలు ప్రసారం చేస్తున్నారని భావిస్తే ఇక ఆ ప్రసార సాధనాల వార్తలు వినడం, చూడడం మానేస్తారు. ఏ ప్రచార సాధనానికీ విశ్వసనీయత కోల్పోయే దుస్థితి దాపురించకూడదు. ఆ దుస్థితి వస్తే దానికిక నూకలు చెల్లినట్లే.

ప్రచార మాధ్యమాల కోసం రాసే రచయితలను శంకించాల్సిన అవసరం లేదు. వృత్తి ధర్మమెరిగిన ఏ రచయితా అవాస్తవాలు, అబద్ధాలు రాయాలనుకోడు. ప్రతి రచయితకూ అతడి అంతరాత్మే గీటురాయి. తన రచనలు విశ్వసనీయత కోల్పోతాయన్న భయంతోనయినా వారు సత్యసంధతకు కట్టుబడక తప్పదు. వారు సాధారణంగా కచ్చితంగా, నిర్దిష్టంగా రాయాలనే భావిస్తారు. అలా రాయడం తమ నైతిక బాధ్యత అని భావిస్తారు. భావించితీరాలి. ప్రతి రచయితా అలా భావించినప్పుడే ప్రచారసాధనాలపై ప్రజలకు గౌరవభావం ఉంటుంది. ఏమాట కామాటే చెప్పుకోవాలి. ఈ విషయంలో మన పత్రికలకూ అమెరికా పత్రికలకూ కాస్త తేడావున్న మాట నిజం. అమెరికా పత్రికలకున్నంత విశ్వసనీయత మన దేశంలోని పత్రికలకు లేదంటే విభేదించేవారు తక్కువ మందే ఉంటారు. ప్రధాన మంత్రులను గద్దెదించడానికో ముఖ్యమంత్రులను గద్దెకెక్కించడానికో అక్కడ పత్రికలు బాకాగా పనిచేయవు. సాధారణంగా అక్కడి పత్రికలు అలాటి పనికి ఒడిగట్టవు.

పాక్షిక దృష్టి వెల్లడిస్తూనే నిష్పాక్షికంగా వ్యవహరిస్తున్నట్లు నటించాల్సిన దుస్థితికి అక్కడి పత్రికలు సాధారణంగా దిగజారవు.

ప్రచార సాధనాల రచయిత ఎలా నిర్దిష్టంగా, నిష్పాక్షికంగా వుండగలడు? తనురాసిన సమాచారం కచ్చితమైనదిగా, సత్యమైనదిగా ఉండాలంటే తీసుకోవాల్సిన జాగ్రత్తలేమిటి? నిష్పాక్షికంగా, నిర్దిష్టంగా రాయాలంటే రచయితలు ఏమి చేయాలి?

ప్రచార సాధనాల రచయితలు ఎలాటి పూర్వ నిశ్చిత భావాలను ఉంచుకోకుండా వాస్తవాలను, సత్యాలను గ్రహించడానికి సదా సంసిద్ధంగా ఉండాలి. నూతన భావాలను, వివిధ వర్గాల అభిప్రాయాలను స్వీకరించడానికి సిద్ధంగా వుండడం అతడి వృత్తిధర్మం. తమతో ఏకీభవించే వారితోనే కాక విభేదించే వారితో సైతం మాట్లాడ్డానికి ఆసక్తి చూపాలి. ఇతరులు చెప్పేది శ్రద్ధగా ఆలకించడం తప్పనిసరి. వారు చెప్పేదంతా నమ్మినా నమ్మకపోయినా ముందు వినాలి. విన్నాక అందులో సత్యమెంతో విశ్లేషించాలి. సుమతీ శతక కారుడు ఇలా అన్నాడు.

*వినదగు నెవ్వరుచెప్పిన*
*వినినంతనె వేగపడక వివరింప తగున్*
*కనికల్ల నిజము తెలిసిన*
***మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ!***

ప్రచార సాధనాల రచయితలు సైతం ఈ నీతిని పాటించాలి. మీరు అన్ని వర్గాలు, సంస్థలు, వ్యక్తులు చెప్పేది వినాల్సిందే. విన్నదంతా సత్యమనుకోనక్కర్లేదు. ఆమాటకొస్తే సత్యమైన ప్రతిదీ రాయాలన్న నిబంధనకూడా లేదు. అంటే కొన్ని వాస్తవాలను కథనంలో జోడించాల్సిన అవసరం ఉండదు. అయితే వారు ఎక్కువ విషయాలు, వాస్తవాలు సేకరించడంవల్ల వాస్తవమేదో గ్రహించే అవకాశం తేలిగ్గా లభిస్తుంది. ఎక్కువ వివరాలు సరైన నిర్ధారణకు రావడానికి తోడ్పడతాయి.

రచయితలు కచ్చితంగా, నిష్పాక్షికంగా, వాస్తవ . పరిధికి లోబడిరాయాలంటే ఏంచేయాలి?

## *బాగా చదవండి*

ప్రచార మాధ్యమాల కోసం రాసేవారు దొరికిన పుస్తకమల్లా శ్రద్ధగా చదవాలి. వీడియోలువచ్చి చదువును నిరర్ధకంగా మార్చాయనుకోవటం పొరపాటు. విజ్ఞానం సంపాదించడానికి ఇప్పటికీ పుస్తకాలే ఉత్తమ మాధ్యమం. చదవటమంటే ఉబుసుపోకకు చదవటంకాదు. జ్ఞానార్జనాదృష్టితో చదవాలి. జ్ఞానదాహంతో చదవాలి. అప్పుడే చదువువల్ల ప్రయోజనం సిద్ధిస్తుంది. ''చదువది యెంత కల్గిన రసజ్ఞత చాలకయున్న ఆ చదువు నిరర్థకంబు'' అంటాడు భాస్కర శతకకారుడు. సారాన్ని గ్రహించి చదివితేనే సత్ఫలం.

ఈ రంగంలో పనిచేసే వారు తాము రాస్తున్న వివరాలేమిటో, వాటికి ఎలా అక్షర రూపం కల్పిస్తున్నారో శ్రద్ధగా పరిశీలించాలి. గుడ్డెద్దు చేలో పడ్డ సామెత చందంగా రాయకూడదు. రాసేదేదో చక్కగా రాయాలి. మంచి భాషలో రాయాలి. కనీసం అక్షరదోషాలు ఉండకుండా చూడాలి. అక్షర దోషాలు కనిపిస్తే పాఠకుడి దృష్టిలో పలచనైపోతారు. చెప్పే విషయానికి ఇచ్చే ప్రాముఖ్యమే చెప్పే పద్ధతికీ ఇవ్వాలి. విషయం బాగుందికదా ఎలా రాస్తేనేం అని అలసత్వం చూపకూడదు. తాపీ మేస్త్రీ ప్రతి ఇటుక సైజు శ్రద్ధగా పరిశీలించి ఒకదానిపై మరొకటి పేర్చుకొంటూ పోతూ భవనం నిర్మిస్తాడు. ఇక్కడ వార్తాకథనం భవనమైతే వాస్తవాలు ఇటుకలు. కనుక రచయిత ప్రతివాస్తవాన్నీ శ్రద్ధగా పరికించి వార్తాకథన సౌధాన్ని నిర్మించాలి.

మనం ఈ అంశాన్ని ఒక ఆధునిక కవి ఉల్లేఖనంతో ముగిద్దాం

''చెప్పేదేదో కచ్చితంగా చెప్పు

సత్యాల ముడిచక్కగా విప్పు

అవాస్తవాల జోలికి పోవద్దు

సత్యమే సర్వులకూ ముద్దు''

## స్పష్టత

ఏరచనలో అయినా స్పష్టత ప్రధానం. అది లోపిస్తే రచనలో చెప్పదల్చుకున్నది పాఠకుడికెక్కదు. ఈనాడు కథల్లో, నవలల్లో, కవితల్లో అన్నిట్లోనూ అస్పష్టత ప్రవేశించింది. ముఖ్యంగా తెలుగు కవిత్వంలోకి అస్పష్టత, అయోమయం పెద్ద యెత్తున ప్రవేశించింది. తెలుగు కవిత్వంలోని అయోమయాన్ని దేవరకొండ బాలగంగాధర తిలక్ అనే ఆధునిక కవి ఇలా ఖండించాడు.

''మోడరన్‌గా వుందామని, ఏదో అందామని

తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని

అర్థంలేని ఇమేజరీతో కలగా పులగపు వర్ణనలతో

డిలాన్ థామస్‌కు చేతగాని అనుకరణలతో

ఒక దేశం, నిర్దేశంలేని వాక్యాల వికారంతో

ఎందుకు బాధిస్తావు నన్ను? బాధపడతావు నువ్వు?

తెలుగుకవులు చేసుకున్న పుణ్యమా అని తిలక్‌లాటి విమర్శనాత్మక కవులు లభించారు. కానీ ప్రచార సాధనాల రంగంలోని అస్పష్టతనూ అయోమయాన్నీ విమర్శించి ఒక మార్గం

చూపే విమర్శకులు లేరు. దురదృష్టవశాత్తు ప్రచార మాధ్యమాల కోసం చేస్తున్న రచనలు ఇంకా విస్తృత పరిధిని సంతరించుకోలేదు. కనుక ఈ రంగంలో విమర్శ అభివృద్ధి చెందనే లేదు.

రచయితలు స్పష్టతకు విశేష ప్రాధాన్యం ఇవ్వాలి. మీ రచనలో వాస్తవాలు అస్పష్టంగా వుంటే పాఠకుడికి అసలు సందేశం ఎలా చేరుతుంది? వాస్తవాలెంత ముఖ్యమో స్పష్టంగా వివరించడమూ అంతే ముఖ్యం. హోటల్‌లో పదార్థాలు రుచిగా వుంటేనే తింటారు. పంచదార, నెయ్యి, శనగపప్పువేశాం కదా రుచి వుండకేం చేస్తుంది అంటే సరిపోదు. పదార్థాల్లో ఏమి ఉపయోగించావన్నది ఎంత ప్రధానమో, అవి రుచిగా వున్నాయా లేదా అన్నదికూడా అంతే ప్రధానం. వాస్తవాల చిత్రణే కాదు మీ చిత్రణ పాఠకుడికి స్పష్టంగా అర్థం అవ్వాలి. మీరు రాసింది విన్నాక, లేక చదివాక పాఠకుడు తన్నుతాను ప్రశ్నించుకొంటే మీరు రాసిన అంశాలలో ఎక్కువ భాగం స్పష్టంగా గుర్తుకురావాలి. చదివిన విషయం జ్ఞాపకం పొరలో భద్రంగా ఉండిపోవాలి తప్ప ఆవిరిలా అదృశ్యమై పోకూడదు.

రచయితలు భాషలో ప్రావీణ్యం సంపాదించడం అవసరం. భాషలో పాండిత్యం అక్కర్లేదు కానీ కనీసం అయోమయంలేకుండా స్పష్టంగా రాయటమెలాగో తెలిసివుండాలి. కథనాన్ని లేక వ్యాసాన్ని స్పష్టంగా, సరైన పద్ధతిలో అల్లుకుపోవాలి. రాసింది చదువుకుంటూ గందరగోళం, అయోమయం ఉంటే పరిహరిస్తూ తిరగరాస్తూపోవాలి. కథన నిర్మాణానికీ, వాక్యనిర్మాణానికీ మధ్య సమన్వయం కుదిరేలా రాయాలి. అలా సంతులనం ఉన్నప్పుడే చదువుకోడానికి హాయిగా ఉంటుంది. వాక్య నిర్మాణం కంటికీ, చెవికీ నదురుగా శ్రావ్యంగా ఉండాలి. ఈ విషయంపై ఎందుకు ఇంతగా చెప్పవలసి వస్తోందంటే యాభైలలో అమెరికా



దినపత్రికల్లో ప్రమాణాలు పడిపోతున్నప్పుడు మార్క్ ఎత్రిడ్జ్ అనే సుప్రసిద్ధ ప్రచురణకర్త ఈ యిలా ఆవేదన వ్యక్తం చేశారు :

''మన వార్తా కథనాల్లో, సంపాదకీయాల్లో ఇప్పటికీ అనవసరమైనది చాలా ఉంటున్నది. 'అతిగా' రాయటం కొనసాగుతూనే ఉంది. పూర్వాపరాల కోసం గట్టి ప్రయత్నం కనిపించదు. ఇప్పటికీ పాత ఏడుపు గొట్టు కథనాలే దర్శనమిస్తున్నాయి. శుభ్రంగా రాయడం మనమింకా నేర్చుకోలేదు.''

నలభై యేళ్ల క్రితం అమెరికాలోనే ఆ పరిస్థితి ఉందంటే నేడు మన పత్రికల్లోని పరిస్థితి తేలిగ్గానే అర్థం చేసుకోవచ్చు. రచయితలు నిత్యజాగరూకులై వ్యవహరించాలి. రచయిత మనస్సులో స్పష్టత ఉంటే కథనంలో చక్కగా స్పష్టత దర్శనమిస్తుంది. కథనానికి సంబంధించిన మనోచిత్రం అందంగా, స్పటిక సదృశంలా ఉంటే రచనా చిత్రం కూడా అంతే అందంగా స్పష్టంగా ఉండే అవకాశం ఉంటుంది. కథనం రాయటం పూర్తికాగానే శ్రద్ధగా చదివి లోపాలు గ్రహించి వాటిని తొలగించాలి. జాగ్రత్త, శ్రద్ధ వ్యక్తం చేస్తే రచన పెద్ద బ్రహ్మవిద్యేమీ కాదు, అందరూ అందులో రాణించొచ్చు. రచయిత కథనం ముగించాక తనొక పాఠకుడిగా చదువుకోవాలి. స్పష్టంగా అర్థమవుతున్నదా? ఎక్కడయినా 'సుత్తి' ఉందా? ఇంకొంచెం సంక్షిప్తం చేయొచ్చా? ఇలా ప్రశ్నించుకోవాలి. ప్రచార సాధనాలకు రాసే వారికి ఆత్మ విమర్శ అవసరం. తనకు తనే అంకుశంలాగా వ్యవహరిస్తూ ప్రతిని చక్కగా ఎడిట్ చేసుకోవాలి. క్రమశిక్షణ ఉన్న రచయిత మాత్రమే తన కాపీని తను చక్కగా ఎడిట్ చేసుకోగలడు. తను రాసిందంతా బాగుంటుంది లెమ్మనే భరోసాధోరణికి అలవాటుపడినా, బద్ధకించినా రచయిత, కాపీని ఎడిట్ చేసుకొనే అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకొంటాడు. స్పష్టతకు వ్యతిరేక పదం అస్పష్టత. అస్పష్టత అంటే అయోమయం, గందరగోళం. కథనంలోకి గందరగోళం చాలా మార్గాలనుంచి ప్రవేశించే ప్రమాదం ఉంది. గందరగోళం ఎలా వచ్చి చేరినా దాన్ని రచన నుంచి తొలగించే బాధ్యత రచయితదే. గందరగోళంగా రాసి సానుభూతితో అర్థం చేసుకోండి బాబూ అంటే పాఠకులు అంగీకరించరు. అసలు ఎందుకు అంగీకరించాలి? గందరగోళంగా రాయడానికి ప్రధాన కారణం రచయితకు తను రాస్తున్న విషయంపై సరైన అవగాహన లేకపోవడమే. తమకు అవగాహనలేని అంశంపై రాస్తే అది అయోమయంగా తయారయ్యే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది.

స్పష్టంగా రాయటం ఒకకళ. ఆ కళ దీక్షగా సాధన చేస్తే తప్పు పట్టువడదు. మీభావాలను, అనుభూతులను లేక సమాచారాన్ని స్పష్టాతి స్పష్టంగా రాయడం నిజానికి చాలా కష్టం. అదంత తేలికయిన పనేమీకాదు. మనం రాసేదానికంటే మన మెదడు వేగంగా పరుగులు తీస్తుంది. కనుక ఒక్కోసారి రచనకూ, ఆలోచనకూ లంగరందదు. ఒక విషయం రాస్తోంటే మెదడు మరో అంశం మీదికి మళ్లి కొత్త ఆలోచనలకు అంకురార్పణ

వేసుకోవచ్చు. మెదడుకు పగ్గాలు వేసి జాగ్రత్తగా రచనాక్రమం సాగించాలి. విషయంపై పక్కాటి అవగాహనే స్పష్టమైన రచనకు పునాది. బాగా ఆకళింపు చేసుకున్న అంశం గురించి మాత్రమే చక్కగా స్పష్టంగా రాయడం సాధ్యం. కాబట్టి రచయిత మొదటగా చేయాల్సిన పని విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవడం. అన్నం వండడానికి ఎసరు ఎంత ప్రధానమో రచనలో స్పష్టతకు విషయంపై అవగాహన అంతముఖ్యం. ఈ సామ్యం ఆషామాషీగా కనిపించొచ్చుగానీ ఇది వాస్తవం. స్పష్టంగా అవగాహన చేసుకొన్నప్పుడే స్పష్టంగా రాయగలుగుతాడు.

## స్పష్టత కోసం సూచనలు

రచనలో స్పష్టత సాధించడానికి కొన్ని సూచనలు, సూత్రాలు ఉన్నాయి. ప్రచారసాధనాల కోసం రాసేవారు వీటిని దృష్టిలో పెట్టుకోవడం అవసరం.

**పదాడంబరం పనికిరాదు:** కొందరు రచయితలు ఎంత పెద్ద పదాలు దొర్లిస్తే అంతగొప్ప అనుకుంటారు. రచయితలు ఆ మనస్తత్వం నుంచి బయటపడాలి. ప్రచారసాధనాల రచయితకు పాండితీ ప్రకర్ష మొదటి శత్రువు. పెద్ద పెద్ద శబ్దాలు వాడితే పాఠకులు అదిరిపోతారనుకోవటం అవివేకం తప్ప మరొకటికాదు. నిజానికి చిన్న చిన్న పదాల్లో సరళంగా చెప్పడమే కష్టం. సరళంగా చెప్పిందే సూటిగా అర్థమవుతుంది. అలంకారయుతంగా చెప్పాలనుకోవడం కూడా పొరపాటే. దాదాపు పాతికేళ్ల క్రితం సుప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి (రా.రా.) కొడవటిగంటి కుటుంబరావు శైలిని వివరిస్తూ ఇలా రాశారు. ''ఆధునిక శైలిలో ముఖ్యమైన గుణం కృత్రిమత్వం లేక పోవడం- అంటే నిత్యజీవితంలోని వ్యవహారానికి దగ్గరగా ఉండడం. వీలైనంతవరకు నిత్యవ్యవహారంలోని మాటలే వాడడం. వీలైనంతవరకు నిత్యవ్యవహారంలోని వాక్యనిర్మాణ పద్ధతులే అవలంబించడం.''

రా.రా.గారు సృజనాత్మక రచయితలకు చేసిన సూచన అది. సృజనాత్మక రచయితలకంటె మరింత సరళ పదాలు వాడడం ప్రచార సాధనాల రచయితల విధి. చిన్నపదాల్లోనే కొండంత భావాలను స్పష్టంగా వ్యక్తం చేయొచ్చు. విషయం ప్రధానం గానీ శబ్దాడంబరంకాదు. శబ్దాడంబరం ఉంటే పాఠకుడి దృష్టి ఆ బడబడశబ్దాల మీదికి పోతుంది తప్ప విషయం మీదికి వెళ్లదు. పాఠకుడికి భావం బట్వాడా కాకుండా ఆ శబ్దాలే ప్రతిబంధకంగా నిలుస్తాయి. ఇక్కడ 'ప్రతిబంధకంగా' బదులు 'అడ్డంకిగా' అంటే బాగుండేది. అవునా? (శబ్దలౌల్యంలో ఆ పదం వాడి వెంటనే గ్రహించాను. కానీ మీకు ఉదాహరణకోసం అలాగే వుంచాను. గమనించగలరు.)

భావాలను లేక సమాచారాన్ని కేవలం పాఠకులకు అందచేయడమే మీ పని కాబట్టి ఏలాటి పరిస్థితుల్లోనూ శబ్దాడంబరానికి ఆకర్షితులు కావొద్దు. చిక్కేమిటంటే మీరు,

అంటే ప్రచారసాధనాల కోసం రాసే వారు, తరుచుగా మీరచనా ప్రయోజనాన్ని శుభ్రంగా మరచిపోతుంటారు. మీ రచనా ప్రయోజనం ఏమిటి? పాఠకులకు సందేశాన్ని చేరవేయడం. రచన అన్నది పాఠకుల్ని తమవైపు ఆకర్షించుకోకుండా విషయంవైపు వారిని మళ్లించే విధంగా ఉండాలి. ఇంగ్లీషులో Simplicity is the mother of beauty అన్న సూక్తిని ఆకళించుకోవాలి. నిరాడంబరతలో ఉన్న అందం ఆడంబరంలో లేదు. ఈ సూక్తి రచనకు కూడా నూటికి నూరు పాళ్లూ వర్తిస్తుంది. రచన సాధ్యమైనంత సరళంగా నిరాడంబరంగా ఉండాలి. ఈ రంగంలోని రచయితలు చిన్నపదాలే, చిన్న వాక్యాలే రాయాలి. విశేషణాలను, పదబంధాలను, పటాటోప పదాలను దగ్గరకు రానివ్వకూడదు. చిన్నారుల బుడిబుడి నడకలా చిన్న చిన్న పదాలే అందంగా ఉంటాయి. చిన్న పదాలు, సరళవాక్యాలు వాడితే చెప్పదల్చుకున్న విషయం పాఠకుడికి నేరుగా చేరుతుంది. అవే చాలా సమర్థంగా పనిచేస్తాయి.

## కళ్లముందు బొమ్మ నిలపండి

జర్నలిస్టులు లేక ప్రసారసాధనాల రచయితలు తాము రాసిందల్లా పాఠకులకు అర్థమయ్యేలా రాయాలి. వార్తాకథనం రాస్తే ఏది ఎక్కడ ఎందుకు ఎలా ఏమి జరిగిందో స్పష్టంగా అర్థమవ్వాలి. పాఠకుల కళ్లముందు బొమ్మ కట్టించాలి. తాము రాస్తున్న వాటిగురించి పాఠకులకు ముందే తెలుసు అనుకోకూడదు. వాస్తవాలను ఇటుకల్లాగా పేర్చుకొంటూ పోవాలి. చిన్న వాస్తవాలను సైతం విస్మరించకూడదు. కథనం అర్థంచేసుకోవాలంటే ఒక్కోసారి చిన్న వాస్తవాలే చక్కగా సాయపడతాయి. కొత్తభావాలు, భావనలు, అభిప్రాయాలు వచ్చినప్పుడు వాటి గురించి వివరించాలి. ఉదాహరణకు ఇటీవల 'జుడీషియల్ యాక్టివిజమ్' (న్యాయవ్యవస్థ క్రియాశీలత) అన్న పదం తరుచుగా పత్రికల్లో వస్తోంది. న్యాయ వ్యవస్థ క్రియాశీలత ఏ చారిత్రక పరిస్థితుల్లో వచ్చిందో చక్కగా వివరిస్తే తప్ప పాఠకులకు ఎలా అర్థమవుతుంది? ఒక చిన్న ఉదాహరణ - ఒక జర్నలిస్టు తన వార్తాకథనంలో మొదటి వాక్యం ఇలా రాశారు. ''గుంటూరు నగర కార్పొరేషన్ కొత్త కంప్యూటర్ వ్యవస్థను కొనుగోలు చేసేందుకు అవసరమైన నిధులను మంజూరు చేస్తూ గత రాత్రి తీర్మానించింది.'' ఈ వాక్యం చదవగానే పాఠకుడు 'కొత్త కంప్యూటర్ వ్యవస్థ' అంటే ఏమిటి అని ప్రశ్నించొచ్చు. ప్రశ్నించొచ్చు కాదు తప్పని సరిగా ప్రశ్నిస్తాడు. కార్పొరేషన్ సభ్యులంతా ఆమాట వాడుతున్నారు కనుక తీర్మానంలో ఆపదం ఉంది కాబట్టి విలేకరి కొత్తకంప్యూటర్ వ్యవస్థ అని విశదీకరించకుండా రాసేశాడు. పాఠకులు ఊహించి తెలుసుకొంటారనో, వారికి అతీంద్రియ జ్ఞానం ఉందనో విలేకరులు కానీ ఇతర రచయితలు కానీ అనుకోకూడదు. రాసిందంతా పాఠకులకు సంపూర్ణంగా అర్థమయ్యేలా రాయాలి. అన్ని కథనాలను తప్పనిసరిగా ఘటనానుక్రమ పద్ధతి (క్రానలాజికల్ ఆర్డర్) లోనేరాసి తీరాలన్న నిబంధనేదీ లేదు. ఒక్కోసారి వెనకది ముందు, ముందుది వెనక కూడా రాయొచ్చు. ముఖ్యంగా ఘటన తాలూకు పూర్వాపరాలను తెలపడానికి లోగడ జరిగిన

ఘటనలను సైతం వివరించాల్సి ఉంటుంది. ఘటనలను అవసరాన్నిబట్టి వెనకాముందూ వివరించినా పాఠకులకు స్పష్టంగా అర్థమయ్యేలా రాయాలి.

## వాక్యాల మధ్య అనుబంధం

స్పష్టమైన రచనలో మధ్యంతర పరివర్తనలు అవసరం. అంటే ప్రతివాక్యం మధ్య క్రమమైన అనుబంధం, అన్వయం ఉండాలి. ఏ వాక్యానికి ఆ వాక్యం ఉండకుండా ప్రతివాక్యం మధ్య అన్వయం ఉండాలి. కాలంలో గతకాలానికీ, వర్తమానకాలానికీ మధ్య, వర్తమాన కాలానికీ భవిష్యత్ కాలానికీ మధ్య క్రమబద్ధ అన్వయం ఉన్నట్లే ముందువాక్యానికీ, వెనకవాక్యానికీ మధ్య తర్కబద్ధ అనుబంధం ఉండితీరాలి. కథనం రాసుకుంటూ పోయేప్పుడు పాత సమాచారానికి సంబంధించిన కొత్త సమాచారాన్ని ఇవ్వాలి. అంటే ఇంతకు ముందే ఇచ్చిన సమాచారానికీ ఇప్పుడు కొత్తగా అందచేస్తున్న సమాచారానికి మధ్య సంబంధం ఉంటేనే రెండింటి విషయం స్పష్టంగా అర్థమవుతుంది. అంటే రెండు సమాచారాలకూ మధ్య పరివర్తన చక్కగా ఉండాలి. అది లోపిస్తే కథనం అర్థంకాదు. పాఠకుడికి అంతా గందరగోళంగా అయోమయంగా కనిపిస్తుంది. వాక్యానికీ మరొక వాక్యానికీ మధ్య అనుబంధం ఎలా ఉంటుందో తెలుసుకోడానికి ఈ వాక్యం గమనించండి:

> *''మనం ఇంగ్లీషును బహిష్కరించనవసరం లేదు. తెలుగు మీద ఆదరం పెంచుకొంటే చాలు. తెలుగును ఆధునిక ప్రయోజనాల కోసం ఉపయోగించటం పనిగా పెట్టుకుంటే చాలు. క్రమంగా అదే పరిణామం చెందుతుంది. కాల క్రమాన ఇంగ్లీషు తప్పనిసరి అనే స్థితి దానంతట అదే అంతరిస్తుంది''.*

ఈ పేరాగ్రాఫులో ఐదువాక్యాలున్నాయి. ప్రతి వాక్యానికీ మధ్య సంబంధం గమనించండి. మొదటి వాక్యంలో ఇంగ్లీషును బహిష్కరించాల్సిన అవసరంలేదు అన్నాడు. రెండో వాక్యంలో మరో భాషగురించి ప్రస్తావిస్తూ మనం తెలుగు మీద ఆదరం పెంచుకొంటే చాలు అంటాడు. ఆ ఆదరాన్ని ఎలా పెంచుకోవాలో మూడో వాక్యంలో చెప్పాడు. అంటే తెలుగు భాషను ఆధునిక ప్రయోజనాల కోసం ఉపయోగించటం పనిగా పెట్టుకోవాలన్నాడు. ఇప్పుడు మనం ఆధునిక ప్రయోజనాల కోసం ఇంగ్లీషు వాడుతున్నాం. ఆ పనికి స్వస్తి చెప్పి, ఆధునిక ప్రయోజనాలకోసం తెలుగునే ఉపయోగించాలంటాడు. నాలుగో వాక్యంలో క్రమంగా అదే పరిణామం చెందుతుంది అంటాడు. ఏమిటా పరిణామం? అంటే తెలుగును ఆధునిక ప్రయోజనాల కోసం వాడడం ప్రారంభిస్తే ఇంగ్లీషు తప్పనిసరి కాదు అనే స్థితి వస్తుంది అంటాడు. ఇందులో ప్రతి వాక్యం మధ్యా ఎంత బలమైన, తర్కబద్ధమైన అనుబంధం ఉందో గ్రహించండి. మధ్యలో ఏవాక్యం ఎగిరిపోయినా భావమే

అర్థం కాదు. ఇటుకకూ ఇటుకకూ మధ్య సిమెంటు పూసినట్లు వాక్యాల మధ్య పరస్పర అనుబంధం ఉండాలి. అలా ఉన్నప్పుడే కథనం లేక సమాచారం స్పష్టంగా బుర్రకెక్కుతుంది. వాక్యానికీ వాక్యానికీ మధ్య సన్నిహిత సంబంధం లేకపోతే ఆ వాక్యాలు ఎలా అర్థరహితంగా కనిపిస్తాయో చూడండి.

''పాపం రాఘవరావుకు ఆ పరిస్థితిలో ఆ విషయం తట్టనేలేదు.

*పెళ్లి అంటే మాటలుకాదు. కమ్యూనిటీహాల్ దగ్గర్నుంచీ పురోహితునిదాకా అన్నీ ముందే మాట్లాడుకోవాలి. ఏమాసంలో అయితే అనువుగా ఉంటుందో మరి? సాధారణంగా అందరూ ఏప్రిల్, మే మాసాల్లో ఆ విషయంపై నిర్ణయాలు తీసుకుంటారని రఘురామ్ చెబుతారు. ఒక్కో పెళ్లి కార్యక్రమం వారం పాటు కొనసాగుతుందనికూడా ఆయన అంటారు. ఇంతకూ దండల పెళ్లా? రిజిస్టర్ పెళ్లా? ప్రమాణాలపెళ్లా? రాఘవరావు తేల్చుకోలేక సతమతమవుతున్నాడు.''*

ఈ వాక్యాల మధ్య ఉండాల్సిన అనుబంధం లేనేలేదు. మొదటి వాక్యంలో రాఘవరావుకు ఆ విషయం తట్టలేదు అని ఉంది. ఆయనకు ఏ విషయం తట్టలేదో స్పష్టంగా లేదు. పోనీ రెండో వాక్యం అందామా అదీ దాదాపు అలాగే వుంది. పెళ్లి అంటాడు, కమ్యూనిటీ హాల్ అంటాడు, పురోహితుడు అంటాడు. ఉన్నట్టుండి రఘురామ్ రంగ ప్రవేశం చేస్తాడు. ఆయనెవరో తెలీదు. వాక్యాల్లో కర్త కర్మ క్రియ అయితే వున్నాయికానీ వాక్యాల మధ్య తర్కబద్ధ సంబంధం టార్చ్‌లైటు వేసి వెతికినా కనిపించదు. ఆ రఘురామ్ పెళ్లిళ్ల పేరయ్యా? పురోహితుడా? రాఘవరావు స్నేహితుడా? ఎవరో ఆ దేవుడికే తెలియాలి.

ఇది రాసిన రచయిత పెళ్లిళ్ల గురించి రాశాను. పాఠకుడికి ఆమాత్రం తెలీదా అనుకోవచ్చు. అలా అనుకోవడం అన్యాయం. వృత్తి ధర్మానికే వ్యతిరేకం. ఉత్తమ రచయితలు అరటిపండు వల్చి చేతిలో పెట్టినంత స్పష్టంగా రాయాలి. స్పష్టంగా రాయడానికి అవసరమైన క్రమశిక్షణను మొదటినుంచే అలవరచుకోవాలి. వారు తమ రచన రాత ప్రతిని చాలా విమర్శనాత్మకంగా చదువుకోవాలి. అవసరమైన చోట నిర్దాక్షిణ్యంగా కొట్టిపారేయాలి. వాక్యాల మధ్య తర్కబద్ధమైన సంబంధం లేదనిపించినప్పుడు తిరగరాయాలి. తాను రాసిందంతా బాగుంది లెమ్మనే భరోసా ధోరణి ముఖ్యంగా జర్నలిస్టుకు శత్రువు వంటిది.

## సంక్షిప్తత

షేక్స్‌పియర్ నాటకంలోని ఒకపాత్ర "Brevity is the soul of wit" అంటాడు. అంటే సంక్షిప్తత అన్నది చతురోక్తికి ప్రాణం వంటిదన్నమాట. ఈ మూడో లక్షణం సంక్షిప్తత

గురించి వివరించడానికి ముందు ఒక సుప్రసిద్ధ సాహితీ విమర్శకుడు కథానికలో సంక్షిప్తత ప్రాధాన్యంగురించి ఏమన్నారో పరిశీలిద్దాం. ఆయన ఇలా విశ్లేషించారు: ''సంక్షిప్తత కథానికకు బలం ఇస్తుంది. అనగా పాయింటుకు పదును ఇస్తుంది. సంక్షిప్తతే కథానికకు బలం కనుక కథను సాగదీసి పేజీలను నింపాలనే ఉబలాటమూ, కథలో కవిత్వం వెలగబెట్టాలనే ప్రలోభమూ, అతితెలివి ప్రదర్శించాలనే చాపల్యమూ కథను నీరస పరుస్తాయి. ఈ విషయంలో ఈ కథకుడికి ఆత్మనిగ్రహం ఉంది''.

ఈ విమర్శకుడుచెప్పింది జర్నలిస్టుకు సైతం చక్కగా వర్తిస్తుంది. ఆ మాటకొస్తే సాహిత్యానికీ, జర్నలిజానికి కొన్ని పోలికలున్నాయనడం నిర్వివాదం. ముఖ్యంగా నాటక రచయితకూ, జర్నలిస్టుకూ సామ్యం ఉంది. ఒకరు తన నాటకాన్నీ ఇంకొకరు తన కథనాన్ని క్రమ పరిణామాలను వివరిస్తూ సౌధం నిర్మించుకుంటూ పోతారు. నాటక రచయిత ఒక అంకం తర్వాత మరో అంకం రాస్తే జర్నలిస్టేమో ఒక వాస్తవం తర్వాత మరో వాస్తవం తెలుపుతూ వార్తాకథనాన్ని క్లైమాక్స్ (పరాకాష్ఠ) దిశగా తీసుకెళ్తాడు. నాటకంలో పాత్రలుంటే వార్తాకథనంలో వాస్తవ వ్యక్తులు, ఘటనలు ఉంటాయి. ఇరువురి రచనల్లోనూ ప్రధానాంశం, కదలిక, స్పష్టమైన వివరణ ఉంటాయి. ఇరువురూ ప్రతిభావంతులైతే తప్ప మంచి నాటకం, మంచి వార్తాకథనం ఆవిష్కృతం కావు.

మళ్లీ మొదటి కొద్దాం. ప్రచార సాధనాల కోసం రాసేవారు సంక్షిప్తత పాటించకపోతే కథనం కానీ వ్యాసం కానీ పలచబడిపోయే ప్రమాదం ఉంది. అసలు సందేశం పాఠకుడికి చేరకపోయే ప్రమాదం ఉంది. సంక్షిప్తత పాటించకుండా తనకు తెలిసినవన్నీ వివరిస్తూ పోతే అసలు సందేశం కోసం కసవులో సూది కోసం వెదకినట్లు వెదక్క తప్పదు. పాఠకుడి నెత్తిమీద ఆభారం మోపే హక్కు మీకు లేదు. అనవసరమైన ప్రతి పదాన్నీ, వాక్యాన్నీ తొలగించి కథనాన్ని బిగువుగా రూపొందించాలి. కథనం ఎంత బిగువుగా ఉంటే అంత ఆకర్షణీయంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది. అయితే సంక్షిప్తత కోసం నిర్దిష్టతనుకానీ స్పష్టతనుకానీ బలిపెట్టకూడదు. సంక్షిప్తతను సాధించడం ఎలా? అందుకు సూచనలేమైనా ఉన్నాయా? ఉన్నాయి లేకేం.

## సంక్షిప్తంగా రాయటం ఎలా?

**అ) పాయింట్‌ను పట్టుకోండి:** మీరు రాస్తున్న కథనం దేని గురించి అన్నది ముందు నిర్ణయించుకోండి. ఈ కథనంద్వారా పాఠకుడికి తెలియజేయాల్సిందేమిటి? జర్నలిస్టు ముందు ఈ ప్రశ్నలకు స్పష్టమైన, సరళమైన మాటల్లో సమాధానాలిచ్చుకోవాలి. వీటికి సరైన సమాధానాలు లభిస్తే ఇక మీ కథనంలో స్పష్టత చోటుచేసుకునే అవకాశం పుష్కలంగా ఉంటుంది. ఈ సమాధానాలను దృష్టిలో పెట్టుకొంటే కథనం బిగువు (Compact)గా తయారవుతుంది.

ఆ) పునరుక్తుల్ని ఏరివేయండి: కథనంలో పునరుక్తులు పైరు మధ్య కలుపు మొక్కల వంటివి. కలుపు మొక్కల్ని తీసేయకపోతే పైరుకు నష్టం. అలాగే పునరుక్తుల్ని తొలగించకపోతే కథనంలో పటుత్వం, బిగువులోపిస్తుంది. కాబట్టి కథనం ముగించాక ఒకసారి శ్రద్ధగా చదివి, కాదు అధ్యయనం చేసి పునరుక్తులను తొలగించాలి. మామూలు రచయితల బలహీనత ఏమిటంటే, వాళ్లు తాము రాసిందాన్ని మొత్తంగా ప్రేమిస్తారు. అలా మమకారం ఉంచుకోకుండా పునరుక్తులను ఏరిపారేయాలి. క్రమశిక్షణ లోపించిన రచయిత మాత్రమే చెప్పిన విషయమే మళ్లీ చెబుతాడు. పునరుక్తి అంటే అదే. పునరుక్తులున్న కథనం పనికిమాలిన కథనంలాగ కనిపిస్తుంది. ఏకాగ్రత లేని రచయిత రచనలోనే పునరుక్తులు ప్రవేశిస్తాయి. అయితే స్పష్టత కోసం కొన్ని సందర్భాల్లో కొన్ని వాస్తవాలను మళ్లీ చెప్పాల్సి ఉంటుంది. అందులో తప్పులేదు. అవసరమైన చోట మాత్రమే వాస్తవాలను పునరుద్ఘాటించొచ్చు. అయితే దాన్ని లైసెన్సుగా తీసుకొని పదేపదే చెప్పిందే చెప్పకూడదు.

ఇ) అనవసర పదాలు తొలగించండి: కథనాల్లో అర్థపుష్టికి బలం చేకూర్చని పదాలుంటాయి. ఎంతో జాగ్రత్తగా చదివితే తప్ప అవి కనిపించవు. నిజానికి, కాగా, ఇలా ఉండగా, వాస్తవానికి, వగైరా పదాలు దొర్లకతప్పదు. ఇలాటి పదాలను అవసరమైతేనే ఉంచాలి. అవసరంలేని చోట్ల నిర్దాక్షిణ్యంగా తొలగించాలి. కాగా అన్నపదం ఇప్పుడెవ్వరూ వాడడం లేదు. మంచి రచయితకు ఊతపదాలు ఉండవు.

ఈ) వెంటనే ఆపండి: ఇక చెప్పాల్సిందేమీ లేదు అనుకున్నప్పుడు వెంటనే రాత ఆపండి. కథనంలో సుత్తి కొట్టడం క్షంతవ్యంకాదు.

నిర్దిష్టత, స్పష్టత, సంక్షిప్తత అనే మూడు ముఖ్య లక్షణాలతో పాటు మరో లక్షణం కూడా ఉంది. అది సమగ్రత. అంటే కథనంలో వీటితోపాటు సమగ్రత కూడా ఉండాలి. సంక్షిప్తతకు సమగ్రత వ్యతిరేకమని కొందరు భావిస్తారు. అది వాస్తవంకాదు. కథనం సంక్షిప్తంగా ఉన్నా సమగ్రంగా ఉండే వీలుంది. కథనం దీర్ఘంగా వుంటేనే సమగ్రత (Comprehensiveness) ఉంటుందనుకోవటం పొరపాటు. కథనంలో ముఖ్యమైన అన్ని అంశాలు ఉండి తీరాలి. ఇరవై ముప్పై వాక్యాల కథనంలో అయినా సమగ్రత చోటు చేసుకొనే అవకాశం ఉంది.

ఆర్ట్‌బుచ్‌వాల్డ్ అనే విశ్వవిఖ్యాత జర్నలిస్టు (అమెరికన్) పేరు మీరు వినే ఉంటారు. ఆయన ఫీచర్స్ చాలా సంక్షిప్తంగా ఉంటాయి. ఆయన గొప్ప వ్యంగ్య రచయిత. వ్యంగ్యమే ఆయన ఆయుధం. ఆయన రచన ఏదీ సగటున 500 పదాలకు మించదు. ఆ పదాల్లోనే చాలా స్పష్టంగా సూటిగా చెబుతాడు. ఆయన వ్యంగ్య బాణం సంధించాడంటే ఎదుటి వాడు విలవిల్లాడాల్సిందే.

## బద్ధకాన్ని దూరంచేయండి

సృజనాత్మక రచయిత బద్ధకంగా ఉన్నా చెల్లుతుందికానీ జర్నలిస్టుమాత్రం బద్ధకాన్ని పెంచుకుంటే రాణించడు. అతడు సమయంతో పోటీపడాల్సి ఉంటుంది. బద్ధకంగా వ్యవహరిస్తే కుదరదు. మార్క్‌ట్వెయిన్ అనే ప్రపంచ ప్రఖ్యాత రచయితపేరు మీరు వినే ఉంటారు. ఆయన మొదట ఒక ఇంగ్లీషు దిన పత్రిక (అమెరికా)లో పనిచేశాడు. ఆ పత్రికలో చేరిన అయిదారు మాసాలకు ఒక రోజు ఆయన్ను ఎడిటర్ పిలిపించాడట. ఎడిటర్ దగ్గరకెళ్లి ''పిలిపించారా?'' అన్నాడు.

''అవును'' అన్నాడు ఎడిటర్.

''ఎందుకు సార్?'' ప్రశ్నించాడు మార్క్‌ట్వెయిన్.

''మీకు బద్ధకం ఎక్కువ. పాత్రికేయ రంగానికి బద్ధకం శత్రువు. మీరు ఈ రంగానికి పనికిరారు. దయచేసి రాజీనామా చేయండి మీ ఉద్యోగానికి'' అన్నాడు ఎడిటర్. అప్పుడు మార్క్‌ట్వెయిన్ టేబుల్ మీది టోపీ నెత్తిమీద సింగారించి ''ఇవాళే రాజీనామా చేస్తాను. అయినా నా బద్ధకం గుర్తించడానికి మీకు ఇన్నాళ్లు పట్టిందా? అడిగితే ముందే చెప్పే వాన్నిగా'' అన్నాడట. ఆ తర్వాత మార్క్‌ట్వెయిన్ ప్రొఫెషనల్ రచయితగా (అంటే సృజనాత్మక రచయితగా) స్థిరపడి బ్రహ్మాండమైన నవలలు రాసిన విషయం అందరికీ తెలిసిందే. కనుక చెప్పొచ్చేదేమంటే సృజనాత్మక రచయిత బద్ధకస్తుడు కావచ్చు కానీ జర్నలిస్టు మాత్రం బద్ధకస్తుడయితే రాణించే అవకాశాలే లేవు. ఫ్రీలాన్స్ జర్నలిస్టుకయినా సోమరితనం శత్రువే.

## సంప్రదాయాలు మన వారసత్వ సంపద

అమెరికన్ జర్నలిజంతోనూ ఇంగ్లీషు జర్నలిజంతోనూ పోల్చితే మన జర్నలిజం వయస్సు చిన్నదే. వయసుతో నిమిత్తం లేకుండానే ఇక్కడ ఇండియాలో పాత్రికేయరంగంలో వృత్తితత్వం బాగా అభివృద్ధిచెందిన మాట వాస్తవం. ఆ వృత్తితత్వంతోపాటు కొన్ని సంప్రదాయాలు వృద్ధి చెందాయి. ఒకటి మాత్రం వాస్తవం. మన పత్రికా రంగ సంప్రదాయాలకు అమెరికన్, ఇంగ్లీష్ పాత్రికేయ సంప్రదాయాలే మూలం. మనమీ సత్యాన్ని అంగీకరించక తప్పదు. ఈ రంగంలో ఉన్న సంప్రదాయాలగురించి మామూలు పాఠకుడికి తెలీదు. కొంతమంది అసాధారణ పాఠకులకు తెలిస్తే తెలియొచ్చు.

వార్తాకథనాల మౌలిక స్వరూపాలను నిర్ధారించడంలో, వాస్తవాలను వివరించడంలో, వాక్యాల్లో వాడే పదాలను ఎంపిక చేయడంలో ఈ సంప్రదాయాలది కీలకపాత్ర.

## కథనానికి అనువైన రచనాపద్ధతి

పత్రికా రచనలో రకరకాల కథనాలున్నాయి. ఒక్కో తరహా కథనానికి ఒక్కోరకం

సంప్రదాయం పాటించడం పరిపాటి. వాటిని సంప్రదాయాలనండి, పద్ధతులనండి అవి జర్నలిజంలో స్థిరపడిపోయాయి. ఉదాహరణకు ప్రమాదవార్త ఉందనుకోండి. ఆ వార్తలో ముందు మనం చావుల సంఖ్య ఇస్తాం. ఆ తర్వాత గాయపడిన వారిసంఖ్య, వారికి జరుగుతున్న చికిత్స వగైరా వివరాలిస్తాం. అమెరికానుంచి ఆంధ్రప్రదేశ్ దాకా ఈ సంప్రదాయం అమలులో ఉంది. వాస్తవానికి పాఠకుడికి ఆసక్తి కలిగించేవీ ఆ వివరాలే. మరణ వార్తలు దాదాపు అన్ని దినపత్రికలూ ఒకే రకంగా ఇస్తున్నాయి. ఒక్క 'ది హిందూ' మాత్రం కాస్త భిన్నంగా ఇస్తుంది. అధికారంలో లేకపోతే ఎంత ముఖ్యమైన వ్యక్తి మరణించినా ఆ పత్రిక ఆయన మరణవార్త లోపలి పేజీల్లోనే ప్రచురించడం రివాజు. అలాగే 'దిహిందూ'కు ఇతర ఇంగ్లీషు పత్రికలకూ వాతావరణం వార్తలు (Weather report) ప్రచురించడంలో కూడా తేడా కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. 'ది హిందూ' పత్రికలో వాతావరణం వార్తలకు చాలా ప్రాముఖ్యం ఇస్తారు. వర్షపాతం, కనిష్ట ఉష్ణోగ్రత, గరిష్ఠ ఉష్ణోగ్రత వగైరా వివరాలకు ఈ పత్రిక ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తుంది. అది దాని సంప్రదాయం.

కుల, మతకలహాల వార్తల ప్రచురణలో మన పత్రికలు కొన్ని మార్గదర్శక సూత్రాలను పాటిస్తున్నాయి. సాధారణంగా ఏ పత్రికా మతం పేరుగాని, కులంపేరుగాని ప్రస్తావించదు. మరీ తప్పనిసరి అయితే తప్ప ప్రచురించరు. ఆదిలాబాద్‌లో ముస్లిములు హిందువులపై దాడి చేశారని స్పష్టంగా ప్రకటిస్తే హైదరాబాద్‌లో హిందువులు ముస్లిములపై ప్రతీకారదాడులకు దిగొచ్చునన్న భయంతో మన పత్రికలు ఈ పద్ధతిని తూచా తప్పకుండా పాటిస్తున్నాయి. కేవలం ఇందువల్లే ప్రతీకార దాడులను నివారించగలమా అంటే అది వేరే విషయం.

మానవాసక్తికర కథనాలు. ఇవి ఏ ఆకాశంలో నుంచో ఊడిపడవు. ఏదైనా ఘోరవిపత్తో, ప్రమాదమో సంభవించినపుడు జాగ్రత్తగా అన్వేషిస్తే మానవాసక్తికర కథనాలు (Human Interest Stories) లభిస్తాయి. 1993 అక్టోబరులో మహారాష్ట్రలోని లాతూరు వగైరా ప్రాంతాల్లో భూకంపం సంభవించినప్పుడు తెలుగు పత్రికలు బోలెడు మానవతా కథనాలు ప్రచురించాయి. మానవతా కథనాలను చక్కటి కథానికల్లాగా హృదయానికి హత్తుకునేలా రాసే సంప్రదాయం మన దేశంలోని అన్ని పత్రికలకూ ఉంది. మామూలు వార్తలు చదివి విసుగెత్తిన పాఠకులకు ఇవి కాస్త ఊరటకలిగిస్తాయి.

## నిష్పాక్షికత, సంతులనం

అమెరికన్ పత్రికలతో పోల్చలేముకానీ మన పత్రికలు కూడా ఎంతో కొంత నిష్పాక్షికత, సంతులనాన్ని పాటిస్తున్నాయి. ఏమాటకామాటే చెప్పుకోవాలి. దాదాపు ఇరవై ఏళ్లక్రితం మనదేశంలో క్యాంపెయిన్ జర్నలిజం అనేది వ్యాప్తిలోకి వచ్చింది. అంతకు ముందు అది అసలు లేదని కాదుగానీ ఒక ధోరణిలాగా బయలుదేరింది అప్పట్నుంచే. ఏ ప్రధానినో

దించాలని ఒక పత్రికాధిపతి శపథం చేస్తాడు. ఇక ఆయన పత్రిక ఆ ప్రధానికి సంబంధించిన ప్రతికూల వార్తలకే ప్రథమ ప్రాధాన్యం ఇస్తుంది. ఏముఖ్యమంత్రినో దించి తనకు ఇష్టుడు, అనుకూలుడు అయిన మరో నేతను ముఖ్యమంత్రిగా చేయాలని ప్రతినచేస్తాడు మరో పత్రికాధిపతి. ఇక అంతే. ఆ పత్రికలో అన్నీ ఆ ముఖ్యమంత్రికి వ్యతిరేక వార్తలే చోటు చేసుకొంటాయి. ఇలాటి ''ప్రచార తరహా'' వార్తలు పత్రికలకెక్కడానికి ప్రధాన కారణం పత్రికల మధ్య పోటీలేక పోవడం కావచ్చు. దురదృష్టవశాత్తూ ఆంధ్రప్రదేశ్ సహా అనేక రాష్ట్రాల్లో ఈ తరహా క్యాంపెయిన్ జర్నలిజం మూడు చందాలు ఆరు పత్రికలుగా వర్ధిల్లుతోంది. అయితే అమెరికాలోనూ, యూరప్‌లోనూ ఈ రకం జర్నలిజం బతికిబట్టకట్టే స్థితిలో లేదు. అందుకు రెండు ప్రధానకారణాలు కనిపిస్తాయి. ఒకటి- అక్కడ పత్రికల మధ్య ఆరోగ్యకరమైన పోటీ ఉంది. రెండు- అక్కడి పాఠకులు మన పాఠకుల కంటె పరిణతి చెందినవారు. అక్కడి పత్రికలు సర్వసాధారణంగా ఎవరిపక్షమూ వహించవు. నిష్పాక్షికంగానే వ్యవహరిస్తాయి. ఉభయ పక్షాల వాదనలకూ తగిన అవకాశం కల్పిస్తాయి. కానీ ఇక్కడి జర్నలిస్టుల్లో కొందరికి అవసరమైనంత వృత్తితత్వంగాని, చిత్తశుద్ధిగాని లేవు.

ఏది ఏమైనా నిష్పాక్షికత పాటించడం జర్నలిస్టుల విధి. ఎవరైనా అధికారిపైకానీ రాజకీయ నాయకునిపైకానీ ఆరోపణల వార్త ప్రచురించినప్పుడు ఆ అధికారికి లేక ఆ రాజకీయనేతకు తన వాదనను వినిపించే అవకాశం కల్పించాలి. ఏకపక్ష వార్తలు పత్రికల ఆరోగ్యానికి హాని చేస్తాయి. జర్నలిస్టులు ఏపక్షమూ వహించక పోవడమేకాదు, ఒక పక్షాన్ని సమర్థిస్తున్నట్లు కనిపించకూడదుకూడా. సంఘటన తాలూకు ప్రాధాన్యానికి ఎంత విలువ ఇవ్వాలో అంతే విలువ ఇవ్వాలి. ప్రాధాన్యాన్ని తక్కువ చేసి చూపకూడదు. ఎక్కువ చేసి చూపకూడదు. సంతులనం పాటించితీరాలి. మన జర్నలిస్టులు అప్పుడప్పుడు గాడితప్పి వ్యవహరిస్తుంటారు. అంటే కొండకచో నిష్పాక్షికతకు నీళ్లొదులుతుంటారన్న మాట. మొత్తంమీద చెప్పదల్చుకున్నదేమంటే - నిష్పాక్షికత సంప్రదాయానికి మనపత్రికలు త్రికరణశుద్ధిగా కట్టుబడిలేవు. తరుచుగా ఆ సంప్రదాయాన్ని కారణమేదయినా ఉల్లంఘిస్తున్నమాట అక్షర సత్యం. స్వాతంత్ర్యానికి పూర్వం మన పత్రికలు ఒక లక్ష్యానికి అంకితమై మిషినరీ జీల్‌తో పనిచేసేవి. దురదృష్టవశాత్తూ ఇటీవలి కాలంలో మన పత్రికలు వాణిజ్య పాత్రకు కట్టుబడడంతో కొన్ని సత్సంప్రదాయాలు గాలికెగిరిపోతున్నాయి. జర్నలిస్టు జరిగిన ఘటనలను వార్తలుగా రాయాలి తప్ప వార్తలను తానుగా సృష్టించకూడదు. అది అతని పనికాదు. జరిగిన ఘటనలను నిష్పాక్షికంగా, నిర్భయంగా రాయాలి.

## రిపోర్టర్ కనిపించకూడదు

నిష్పాక్షికంగా రాయాలన్న సూచనకు, రిపోర్టర్ కనిపించకూడదు అన్న సూచన దగ్గరగా ఉంది. విలేకరి ఎప్పుడూ తన రచనలో కనిపించకూడదు. విలేకరి కనిపించకూడదు అంటే

అర్థం (1) ఆయన తన అభిప్రాయాలను, భావాలను తన రచనలో వెల్లడించకూడదు. (2) ఉత్తమ పురుషలో రాసిన కథలో మాదిరి విలేకరులు పాఠకులను నేరుగా పలకరించకూడదు. అలాగే పాఠకులను సైతం పాత్రలుగా మార్చడం భావ్యంకాదు. ఇంకొంచెం స్పష్టంగా చెప్పాలంటే విలేకరులు ఎప్పుడూ నేను, నా, నన్ను, మనల్ని, మనం వగైరా పదాలు రాయకూడదు. దీనికి అనుగుణంగానే మీరు, మీ, మిమ్మల్ని అని పాఠకుల్ని ఉద్దేశించి రాయడం నిషిద్ధం. మన పత్రికలు ఈ సంప్రదాయాన్ని శత శాతం అమలు పరుస్తున్నాయి. కొందరు విలేకరులకు ఒక బలహీనత ఉంటుంది. మాటకొస్తే నేను భావించేదేమంటే, నా అభిప్రాయం ఏమిటంటే అంటూ ఆత్మ ప్రదర్శనకు దిగుతూంటారు. ఇలా రాయడం సముచితంకాదు. ఏ విలేకరీ, జర్నలిస్టూ నూటికి నూరు పాళ్లు నిష్పాక్షికంగా వ్యవహరించడం అసాధ్యం. అయినా వారు తమ సొంత భావాలను నేరుగా వ్యక్తం చేయడం మంచిది కాదు. జరిగిన ఘటనను నిష్పాక్షికంగా, సమగ్రంగా, నిరుద్రేకంగా పాఠకులకళ్లముందుంచాలి. ఘటన అనే నాటకంలో రిపోర్టర్ పాత్రకాదు, ప్రేక్షకుడు కాదు. ఈ విషయం నిరంతరం జ్ఞాపకం ఉంచుకోవాలి. మీ వార్తాకథనాలు చదివి పాఠకులే కొన్ని నిర్ధారణలకు రావచ్చుకానీ మీరే నిర్ధారణలు లాగడం మంచిదికాదు.

అయితే కొన్ని సందర్భాలలో విలేకరిలేక జర్నలిస్టు తన అభిప్రాయాలను వ్యక్తం చేయవలసి ఉంటుంది. ముఖ్యంగా వ్యాఖ్యానాత్మక వార్తారచన సాగిస్తున్నప్పుడు ఆ అవసరం ఉంటుంది. అప్పుడు కూడా తన అభిప్రాయానికి దన్నుగా రాజ్యాంగాన్నో, పూర్వసంప్రదాయాన్నో ఉటంకించాలి తప్ప నేరుగా తన అభిప్రాయం వెల్లడించకూడదు. కుల్‌దీప్ నయ్యర్, ప్రేమశంకర్‌ఝా, కత్యాల్ లాటి పేరుతో రాసే రచయితలు తమ సొంత భావాలను వ్యక్తం చేస్తున్నమాట నిజం. వారితో వర్ధిష్ణువులయిన మీరు పోటీ పడడం భావ్యంకాదు. వారికున్న అపార అనుభవం ఆధారంగా, కొన్ని అంశాలను విశ్లేషిస్తున్నప్పుడు సొంత అభిప్రాయాలను వెల్లడిస్తుంటారు.

## అధికార వర్గాల సమాచారం

వార్తా పత్రికల్లో వస్తున్న వార్తల్లో ఎక్కువ శాతం వార్తలకు ఆధారం అధికార వర్గాల కథనమే. అధికార వర్గాలపై ఆధారపడడం తప్పేమీకాదు గానీ మరీ అతిగా ఆధారపడడం మంచిదికాదు. ''అతి సర్వత్ర వర్జయేత్'' అన్నారు కదా పెద్దలు. ద్రవ్యోల్బణం, ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి వగైరా అంశాలపై రాస్తున్నప్పుడు నిపుణులయిన అధికారుల అభిప్రాయాలను తెలుసుకోక తప్పదు. అయితే ఒక్కోసారి ముఖ్యంగా ద్రవ్యోల్బణం, ధరలు అంశాలపై ప్రభుత్వవర్గాలు చెప్పేదానికీ వాస్తవ పరిస్థితులకీ మధ్య వ్యత్యాసం ఉండొచ్చు. అలాటి సందర్భాలలో మార్కెట్ వర్గాలనూ, వివిధ విభాగాలకు చెందిన ప్రజలనూ కూడా

సంప్రదించి కథనాన్ని సమగ్రమైనదిగా చేయొచ్చు. అధికార వర్గాల కథనంతోపాటు అనధికార వర్గాలనూ ఉటంకించాల్సిందే. ఈ సంప్రదాయం కూడా కొనసాగించ తగిందే.



## ఆధారం చెబితే కథనానికి బలం

కొన్ని సందర్భాలలో మాత్రమే ఏ వర్గాల నుంచి సమాచారం అందిందో తెలపడం తగదు. ఏవర్గాల నుంచి సమాచారం అందిందో తెలపడంవల్ల కథనానికి విశ్వసనీయత పెరుగుతుంది. అయితే తమ పేరు వెల్లడించకూడదని ఎవరైనా సూచిస్తే మాత్రం మీరు ఆ సూచనను తూచా తప్పక పాటించాల్సిందే. వారలా వద్దు అన్నప్పుడు పార్టీవర్గాల కథనం ప్రకారం అనో పార్టీ కార్యకర్తల అభిప్రాయం ప్రకారం అనో రాయొచ్చు. కథనంలోని ముఖ్యమైన వాస్తవాలు, వివరాలు ఎవరు తెలిపారో వెల్లడించొచ్చు. అయితే పాఠకుడి అవగాహనకు తోడ్పడేట్లయితేనే ఆధారాలను ప్రస్తావించాలి తప్ప అనవసరంగా తెలపకూడదు.

కొన్ని సందర్భాలలో వ్యక్తులు చెప్పింది చెప్పినట్లేరాయడం బాగుంటుంది. ఉదాహరణకు ధరల ప్రభావంపై సర్వే చేస్తున్నప్పుడు మామూలు గృహిణి భావాలను ఆమె మాటల్లోనే చెబితే బాగుంటుంది. అలాగే ఒక రిక్షావాలా కథనాన్ని రాసేటపుడు అతడు వాడిన మాటలనే కచ్చితంగా రాయడంమేలు. అయితే ఇలాటి కొటేషన్లు మరీ దీర్ఘంగా ఉంటే విసుగురావచ్చు కనుక మచ్చుకి నాలుగు ముక్కలు రాస్తే చదువుకోడానికి హాయిగా ఉంటుంది.

పాఠకుల గౌరవాభిమానాలు సంపాదించాలంటే విలేకరులు, జర్నలిస్టులు పైన తెలిపిన

సంప్రదాయాలను పాటించాలి. ముఖ్యంగా రిపోర్టర్లు నిత్యం ప్రజలను కలుస్తుండాలి రాజకీయ నాయకులను, మేధావులనేకాక సమాజంలో వివిధ వర్గాలకు చెందిన వారిని కలిసి తమ విజ్ఞాన పరిధిని విస్తరింపచేసుకోవాలి. ఒక సీనియర్ జర్నలిస్టు ఇలా అన్నారు. "One can not learn the art of communicating without being himself communicative". జర్నలిస్టు దండలో దారంలా ప్రజల మధ్య మెలగుతూ ప్రజలనాడిని గుర్తించడానికి ప్రయత్నించాలి. తరుచుగా పలువర్గాల వారిని కలిసి చర్చించడం ద్వారా తన అనుభవ సంపదను పెంచుకోవాలి. నేను ఒకరికి చెప్పేవాణ్ణే తప్ప ఒకరి నుంచి నేర్చుకునేది ఏముంటుంది అని ఎప్పుడూ భావించకూడదు. జర్నలిస్టుకు అహంభావం శత్రువు వంటిది. అహంభావానికి ఆశ్రయమిస్తే పెరుగుదలకు అవకాశం ఉండదు.

**అసహాయులకు అండగా**

సమాజంలో అసహాయులుగా ఉన్నవారిలో చైతన్యమూ, బెదిరిపున్న వాళ్లకు ధైర్యమూ, వ్యక్తిత్వం కోల్పోయిన వాళ్లకు వ్యక్తిత్వమూ ఇవ్వటంకన్న రచయిత తన రచనల ద్వారా చేయగల ఉత్తమమైన పని ఏమన్నా ఉందా? లేదనుకుంటాను.

— కొడవటిగంటి కుటుంబరావు

# ఏవార్తను ఎలా సేకరించాలి



**వా**ర్తలంటే అందరికీ ఆసక్తే. స్నేహితులో, బంధువులో కనిపిస్తే తప్పనిసరిగా ·లేమిటి? సంగతులేమిటి? అని అడక్కుండా ఉండలేము.

ఉ. అంతట నొక్కనాడు గదుడన్ యదువంశభవుండు రుక్మిణీ
కాంతుడు కూరిమింబనుపగా కుశలంబరయంగ వచ్చి యే
కాంతపువేళ ద్వారవతియందలివార్తలు దెల్పుచున్ తటిత్
కాంతిమనోహరాంగులగు కన్నెల చక్కదనంబులెన్నుచున్.

పాండవుల క్షేమ వార్తలు తెలుసుకుని రమ్మని కృష్ణుడు గదుడనే వాన్ని ఇంద్రప్రస్థం ంచాడు. అతడు ఏకాంతంగా ఉన్న అర్జునునితో ముచ్చటిస్తూ ద్వారక వార్తలు పెడట. అందులో ముఖ్యంగా అందమైన కన్నెపిల్లల గురించి చెప్పాడట. చేమకూర

వెంకటకవి 17వ శతాబ్దంలో రాసిన 'విజయ విలాసము' లోనిదీ పద్యం. వార్తలంటే ఎవరికైనా ఆసక్తికరంగానే ఉంటాయి. అవి అంత ఆసక్తికరంగా ఉంటాయి కాబట్టే వార్తాపత్రికలు మన జీవితంలో అంతర్భాగంగా తయారయ్యాయి. ముఖ్యంగా పట్టణాల్లో నగరాల్లో నివసించే వారికి వార్తాపత్రికలు చదవడం దాదాపు వ్యసనంగా తయారైంది. పొద్దున్నే టీ, కాఫీ తాగగానే పత్రికల కోసం తహతహలాడిపోతారు. వార్తాపత్రిక రావటం కాస్త ఆలస్యమైతే చాలు అసహనంతో వేగిపోతారు. వార్తా పత్రికలకు సెలవొస్తే ఇక పిచ్చెక్కినట్లుంటుంది. నగర జీవులకు వార్తాపత్రిక రాకతోనే తెల్లవారుతుంది. అదిరాకపోతే ఉదయం ఏడుగంటలయినా పొద్దుపొడవనట్లే మరి.

మనలో చాలా మంది రోజూ వార్తలు ఆసక్తిగా చదువుతాంకానీ వార్తల స్వభావం గురించి ఆలోచించే వారు చాలా తక్కువ. సమాజంలో విభిన్న వర్గాల ప్రజలను ఐక్యంగా బంధించే శక్తుల్లో వార్తలు ముఖ్యమైనవి. తెల్లారిలేస్తే ప్రజలంతా ఆసక్తిగా ఎదురుచూసేది వార్తల కోసమే. సమాజంలోని ప్రజలందరూ ఒకే సమాచారం లేక ఒకే వార్తల సముదాయం చదవడమంటే మాటలుకాదు. మనం అడవిలో బతుకుతున్నా తక్కువ సంఖ్యలోని ఒక గ్రూపు ప్రజలతో మాత్రమే మనం సంబంధాలు పెంచుకున్నా బహుశా వార్తాలకింత ప్రాధాన్యం ఉండేదికాదు. మన ప్రయోజనాలు, లావాదేవీలు, ఇతరేతర వ్యవహారాలు మనతో పరిచయం ఉన్న వారికే పరిమితమైలేవు. మనతో పరిచయంలేనివారితో మనం సంబంధాలు ఏర్పాటు చేసుకొనే వీలుందా? తప్పకుండా ఉంది. పరిచయేతరులతో సంబంధ బాంధవ్యాలు నిర్వహించే ఒకానొక మార్గం సమాచారమే. అంటే ఒకే విధమైన తాజా సమాచారాన్ని పంచుకోవడం ద్వారా మనం పరిచయేతరులతో సంబంధాలు ఏర్పాటు చేసుకుంటాం. సమాచారం అంటే వార్తలు. వార్తలు రాసే పద్ధతికి ఈనాడు విశేష ప్రాధాన్యం ఉంది. ఇది ఎవరూ కాదనలేని సత్యం. వార్తాకథనంద్వారా మనం మనకు పరిచయంలోనివారితో సంబంధం నిర్వహిస్తామన్నమాట. ఈ సంబంధం ఒక రకంగా పరోక్షమైనదే అయినా ఇది ఆధునిక సమాజంలో చాలా ప్రాముఖ్యమైనదనడం నిస్సందేహం. ఇంకొంచెం స్పష్టంగా చెప్పాలంటే మనం ప్రచార సాధనాలద్వారా పరిచయేతరులతో పరోక్ష పరిచయం ఏర్పాటు చేసుకుంటాం. అన్ని వర్గాలకు, ప్రాంతాలకు చెందినవారు ఒకేరకం వార్తా కథనాలను నిత్యం చదువుతారు. ప్రచార మాధ్యమాల్లో పనిచేసే వారు వార్తాకథనాలను చక్కగా రాయడం నేర్చుకోకుండా రంగంలో రాణించలేరు. ప్రచార మాధ్యమాలకోసం రాసే సంఖ్యానేక ప్రక్రియల్లో వార్తా కథనం ముఖ్యమైనది.

వార్తాకథనం ప్రక్రియపై పట్టు సంపాదించడంలోనే అతడి వృత్తి నైపుణ్యం ప్రతిబింబిస్తుంది. ఈ వార్తా కథనాలకు, అవిరాసే జర్నలిస్టులకు సమాజంపై విశేష ప్రభావం ఉంటుంది. జర్నలిస్టులు మనల్ని గురించి మనకు తెలియచేస్తారన్నమాట. సమాజంలోని వివిధ వ్యక్తుల మధ్య వారు ఐక్యతా బంధం సృష్టిస్తారు. దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య

బంధం ఏర్పాటు చేస్తారు. వారు నిర్వర్తించే బాధ్యత మహత్తరమైనది కాబట్టి వారు నిజాయితీపరులుగా, ప్రతిభావంతులుగా కర్తవ్యానికి అంకితమైన వారుగా ఉండితీరాలి. వారి కర్తవ్యం ఎంత ముఖ్యమైనదో అంతక్లిష్టమైనది.

మనం ఈ అధ్యాయంలో వార్తా కథనం గురించి సాధ్యమైనంత క్షుణ్ణంగా చర్చిద్దాం. వార్తాకథనం అంటే ఏమిటి? అదెలా అందంగా రాస్తారు? వార్తా కథనం తాలూకు ప్రధాన లక్షణాలేమిటి? వార్తకూ సమాచారానికీ తేడా ఏమిటి? వగైరా ప్రశ్నలన్నిటికీ సమాధానాలిచ్చుకోవాలి.

వాస్తవానికి వార్తలనేవి వార్తా పత్రికలకూ, టెలివిజన్‌లకూ రేడియోలకూ మాత్రమే పరిమితమై ఉండవు. కంపెనీల న్యూస్ లెటర్స్‌లో, ఉద్యోగుల మ్యాగజైన్లలో సైతం వార్తలుంటాయి. ఆమాటకొస్తే అడ్వర్‌టైజ్‌మెంట్లు కూడా వార్తలే. అవికూడా సమాచారాన్ని అందిస్తాయి. కనిపెట్టే కన్నుండాలిగానీ వార్తలకేం ఎక్కడపడితే అక్కడుంటాయి. కుక్కపిల్ల, అగ్గిపుల్ల, బల్ల చెక్క, అరటితొక్క, నిమ్మమొక్క అన్నీ తమలోని వార్తల్ని కనుక్కోమని సవాలు చేస్తుంటాయి.

జర్నలిస్టురెండు ప్రధాన కర్తవ్యాలను నిర్వహించాలి. అవి ఒకటి - సమాచారాన్ని సేకరించడం, రెండు - ఆ సమాచారానికి సరైన రూపం ఇవ్వటం. మనమిప్పుడు ప్రథమ కర్తవ్యాన్ని అన్ని కోణాలనుంచి పరిశీలిద్దాం.

## వార్తా కథనం ముఖ్యం

వార్తా కథనం అంటే ఏమిటో, అదెలా రాయాలో తెలుసుకోవటమే ఏ జర్నలిస్టుకయినా వృత్తిలో ప్రారంభకేంద్రం. ఏ ప్రచార మాధ్యమం కర్తవ్యమయినా వార్తలను, సమాచారాన్ని పదిమందికీ అందజేయడమే. కాబట్టి ప్రచార మాధ్యమాల్లో పనిచేసే రచయితలకు వార్తలను ఏ రూపంలో ఎలా రాయాలో తెలిసివుండాలి. వార్తలను అందచేసే వివిధ ప్రక్రియల్లో వార్తా కథనం చాలా ప్రధానమైనది. అది ఇతర ప్రక్రియలకు తల్లివంటిది. వార్తా కథనం చక్కగా ఉండాలంటే రచయిత సరళమైన, సుబోధకమైన వచనం రాయగలగాలి. స్పష్టమైనరీతిలో ఆలోచించే నైపుణ్యం ఉండాలి. రాసే అంశంపై సమగ్ర, స్పష్టమైన అవగాహన ఉండాలి. క్లుప్తంగా, కచ్చితంగా రాయటం ఎలాగో తెలియాలి. భాషలో పాండిత్యం అక్కర్లేదు కానీ ఏ పదం ఎప్పుడు ఎక్కడ వాడాలో మాత్రం కచ్చితంగా తెలిసి ఉండాలి. వార్తా పత్రికలకు, టెలివిజన్‌కు, రేడియోకు దేనికి రాయాలన్నా ఈ మౌలిక సూత్రాలు తెలిసి వుండడం తప్పనిసరి. వార్తలు ఎలా రాయడమో తెలిస్తే ఏ ప్రచార మాధ్యమానికైనా పని చేయొచ్చు.

## వార్తను కొలిచే తూకం రాళ్లు

వార్తా విలువలనుబట్టి వార్తలు రాస్తారు. దీర్ఘకాల చరిత్రలో ఆవిర్భవించిన ఈవార్తా విలువల ఆధారంగానే జర్నలిస్టులు ఇంకా ఇతరేతర రచయితలు ఏ వార్త రాయాలో ఏ వార్త రాయకూడదో నిర్ణయిస్తారు. ఈ రంగంలో ప్రవేశించిన వర్ధిష్ణువులు ఆవార్తా విలువ లేమిటో తెలుసుకోవాలి. అలా గ్రహించగలిగినప్పుడే ఏ ఘటన లేక ఏ పరిణామం వార్తగా రాయడానికి అర్హమైనదో నిర్ణయించొచ్చు. మన సమాజంలో రోజూ వందలాది ఘటనలు జరుగుతుంటాయి. అయితే అవన్నీ వార్తలు కావు. ఏఘటన వార్తగా రాయడానికి అర్హమైనదో నిర్ణయించే విలువలు కొన్ని ఉన్నాయి. అవి ఇవి.

**1) ప్రభావం :** ప్రజల జీవితాలను ఏదో ఒక స్థాయిలో ఏదో ఒక విధంగా ప్రభావితం చేయగల ఘటనలనే వార్తలు అంటారు. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్నట్లు వార్తలకెక్కే ఘటనలు వేరు, మామూలు ఘటనలు వేరు. ఏదైనా ఒక ఘటన కొంత మందికి సంబంధించిందే అయినప్పటికీ దాని ప్రభావం లక్షలాది మందికి ప్రసరించవచ్చు. అంటే అది పరోక్షంగా అశేష జన సంఖ్యను ప్రభావితం చేయవచ్చు. అప్పుడే ఆఘటన వార్తార్హత సంతరించుకుంటుంది. ఉదాహరణకు - పెట్రోల్ ధరలను పెంచుతూ పార్లమెంట్ తీర్మానాన్ని ఆమోదించొచ్చు. వైద్యరంగ పరిశోధకుడు క్యాన్సర్‌ను నయం చేసే మందును కనుగొనవచ్చు. ఈ రెండు ఘటనలూ కోట్లాది మంది జీవితాలను ప్రభావితం చేసేవే కనుక అవి నిస్సందేహంగా వార్తార్హఘటనలు. ఇవాల్టివార్త రేపటికి సమాచారంగా మారవచ్చు. ఉదాహరణకు 1991 ఫిబ్రవరిలో ప్రపంచ జనాభా 500 కోట్లు అన్నది ఆనాటికి వార్తే. ఈనాడది సమాచారమే కానీ వార్తకాదు.

**2) సమయం:** ఏ వార్తా కథనంలో అయినా సమయానికి ప్రాధాన్యం ఉంటుంది. అంటే తాజాగా జరిగిందానికే విలువ ఉంటుంది. సమయ ప్రాధాన్యం లోపిస్తే వార్తార్హత ఉండదు. ఉదాహరణకు గత ఏడాది జరిగిన కోర్టు విచారణ ఇవాళ వార్త కాదు. అది ఆనాడే వార్త. మాజీ ప్రధాని నరసింహారావుమీద ఇప్పుడు విచారణ సాగుతున్నది. కాబట్టే అది ప్రధాన వార్త అవుతున్నది. ఆయనకు బెయిలిచ్చినా వార్తే, ఇవ్వక పోయినా వార్తే. అయితే కేసులోని వ్యక్తి ముఖ్యమైన వారు కాబట్టికూడా ఈ వార్తకు ప్రాధాన్యం పెరుగుతున్న మాటనిజం. అయితే ఎంత కాలం గడిచాక ఒకఘటన వార్తాప్రాధాన్యాన్ని కోల్పోతుంది అంటే కచ్చితంగా సమాధానం చెప్పలేము. అన్ని ఘటనలకూ ఒకే సూత్రం వర్తించదు. పిడుక్కూ బియ్యానికీ ఒకే మంత్రం చదవలేంకదా. మొత్తం మీద ఎక్కువ ఘటనలు ఒకరోజు దాటితే వార్తలనిపించుకోవు. ఏమో ఎవరు చెప్పగలరు ఇంకో ఇరవై ఏళ్లకు కమ్యూనికేషన్స్‌రంగంలో గొప్ప ప్రగతి జరిగిన ఫలితంగా ఈ సమయం 12 గంటలకే పరిమితం కావచ్చు. అనేక ఘటనలు పదిహేన్నెండు గంటలు దాటగానే వార్తార్హత కోల్పోవచ్చు. మీరు ఇవాల్టివార్తా పత్రిక

శ్రీసి శ్రద్ధగా చదవండి. అందులో అన్నీ నిన్న జరిగిన ఘటనలే వార్తలుగా ఉంటాయి. అయితే కొన్ని ప్రత్యేక కారణాలవల్ల పాత ఘటనలు సైతం వార్తలుగా చలామణీ కావచ్చు. బజ్జీలు తినేవారు వేడిబజ్జీలే తింటారు. చద్దివార్తలు వార్తలుకావు.

**3) ప్రాధాన్యం:** ప్రాధాన్యం ఉన్న వ్యక్తులు చిన్న పనిచేసినా అది వార్తార్థమే అవుతుంది. ప్రధానికో, ముఖ్యమంత్రికో గోరుచుట్టు పుండు వచ్చినా అది వార్తే. ప్రధాని వ్యక్తిగత హోదాలో ఎక్కడికయినా పర్యటనకెళ్ళినా అదివార్తే. ఆషామాషీ వార్త కాదు మొదటిపేజీలో ప్రచురించే వార్త అవుతుంది. ప్రధాని ఎంత ముఖ్యమైన వ్యక్తి అంటే ఆయనకు జలుబు చేసినా 'ప్రధానికి స్వల్ప అస్వస్థత' అన్న శీర్షికతో వార్త ప్రచురిస్తారు. అదే సాదాసీదా మనుషులు టైఫాయిడ్ వచ్చి రెండునెలలు మంచంలో పడినా అది వార్త కాదు. ప్రధానికి, ముఖ్యమంత్రికి, రాష్ట్రపతికి సంబంధించిన అన్ని ఘటనలపైనా ప్రజలకు ఆసక్తి ఉంటుంది. కనుక అవి వార్తలవుతాయి. రాజకీయ నాయకులే కాదు సినిమాయాక్టర్లు, సంఘసేవకులు, కొన్ని రంగాల్లో సుప్రసిద్ధులు సైతం వార్తా వస్తువులే. సినిమా యాక్టర్లు పెళ్లి చేసుకున్నా వార్తే, విడాకులిచ్చినా వార్తే, ఇతరులతో స్నేహం చేసినా వార్తే. సిల్క్‌స్మిత ఆత్మహత్యవార్తపై కొన్ని తెలుగు పత్రికలు సంపాదకీయాలు కూడా రాశాయి.

**4) సామీప్యం:** వార్తకు మూలమైన ఘటన ఎక్కడ జరిగింది? పాఠకుడికి లేక శ్రోతకు దగ్గరలోనా? దూరంలోనా? సమీపంలో జరిగిన ఘటనలకు దూరంలో జరిగిన ఘటనకంటె ఎక్కువ విలువ ఉంటుంది. అమెరికాలోని రైలు ప్రమాదంలో వంద మంది మరణించినా మనం పెద్దగా స్పందించం. ఢిల్లీ రైలు ప్రమాదంలో అంతే మంది దుర్మరణం పాలయినా తీవ్రంగా స్పందిస్తాం. అదే ఘోరప్రమాదం మన రాష్ట్రంలో జరిగితే దిగ్భ్రాంతి చెందుతాం. మనిషి తన చుట్టూ జరిగే ఘటనలపై ఎక్కువ ఆసక్తి ప్రదర్శిస్తాడు. ఎక్కడో దూరంగా సంభవించిన సంఘటనకు పెద్దగా స్పందించడు. అది మానవ సహజం. అయితే కమ్యూనికేషన్స్‌పెరిగి ప్రపంచం చిన్నదయ్యేకొద్దీ దేశాల మధ్య దూరం తగ్గే కొద్దీ ఈ సామీప్యత విలువ మారిపోతుంది. తూర్పుగోదావరి జిల్లాలో జరిగిన తుపాను తాలూకు దృశ్యాలను వెనువెంటనే అమెరికా ప్రేక్షకులకు చూపిస్తే వారు కూడా మన విషాదంలో పాలుపంచుకోవచ్చు. అంటే కమ్యూనికేషన్స్ సౌకర్యాలు విస్తరించే కొద్దీ సామీప్యం విలువ సాపేక్షంగా తగ్గిపోతుంది.

**5) వివాదం, ఘర్షణ :** ముఖ్యమైన వ్యక్తుల మధ్య ఘర్షణ, వివాదం, వాదవివాదాలు ఏది జరిగినా వార్తే. పీవీతో కేసరి విభేదిస్తే వార్తే. చంద్రబాబుపై లక్ష్మీపార్వతి ధ్వజమెత్తితే వార్తే. విజయభాస్కరరెడ్డిని వై.ఎస్.రాజశేఖర రెడ్డి పల్లెత్తు మాటన్నా పత్రికలకెక్కుతుంది. జర్నలిస్టులు ఘర్షణను, వివాదాన్ని చాలా విలువైనదిగా పరిగణిస్తారు. ఎందుకంటే అవి పాఠకులకు ఆసక్తికరమైనవి కాబట్టి. కోర్టులో సాగుతున్న విచారణ వార్తలంటే ప్రజలు చెవికోసుకోడానికి ప్రధాన కారణం అందులో వివాదం, ఘర్షణ ఉండడమే. మాజీ ప్రధాని

పీవీని చూసి చంద్రస్వామికి లక్షడాలర్ల లంచం ఇచ్చానంటాడు లక్కూభాయ్ పాఠక్. రామరామ లంచం ఇచ్చానన్న రోజున నేను అమెరికాలోనే లేను అంటారు పీవీ. బ్రహ్మాండమైన వివాదం, అద్భుతమైన ఘర్షణ. ఇంతకంటె ఏంకావాలి పాఠకులకు? ఇటీవల పీ.వీకి కేసరికి మధ్య వివాదాలు, మనస్పర్థలు చెలరేగినట్లు దాదాపు దశాబ్దం క్రితం కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్‌గాంధీకి వర్కింగ్‌ప్రెసిడెంట్ కమలాపతి త్రిపాఠీకి రోజూ ఏదో ఒక వివాదం చెలరేగేది. నాయకుల మధ్య వివాదంలాగా మరే వార్తా రుచిగా ఉండదన్న అభిప్రాయాన్ని మన పత్రికలు స్పష్టిస్తున్నాయి.

**6) అసాధారణం, విడ్డూరం, వింత :** అసాధారణమైన, అరుదైన ఘటనకూడా వార్తకిందేలెక్క. జర్నలిజంలో ఒకనానుడి ఉంది. ''కుక్క మనిషిని కరిస్తే వార్తకాదు, మనిషి కుక్కను కరిస్తే అది వార్తే''. 19వ శతాబ్దికి చెందిన ఒక సంపాదకుడు ఆమాట అన్నారు. అంటే అసాధారణమైనదీ, విడ్డూరమైనదీ ప్రతిదీవార్తే అన్నది ఆయన అభిప్రాయం. అయితే చిన్న సందేహం. చంద్రబాబునాయుడినో జయప్రదనో కమల్‌హాసన్‌నో పిచ్చికుక్కకాదు మామూలు కుక్కకరచినా వార్త అవదా? చచ్చినట్లు వార్త అవుతుంది. వ్యక్తుల ప్రాధాన్యాన్ని బట్టి మనిషిని కుక్క కరచినా వార్తే అవుతుంది. మామాలు ఘటనే అయినా ఒక్కోసారి వార్తా ప్రాధాన్యం సంతరించుకుంటుంది. చిన్న ఉదాహరణ - మామూలు డ్రైవర్ లైసెన్స్ రద్దుచేస్తే అది వార్త అవదు. కానీ యాభై అరవై రోడ్డు ప్రమాదాలకు కారకుడైన ఒక డ్రైవర్ లైసెన్స్ రద్దుచేస్తే అది అనివార్యంగా వార్తే అవుతుంది.

**7) వర్తమానం:** వర్తమాన ఘటనలకు వార్తా ప్రాధాన్యం ఉంటుంది. వర్తమానంలో జరిగే ప్రతిఘటనా వార్తగా వాసికెక్కే అవకాశం ఉంది. ఉదాహరణకు మీరున్న ప్రాంతంలో మామూలు సమావేశం జరిగితే ఎవరూ పెద్దగా ఆసక్తి చూపకపోవచ్చు. అలాకాకుండా కట్నం చావులపైన్నో, దళితులపై దాడులపైన్నో, ప్రొహిబిషన్ అవసరమా? అన్న అంశంపైన్నో సమావేశం జరిగితే అత్యధికులు ఆసక్తి వ్యక్తం చేయొచ్చు.

జర్నలిస్టు ఈ వార్తా విలువలను దృష్టిలో పెట్టుకుని ఏదివార్తో నిర్ణయిస్తాడు. ఈ వార్తా విలువలు అతడికి గీటురాయి వంటివి. గీటురాయి ఆధారంగానే మంచి బంగారం అవునోకాదో నిర్ణయించినట్లు ఈవార్తా విలువల ఆధారంగా ఏఘటనకు, పరిణామానికి వార్తార్హత ఉందో నిర్ధారించొచ్చు.

వార్తలో పనికి మాలిన వివరాలను చేర్చకుండా క్లుప్తంగా స్పష్టంగా రాయాలి. ఇంగ్లీషులో ఉన్న ప్రకటనలను అనువదించేప్పుడు కొన్ని జాగ్రత్తలు పాటించాలి.

(1) మక్కీకి మక్కీగా అనువదించొద్దు. అంటే ముక్కస్య ముక్క అనువాదం పనికిరాదు.

(2) అనువాదం అనిపించకూడదు. వార్తలోని స్ఫూర్తికి అనుగుణంగా స్వేచ్ఛగా

అనువదించాలి. ప్రధాని ఐ.కె. గుజ్రాల్ ప్రసంగాన్ని అనువదిస్తే ఆయన తెలుగులో మాట్లాడారా అనిపించాలి.

(3) సంస్కృత గ్రంథాలను తెలుగులోకి అనువదించినవారిని విమర్శిస్తూ మొల్లకవి ఇలా అన్నారు.

*''తేనెసోక నోరు తియ్యన యగురీతి*
*తోడనర్థమెల్ల దోచకున్న*
*గూఢ శబ్ద వితతి కొట్లాట పనియెల్ల*
*మూగ చెవిటి వారి ముచ్చటరయ''*

నోట్లో తేనె పడగానే తియ్యగా ఉంటుంది. అలాగే వాక్యంకూడా చదవగానే అర్థమవ్వాలి. అర్థంకాని పదాలు ప్రయోగిస్తే, మూగ చెవిటివారి ముచ్చటగా తయారవుతుంది. ఒకరి భావాలు మరొకరికి అర్థమే కావు. అనువాదం అలా ఉండకూడదు అంటోంది మొల్లకవి. మనం ఇంగ్లీషునుంచి తెలుగులోకి అనువదించినా అలాగే స్పష్టంగా అర్థమవ్వాలి.

## వార్తాసేకరణ ; 5 డబ్ల్యులు 1 హెచ్

సమాచారాన్ని సేకరించే సందర్భంగానూ, వార్తాకథనం రాసేప్పుడూ జర్నలిస్టు ఆరు మౌలిక ప్రశ్నలకు సమాధానాలు వెదకాలి. ఆ ఆరుమౌలిక ప్రశ్నలూ ఇవి:

**ఎవరు? (Who):** వార్తా కథనంలోని వ్యక్తి ముఖ్యమైన వారా కాదా? వార్తలో వచ్చే ప్రతివ్యక్తినీ కచ్చితంగా వివరించానా? ఒక వ్యక్తితో మరొక వ్యక్తి సంబంధాన్ని సరిగ్గా చిత్రించానా? లేదా?

**ఏమిటి?(What):** వార్తా కథనంలోని ప్రధాన ఘటన లేక చర్య ఏమిటి? అప్రధాన ఘటనలు, వివరాలు ఏమిటి? వాటిని సైతం క్లుప్తంగానే అయినా సమగ్రంగా వివరించానా?

**ఎప్పుడు: (When):** ఘటన జరిగిందెప్పుడు? వార్తా కథనం తాలూకు సమయాసందర్భాలు పాఠకులకు స్పష్టంగా తెలిపానా? వాస్తవానికి వార్తాకథనాన్ని 'ఎప్పుడు' తో ప్రారంభించడమే ఉత్తమపద్ధతి అంటారు అనుభవజ్ఞులు. ఘటన ఎప్పుడు జరిగిందో ప్రారంభంలోనే తెలిపితే చిక్కు ఉండదు. ఆ తెలిపేదేదో స్పష్టాతి స్పష్టంగా తెలపాలి.

**ఎక్కడ? (Where):** ఘటన జరిగిందెక్కడ? ఘటన జరిగిందెక్కడో పాఠకులకు తెలుసులెమ్మని జర్నలిస్టు అనుకోకూడదు. పాఠకుడి ఊహకు వదలకూడదు. అన్నీ స్పష్టంగా చెప్పితీరాల్సిందే. ఏ స్థలంలో అది సంభవించిందో ఆ ఘటనల పరంపర ఏమిటో వర్ణించాలి; పాఠకుల కళ్లముందు బొమ్మ కట్టించాలి.

ఎందుకు? ఎలా? (Why and How): ఘటన ఎందుకు? ఎలా? జరిగిందో కూడా వివరించడం జర్నలిస్టుబాధ్యత. పాఠకుడి మనసులో తలెత్తే ప్రతి ప్రశ్నకూ మీ వార్తా కథనంలో సమాధానం ఉండితీరాలి. వార్తా కథనం చదివాక పాఠకుడి మనస్సులో సమాధానం దొరకని ప్రశ్నలు మిగిలాయంటే ఆ కథనంలో లోపం ఉన్నట్లే. జర్నలిస్టును పాఠకుడు ప్రశ్నించే అవకాశమే ఉండకూడదు. పాఠకున్ని విమర్శించే హక్కు జర్నలిస్టుకుండదు. అవసరమైతే పూర్వ ఘటనలను వివరించి పాఠకుడి సందేహాలకు నివృత్తి కల్పించాలి.

## ప్రజలే వార్తలకు ఆధారాలు

మనం వార్త అంటే ఏమిటో వివరించాం. ఒకే ఒక నిర్వచనమేదీ వార్తను సమగ్రంగా వివరించలేదు. కనుక పలునిర్వచనాలను స్పృశించాం. మొత్తంమీద వార్తా చిత్రాన్ని పాఠకుల కళ్లముందుంచాం. ఇక వార్తా కథనానికి అవసరమైన సమాచారం ఎక్కడ నుంచి వస్తుందో పరిశీలిద్దాం. వార్తాధారాలు లేక సమాచారం తాలూకు ఆధారాలు చాలా ఉన్నాయి. కానీ వాటిని మూడు ముఖ్య ఆధారాలుగా పేర్కొనవచ్చు. ఆ ఆధారాలు ఒకటి - ప్రజలు, రెండు - రికార్డులు మూడు - వ్యక్తిగత పరిశీలన లేక పరిశోధన. అనేక వార్తాకథనాలకు వార్తాధారం ప్రజలనుంచే లభిస్తుంది.

వార్తలు శూన్యంలో పుట్టవు. ప్రజలనుంచే వార్తలు, సమాచారం అన్నీ ఆవిర్భవిస్తాయి. అందుకే జర్నలిస్టు ఎప్పుడూ ప్రజలతో కలిసిమెలిసి బతకాలి. అన్ని వర్గాల ప్రజలతోనూ మాట్లాడి సంగతులు తెలుసుకుంటుండాలి. తరుచుగా ఫోన్ చేస్తూ విషయాలు అడిగి పరామర్శిస్తుండాలి. వార్తాకథనం రాయడానికి ముందు జర్నలిస్టు ఎంత ఎక్కువ మందిని కలిసి మాట్లాడితే కథనం అంత సమగ్రంగా ఉండే అవకాశం ఉంటుంది. ఒకే వార్తకు సంబంధించి వివిధ వ్యక్తులనుంచి సమాచారం సేకరిస్తే ఆకథనం ఎలా తయారవుతుందో తెలుసుకోడానికి చిన్న ఉదాహరణ:

*ఆ వివాదాస్పద చలన చిత్రాన్ని ప్రదర్శించిన తొలి రాత్రి దాదాపు వెయ్యిమంది ప్రేక్షకులు హాజరయ్యారని థియేటర్ యజమాని రంగనాథ్ తెలిపారు.*

*ఆ ప్రారంభోత్సవానికి తాను హాజరైన విషయం వాస్తవమే అయినా ఆ కార్యక్రమంపై అంత డబ్బు ఖర్చుచేయడాన్ని తాను విమర్శించానని ఎమ్మెల్యే అన్నారు.*

*''అది మధ్యతరగతి జనాల ప్రయోజనాలకు వ్యతిరేకమైంది. కనుక ఆ ప్రతిపాదనను నేను వ్యతిరేకించాను'' అన్నారు ఆ ఎమ్మెల్యే.*

ఇందులో మొదటి రెండు వాక్యాలు ఒక పద్ధతిలోనూ, చివరి వాక్యం మరో

ప్రతిలోనూ ఉన్నాయి. మొదటి రెండువాక్యాల్లో - వ్యక్తులు అందించిన సమాచారాన్ని జర్నలిస్టు తన మాటల్లో రాశారు. మూడోవాక్యంలో అతడు చెప్పిన సమాచారాన్ని అతడి మాటల్లోనే ఉంచారు.

వార్తకు ఆధారమైన వ్యక్తితో విలేకరి మాట్లాడితే ఆ మాటల క్రమాన్ని 'ఇంటర్‌వ్యూ' అంటారు. విలేకరి రాణించాలంటే ఇంటర్ వ్యూ చేసే నైపుణ్యాన్ని పెంచుకోవాలి. విలేకరి వార్తకు ఆధారమైన వ్యక్తిని కలవడానికి ముందే అతని నుంచి ఏ సమాచారాన్ని రాబట్టాలో నిర్ణయించుకోవాలి. అందుకనుగుణంగా ప్రశ్నలడిగి సమాచారం సంపాదించాలి.

విలేకరులు రోజూ సాధ్యమైనంత ఎక్కువ మందిని కలుస్తుండాలి. వారిలో ఎవరినుంచి ఎలాటి సమాచారాన్ని సేకరించవచ్చో ముందే ఊహించాలి. ఒక్కోసారి అనుకోని వ్యక్తులనుంచి కూడా సమాచారం లభించవచ్చు. చిన్న ఉదాహరణ - రాజకీయ నాయకుని కలవడానికి వెళ్తే ఆయన ఉండకపోవచ్చు. అలాటి సందర్భాలలో విలేకరి నిరాశగా వెంటనే తిరిగి రాకూడదు. ఆరాజకీయ నాయకుని కార్యదర్శిని కదిపితే కూడా అవసరమైన



సమాచారం తెలియవచ్చు. ఒకసారి విజయవాడ దగ్గర ఒక రైలు ప్రమాదం జరిగింది. ఒక దినపత్రిక విలేకరి వెళ్లి అధికారులను కలిస్తే కావలసిన సమాచారం లభించలేదు. తీరా వెనక్కి వచ్చేముందు ఒక పోర్టర్‌ను కదిపితే అవసరమైన సమాచారం లభించింది. అప్పుడా విలేకరి రైల్వే వర్గాల కథనం ప్రకారం... అంటూ వార్తా కథనం రూపొందించాడు. కొన్ని రకాల వివరాలు తెలియచేయాలంటే అధికారులు భయపడొచ్చు. కింది తరగతి సిబ్బందికి అలాటిభయాలు ఉండవు. వాళ్లనుంచి వివరాలు సేకరించడం తేలిక. యధాలాపంగా అడిగితే వారు చాలా సంగతులు చెప్పే అవకాశం ఉంది. నాయకుల విషయంలోనూ ఈ సూచన వర్తిస్తుంది. నాయకుల ఆఫీసుల్లో కార్యదర్శుల నుంచో ఇతర కార్యకర్తలనుంచో అవసరమైన వివరాలను సేకరించడం తేలిక. అయితే చాలా తెలివిగా నేర్పుగా వాళ్లను ప్రశ్నించాలి. తాను అందజేసిన సమాచారాన్ని ఈ విలేకరి తనకు మాట రాకుండా ఉపయోగించుకుంటాడన్న నమ్మకం ఆ వ్యక్తిలో కలిగించాలి. వార్తాధార వ్యక్తిని మీరు నమ్మాలి. అతడు మిమ్మల్ని నమ్మాలి. ఇలా పరస్పర విశ్వాసం ఉన్నప్పుడే వారు నిస్సంకోచంగా వివరాలు వెల్లడిస్తారు.

ఇక్కడొక విషయం స్పష్టంగా చెప్పాలి. విలేకరులు ఎలాటి పరిస్థితుల్లోనూ వార్తాధార వ్యక్తిని మోసగించకూడదు. పత్రికలో ప్రచురణకు వివరాలందచేయమనే అడగాలి. కాకపోతే అతడికి మాటరాకుండా చూస్తానని హామీ ఇచ్చి ఆహామీని నిలుపుకోవాలి. సమాచారం ఇవ్వడానికి నిరాకరించే వారిని బలవంతపెట్టకూడదు. ప్రలోభపరచడానికిగాని బెదిరించడానికిగాని ప్రయత్నించడం మీ వృత్తి ధర్మానికే వ్యతిరేకం. ఇంటర్వ్యూ ఇవ్వడానికి నిరాకరించిన వారిని పదేపదే అడిగి విసిగించ కూడదు.

**పరిశీలన :** ఇక సమాచారానికి రెండో ఆధారమైన పరిశీలన గురించి రెండు ముక్కలు. ఏ వార్తాధారం నుంచికాక విలేకరి సొంత పరిశీలన ద్వారా సంపాదించిన సమాచారాన్ని పరిశీలనా సమాచారం అంటారు. విలేకరి సొంత పరిశీలన ద్వారా సంపాదించిన వార్తలు ఈ కింది విధంగా ఉంటాయి.

*(అ) నగరంలోని కల్యాణ్ థియేటర్‌లో నేటి సాయంత్రం టిక్‌టిక్ సినిమా ముఖ్యులకోసం ప్రదర్శిస్తున్న సందర్భంగా బి.జె.పి కార్యకర్తలు ధర్నా నిర్వహించారు. ఆ సినిమాలో ఉన్న కొన్ని అశ్లీల దృశ్యాలను తొలగించాలంటూ ఆ పార్టీ కార్యకర్తలు నినాదాలిచ్చారు.*

*(ఆ) తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలితపై కింది కోర్టులో విచారణ జరుగుతున్న సందర్భంగా ఆమెకారు డ్రైవరు ఇచ్చిన సాక్ష్యాన్ని కోర్టులోని లాయర్లు, సందర్శకులు అందరూ ఎంతో శ్రద్ధగా విన్నారు. అందరూ సాక్షిపైన్నే దృష్టి కేంద్రీకరించారు.*

*(ఇ) రాష్ట్రంలో మద్యనిషేధం విధించి దాదాపు రెండేళ్లు కావస్తున్నా మద్యం*

కేసుల విచారణ, పరిష్కారానికి ఇప్పటికీ సరైన వ్యవస్థ రూపొందలేదు. కేసుల న్యాయవిచారణ, కోర్టుల పరిధి తదితరాలకు సంబంధించిన సాంకేతిక ఇబ్బందుల నుంచి ప్రొహిబిషన్ విభాగం ఇంకా బయటపడలేక పోతోంది.

ఈ వార్తలను శ్రద్ధగా చదివితే, ఆ విలేకరులు ఘటనలను, పరిస్థితిని స్వయంగా చూసి పరిశీలించారని స్పష్టంగా బోధపడుతుంది. విలేకరి పరిశీలనపై ఆధారపడిన సమాచారం ఇలా ఉంటోంది. ఇలాటి కథనంలో ఆయన అన్నారు, ఆమె వెల్లడించారు, వగైరా పదాలు ఉండవు.

రికార్డులు :ఇక మూడో వార్తాధారం రికార్డులు. అవి ప్రభుత్వ రికార్డులు కావచ్చు, ప్రైవేట్ రికార్డులు కావచ్చు. పుస్తకాలు, పత్రికలు, వ్యాసాలు, చారిత్రక పత్రాలు, కంప్యూటర్ సమాచారం - ఇవన్నీ రికార్డుల కిందికే వస్తాయి. రికార్డులనుంచి సేకరించిన సమాచారం సాధారణంగా ఇలా ఉంటుంది.

*అ) ఆదివారం మరణించిన శ్రీధరరావు దాదాపు 200 కథలు, పదినాటకాలు రచించారు. ఆయనకు 1961లో సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. ఆయన 1968లో అమెరికాలోని ఒక ప్రైవేట్ సంస్థ ఆహ్వానంపై ఆ దేశంలో పర్యటించిన సందర్భంగా ఆయన్ను పలునగరాల్లో ఘనంగా సన్మానించారు.*

*ఆ) గత ఏడాది హైదరాబాద్ నగరంలో 282 హత్యలు 1200 దాడులు 78 కిడ్నాపులు జరిగినట్లు రాష్ట్ర హోంమంత్రిత్వ శాఖ నివేదిక తెలిపింది. గత సంవత్సరంలో కంటె ఈయేడాది ఎక్కువ నేరాలు జరిగాయని కూడా ఆ నివేదిక పేర్కొంది.*

*ఇ) భారత ప్రభుత్వ విదేశాంగ విధానంలో కొన్ని మార్పులు జరగనున్నట్లు నేడు ప్రధానమంత్రి ఐ.కె. గుజ్రాల్ ఒకదిన పత్రికలో రాసిన వ్యాసం బట్టి తెలుస్తున్నది. భారత ప్రభుత్వం ముఖ్యంగా ఇరుగు పొరుగుదేశాల పట్ల 'పెద్దన్నయ్య వైఖరి' ప్రదర్శించరాదని నిర్ణయించుకున్నట్లు ఆ వ్యాసం స్పష్టం చేసింది.*

రికార్డు ఆధారాలు కంపెనీల రికార్డుల్లోనూ, అవి ప్రచురించే మ్యాగజైన్లలోనూ కూడా లభ్యంకావచ్చు. నగరాల్లో ఉండే గ్రంథాలయాల్లో సైతం విశేష సమాచారం లభించొచ్చు. విలేకరులు అవసరమైనప్పుడు స్థానిక గ్రంథాలయానికి వెళ్లి కావలసిన సమాచారం సేకరించొచ్చు.

## నిర్దిష్టత ముఖ్యం

విలేకరి తన వార్తా కథనంలో నిర్దిష్టత (accuracy)కు ఎక్కువ ప్రాధాన్యమివ్వాలి.

రాసేదేదో కచ్చితంగా రాయాలి. తెలిసిన వివరాలే రాయాలి తప్ప ఊహించి రాయకూడదు. సమాచారాన్ని సేకరించడంలోనూ వార్తా కథనం రాయడంలోనూ నిర్దిష్టత పాటించడం తప్పనిసరి. నిర్దిష్టత విలేకరి విశ్వసనీయతను పెంచుతుంది. వివరాల విషయంలోనేకాదు పదాల ప్రయోగంలోనైతం విలేకరులు కచ్చితంగా ఉండాలి. ఏపదం ఏ అర్థాన్ని స్ఫురిస్తుందో తెలుసుకుని వాడాలి.

**మనుషులు, వ్యక్తులపేర్లు:** కథనంలో మనుషుల పేర్లు, స్థలాల పేర్లు కచ్చితంగా ఉండాలి. పేర్లలో పొరపాట్లొస్తే పాఠకులు నవ్వుకుంటారు. పైగా పత్రిక ప్రతిష్ఠకూడా దెబ్బతింటుంది. తమ పేరు తప్పుగా అచ్చయితే ఆయా వ్యక్తులు మనస్తాపానికి గురవుతారు. కాస్త జాగ్రత్త వహిస్తే అన్నీ సవ్యంగా అచ్చయ్యే అవకాశం ఉంది. ఇంగ్లీషు, తెలుగు లాగా ఫొనెటికల్ భాషకాదు కనుక ఆభాషలో అక్షర దోషాలు దొర్లే ప్రమాదం ఎక్కువ. తెలుగు ఫొనెటికల్ భాష. అంటే ఉచ్చారణ ప్రకారమే అక్షరాలుంటాయి. రెండు ఉదాహరణలు: ఇంగ్లీషులో స్మిత్ అనే పేరుంది. ఆ పేరు ఇలా రాయాలి. Smith. అయితే ఈ కింది మూడు విధాలుగా ఆ పేరు అచ్చయ్యే ప్రమాదం ఉంది.

Smithe Smythe Smyth



ఇక తెలుగు ఉదాహరణ: తెలుగు విశ్వవిద్యాలయం ప్రథమ వైస్ చాన్స్‌లర్ దోణప్ప పేరు మీరు వినే ఉంటారు. ఆయన ఉత్తమ శ్రేణి పరిశోధకుడు, సుప్రసిద్ధ రచయితకూడా. ఆయనపేరు 'దోణప్ప'గానో ద్రోణప్పగానో అచ్చయ్యేది. ఆయనపేరు కచ్చితంగా ప్రచురించిన తెలుగుపత్రికలు లేవంటే అతిశయోక్తికాదు. పత్రికలు తరుచుగా దోణప్ప అని ప్రచురించడంతో ఆయన సాహితీ సమావేశాల్లో ''నేను హ్రస్వనామధేయుణ్ని బాబూ'' అని చెప్పుకునేవారు.

పేర్ల గురించి సందేహం వచ్చినప్పుడు ఆ వ్యక్తినే అడగడం మంచిది. ఆయన అందుబాటులో లేకపోతే ఆయనపేరు తెలిసిన వారిని వాకబు చేయాలి. అంతే తప్ప మీకు తోచినట్లు రాయడం న్యాయంకాదు. ఊళ్లపేర్లు యథాతథంగా రాయాలి. ఉదాహరణకు మన రాష్ట్రంలోని ఒక జిల్లాలో 'నార్త్‌రాజుపాళెం' 'సౌత్ మోపూరు' అనే ఊళ్లున్నాయి. వాటిని అలాగే రాయాలి తప్ప 'ఉత్తర రాజు పాళెం'గా 'దక్షిణ మోపూరు'గా అనువదించకూడదు. రెవెన్యూ రికార్డుల్లో వాటిపేర్లు అలాగే ఉన్నాయి. కనుక మనమూ అలాగే రాయాలి. ప్రభుత్వ రికార్డుల్లో కె.సి. కెనాల్ (కర్నూలు - కడప కెనాల్) అని ఉంది కనుక అలాగే రాయాలి. కె.సి.కాలువ అని తెనిగించ కూడదు.

**కచ్చితంగా ఉటంకించండి:** ముఖ్యంగా రాజకీయ నాయకులు తరుచుగా విలేకరులపై ఫిర్యాదులుచేస్తుంటారు. తమ మాటలను, ప్రకటనలను, వ్యాఖ్యలను సరిగా ఉటంకించలేదనో ఉద్దేశపూర్వకంగా వక్రీకరించారనో వారు అభియోగాలు చేస్తుంటారు. ఒక్కోసారి సందర్భాన్ని విస్మరించి ఉటంకించి తమను ఇరుకున పెట్టారని కూడా వారు విమర్శలకు దిగుతుంటారు. రాజకీయ నాయకులకు అలా విమర్శించే అవకాశం ఇవ్వకుండా రాయాలి. అంటే విలేకరులు వార్తాధారాలను కచ్చితంగా ఉటంకించాలి. ఉబలాటంతో కానీ దురుద్దేశంతోకానీ వారి మాటలను, ప్రకటనలను వక్రీకరించకూడదు. రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు చెప్పింది సరిగా అర్థంగాకపోతే వివరణకోసం వాళ్లనే మళ్లీ అడగాలిగానీ మనసుకుతోచింది రాయడం భావ్యంకాదు. వాళ్లను అడగడం నామోషీగా భావించకూడదు. వార్తాధారం అన్న మాటలనేకాదు ఆమాటల ద్వారా ఆయన లేక ఆమె ఆశించిన అర్థాన్ని కూడా గ్రహించాలి. కొందరు విలేకరులు 'సంచలనం' కోసం వార్తాధారాలను తప్పుగా ఉటంకిస్తుంటారు. ఎలాటి పరిస్థితుల్లోనూ అలాటి బలహీనతకులోను కాకూడదు. ఆ బలహీనతవల్ల మీరు పని చేస్తున్న పత్రికకు లేక సంస్థకు చెడ్డపేరు వస్తుంది. పత్రిక ప్రతిష్ఠదెబ్బ తింటుంది.

విలేకరులు లేక ప్రచారమాధ్యమాలకు రాసే రచయితలు వార్తాధారాలు చెప్పిన విషయాన్ని రెండురకాలుగా ఉటంకిస్తారు. ఒకటి - ప్రత్యక్ష పద్ధతి, రెండు - పరోక్షపద్ధతి. ప్రత్యక్ష పద్ధతి అంటే వార్తాధారం చెప్పిన మాటలను కొటేషన్స్‌లో యథాతథంగా రాయడం. ఉదాహరణ:

''పార్టీ ప్రయోజనాలకు ప్రాధాన్యం ఇవ్వని వారినీ, అధినేతలను ఇరుకునపెట్టే విధంగా ప్రకటనలు చేసే వారిని పార్టీలో తిరిగి చేర్చుకోవడం నా అభిమతం కాదు'' అని ఏ.ఐ.సి.సి. అధ్యక్షుడు సీతారాంకేసరి వ్యాఖ్యానించారు.

ప్రత్యక్ష పద్ధతి అంటే ఇలా ఆయన అన్న మాటలను యథాతథంగా కొటేషన్స్‌లో ఉంచి రాయడం. ఇలా రాస్తున్నప్పుడు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ఆయన లేక ఆమె వాడిన పదాలనే విధిగా వాడాలి. ఆయన మాటల అర్థాన్ని దృష్టిలో ఉంచుకుని మీ మాటలనే ఆయన మాటలుగా కొటేషన్స్‌లో పెట్టడం న్యాయంకాదు. ఇక పరోక్షపద్ధతికి ఉదాహరణ.

పార్టీప్రయోజనాలకు ప్రాధాన్యం ఇవ్వని వారినీ, అధినేతలను ఇబ్బంది పెట్టే విధంగా ప్రకటనలు చేసే వారినీ పార్టీలో తిరిగి చేర్చుకోవడం తన అభిమతంకాదని ఏ.ఐ.సి.సి. అధ్యక్షుడు సీతారాం కేసరి స్పష్టం చేశారు.

సందర్భాన్ని దృష్టిలో ఉంచుకుని ఒక్కోసారి పరోక్షపద్ధతిలో కూడా ఒకటి రెండు మాటలనుకూడా కొటేషన్స్‌లో ఉంచడం తప్పేమీ కాదు. ఉదాహరణకు పై కథనంలో 'అభిమతం' అన్న పదాన్ని మాత్రమే కొటేషన్స్‌లో ఉంచొచ్చు. అలా 'అభిమతం' అనే పదాన్ని మాత్రమే కొటేషన్స్‌లో ఉంచడం కేసరి వైఖరిని స్పష్టం చేసేందుకు తోడ్పడుతుంది. అంటే అధినేతలను ఇరుకునపెట్టే విధంగా ప్రకటనలు చేసే వారిని చేర్చుకోవడం తన అభిమతం కాదనీ పార్టీ హైకమాండ్‌కు చేర్చుకోవడం ఇష్టమైతే తనకు అభ్యంతరం ఉండదని కేసరి అంటున్నారన్న వాస్తవాన్ని ఈవిధంగా వ్యక్తం చేయొచ్చు. రాజకీయనాయకులు ఒక్కోసారి చాలా జాగ్రత్తగా పద ప్రయోగం చేస్తారు. ఒక పదం వాడి పార్టీ అభిప్రాయాన్నీ మరో పదం వాడి వ్యక్తిగత అభిప్రాయాన్నీ వ్యక్తం చేస్తారు. అప్పుడా పదాలను కచ్చితంగా ఆయన ఉచ్చరించినట్లే వాడాలి. ఆయన మాట్లాడుతున్నప్పుడు ఏదైనా పదాన్ని లేక పదాలను నొక్కి చెబితే ఫలానా పదాన్ని నొక్కి చెప్పారని రాయాలి. ఒక పదాన్ని యథాలాపంగా వాడడం వేరు, నొక్కి చెప్పడంవేరు.

**సాధ్యమైనన్ని ఎక్కువ ఆధారాలు:** ఎక్కువ ఆధారాలనుంచి సమాచారాన్ని సేకరించడంవల్ల కథనం నిర్దిష్టంగానేకాక నిర్దుష్టంగా కూడా రూపొందే అవకాశం ఉంటుంది. ఉదాహరణకు - కట్నం చావు సంభవించినప్పుడు ఇటు కుటుంబసభ్యులు అటుపోలీసులు చెప్పిన విషయాలతోనే సంతృప్తిపడకుండా ఇరుగుపొరుగు వారినీ, దగ్గరిబంధువులను సైతం ఇంటర్వ్యూ చేయొచ్చు. ఒక్కోసారి ఒక చిన్న ఆధారం (క్లూ) కూడా వాస్తవ నిర్ధారణకు తోడ్పడవచ్చు. కొన్ని ఘటనలకు సంబంధించి పదిమందిని కదిపితే పది వాస్తవాలు వెల్లడవుతాయి. పాతిక మంది సభ్యులున్న కార్యవర్గం తీసుకున్న నిర్ణయంకంటే నూటాపాతిక మంది సభ్యులున్న సర్వసభ్య సమితి తీసుకున్న నిర్ణయం ఎక్కువ ప్రజాతంత్ర యుతంగా ఉండడానికి వీలున్నట్లే ఎక్కువ ఆధారాలనుంచి విషయసేకరణ జరిపితే ఆకథనం వాస్తవానికి ఎక్కువ దగ్గరగా ఉండే అవకాశం ఉంటుంది. ఈ సత్యాన్ని విలేకరి ఎప్పుడూ

విస్మరించకూడదు. ఎక్కువ మందిని కలిస్తే వాస్తవాలు బయటపడి చక్కటి కథనం తయారవుతుంది.

**సంఖ్య విషయంలో జాగ్రత్త:** వార్తా కథనంలో సంఖ్యల ప్రస్తావనవస్తే జాగ్రత్తగా ఉండాలి. ఈ కింది వాక్యం గమనించండి.

> *విద్యార్థి యూనియన్ ఎన్నికల్లో పోటీచేసిన మురళీధర్‌కు 4044 ఓట్లురాగా అతడి ప్రత్యర్థి శ్రీకాంత్ 5069 ఓట్లు సంపాదించి 1035 ఓట్ల ఆధిక్యతతో గెల్చారని అధికారులు ప్రకటించారు.*

ఇక్కడ అతడికి వచ్చిన ఓట్ల ఆధిక్యత 1025 మాత్రమే. అయితే అధికారులు ప్రకటించిన సంఖ్యను విలేకరి యథాతథంగా కథనంలో దించాడు. అలాకాకుండా సరిగా లెక్కవేసి పొరపాటును అధికారుల దృష్టికి తీసుకురావాల్సింది. వివరణ కోరే అవకాశంలేనప్పుడు పెద్దమెజారిటీతో గెల్చారు అని రాసిండొచ్చు. ఏదో విధంగా పొరపాటును నివారించి ఉండాల్సింది.

**కార్యకారణ సంబంధం:** ప్రతి ఘటన వెనకా సాధారణంగా కార్యకారణ సంబంధం ఉంటుంది. దీన్నే ఇంగ్లీషులో cause and effect theory అంటారు. అంటే ప్రతికార్యం వెనక ఒక కారణం ఉండితీరుతుంది. ఏ కారణం లేనట్లు పైకి కనిపించినా కాస్త శ్రద్ధ తీసుకొని అన్వేషిస్తే కారణం బయటపడుతుంది. చిన్న ఉదాహరణ: గత ఏడాది పశ్చిమగోదావరి జిల్లా



కాల్దారి గ్రామంలో రైతులపై పోలీసులు కాల్పులు జరిపి ఇద్దరిని పొట్టన పెట్టుకున్నారు. దాదాపు అన్ని పత్రికలు కూడా పోలీసులు నిష్కారణంగా కాల్పులు జరిపారని రాశాయి. అయితే పోలీసులుకానీ మరొకరు కానీ నిష్కారణంగా ఎందుకు కాల్పులు జరుపుతారు? ఏదో ఒక బలమైన కారణం ఉండే ఉంటుంది. కాస్త ఆలోచించి పరిశోధన చేస్తే అసలు కారణం దొరికేది. బయటి కారణం ఏదీ లేకపోతే పోలీసులకు కాల్చడమంటే సరదాకనుక (Trigger minded) కాల్చారు అనయినా రాయొచ్చు. అయితే ఈ ఘటన జరిగిన కొన్నాళ్లకు ఒక దినపత్రిక మాత్రం అసలు కారణాన్ని బయటపెట్టింది. కాల్దారి గ్రామస్తులు స్థానిక సబ్ ఇన్స్పెక్టర్పై ఎస్.పి.కి ఫిర్యాదులు చేశారు కాబట్టి ఆ కక్షతో ఎలాటి కవ్వింపులు లేకుండానే వారు కాల్పులకు పాల్పడ్డట్లు ఆ పత్రిక వివరించింది.

ఘటన ఎంత చిన్నదయినా సరే కారణం ఉండితీరుతుంది. ఏతావాతా చెప్పేదేమంటే విలేకరి ఈ కార్యకారణ (Cause and effect) సూత్రాన్ని నిరంతరం దృష్టిలో ఉంచుకుంటే ఆలోచనకు పదునొస్తుంది.

పైన తెలిపిన అన్ని వార్తావిలువలకూ తగిన ప్రాధాన్యం ఇస్తూనే ఈ కార్యకారణ సూత్రాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ఈ సూత్రం ఘటనలను వివరించడానికేకాక కథనంలోకి వచ్చే వ్యక్తుల ప్రవర్తనను అంచనా కట్టడానికి సైతం చక్కగా ఉపకరిస్తుంది. సుప్రసిద్ధ జర్నలిస్టు జి.కె. రెడ్డి తన కథనానికి ఈ సూత్రాన్ని అన్వయించే వారు.

# ఏ వార్తను ఎలా మలచాలి




ప్రచార మాధ్యమాల కోసం రాసే వారు రెండు ముఖ్య పనులు చేయాల్సి ఉంటుంది. ఒకటి - సమాచారాన్ని సేకరించడం, రెండు- సేకరించిన సమాచారాన్ని అక్షర బద్ధం చేయడం. వెనుకటి అధ్యాయంలో మనం వార్తా కథనానికి అవసరమైన సమాచారం గురించి, విలేకరి ఆ సమాచారాన్ని సేకరించే పద్ధతులగురించి చర్చించాం. రచనా క్రమానికి ముందే సమగ్రసమాచారాన్ని సేకరించాలి. అంటే కథనంలోని వాస్తవాలను, సంబంధిత వ్యక్తుల వివరాలను, తేదీలు సమయం వగైరాలన్నీ సమగ్రంగా సేకరించాలి. ఈ సేకరణ క్రమం రచనా క్రమానికి పునాది వంటిది. సమాచార సేకరణ పూర్తికాగానే రచనా క్రమానికి శ్రీకారం చుట్టాలి.

విలేకరి చక్కగా రాయాలంటే వార్తకు సంబంధించిన అన్ని వివరాలు వాస్తవాలు క్షుణ్ణంగా తెలిసివుండాలి. తర్వాత వార్తాకథన సౌధాన్ని ఎలా నిర్మించాలో నిర్ణయించుకోవాలి. వార్తాకథన రచనలో పాటించాల్సిన సంప్రదాయాలను గుర్తుంచుకోవాలి. చిన్న పదాలతో అయిదోతరగతి చదివిన వాళ్లకి సైతం అర్థమయ్యేలా సరళంగా సుబోధకంగా రాయాలి. తాపీ ధర్మారావు ప్రవచించిన ఈ కింది రచనా సూత్రాన్ని దృష్టిలో ఉంచుకోండి.

'చదివిన విన్నా జనులకందరికి
చక్కగ తెలిపితె రాతా,
మెదడు చించుకొని నిఘంటులన్నీ

వెదకించిందే రోతా,
వాడుక మాటల వల్లనె భావాల్
ప్రకటించిందే రాతా,
పాడు ముష్టితో పెద్ద సమాసాల్
వాడిందైతే రోతా,

మనం ఈ అధ్యాయంలో ప్రచారసాధనాల కోసం రాసే రచయితలు పాటించాల్సిన సంప్రదాయాలగురించి, వార్తాకథన స్వరూపాలగురించి చర్చిద్దాం. ప్రచారమాధ్యమాల కోసం ఎలా రాయాలో నేర్చుకోవాలనుకునే వారు ముందస్తుగా వార్త ఎలా రాయాలో తెలుసుకోవాలి. ప్రచారసాధనాల కోసం రాసే క్రమంలో ఇది మొదటిమెట్టు.

## తిరగేసిన త్రిభుజం

విలేకరి కథనానికి అవసరమైన సమాచారాన్ని సేకరించడం పూర్తవగానే కథనానికి ఏ రచనా స్వరూపం ఇవ్వాలో నిర్ణయించుకోవాలి. అంటే కథన రూపాన్ని నిర్ధారించుకోవాలన్న మాట. కథన రూపం ఎలా వుండాలంటే మీరనుకున్న సమాచారం పాఠకుడికి చక్కగా బట్వాడా కావాలి. పాఠకుడు చదవడానికి ఇబ్బంది పడకూడదు. హాయిగా ఆనందంగా అవలీలగా చదువుకోవాలి. కథనంలోని ఘటనల మధ్య సంబంధాన్నీ వ్యక్తుల మధ్య సంబంధాన్నీ పాఠకుడు శ్రమ పడకుండానే అర్థం చేసుకొనేలా రాయాలి. మీరెంత స్పష్టంగా రాస్తే వాళ్లంత హాయిగా అర్థం చేసుకుంటారు.

వార్తాకథనాలకు ఇప్పుడందరూ అన్ని దేశాల్లోనూ తిరగేసిన త్రిభుజం పద్ధతి అవలంబిస్తున్నారు. తిరగేసిన త్రిభుజం అంటే ఏమిటి? ఆ పద్ధతిని అవలంబించడమంటే ఏమిటి? తిరగేసిన త్రిభుజం కథా కమామిషు ఇది:

వార్తా పత్రికలో చాలా వార్తా కథనాలుంటాయి. పాఠకులు సాధ్యమైనంత తక్కువ సమయంలో సమాచారాన్ని గ్రహించేలా కథనాలను రాయాల్సి ఉంటుంది. తిరగేసిన త్రిభుజం ఆకారం అడుగున విస్తీర్ణం తక్కువగానూ అగ్రభాగాన విస్తీర్ణం ఎక్కువగానూ ఉంటుంది. ఈ పద్ధతి ప్రకారం, కథనంలోని అత్యంత ముఖ్య సమాచారాన్ని, ఆసక్తికరమైన సమాచారాన్ని కథనం ప్రారంభంలోనే తెలియచేయాలి. వార్తాకథనంలోని మొదటి రెండు మూడు వాక్యాల్లో వివరిస్తే పాఠకులు ఇక ఆ వార్త చదవటం ఆపి మరో కథనం చదివే అవకాశం ఉంటుంది. వార్తాకథనాల శీర్షికలు కూడా కథనంలోని ముఖ్య సమాచారాన్ని సూచించేవిగా ఉండాలి. కథనంలోని మొదటి రెండు వాక్యాలను లీడ్ అంటారు. ఆ లీడ్‌లోనే కథనం సారాంశాన్ని పూర్తిగా తెలియచేయాలి. లీడ్ సరళంగా సుబోధకంగా ఉండాలి. పాఠకుడికి చదవగానే అవలీలగా అర్థమవ్వాలి. లీడ్‌లో అయిదు W ( డబ్ల్యు) లకు సమాధానం లభించాలి.

తలలో ప్రాణం: తిరగేసిన త్రిభుజం పద్ధతి పాటించడం వల్ల మరో సౌలభ్యంకూడా లభిస్తుంది. ఒక్కోరోజు ముఖ్యమైన వార్తలు చాలా రావచ్చు. అప్పుడు ప్రతివార్తలోనూ ఆఖరు భాగాన ఉన్న వివరాలను తొలగించినా నష్టం ఉండదు. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకునే న్యూస్ ఎడిటర్లు 'వార్త తోకలో ప్రాణం పెట్టొద్దు' అని సబ్ ఎడిటర్లకు, విలేకరులకు సలహాలిస్తుంటారు. అంటే వార్త తోకలో కాక తలలో ప్రాణం ఉంచాలన్న మాట. ప్రాణం అంటే ముఖ్యమైన విషయం.

తిరగేసిన త్రిభుజం పద్ధతిలో రాసిన కథనంలో అతి ముఖ్యమైన వివరాలు లీడ్‌లోనూ సమాచారం తాలూకు వివరాలు వార్తా శరీరంలోనూ ఉంటాయి. లీడ్‌లో తెలిపిన ముఖ్యమైన వివరాలను నిరూపించే వివరాలు, దాఖలాలిచ్చే వివరాలు వార్తాశరీరంలో ఉంటాయి. కథనానికి సంబంధించిన వర్ణనలు, వ్యక్తుల ఉల్లేఖనలు (కోట్స్) వగైరాలన్నీ ఇందులో ఉంటాయి, ఉండాలి.

వార్తాకథనం స్వరూపానికి సంబంధించిన వివరణ ఇది. అయితే స్వభావానికి సంబంధించి తేడాలుండవు. లీడ్‌లో వాక్యాలు వార్తా శరీరంలోవాక్యాలు అన్నీ చక్కగా ఉండాల్సిందే. ఇందులో మినహాయింపుల్లేవు. రచనలో జీవకళ ఉట్టిపడాలి. ఒక సుప్రసిద్ధ రచయిత సూత్రీకరించినట్లు -

*'కతలో సంగతి జీవకళలతో*
*కనబడితేనే రాతా*
*మృత దేహంవలె ముస్తాబులతో*
*మిటకరించితే రోతా'*

జర్నలిస్టులతోపాటు ప్రచార మాధ్యమాల కోసం రాసే వారంతా ఈ సూత్రాన్ని ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. సమాచారం ఎంత ముఖ్యమైనదైనా సరిగా రాయకపోతే పాఠకులకు ఎక్కదు. సమాచారమూ ప్రధానమే, చక్కగా రాయడమూ ప్రధానమే.

మళ్లీ మొదటి కొద్దాం. తిరగేసిన త్రిభుజ సూత్రం ప్రకారం అట్టే ముఖ్యంకాని వివరాలను చివరన రాసుకుంటూ పోవాలి. అవసరం వచ్చి ఆఖరు భాగాన్ని తొలగించినా ప్రధాన కథనానికి భంగం కలక్కుండా ఉండాలి. వాస్తవానికి ఏ పాఠకుడూ మొత్తం వార్తలను చదవడు. అందులోనూ ఆధునిక జీవితంలో వేగం పెరిగింది కాబట్టి, ప్రతి రంగంలో మినీ పద్ధతి ప్రవేశించింది కనుక ప్రజలు వార్తా పత్రిక పఠనానికి కూడా పరిమిత సమయాన్నే కేటాయిస్తున్నారు. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకొని ముఖ్య సమాచారాన్ని మొదటి మూడు నాలుగు వాక్యాల్లోనే బంధిస్తే పాఠకుడి సమయాన్ని పొదుపు చేసినట్లవుతుంది. పాఠకుడు తక్కువ సమయంలో ఎక్కువ వార్తా కథనాలు చదవగలిగేలా ఉండాలి. అన్ని వార్తల తాలూకు లీడ్ వాక్యాలు చదివినా అన్ని వార్తలూ చదివానన్న సంతృప్తి పాఠకులకు కల్పించడం మీ విధి.

వార్తాకథనాలను ఘటనలు జరిగిన క్రమం ప్రకారమే రాయడాన్ని తిరగేసిన త్రిభుజపద్ధతి అనుమతించదు. చివరన జరిగిన ఘటన ముఖ్యమైనదే అయినా ఆ ఘటనను ప్రారంభంలోనే తెలపాలి.

ప్రాణాన్ని తలలో కాక తోకలో పెట్టిరాసే వార్తలు ఇలా ఉంటాయి. ఉదాహరణ:

*గత రాత్రి జరిగిన నగర కార్పొరేషన్ సమావేశం 'మా తెలుగుతల్లికీ మల్లెపూదండ' పాటతో ప్రారంభమైంది. గత సమావేశంలో ప్రస్తావించిన అంశాలను చదివి ఎలాటి మార్పులేకుండా ఆమోదించారు. వెంటనే మేయర్ వెంకటరత్నం లేచి బడ్జెట్ ప్రవేశపెట్టాల్సిందిగా సంబంధితుల్ని కోరారు. బడ్జెట్‌ను ప్రవేశపెట్టిన వ్యక్తి పన్నులను వసూలు చేసే కార్యక్రమం చురుగ్గా సాగడంలేదని తన ప్రసంగంలో తెలిపారు. 'పన్నుల వసూళ్ల కార్యక్రమం ఇలాగే మందకొడిగా సాగితే కార్పొరేషన్ తీవ్రమైన ఆర్థిక లోటును ఎదుర్కోక తప్ప'దని హెచ్చరించారు.*

*కార్పొరేషన్ అప్పులయినా సేకరించాలి లేదా ఖర్చుల్ని తగ్గించనైనా తగ్గించాలి అని ఆయన అన్నారు. ఈ రెండు ప్రతి పాదనలూ సముచితమైనవి కాదు కనుక నగరంలో ఆస్తి పన్నులను పది శాతం పెంచే ప్రతిపాదన చేశానని ఆయన స్పష్టం చేశారు. కొత్త పన్ను ప్రతిపాదనలు వచ్చే ఉగాది నుంచి అమలులోకి వస్తాయని వివరించారు.*

ఈ వార్త చదివిన పాఠకులు నగరంలో ఆస్తివున్న వాళ్లు కావచ్చు. అద్దె ఇంట్లో నివసించే వాళ్లు కావచ్చు. ఆస్తివున్న వాళ్లకి తాము కట్టే పన్నులు పెరిగాయో లేదో వార్తచదివీ చదవగానే తెలియాలి. ఆస్తిపన్ను పెరిగితే ఇళ్ల కిరాయిలు పెరుగుతాయి కాబట్టి అద్దె ఇళ్లల్లో నివసించే వారికి కూడా ఈ వార్తపైన ఆసక్తే ఉంటుంది. ఈ వార్తలో ఆస్తి పన్ను పెరిగిన సమాచారం కథనం చివరలో ఉంచారు. తోకలో ప్రాణం పెట్టడమంటే ఇదే. ఏ కారణం చేతనయినా ఈ వార్తలోని చివరి వాక్యం తొలగిస్తే వార్త ప్రాణమే పోతుంది. పాఠకుడికి మిగిలేది శవ ప్రాయమైన వివరాలే. కాబట్టి ఆస్తిపన్నును పెంచిన విషయం వార్తాకథనం మొదటి వాక్యంలోనే ఉండాల్సింది. కార్పొరేషన్ సమావేశమయ్యాక చిట్టచివరన ఆస్తి పన్నును పెంచినా అది అత్యంత ప్రధాన సమాచారం కనుక వార్త లీడ్‌లోనే ఆ విషయం తెలపాలి. ముఖ్యమైన విషయాలు ముందే చెప్పాక, అట్టే ముఖ్యం కాని వివరాలను క్రానలాజికల్ ఆర్డర్ (కాల క్రమానుగత పద్ధతి) లో రాయాలి.

ఈనాడు అన్ని దేశాల్లోని పత్రికల్లోనూ ఈ తిరగేసిన త్రిభుజం పద్ధతిని అవలంబిస్తున్నారు. జర్నలిస్టు ప్రారంభంలోనే ఈ పద్ధతి ప్రాధాన్యం గ్రహించాలి.

## లీడ్ పేరాగ్రాఫ్

వార్తా కథనంలోని అతి ముఖ్యభాగాన్ని లీడ్ పేరాగ్రాఫ్ అంటారు. లీడ్ ఉద్దేశం, కథనంలోని అతి ముఖ్య సమాచారాన్ని పాఠకులకు తెలియజేయడం. లీడ్‌కు మరో ప్రయోజనంకూడా ఉంది. పాఠకుడు మొత్తం కథనాన్ని చదివేలా చేయడానికి అది తోడ్పడాలి. అంటే కథనంపై పాఠకుడికి ఆసక్తి కలిగించాలి. మనం ఇంతకు ముందు వివరించిన కథనాన్ని ఉదాహరణగా తీసుకుంటే, ఆస్తిపై కొత్త పన్నుల విధానం ఉగాది నుంచి అమలులోకి వస్తుందన్న విషయం లీడ్‌లో ఉండాలి. ఆ కథనంలో అదే ముఖ్యమైన సమాచారం. లీడ్ పేరాగ్రాఫ్‌లో ముఖ్య సమాచారమూ ఉండడంతోపాటు తదుపరి కథనాన్ని చదివించేలా కూడా ఉండాలి. ఈ కింది లీడ్ గమనించండి.

> ''కాంగ్రెస్‌పార్లమెంటరీ పార్టీ సారధ్య పీఠాన్నుంచి పి.వి. నరసింహారావును వైదొలగించే యత్నాలను పీవీ వ్యతిరేక వర్గం సోమవారం మరింత ముమ్మరం చేసింది. శరద్‌పవార్, కరుణాకరన్, కోట్లవిజయ భాస్కరరెడ్డి, వంటి దిగ్గజాలు సోమవారం పి.వి. వ్యతిరేకులను బహిరంగంగా సమర్థించారు. అసమ్మతి పక్షాన నిలిచారు.''

ఇక్కడ మొదటి వాక్యంలో పీవీని సి.పి.పి. నేతృత్వ స్థానం నుంచి తొలగించే ప్రయత్నాలు ముమ్మరమైనట్లు ఉంది. ఆతర్వాతి వాక్యంలో శరద్‌పవార్, కరుణాకరన్, విజయభాస్కరరెడ్డి వంటి దిగ్గజాలు పివి వ్యతిరేక వర్గాన్ని సమర్థించినట్లు ఉంది. ఈ వాక్యం చదవగానే వారు ఆవిధంగా ఎక్కడ, ఎప్పుడు ఎలా సమర్థించారో తెలుసుకోవాలన్న కుతూహలం పాఠకుడిలో సహజంగానే రేకెత్తుతుంది. ఆ కుతూహలం, ఆ ఆసక్తి మొత్తం కథనాన్ని చదివించేలా ప్రోత్సహిస్తాయి.

లీడ్ గనక ఆసక్తికరంగా లేకపోతే చప్పగా ఉంటే మంచి కథనమైనా, అంటే ఆసక్తికరమైన సమాచారం ఉన్నప్పటికి పాఠకుడు ముందుకెళ్లడు. లీడ్‌తోనే సరిపుచ్చుకుని మరో కథనం మీదికి దృష్టి మళ్లిస్తాడు. ఫస్ట్ ఇన్నింగ్సే ఏడ్చినట్లుంటే సెకెండ్ ఇన్నింగ్స్ ఎలా బాగుంటుంది అన్నట్లు లీడే బాగాలేకపోతే లోపలి కథనం ఏం బాగుంటుందిలెమ్మనుకుంటాడు పాఠకుడు. 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అన్నట్లు లీడే పాఠకుని ముగ్ధున్ని చేయాలి.

తిరగేసిన త్రిభుజం పద్ధతి కథనంలో లీడ్‌లో అత్యంత ముఖ్య సమాచారాన్ని అత్యంత ఆసక్తికరంగా చెప్పాలి. అంతేకాదు కథనంలోని తాజా ఘటనను లేక సమాచారాన్ని కూడా లీడ్‌లోనే చేర్చాలి. వెనక జరిగిన ఘటనకదా అని చివరన చెప్పేయత్నం చేయకూడదు. ఇంతకు ముందు మనం చర్చించిన వార్తావిలువల గీటురాయి ఆధారంగా జర్నలిస్టు లీడ్‌లో ఏసమాచారం ఉంచాలో నిర్ణయించాలి. జర్నలిస్టు పాఠకుడికి సమాచారాన్ని త్వరగా అందించాలి. అది అతడి బాధ్యత. అయితే ఆ సమాచారాన్ని కచ్చితంగా, ఆసక్తికరంగా

తెలియచేయాలి. బట్వాడా చేయడమేకాదు పసందుగా బట్వాడా చేయడమూ ముఖ్యమే. మంచి లీడ్ పేరాగ్రాఫ్‌లో నిర్దిష్టత, వేగం, వినోదం అనే మూడు గుణాలను ముప్పేట గొలుసుగా మలచాలి. అంటే కచ్చితంగా చెప్పాలి, వేగంగా చెప్పాలి, అందంగా చెప్పాలి. ఇందులో ఏదిలోపించినా జర్నలిస్టు తన కర్తవ్య నిర్వహణలో కృతకృత్యుడు కానట్లే.

వార్తాకథనాల్లోని లీడ్‌లలో సాధారణంగా నాలుగు 'డబ్ల్యు'లు ఒక 'హెచ్' ఉంటాయి. నాలుగు డబ్ల్యులు అంటే ఎవరు (Who) ఏమిటి (What) ఎక్కడ (Where) ఎప్పుడు (When). హెచ్ అంటే ఎలా (How) . అయితే లీడ్‌లో ఈ నాలుగు డబ్ల్యులలో ఒకే ఒక దానికి కాస్త ఎక్కువ ఇవ్వొచ్చు. కథనంలోని వివరాలను బట్టి అందులో ఏ ఒక డబ్ల్యుకైనా ప్రాధాన్యం ఇవ్వొచ్చు. అయితే లీడ్‌లో నాలుగు అంశాలూ ఉండితీరాల్సిందే. దీనికి మినహాయింపులేదు.

లీడ్ పేరాగ్రాఫుల్లో అవసరమైనదానికంటె ఎక్కువా ఉండకూడదు, తక్కువా ఉండకూడదు. ఎంత ఉండాలో అంతే ఉండాలి. వృత్తిలో కొత్తగా ప్రవేశించిన వారు తరుచుగా లీడ్‌లో తమకు తెలిసిన వివరాలన్నింటినీ ఇరికించాలనుకుంటారు. లీడ్‌లో సమాచార భారం మరీ పెరగకూడదు. ప్రధాన ప్రశ్నలకు సమాధానాలను క్లుప్తంగానూ ఆసక్తికరంగానూ తెలియచేయాలి. అన్నీ లీడ్‌లోనే చెప్పేస్తే కథనం విసుగెత్తిస్తుంది. చదవబుద్ధి అయ్యేలా ఉండదు.

## రకరకాల రూపాలు

అలా ఉండాలి, ఇలా ఉండాలి, అది ఉండకూడదు, ఇది ఉండకూడదు అన్నంత మాత్రాన లీడ్ రచనపై పరిమితులు ఆంక్షలు విధిస్తున్నారని భావించకూడదు. జర్నలిస్టు లేక విలేకరిలో పస ఉండాలి గానీ లీడ్‌పేరాగ్రాఫులను వివిధ రూపాల్లో, శైలుల్లో చక్కగా రాయొచ్చు. మన జీవితాల్లో ఎంత వైవిధ్యం ఉందో లీడ్‌లలోనూ అంతే వైవిధ్యం ఉంది. ఇందులో సృజనాత్మక శక్తికి అవకాశాలున్నాయి. లీడ్‌రాయడంలో నూతన రూపాలను ఆవిష్కరించి పాఠకుడిని ఆకట్టుకోవచ్చు. జర్నలిస్ట్‌లు ఈ కింది రూపాల్లో లీడ్‌లు రాయొచ్చు.

1. Straight news lead : (నేరుగా వార్త తెలియచేసే లీడ్) ఈ పద్ధతి లీడ్‌లో కేవలం వివరాలు తెలియజేయడమే ఉంటుంది. ఇది పాఠకుడికి సమాచారాన్ని త్వరగానూ సంక్షిప్తంగానూ తెలియజేస్తుంది. ఇందులో సమాచారానికి ఎలాటి ముస్తాబూ ఉండదు. ఉదాహరణ:

''హైదరాబాద్‌కు సమీపంలో సోమవారం ఒకలారీ, ప్రయాణీకులున్న కారును ఢీకొన్న ప్రమాదంలో ఇద్దరు మరణించారు. నలుగురు గాయపడ్డారు''..

వాస్తవానికి ఈ Straight news leadనే ఎక్కువ మంది రచయితలు వాడుకుంటున్నారు. ఈలీడ్‌లో ఒకే ఒక పెద్ద వాక్యం ఉంటుంది. వాక్యంలో 15 నుంచి 20 పదాలుంటాయి. ముఖ్యంగా వృత్తిలో కొత్తగా ప్రవేశించిన వారికి ఈ పద్ధతి లీడ్ సౌకర్యంగా ఉంటుంది. ఇందులో దాదాపు 20 పదాలున్న ఒకే ఒక వాక్యం ఉండాలి కనుక ఇది రాయడంలో నైపుణ్యం సంపాదించడం తేలికే. ముఖ్య సమాచారాన్ని ఒకే ఒక వాక్యంలో తెలపాలంటే కాసేపు శ్రద్ధగా ఆలోచించాలి. రచయితకు అలా ఆలోచించే క్రమశిక్షణ అబ్బుతుంది. ఈలీడ్‌ను సాధన చేసే రచయిత వ్యర్థపదాలు ఉపయోగించకుండా ఎలా రాయాలో నేర్చుకుంటాడు. ఇది నేర్చుకోవడం అతడికి అన్ని విధాలా ఉపకరిస్తుంది.

2. Summary Lead : (సారాంశం తెలిపే లీడ్) ఈ రకం లీడ్‌లో ఒకటికంటె ఎక్కువ ప్రధాన విషయాలుంటాయి. ఇందులో కూడా సాధారణంగా ఒకే పెద్దవాక్యం ఉంటుంది కానీ వివరాలుకాస్త ఎక్కువ వుంటాయి. అయితే సందర్భాన్ని బట్టి రెండు వాక్యాలు సైతం ఉండొచ్చు. తప్పేమీలేదు. ఉదాహరణ.

> ''హైదరాబాద్‌కు అరవైకిలోమీటర్ల దూరంలో జడ్చర్లకు సమీపాన ఆదివారం రాత్రి ఒకలారీ, ప్రయాణీకులున్న కారును ఢీకొన్న దుర్ఘటనలో ఇద్దరు మరణించగా ముగ్గురు తీవ్రంగా గాయపడ్డారు. తీవ్రంగా గాయపడిన ముగ్గురినీ జడ్చర్ల ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చారు''.

ఈ తరహా లీడ్‌లో కూడా పాఠకుడికి సమాచారాన్ని త్వరగానూ కచ్చితంగానూ అందచేస్తారు. ఈ రకంలీడ్‌లు రాసేవారు ఒక జాగ్రత్త తీసుకోవాలి. ఒకటి రెండు వాక్యాల్లో మరీ ఎక్కువ సమాచారాన్ని కుమ్మరించే ప్రయత్నం చేయకూడదు. అన్ని వివరాలూ లీడ్‌లోనే చెప్పేయకూడదు. ముఖ్య వివరాలే చక్కగా రాసి ఇతర వివరాలకోసం పాఠకుడు కథనంలోకి ప్రవేశించేలా చేయాలి. ముఖ్య వివరాలన్నీ చెప్పేస్తే కథనం గందరగోళంగా తయారవొచ్చు. మిగతా కథనంపై పాఠకుడికి ఆసక్తి కలగక పోవచ్చు.

ఈ రెండు రకాల లీడ్స్‌లోనూ ముఖ్యమైన వివరాలు - అంటే ఎవరు? ఏమిటి? ఎప్పుడు? ఎక్కడ? అన్న వాస్తవాలు ఉంటాయి. జర్నలిస్టు ఇందులో ముఖ్య వివరాలను నేరుగా అందజేస్తాడు. నిరాడంబరంగా వివరించడమే తప్ప ముస్తాబులు గిస్తాబులు ఉండవు. మరికొన్ని లీడ్‌లుకూడా ఉన్నాయి. వాటిని ఏ సందర్భంలో సమర్థంగా ఉపయోగించాలో తెలుసుకోవటం అవసరమే.

3. Blind lead (వ్యక్తుల ప్రస్తావన లేనిలీడ్) లీడ్‌లో వ్యక్తుల పేర్లు తెలపరు. అంటే ఘటనకు సంబంధించిన వ్యక్తులు అనామకులయినప్పుడు వాళ్ల పేర్లు ప్రస్తావించరు. పైన రాసిన రెండులీడ్‌లూ బ్లైండ్ లీడ్సే. ప్రమాదంలో మరణించిన వారు కానీ గాయపడినవారు కానీ సుప్రసిద్ధులు కాదు కనుక వారి పేర్లు లీడ్‌లో ప్రస్తావించలేదు. వారిపేర్లు, వయసు,

వృత్తి తదితర వివరాలు తదనంతర కథనంలోనే ఉంటాయి. చనిపోయిన వారిలోకానీ కనీసం గాయాలు తగిలిన వారిలోగానీ ఎమ్మెల్యేకానీ, మాజీ ఎమ్మెల్యేకానీ, మేయర్‌కానీ ఉండివుంటే ఆయన లేక ఆమె పేరు లీడ్‌లోనే ఉండేది.

4. Direct address lead : (ప్రత్యక్ష సంబోధన పద్ధతి) ఈ తరహా లీడ్‌లో రచయిత పాఠకుడిని నేరుగా పలకరిస్తాడు. ఈ లీడ్‌లో 'మీరు' అన్న పదం ఉంటుంది. ఉదాహరణలు.

''మీరు ఆస్తి యజమానులయితే, నగర కార్పొరేషన్ మీ ఆస్తిపై పన్ను పెంచ బోతున్నది.''

''పెరట్లో మొక్కలు పెంచడం మీ హాబీ అయితే అందులో నిష్ణాతుడయిన రామారావును మీరు సంప్రదించాల్సిందే.''

''వార్తలు రాయటంలో మీకు ఆసక్తి అంటూ ఉంటే మీరు తక్షణమే ఒక స్థానిక దిన పత్రిక సంపాదకుడిని కలవడం మంచిది''

పాఠకులను ప్రత్యక్షంగా (Direct address) సంబోధించే లీడ్‌లు పైవిధంగా ఉంటాయి. ఇలాటి లీడ్‌లు పాఠకుడిని వెంటనే ఆకర్షిస్తాయి. రచయిత లీడ్‌లోనే పాఠకుడిని సంబోధిస్తాడు కనుక అతడు వార్తపై ఎక్కువ శ్రద్ధ కేంద్రీకరిస్తాడు. అయితే ఈ రకం లీడ్‌లను చాలా అరుదుగా మాత్రమే ఉపయోగించుకోవాలి.

5.Question lead : (ప్రశ్న పద్ధతి) ఈతరహా లీడ్‌లో పాఠకుని ప్రశ్నించడం ద్వారా అతని దృష్టిని ఆకర్షిస్తారు. లీడ్‌లోని ప్రశ్నే పాఠకుడిని కథనంలోకి ప్రవేశపెడుతుంది. ఉదాహరణలు:

1. జాతి కుక్కలను పెంచడమెలాగో మీరు తెలుసుకోవాలనుకుంటున్నారా?

2. సారానిషేధాన్ని కొనసాగిస్తారోలేదోముఖ్యమంత్రి ఎందుకని స్పష్టంగా చెప్పరు?

3. కొత్త పెన్షన్ పథకం మామూలు ఉద్యోగులకు ఎలా ప్రయోజనం కలిగిస్తుందో ప్రావిడెండ్ ఫండ్ కమిషనర్ ఎందుకని వివరించరు?

ఈ లీడ్‌లో సానుకూల అంశాలున్నట్లే కొన్ని ప్రతికూల అంశాలూ ఉన్నాయి. పాఠకుడి దృష్టిని నేరుగా ఆకర్షించడానికి ఇది ఉత్తమ పద్ధతి. అంతవరకూ మంచిదే. అయితే దీన్ని శ్రుతి మించి వాడితే బాగుండదు. ఆమేరకు ప్రతికూలాంశం. ఇది కూడా పాఠకుడికి కొంత తక్షణ సమాచారాన్ని అందజేస్తుంది. డైరెక్ట్ అడ్రస్‌లీడ్‌కూ దీనికీ కొన్ని సామ్యాలున్నాయి. ఈ పద్ధతులను అరుదుగా, సందర్భోచితంగా మాత్రమే వాడుకోవాలి.

6. Direct quote : డైరెక్ట్‌కోట్ - నేరుగా ఉల్లేఖించే పద్ధతి: ఒక వ్యక్తి చెప్పిన మాటలను ఉల్లేఖించడం ఈ పద్ధతిలో ప్రధానాంశం. ఇలా ఉల్లేఖించడంద్వారా పాఠకుల దృష్టిని

ఆకర్షిస్తారు. కథనంలో ఉన్న వ్యక్తి మాటలే ఉల్లేఖనగా (quote)గా ఉండడం తప్పనిసరి. కథనంలో ప్రత్యక్షపాత్రలేని వ్యక్తుల మాటలను ఉల్లేఖనగా స్వీకరించకూడదు. ఉల్లేఖన కేవలం ఉల్లేఖనగాకాక ముఖ్య సమాచారం అందచేసేదిగా ఉండాలి. ఉదాహరణలు:

1. ''తెలుగుప్రజల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను, ఈయేడాది కొత్త పన్నులుండవు.'' ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు జనవరి 1వ తేదీన రాష్ట్ర ప్రజలనుద్దేశించి చేసిన ప్రమాణం అది.

2. ''రాజకీయ కక్ష సాధించడానికే నన్ను ఇలా వేధిస్తున్నారు''. తనపై పెట్టిన కేసులను ప్రస్తావిస్తూ తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి చేసిన వ్యాఖ్య అది.

ఈ ఉల్లేఖన పద్ధతిని సైతం తరుచుగా ఉపయోగించకూడదు. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్న సూక్తి ఈ పద్ధతికీ వర్తిస్తుంది. నిజంగా అవసరమైనప్పుడే, ఈ సందర్భంలో అయితే బాగుంటుంది అనుకున్నప్పుడే ఈ పద్ధతిని వినియోగించుకోవాలి.

7. Delayed lead (విషయాన్ని తాపీగా చెప్పడం) ఏదైనా విషయాన్ని సస్పెన్స్‌తో చెప్పాల్సి వచ్చినపుడు, నాటకీయతకు ఆస్కారం ఉన్నప్పుడు అసలు విషయాన్ని లీడ్ మధ్యలోనో చివరలోనో చెబుతారు. ఉదాహరణకు ఓ నేర వార్తను డిలేడ్ లీడ్‌తో ఇలా రాయవచ్చు. ''తలుపుకొట్టిన శబ్దం అయింది. ఇంటి యజమాని తలుపు తీశాడు. ఎదురుగా చేతిలో కత్తితో ఓ వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతను దౌర్జన్యంగా లోపలికి ప్రవేశించాడు. ఇంట్లోని వారిని బెదిరించి ఖరీదైన వస్తువులను తీసుకు వెళ్లాడు''.

8. Punch, Capsule or bullet lead : ఒక విషయాన్ని క్లుప్తంగా, సూటిగా దూసుకుపోయేలా చెప్పడాన్ని ఈ తరహా లీడ్‌గా చెప్పుకోవచ్చు. ఎవరైనా ప్రముఖ వ్యక్తి మరణిస్తే ఆవిషయాన్ని సూటిగా చెప్పవచ్చు. ఉదాహరణకు ఎన్.టి.రామారావు నేటి తెల్లవారు జామున గుండె పోటుతో కన్నుమూశారు. పశ్చిమ గోదావరి జిల్లాలో వరదల తాకిడికి 114 మంది మరణించారు.

9. Parady lead (పేరడీ లీడ్) బాగా ప్రాచుర్యం పొంది జనం నోళ్లలోనానుతున్న సామెతలు, సినిమా పాటలు, సినిమా పేర్లను ఆసరాగా తీసుకుని విషయాన్ని చెప్పవచ్చు. ఇందువల్ల పాఠకుడిని ఆకట్టుకోవచ్చు. ఉదాహరణకు కోటి విద్యలు కూటికొరకే అన్నవాళ్లు శ్రీరామ్‌విద్యను మాత్రం ఊహించి ఉండరు. నేతి బీరకాయలో నెయ్యి చందంగా గాంధీపార్క్‌లో పచ్చదనం అంతే ఉందనుకోవచ్చు.

10. Contrast lead (పోల్చిచూపటం): స్త్రీ పురుషుల్ని, గతాన్ని వర్తమానాన్ని, వయోభేదాలను పోల్చిచూపుతూ రాయటాన్ని కాంట్రాస్ట్‌లీడ్ అంటారు. ఉదాహరణకు ''పురుషులతో పోల్చి చూస్తే అక్షరాస్యుల సంఖ్య స్త్రీలలో తక్కువగా ఉంది''.

''నిన్నటిదాకా ఊసరక్షేత్రంగా ఉన్న ఈ ప్రాంతం నేడు సస్యశ్యామలంగా మారింది''. సర్వే నివేదికలను రాసేటపుడు ఈ తరహా లీడ్‌ల అవసరం ఉంటుంది.

11. Stacato lead (స్టకాటో లీడ్): ఒక దృశ్యాన్ని, ఒక సంఘటనను చెప్పేటపుడు ఈ తరహా లీడ్‌తో రాయవచ్చు. మానవాసక్తికర కథనాల్లో ఈ తరహా లీడ్స్ ఎక్కువగా ఉపకరిస్తాయి. ఉదాహరణకు - చిమ్మచీకటి .. కీచు రాళ్ల అరుపులు.... మనసునిండా భయం''.

## కథన వికాస క్రమం : శాస్త్రం, కళల మేళవింపు

తిరగేసిన త్రిభుజ పద్ధతిని అనుసరించే రచయితలు కథనం ప్రారంభంలో చెప్పాల్సిన అంశాలేమిటో నిర్ణయించడంతో పాటు మరో విషయంపైకూడా శ్రద్ధ వహించాలి. కథనంలో వెల్లడించే సమాచారంలో ఏ వివరానికి ఎంత ప్రాధాన్యం ఉందో కూడా కచ్చితంగా నిర్ణయించాలి. అంటే లీడ్‌లో ఏ సమాచారం ఉండాలి. ఆ తరువాతి పేరాగ్రాపుల్లో ఏ సమాచారం ఉండాలి. చిట్టచివరి పేరాగ్రాపులో ఏ సమాచారం ఉండాలి వగైరాలన్నీ నిర్ణయించగలగాలి. ఇంకో విధంగా చెప్పాలంటే, రచయిత కథనం తాలూకు వికాసక్రమాన్ని ఎలా అక్షర బద్ధం చేయాలో మనసులో చక్కగా రూపకల్పన చేసుకోవాలి. ఇల్లు కట్టడానికి నిర్మాణాన్ని ముందే డిజైన్ చేసుకుంటారు కదా. ఇదీ అలాగే. ఇటుకపై ఇటుక పేర్చు కుంటూ పోయినట్లే కథనంలోని వివరాలను ప్రాధాన్యం ప్రకారం రాసుకుంటూపోతూ కథన సౌధాన్ని నిర్మించాలి. కథన వికాస క్రమంలో రెండు విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వాలి. ఏవివరాన్ని ఎక్కడ చెప్పాలో కచ్చితంగా నిర్ణయించాలి. ఆమేరకు ఇది శాస్త్రం. ప్రతి వివరాన్నీ అంటే మొత్తం సమాచారాన్ని అందంగా చెప్పాలి. అంటే చక్కగా చెప్పాలి. ఆమేరకు ఇది కళ. ఇంకొంచెం స్పష్టంగా చెప్పాలంటే కథన వికాస క్రమం ఎంత శాస్త్ర బద్ధంగా ఉండాలో అంతకళాత్మకంగానూ ఉండాలి. ఇది శాస్త్రం, కళల మేళవింపు. శాస్త్ర బద్ధంగా కళాత్మకంగా రాయడానికి నైపుణ్యమూ, సాధనా అవసరం. నైపుణ్యం ఉన్నంత మాత్రాన చాలదు. ఆ నైపుణ్యాన్ని సాధనతో మెరుగుపరుచుకోవాలి. ఇలా మెరుగుపరుచుకోవడం కేవలం రోజుల్లో అయ్యేపని కాదు. ''సాధనమున పనులు సమకూరు ధరలోన'' అన్నట్లు సాధనతో నైపుణ్యాన్ని మెరుగుపరుచుకోవాలి.

కథనంలో లీడ్ పేరాగ్రాఫ్ అత్యంత ముఖ్య భాగమైతే రెండో పేరా గ్రాపునకు ద్వితీయ ప్రాముఖ్యం మూడో పేరాగ్రాపునకు తృతీయ ప్రాముఖ్యం ఉంటుంది. మిగతా పేరాగ్రాపులకూ ఇలాగే వరసగా ప్రాధాన్యం ఉంటుంది.

ఒక విషయం గమనించాలి. వార్తా కథనంలోని మొత్తం సమాచారాన్ని లీడ్ పేరాగ్రాపులోనే ఇరికించడం సాధ్యం కాదు. మంచిలీడ్ అంటే అది పాఠకుడికి సమాచారాన్ని అందివ్వడంతోపాటు కథనానికి సంబంధించి పాఠకుడి మనసులో కొన్ని ప్రశ్నలు ఉత్పన్నం

చేయాలి. రెండో పేరాగ్రాఫ్, మూడో పేరాగ్రాఫు ముఖ్య ప్రశ్నలకు సమాధానాలివ్వాలి. అంటే కథనంలోని అదనపు సమాచారాన్ని మిగతా పేరా గ్రాఫుల్లో వివరించాలి. అత్యంత ముఖ్య సమాచారమేదో, పాఠకుడి అవగాహనకు ఉపయోగపడే సమాచారమేదో రచయిత కచ్చితంగా నిర్ణయించాలి. ఇలా నిర్దిష్టంగా నిర్ణయించడానికి అవలంబించాల్సిన భేషయిన పద్ధతి యేమిటంటే - రచయిత తానే పాఠకుడయితే ఏ వివరాలను తెలుసుకోవాలనుకుంటాడో తన్ను తాను ప్రశ్నించుకోవాలి. ఈ లీడ్ గమనించండి.

*''ముషీరాబాద్ సెంట్రల్ జైలునుంచి గతరాత్రి తప్పించుకు పారిపోయిన ఖైదీ కోసం అధికారులు, పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారు.''*

ఈలీడ్ ముఖ్య సమాచారాన్ని తెలియజేయడంతోపాటు పాఠకుడి మనసులో కొన్ని ప్రశ్నలనుకూడా సృష్టిస్తున్నది. ఆ ప్రశ్నలు ఇవి.

ఆ ఖైదీ ఎవరు?

ఎందుకు జైల్లో ఉన్నాడు?

అతడికి ఎన్నేళ్ల శిక్షవిధించారు. ఎన్నాళ్లనుంచి జైల్లో ఉంటున్నాడు?

అతడెలా తప్పించుకున్నాడు?

అతడికోసం ఏ ప్రాంతాల్లో గాలిస్తున్నారు?

ఆ ఖైదీ సమాజానికి ప్రమాదకారుడా?

అతడి రూపురేఖలెలా ఉంటాయి?

అతడు తప్పించుకు పారిపోయినవైనం గురించి జైలు అధికారులిచ్చిన వివరణ ఉందా?

పై లీడ్ చదవగానే సహజంగానే పాఠకుడి మనసులో ఈ ప్రశ్నలు తలెత్తుతాయి. ఈ ప్రశ్నలకు సమాధానాలు లభించగానే మరికొన్ని ప్రశ్నలు కూడా తలెత్తొచ్చు. వాటికి సైతం క్లుప్తంగానైనా సమాధానాలుండాల్సిందే. ప్రాధాన్యక్రమాన్ని అనుసరించి ప్రతి ప్రశ్నకూ సమాధానమిస్తూ కథనాన్ని వికసింపచేస్తూ పోవాలి. చివరకు మొత్తం కథనాన్ని పాఠకుల కళ్లముందు ఆవిష్కరించాలి. కథనంలోని ప్రతి వివరం మధ్య సన్నిహిత సంబంధం, అంతర్గత సంబంధం ఉండాలి. ప్రతి అంశమూ ఆసక్తి కలిగించేదిగా ఉండాలి. రచయిత తనకు లభించిన సమాచారం ఆధారంగా పాఠకుడి ప్రశ్నలకు సమాధానాలిచ్చుకుంటూ పోతాడు.

పైన తెలిపిన కథనంలో బహుశా రెండో పేరాగ్రాఫులో తప్పించుకున్న ఖైదీ పేరు, అతడు తప్పించుకు పారిపోయిన వివరాలు తెలియచేయవచ్చు. అతడు రాసే రెండో పేరాగ్రాఫు ఈకింది విధంగా ఉండొచ్చు.

*''పాతికేళ్ల రామారావుకు పోలీసుల ఆయుధాలు దొంగిలించిన నేరానికి*

రెండేళ్ళ శిక్ష విధించారు. గత రాత్రి జైలు ఆసుపత్రికి తీసుకెళ్లిన సమయంలో అతడు తప్పించుకుపారిపోయాడని జైలు అధికారులు తెలిపారు''.

వాస్తవానికి ఈ పేరాగ్రాపు కూడా కొన్ని ప్రశ్నలకే సమాధానమిస్తోంది. మరికొన్ని ప్రశ్నలకు తరువాతి పేరాగ్రాపుల్లో సమాధానాలు లభించొచ్చు. ఏమైనా విలేకరివద్ద ఉన్న సమాచారాన్ని బట్టి పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు లభిస్తాయి. అంతేకాదు. అది విలేకరి స్వభావాన్ని బట్టికూడా ఉంటుంది. ఒక విలేకరి ఆ ఖైదీ జైలు నుంచి పారిపోయిన పరిస్థితుల పరిశీలనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తే, మరో విలేకరి ఆ ఖైదీ దాక్కున్న స్థలాలపై సమాచారం సేకరించడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వొచ్చు. ఇందులో ఏ విలేకరినీ తప్పుపట్టలేము, ఇద్దరూ రైటే.

మరో ఉదాహరణ పరిశీలిద్దాం:

మీరున్న నగరంలో రోడ్డుప్రమాదం సంభవించింది. మొత్తం మూడుకార్లు ప్రమాదంపాలయ్యాయి. అందులో ఒక కారు డ్రైవర్‌ను అరెస్టు చేశారు. డ్రైవింగ్ చేస్తున్న సమయంలో అతడు తాగి వున్నట్లు తేలింది. మరో కారు డ్రైవర్ మరణించాడు. ఇంకో కారుడ్రైవర్‌కు గాయాలయ్యాయి. మధ్యాహ్నం ఒంటిగంటకు బాగా రద్దీ ఉన్నప్పుడు దుర్ఘటన సంభవించింది. గంటసేపు రవాణా స్తంభించింది.

ఈ వార్తకు సంబంధించిన అన్ని వివరాలనూ విలేకరి సేకరించాడు. ఈ వివరాల్లో ఏది అతి ముఖ్యమైందో ఏది ముఖ్యమైందో చెప్పడం ఎలా? ఈ విషయం నిర్ధారించడానికి సూత్రాలేమైనా ఉన్నాయా? ఉన్నాయి. ప్రమాదాల వార్తలో చావు చాలా ముఖ్యమైనది. మరణాల తర్వాత గాయాలు. ఈ ప్రమాదంలో కారు డ్రైవర్ మరణానికి అత్యంత ప్రాధాన్యం, రెండో డ్రైవర్ గాయాలకు ఆ తర్వాత ప్రాధాన్యం ఇవ్వాలి. మరణించిన డ్రైవర్ తాలూకు వ్యక్తిగత వివరాలు కూడా ఇవ్వాలి. అతడి వయసు, ఎంత మంది పిల్లలు, పెళ్లాం ఉందా? అతని మీద ఆధారపడ్డ వారెవరు వగైరా వివరాలన్నీ సేకరించక తప్పదు. రెండో డ్రైవర్ గాయాల వివరాలిస్తే చాలు. ముఖ్యంగా అతడి ప్రాణానికి ముప్పు ఉందో లేదో ముందు తెలపాలి. తర్వాత అరెస్టయిన డ్రైవర్ తాలూకు వివరాలు కూడా ముఖ్యమైనవే. ఎందుకంటే తాగుడు వల్ల చాలా రోడ్డుప్రమాదాలు జరుగుతున్నాయి కనుక ఆ వివరంసైతం ప్రధానమైనదే. ఆతర్వాత గంటసేపు రవాణాకు అంతరాయం కలిగిన విషయం కూడా సంక్షిప్తంగానైనా వివరించక తప్పదు.

మొత్తానికి చెప్పొచ్చేదేమంటే, ఈ వార్త లీడ్‌లో ఒక కారు డ్రైవర్ మృతి విషయమూ, మరో డ్రైవర్‌కు తగిలిన గాయాల సంగతీ ఉండాలి. అందులోనే ప్రమాదం జరిగిన వీధిపేరు కూడా ఉండాల్సిందే. ఈ కథనానికి ఏతరహా లీడ్ రాసినా కారు డ్రైవర్ మరణించిన విషయం

మాత్రం మొదటి వాక్యంలోనే ఉండాలి. ఏ వాక్యంలోనూ మొత్తం మీద పాతిక ముప్పై పదాలకు మించరాదు. చిన్న చిన్నపదాలతో సరళంగా స్పష్టంగా అర్థమయ్యేలా రాయాలి. వాక్యాల్లో పదాల ఆడంబరం ప్రదర్శించకూడదు. పెద్ద పెద్ద పదాలు వాడి పాఠకుని హడలెత్తించకూడదు. కథనం వికాసం అన్నది పత్రికా రచయిత సేకరించిన సమాచారం పై ఆధారపడి ఉంటుంది. వివరాలు ఏవైనా వివరాల ప్రాధాన్యం ముఖ్యం. అంటే అతి ముఖ్య వివరాలను వరసగా చెప్పుకుంటూ పోవాలి. వివరాల స్వభావం మారినప్పుడు కొత్త పేరాగ్రాఫ్ ప్రారంభించాలి. అయితే అన్ని వాక్యాలమధ్య, వివరాల మధ్య సన్నిహిత సంబంధం ఉండాలి. అప్పుడే కథనంలో చక్కటి సమన్వయం, ఐక్యత ఉంటాయి. విలేకరి జరిగిన ఘటనలను క్రానలాజికల్ (కాల క్రమానుగతం)గా రాస్తోంటే అప్పుడప్పుడు తర్వాత, ఆతర్వాత, అనంతరం వగైరా పదాలు వాడాలి. ఘటనల వివరణ మధ్య ఇలాటి పదాలు వాక్యాల మధ్య బంధన శక్తిగా పనిచేస్తాయి.

ఇక చివరన కథనం ఎలా ముగుస్తుందో పరిశీలిద్దాం. ముఖ్యమైన అన్ని ప్రశ్నలకూ సమాధానాలు రాయడం పూర్తికాగానే వార్తా కథనాన్ని టక్కున ముగించాలి. అనవసర విషయాలు చెప్పడం అనుచితం. చెప్పాల్సిన వివరాలే చెబితే అవి నేరుగా పాఠకునికెక్కుతాయి. అనవసర విషయాలు చెబితే కొన్ని అవసర వివరాలు పాఠకునికి చేరకపోవచ్చు.

## ఫలానా వర్గాల కథనం

కథనంలో ఫలానా వర్గాలు ఇలా తెలిపాయి, ఫలానా వర్గాలు ఇలా అభిప్రాయపడ్డాయి. ఫలానా వారి భోగట్టా ఇది అని తెలపడం జర్నలిస్ట్ విధి. ఏ సమాచారం ఏ వర్గాల నుంచి లభించిందో చెప్పాలి. విలేకరులురాసే వార్తలో డెబ్బయి ఎనభైశాతం ఇతరులు చెప్పిందే అయివుంటుంది. చాలా మంది వద్ద సమాచారం ఉంటుంది. కావలసిందల్లా విలేకరులు వెళ్లి నేరుగా సమాచారం రాబట్టాలి. వారిచ్చిన సమాచారాన్ని రచయిత తన మాటల్లో రాయాలి. సమాచారం ఇచ్చిన వ్యక్తి ప్రసిద్ధుడైతేనూ, చెప్పిన విషయం ముఖ్యమైందయితేనూ అతడి మాటలను కోట్స్‌లో ఉంచొచ్చు. అది విలేకరి విచక్షణ పై ఆధార పడి ఉంటుంది. సమాచారం అందించినవారు అధికారులు, అధికార్ల ప్రకటనలు, నాయకుల ప్రకటనలు, ప్రసంగాలు, వ్యాసాలు, పుస్తకాలు, పత్రికలు ఏవైనా కావచ్చు. విలేకరి తాను పరిశీలించి తెలుసుకున్నదయితే అది తన సమాచారంగానే రాయాలి. అయితే కథనంలో ఎక్కడా 'నా అభిప్రాయం ప్రకారం' 'నా పరిశీలన ప్రకారం' 'నేను భావించేదేమిటంటే' వగయిరా పదాలు చొప్పించకూడదు. వివరం లేక సమాచారం స్పష్టంగా తెలియచేస్తేచాలు. ఈ సమాచారం విలేకరిదే అని పాఠకుడు భావించాలే తప్ప మీరుగా ఆ విషయం రాయకూడదు. ఫలానా వారు ఈ విషయం తెలిపారన్న వివరణ

ఎందుకివ్వాలి? ఎందుకంటే విశ్వసనీయతకోసం. అంటే ఇదంతా విలేకరి ఊహాగానంకాదు, ఫలానా వర్గాలు ఫలానా విషయం తెలిపాయి అని పాఠకులు భావించి ఆ వివరాలను నమ్ముతారు. ఇలా రాస్తే, ఈ రచయిత కచ్చితంగా రాస్తున్నాడు. ఇందులో ఊహాగానాలు లేవు అని పాఠకులనుకుంటారు. అలా తెలియచేయడం విలేకరి వృత్తితత్వానికి అద్దం పడుతుంది. ఇలా ఫలానా వర్గాల భోగట్టా ఇది అని తెలపడం వల్ల మరో ప్రయోజనంకూడా చేకూరుతుంది. ఫలానా వర్గాలు లేక వ్యక్తులు అందించిన సమాచారం ఇది అని తెలియచేస్తే అందులో వాస్తవమెంతో పాఠకులొక నిర్ధారణకు రావడానికి అవకాశం ఉంటుంది. వార్తాధారాలనుబట్టి వార్తలోని వివరాలను అంచనావేసే అవకాశం పాఠకులకు కల్పించాలి. రంగంలో కొత్తగా ప్రవేశించిన వారికి సమాచారం తాలూకు ఆధారాలను తెలియచేయడం కాస్త కష్టంగానే తోచవచ్చు. ఎబ్బెట్టుగా ఉండకుండా వార్తాధారాన్ని ప్రస్తావించాలి. వార్తాధారాల ప్రస్తావన సహజసిద్ధంగా ఉండాలి. ఉదాహరణలు.

*1. నగర కార్పొరేషన్ ఆర్థిక సంక్షోభంలో పడిందని మేయర్ తెలిపారు.*

*2. పోలీసుల కథనం ప్రకారం, ప్రమాదం జరగడానికి ముందు వాహనంపై డ్రైవర్ అదుపు కోల్పోయాడు.*

*3. సెషన్స్ జడ్జి ఒకటి రెండు రోజుల్లో తీర్పు ప్రకటించవచ్చునని పబ్లిక్ ప్రాసిక్యూటర్ తెలిపారు.*

నిజానికి ఏ వార్తలో అయినా ఇతరులు చెప్పిందే ఎక్కువ ఉంటుంది; విలేకరి స్వయంగా చూసిందికానీ పరిశీలించి రాసిందికానీ తక్కువగానే ఉంటుంది. అయితే పాఠకులకు తెలిసిన సమాచారాన్ని ఇతరులెవరో తెలిపినట్లు రాస్తే అపహాస్యంగా ఉంటుంది. నగరంలో కుంభవృష్టి పడినట్లు వాతావరణ శాస్త్రజ్ఞులు తెలిపారనిరాస్తే పాఠకులు నవ్వుకుంటారు. విలేకరి అలాటి వివరాలను మామూలుగానే రాయాలి. వార్తనిండా ఫలానా వర్గాలకథనం అని రాసినా బాగుండదు. అసలు తెలపక పోయినా కథనం మీద నమ్మకం కలగదు. అతి, మితం మధ్య సమన్వయం సాధించాలి.

## అన్నారు, చెప్పారు

వృత్తిలో కొత్తగా ప్రవేశించిన వారు తరుచుగా ఒక విషయం ఫిర్యాదుచేస్తుంటారు. 'అన్నారు' 'చెప్పారు' అన్న పదాలు పదేపదే రాయడం బాగుండదని వారు అంటుంటారు. ఇందులో బాధపడాల్సిందేమీలేదు. ఈపదాలను పదేపదే కాక పోయినా అవసరమైనప్పుడు వాడడానికి విచారించాల్సిన పనిలేదు. 'అన్నారు' 'చెప్పారు' పదాల్లో ఎలాటి దురుద్దేశమూలేదు. ఇవిచాలా సరళమైన, శుభ్రమైన పదాలు. ఈ పదాలు ఏ ఇతర అర్థాలనూ స్ఫురించవు. స్త్రీలకూ పురుషులకూ ఇద్దరికీ సమంగా వర్తిస్తాయి. ఇవి పాఠకుడి

అవగాహనకు అడ్డురావు. కనుక అన్నారు, చెప్పారు అనే పదాల స్థానంలో ప్రత్యామ్నాయాలను వెదకాల్సిన అవసరం లేదు. కొంతమంది తెలియక 'అన్నారు' అనాల్సిన సందర్భంలో 'వ్యాఖ్యానించారు' అనో 'పునరుద్ఘాటించారు' అనో మోజుగా రాస్తూంటారు. ఒక వాస్తవాన్నో, వివరాన్నో చెబుతున్నప్పుడు 'అన్నారు' అనో 'చెప్పారు' అనో 'వివరించారు' అనో అంటేనే సముచితంగా ఉంటుంది. ఏదైనా ఒక ఘటనపైన్నో పరిస్థితి గురించో ఒక వ్యక్తి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసినప్పుడు మాత్రమే వ్యాఖ్యానించారు అనాలి. రాజకీయ నాయకులు ఇటీవల చెప్పిన ఒక విషయాన్ని మళ్లీ చెబితేనే 'పునరుద్ఘాటించారు' అనాలి. చెప్పిన విషయాన్ని మళ్లీ చెబితేనే పునరుద్ఘాటించారు అనడం సబబు. ఒకే పదం పదేపదే వాడడంబాగుండదనో, మార్పుంటే మజాగా ఉంటుందనో సందర్భానికి అతకని పదం వాడడం క్షంతవ్యంకాదు.

## కొటేషన్లు

ప్రచార సాధనాల కోసం రాసే రచయితలు డైరెక్ట్‌కొటేషన్స్ రాసే విషయంలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. మీరు సేకరించే వార్తల సమాచారంలో డెబ్బై ఎనభై శాతం ఇతరులు తెలియచేసిందే. అందులో సందేహం లేదు. అయితే అంతమాత్రాన ప్రతి వాక్యాన్నీ కొటేషన్స్‌లో పెట్టాలని లేదు. చెప్పిన విషయం ముఖ్యమైనదైతేనూ, చెప్పిన వ్యక్తి కూడా వి.ఐ.పి. (చాలా ముఖ్యమైన వ్యక్తి) అయితేనూ మాత్రమే కొటేషన్స్‌లో రాయాలి. అవసరాన్ని, సందర్భాన్నిబట్టి ఒక్కోసారి వాక్యమంతా కొటేషన్స్‌లో ఉంచొచ్చు. ఒక్కోసారి కేవలం ఒకటి రెండు పదాలను కూడా కోట్ చేయొచ్చు. ఉదాహరణ:

> హైస్కూలు స్థాయి వరకూ డిటెన్షన్ విధానాన్ని తిరిగి ప్రవేశపెట్టే విషయాన్ని 'పరిశీలిస్తున్నట్టు' రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు.

విలేకరి ఈ వాక్యంలో 'పరిశీలిస్తున్నట్టు' అన్న పదాన్ని మాత్రమే కోట్ చేశారు. పాఠకుడికి కచ్చితమైన సమాచారాన్ని అందచేసేందుకు ఆ పదాన్ని కోట్ చేశారు. అంటే హైస్కూళ్లలో తిరిగి డిటెన్షన్ పద్ధతిని ప్రవేశపెట్టేందుకు ప్రభుత్వం కేవలం 'పరిశీలిస్తున్న'దన్న విషయం పాఠకుడికి తెలపాలి. అనుకోవటం వేరు పరిశీలించటంవేరు, నిర్ణయించడం వేరు. ఏపక్షం నుంచయినా ఒక ప్రతిపాదన వచ్చినప్పుడు మాత్రమే ప్రభుత్వం పరిశీలిస్తుంది. అయితే పరిశీలిస్తున్నంత మాత్రాన నిర్ణయించినట్లు కాదు. ప్రతి పరిశీలనా నిర్ణయానికి దారి తీయక పోవచ్చు.

కొన్ని సందర్భాల్లో ఒక వాక్యాన్ని మొత్తంగా కోట్ చేయాల్సి వస్తుంది. ఉదాహరణ

> 'మీ అడ్వకేట్ పిటిషన్లు దాఖలు చేసిన మూడు కేసుల్లో లొంగిపోడానికి మీరు సిద్ధంగా ఉన్నారా'? అని జడ్జి ప్రశ్నించారు.

ఇది తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలితను జడ్జి అడిగిన ప్రశ్న. కోర్టువార్తలు రాస్తున్నప్పుడు చాలా జాగ్రత్తగా రాయాలి. 'కోర్టుధిక్కార' నేరం మీపై మోపకుండా జాగ్రత్తపడాలి. జడ్జి అన్న మాటలను కచ్చితంగా ఆయన మాటల్లోనే రాయాలి కనుక కోట్ చేయాల్సి వచ్చింది.

ప్రతిముఖ్యమైన వార్తాకథనంలోనూ కొటేషన్స్ ఉంటాయి. కానీ మొత్తం మీద తక్కువ కొటేషన్స్ ఉంటేనే బాగుంటుంది. అయితే వ్యక్తి చెప్పని విషయాన్ని ఆయన చెప్పినట్లు ఎలాటి పరిస్థితిలోనూ రాయకూడదు. చెప్పని విషయాన్ని కొటేషన్స్‌పెట్టి రాయడం అన్యాయం. అది వృత్తి ధర్మానికే వ్యతిరేకం. సంచలనం కోసంగాని మరే దురుద్దేశంతోకానీ చెప్పని విషయాన్ని కొటేషన్స్‌లో పెట్టి రాయడం మంచిది కాదు. వ్యక్తులు చెప్పిన మామూలు విషయాలన్నిటినీ రచయిత తన భాషలోనే రాసేయాలి. చాలా అరుదుగా కొటేషన్స్ వాడితే కథనానికి జీవం వస్తుంది. ఒక వ్యక్తి మన ఎదురుగా నిలబడి విషయం చెప్పినట్లుంటుంది. నాటకంలో పాత్ర చెప్పే మాటలు సూటిగా ఎక్కినట్లు ఎక్కుతాయి. పైగా కథనంలో చదివించేగుణం కూడా పెరుగుతుంది. అంతేకాదు కొన్ని మాటలను రచయిత తన మాటల్లో వివరించడం సాధ్యపడదు. వ్యక్తి చెప్పిన మాటలను అలాగే రాస్తేనే అందంగా ఉంటుంది. చిన్న ఉదాహరణ.

ప్రభుత్వం పన్నులు పెంచిన తర్వాత ఒక విలేకరి సర్వే చేయడానికి వెళ్లాడు. నలుగురు నాలుగురకాల అభిప్రాయాలు వ్యక్తం చేశారు. ఒక పేదగృహిణి ఇలా ఆవేదన వెలిబుచ్చింది. ''ప్రభుత్వం రోజా ఇలా పన్నులు పెంచడం కంటె ఒకేసారి మా ప్రాణాలు తీస్తే హాయిగా ఉంటుంది.'' ఈ మాటలను విలేకరి సొంత మాటల్లో చెప్పడం కంటె వాటిని యథాతథంగా ఉంచడమే ఉత్తమం. రేషన్ బియ్యం కోసం క్యూలో గంటలపాటు నిలబడి ఎట్టకేలకు బియ్యం తెచ్చుకున్న ఒక రిక్షావాలా ఇలా అన్నాడు: ''క్యూలో నిల్చొని బియ్యం తెచ్చుకునేసరికి తల ప్రాణం తోక కొచ్చింది.'' సామెతతో కూడిన ఈ వాక్యాన్ని వివరించడం కంటె అతని మాటలను యధాతథంగా కోట్ చేస్తేనే చక్కగా ఉంటుంది. సామెతలు, నానుడులు పాఠకుడిని లేక శ్రోతను ఆకట్టుకుంటాయి. అవి 'నేరుగా' అతని హృదయాన్ని తాకి అక్కడే గింగిరీలు తిరిగి ఆ భావంలోని తీవ్రతను ప్రస్ఫుటంగా తెలుపుతాయి.

కొటేషన్స్ ప్రాధాన్యం ఎంతవున్నా వాటిని అరుదుగానే ఉపయోగిచుకోవాలి. ఎలాటి పరిస్థితుల్లోనూ వ్యక్తి చెప్పని మాటలను కొటేషన్స్‌లో ఉంచరాదు. వ్యక్తి చెప్పిన మాటలనే కచ్చితంగా కోట్ చేయడం ధర్మం. ప్రతి మాటను కోట్స్‌లో ఉంచి కథనానికి విశ్వసనీయత సంపాదించాలని భావించడం పొరపాటు.

## వార్తా రచన సవాలు వంటిది

వార్తారచన అన్నది ఎంతటి అనుభవజ్ఞులకయినా సవాలు వంటిది. ఎన్నో యేళ్లు దీక్షగా

సాధనచేస్తే తప్ప చక్కగా రాయడం అబ్బదు. అది అంత తేలిగ్గా లభించే విద్య కాదు. ఒక్కోసారి మహారచయితలే చక్కగా రాయలేక తడబడుతుంటారు. చెప్పాలని ముందు మనసులో అనుకున్నది కాక ఏదేదో రాస్తుంటారు. స్పష్టంగా రాయడం అంతతేలికైన పనేమీకాదు. సుప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత సోమర్సెట్ మామ్, అస్పష్టంగా రాసే రచయితల గురించి ఇలా అంటారు.

*''రచయితలలో రెండు రకాల అస్పష్టత కనిపిస్తుంది. కొందరు నిర్లక్ష్యంగా అస్పష్టంగా గందరగోళంగా రాస్తారు. మరికొందరు బుద్ధిపూర్వకంగానే అస్పష్టంగారాస్తారు. మొదటి కోవకు చెందిన వారు స్పష్టంగా రాయడానికి అవసరమైన శ్రద్ధ తీసుకోరు. రెండోకోవకి చెందిన వారి విషయం – వీళ్లు చెప్పే విషయంపై వీళ్లకే స్పష్టమైన అవగాహన ఉండదు. చాలా మంది రచయితలు ముందే ఆలోచించి రాయడం ప్రారంభించకుండా రాస్తున్నప్పుడు మాత్రమే ఆలోచిస్తారు. స్పష్టత లేని తమ భావాల్లో గొప్ప విశేషం, ప్రాముఖ్యం ఉందని మురిసి పోతారు.''*

జర్నలిస్టులు వాస్తవాలను రాస్తారు. రచయితలు వాస్తవాల ఆధారంగా కళాత్మకంగా రచిస్తారు. వారి మధ్య స్థూలమైన భేదం ఇదే. జర్నలిస్టులకు వారు రాయబోయే వాస్తవాలేమిటో ముందే తెలుసుకాబట్టి కొద్దిగా శ్రద్ధతీసుకొంటే, కాస్త ఏకాగ్రత చూపితే స్పష్టంగా కచ్చితంగా చక్కగా రాయడం తేలికే. వార్తాకథనాలను చక్కగా రాయడానికి కొన్ని మార్గదర్శక సూత్రాలున్నాయి.

## మార్గదర్శక సూత్రాలు

వార్తాకథనాలు రాసేవారు విధిగా చిన్నచిన్న వాక్యాలు చిన్న చిన్న పేరాగ్రాఫులు మాత్రమే రాయాలి. తాము పాఠకులకు సమాచారాన్ని అందచేయడానికే రాస్తున్నాంతప్ప భాషా పాండిత్యం ప్రదర్శించడానికికాదు అని ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి. పాఠకుడి అవగాహనకు చిన్న వాక్యాలే అనువుగా ఉంటాయి. అర్థం చేసుకోడానికి పాఠకులు లేక శ్రోతలు కసరత్తు చేయాల్సిన పని ఉండకూడదు. అందులో ప్రచార సాధనాల శ్రోతల్లో పాఠకుల్లో ఎక్కువ మంది సాదాసీదా వ్యక్తులు; కొద్దిగా చదువుకున్నవారు. వారు పండితులుకారు. పుస్తకాలయినా ఉబుసుపోకకు చదివే ఉంటారు కానీ వార్తా పత్రికలు కాలక్షేపం కోసంకాక సమాచారం కోసమే చదువుతారు. సమాచారం సూటిగా స్పష్టంగా అందజేయాలి. ముఖ్యంగా వార్తా పత్రికల్లో కాలమ్ వెడల్పు తక్కువగా ఉంటుంది కనుక మరీపెద్ద పేరాగ్రాఫ్ అయితే పాఠకుడు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరవుతాడు. పేరాగ్రాఫుల సంఖ్య పెరిగితే స్థలం వృధా అయిపోతుందని పత్రికల యజమానులు పెద్దపెద్ద పేరాగ్రాఫులు రాయాల్సిందిగా ప్రోత్సహిస్తుంటారు. అడ్వర్టైజ్‌మెంట్ పెరిగేకొద్దీ వార్తాకథనాలకు కేటాయించగలిగే స్థలం తగ్గిపోతుంది కనుక యజమానులు స్థలం ఆదాచేసేందుకు పెద్ద పేరాగ్రాఫులు

రాయాల్సిందిగా కోరుతుంటారు. ఆవిధంగా పాఠకులను ఇబ్బంది పెట్టే పత్రికా యజమానులను విమర్శించడం మన పనికాదు. మన పనల్లా పాఠకుడికి ఉపశమనం కలిగించేలా చిన్న పేరాగ్రాఫులు రాయడమే. పాతిక ముప్పై పంక్తులకొక పేరాగ్రాఫ్ విరిచేస్తే చదువు కోడానికి హాయిగా ఉంటుంది.

## వార్తా కథన శిల్పం

వార్తా కథనాలను తృతీయ పురుష (Third person)లోనే రాస్తారు; రాయాలి. విలేకరులు అకస్మాత్తుగా కథనంలోకి చొరబడి 'నా అభిప్రాయం ఏమిటంటే' నేను భావిస్తున్నదేమిటంటే' అంటూ స్వోత్కర్షలకు దిగకూడదు. అది వార్తాకథన శిల్పానికే వ్యతిరేకం. కథలు రాసేవారికీ నవలలు రాసేవారికీ శిల్పం ఉన్నట్లే ప్రచార సాధనాల రచయితలకూ శిల్పం ఉంది. విలేకరి తాను స్వయంగా చూసిందే రాస్తున్నప్పటికి ఉత్తమ పురుష (First Person) లో రాయడం మీ శిల్పానికి వ్యతిరేకం. ఉదాహరణలు:

తప్పు: సచిన్ తెండుల్కర్ ఔట్ అయినట్లు అంపైర్ ప్రకటించాడుకానీ నాకయితే ఆ క్రీడాకారుడు ఔటయ్యాడనిపించలేదు.

ఒప్పు: సచిన్ తెండుల్కర్ ఔట్ అయినట్లు అంపైర్ ఇచ్చిన తీర్పుపై భారతజట్టు మేనేజర్ మదన్‌లాల్ రాత పూర్వకంగా నిరసన వ్యక్తం చేశారు.

తప్పు: రోడ్డు ప్రమాదాల్లో 70శాతం ఘటనలకు కారణం డ్రైవర్ల తాగుడేనన్నది నా ప్రగాఢ విశ్వాసం.

ఒప్పు : రోడ్డు ప్రమాదాల్లో 70శాతం ఘటనలకు కారణం డ్రైవర్ల తాగుడని రోడ్డురవాణా శాఖ అధికారుల అంచనా.

## వ్యక్తిగత అభిప్రాయంవద్దు

విలేకరులు కథనాల్లో తమ వ్యక్తిగత అభిప్రాయాలను వెల్లడించడం భావ్యంకాదు. వ్యక్తిగత అభిప్రాయాలను, వ్యాఖ్యలను వ్యక్తం చేయడం ఎడిటర్లకు వదలాలి. అంటే మీరు రాస్తున్నది వార్తాకథనమే తప్ప సంపాదకీయంకాదని నిరంతరం గుర్తుంచుకోవాలి. సమాచారం అందజేయడమే మీ కర్తవ్యం. నిర్ధారణకువచ్చే హక్కు పాఠకులదే. ఆ హక్కులో మీరు ఏవిధంగానూ జోక్యం చేసుకోరాదు. మీరు వ్యక్తిగతంగా చెప్పాల్సింది ఉంది అనుకుంటే పత్రికలకు వ్యాసాలు, ఫీచర్లు రాయండి. అంతేకానీ వార్తాకథనాలను వ్యాసాలుగా మార్చే అధికారం మీకు లేదు. అలా మార్చడం వృత్తి నీతికి వ్యతిరేకం.

## విశ్వాసం కోల్పోతే విలువేలేదు

వార్తాకథనాలు రాసేవారి ప్రధాన లక్ష్యం నిర్దిష్టత (Accuracy) అనడం నిస్సందేహం.

మనం ఈ నిర్దిష్టత గురించి ఇంతకు ముందే చర్చించాం. జర్నలిస్టు కచ్చితమైన సమాచారాన్ని సేకరించడానికే ఎక్కువ సమయం వెచ్చిస్తాడు. సేకరించిన కచ్చితమైన సమాచారాన్ని, (నిర్దిష్టమైన సమాచారాన్ని) నిర్దుష్టంగా రాయడం రెండో బాధ్యత.

నిర్దిష్టంగా, కచ్చితంగా రాయడమన్నది కేవలం రచనా శిల్పానికి సంబంధించిన విషయంకాదు. అది జర్నలిస్టుల వైఖరికి సంబంధించిన అంశం. అంటే వారు కచ్చితమైన సమాచారాన్ని సేకరించాలి, తప్పుడు సమాచారాన్ని ఇవ్వకూడదు అని మనసులో ప్రతినబూనాలి. తనకే సందేహాలున్న సమాచారాన్ని పాఠకుడికి అందచేయడం సముచితంకాదన్న వైఖరికి కట్టుబడాలి. జర్నలిస్టులు నిర్దిష్టతకు నిబద్ధులవ్వాలి. సందేహాలను నివృత్తిచేయడానికి, పొంతనలేని విషయాలను పరిహరించడానికి జర్నలిస్టు ఎంత శ్రమకయినా సిద్ధపడాలి.

మీరిచ్చే వార్తలు వాస్తవమైనవనీ, కచ్చితమైనవని పాఠకులు నమ్ముతుంటారు. ఆ నమ్మకాన్ని నిలబెట్టుకోడానికి మీరు కొన్ని త్యాగాలకు సిద్ధపడక తప్పదు. ఈ వృత్తిలో పాఠకుల విశ్వాసాన్ని కోల్పోతే సమస్తం కోల్పోయినట్లే. పాఠకుల విశ్వాసం మీ వృత్తిలో మీకు పెట్టుబడిలాంటిది.



# ఎవరితో ఎలా మెలగాలి



ఈనాడు అన్ని రకాల వార్తల్లోనూ రాజకీయ వార్తలదే అత్యధిక ప్రాధాన్యం. అందుకు కారణాలు లేకపోలేదు. మన సామాజిక జీవితంలోనే రాజకీయాలకున్నంత ప్రాధాన్యం మరే రంగానికీ లేదు. రాజకీయం అన్నది అధికారానికి పర్యాయపదంగా మారింది. రాజకీయ ప్రభావం లేని రంగమేదీలేదు. రాజకీయంద్వారా అధికారం, అధికారం ద్వారా మిగతావన్నీ. మన రాజకీయాలు ఎంతగా దిగజారాయంటే - తాను ప్రజలసేవకోసమే రాజకీయాల్లో ప్రవేశించానని ఏ నాయకుడయినా చెబితే నవ్వుకోని వారుండరు. వార్తల్లో రాజకీయ వార్తలకు ప్రాముఖ్యం పెరగడానికి మన పత్రికలు కూడా ఒక ప్రధాన కారణమే. మన పత్రికలు రాజకీయ వార్తలకు విశేష ప్రాధాన్యం (అతి ప్రాముఖ్యం అన్నా తప్పులేదు) ఇస్తున్నాయి. రాజకీయాలే అసలు వార్తలన్నంతగా వాటికి ప్రాముఖ్యం ఇస్తున్నాయి. ప్రజలకు రాజకీయాల పిచ్చి ఎక్కిస్తున్నాయి. దాంతో పాఠకులు సైతం రాజకీయాలకే ప్రథమ ప్రాధాన్యం ఇస్తున్నారు. ఈనాడు అన్ని వార్తా పత్రికల్లోనూ ప్రత్యేక రాజకీయ విభాగాలు ఉన్నాయి. సౌలభ్యం కోసం ఇద్దరు ముగ్గురికి ఒక్కో రాజకీయ పార్టీని కేటాయిస్తున్నారు. ఆ విలేకరులిక తమకు నిర్దేశించిన రాజకీయపార్టీల వార్తలే రాయాలి.

ఇవాల్టి రాజకీయాలు సామాజిక జీవితంలోని అన్ని పార్శ్వాలనూ ఎంతో కొంత స్పృశిస్తున్నాయి. ఈ రాజకీయ భూతం అన్ని రంగాలనూ ఆవహించింది. ఇది రాజకీయం ఇది రాజకీయేతరం అని విభజన రేఖ గీయడానికి వీల్లేకుండా ఉంది. కేంద్ర మాజీ మంత్రులు సుఖ్‌రామ్, సతీష్‌శర్మల కేసులపై క్రైమ్ రిపోర్టర్ రాయాలా- పొలిటికల్ రిపోర్టర్ రాయాలా

అని ప్రశ్నిస్తే టక్కున సమాధానం చెప్పడం కష్టమే. వ్యక్తులేమో అగ్రస్థాయి రాజకీయ నాయకులు, చేసిందేమో అవినీతి కార్యం. ఇరవై ఏళ్లకు పూర్వం ఇలాటి పరిస్థితిని ఊహించనుకూడా ఊహించలేము.

## తామరాకు మీది నీటిబొట్టు

అసలు పాయింటుకు వద్దాం. రాజకీయ వార్తారచన (పొలిటికల్ రిపోర్టింగ్) చాలా క్లిష్టమైన కర్తవ్యం. అది కత్తిమీద సాములాటిది. రాజకీయ విలేకరి ఎంతో నిష్పాక్షికంగా, సంయమనంతో వ్యవహరిస్తే తప్ప వృత్తిలో రాణించలేడు. అతడు ఈ విషయాలను దృష్టిలో పెట్టుకోవాలి.

**అ) గ్రూపులకు దూరం.. దూరం :** రాజకీయ పార్టీలన్నాక గ్రూపులుండకపోవు. విలేకరి ఏ గ్రూపునూ సమర్థించనూ కూడదు, వ్యతిరేకించనూ కూడదు. ముఠాల పట్ల తామరాకు మీది నీటి బొట్టులా ప్రవర్తించాలి. అన్ని ముఠాల విషయంలో నిష్పాక్షికంగా నిర్మొహమాటంగా ఉండటం అతడి బాధ్యత. రాజకీయ విలేకరి పార్టీల గ్రూపుల వ్యవహారంలో అంపైర్‌లాటివాడు. విలేకరి, తనకు అప్పగించిన పార్టీ నిబంధనావళిని అధ్యయనం చేయాలి. వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై ఆ పార్టీ వైఖరిని గమనించాలి. ఆపార్టీకి రాష్ట్రంలోని ఇతర పార్టీలతోగల సంబంధ బాంధవ్యాలను గుర్తుంచుకోవాలి. ఏదైనా ఒక అంశంపై లేక సమస్యపై ఆ పార్టీ తన వైఖరిని మార్చుకునే పక్షంలో ఆవిషయం జాగ్రత్తగా నోట్ చేసుకోవాలి.

మీకు కాంగ్రెస్ పార్టీని కేటాయించినంత మాత్రాన ఇతర పార్టీలను శత్రుపక్షాలుగా పరిగణించడం తగదు. కొందరు విలేకరులు ఈ బలహీనత ప్రదర్శిస్తుంటారు. అన్ని పార్టీలపట్ల సమభావం ప్రదర్శించగలగాలి. తరుచుగా ఆ రాజకీయ పార్టీ ఆఫీసుకు వెళ్తూ అక్కడివారితో సంబంధాలు పెంచుకోవాలి. తనపేరు వెల్లడించకూడదు అన్న షరతుతో ఏదైనా సమాచారం అందజేస్తే అతని పేరు ఎలాటి పరిస్థితుల్లోనూ బయటపెట్టకూడదు. వార్త ప్రచురించిన కొన్నేళ్ల తర్వాత కూడా ఆ రహస్యాన్ని కాపాడాలి. అలా అయితేనే వారి విశ్వాసం చూరగొనడం సాధ్యం. అన్ని సందర్భాల్లోనూ నాయకులేకాదు ఆఫీసు సెక్రెటరీలు, అటెండర్లు సైతం సమాచారం అందచేయొచ్చు. అటెండరూ, ఆఫీస్‌బాయ్ ఎవర్నీ నిర్లక్ష్యంచేయొద్దు. అందరూ ఉప్పందించగల సమర్థులే.

**ఆ) ఏపుట్టలో ఏ పాముందో :** రాజకీయ విలేకరులు సమాజంలోని అన్ని వర్గాల వారితోనూ సంబంధాలు పెంచుకోవాలి. రాజకీయనాయకులు, మేధావులు, పార్టీకార్యకర్తలు, సాదాసీదా పౌరులు అందరినీ కలిసి సంగతులు తెలసుకుంటుండాలి. ''నేను విలేకరిని ఇతరులకు సమాచారం అందజేసేవాడినే కానీ, నేను మరొకర్ని అడగడమేమిటి'' అన్న భేషజం పనికిరాదు. ఏ పుట్టలో ఏపాముందో అన్నట్లు ఎవరి వద్ద ఏ సమాచారం ఉందో చెప్పలేంగదా. రాజకీయ పరిణామాలపై వివిధ వర్గాలవారు వ్యక్తం చేసే

అభిప్రాయాలను తెలుసుకోవాలి. అంటే నిరంతరం ప్రజలనాడి గమనిస్తుండాలి. చిన్న ఉదాహరణ. 1989 ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ పరాజయం పాలవుతుందని అందరికంటె ముందు గ్రహించింది గ్రామీణ విలేకరులే. ఆ విషయంలో మేధావులంతా బోల్తా పడ్డారు. ఆ ఎన్నికల్లో జరిపిన సర్వేలన్నీ తప్పుడు సర్వేలుగా తేలాయి. ఆనాడు మన రాష్ట్రంలో నిర్వహించిన సర్వేలలో ఎక్కువ భాగం రాష్ట్రంలో తెలుగుదేశం, కేంద్రంలో కాంగ్రెస్ తిరిగి అధికారంలోకి వస్తాయని వివరించాయి. అయితే అసలు ఫలితం సరిగ్గా వ్యతిరేకంగా వచ్చింది. మరి గ్రామీణ విలేకరులు ఆ సత్యాన్ని ముందుగానే ఊహించారంటే అందులో ఆశ్చర్యమేమీలేదు. వాళ్లు ప్రజలలో ఒకరుగా మెలిగేవారు కనుక ప్రజాస్పందనను పసిగట్టారు.

ఇ) **నేతల మాటలకు అర్థాలే వేరు:** మిగతా వార్తలు రాయడానికీ రాజకీయ వార్తలు రాయడానికీ ప్రధాన తేడా ఒకటుంది. నేరం, సభ సమావేశం, అభివృద్ధి వగైరా వార్తలతో పోలిస్తే రాజకీయ వార్తలు రాయడానికి పరిశీలనాదృష్టి ఎక్కువ అవసరం. మిగతా వాటికి పరిశీలన అవసరం లేదనికాదు, రాజకీయవార్తలు రాయడానికి కించిత్తు ఎక్కువ పరిశీలన అవసరం అన్నదే పాయింట్. ప్రభుత్వ అధికారులో, పోలీసు అధికారులో ఇచ్చిన ప్రకటనలు స్పష్టంగా ఉంటాయి. రాజకీయ నాయకుల ప్రకటనలు, మాటలు, వ్యాఖ్యలు అంత సూటిగా సరళంగా ఉండవు. ఒక్కోసారి వారు వాడిన మాటలకూ, వారు భావించిన అర్థాలకూ మధ్య పొంతన ఉండదు. సూటిగా చెప్పరు.

''సి.పి.పి. నాయకుని ఎన్నిక జరుగుతుందా? ఏకాభిప్రాయం సాధిస్తారా?'' అని శరద్‌పవార్‌ని ప్రశ్నిస్తే, ఎన్నిక షెడ్యూల్ ప్రకటించారుగా అంటారు తప్ప సూటిగా సమాధానం చెప్పరు. ఎన్నిక జరగదు అని ఆయన తన మాటల్లో చెప్పలేదుకానీ ఎన్నిక జరుగుతుందనే భావం మాత్రం పాఠకులకు తప్పకుండా స్ఫురిస్తుంది. రాజకీయ నాయకుల మాటలకు మామూలు అర్థం వేరు, స్ఫురించే అర్థంవేరు. మాటలవెనక ఉన్న అర్థాలను, సూచనలను గ్రహించగలిగే నేర్పుండాలి. అవసరమైతే వారి మాటలకు, వ్యాఖ్యలకు భాష్యం చెప్పగలగాలి. ఇలా భాష్యం చెప్పడాన్నే వ్యాఖ్యానాత్మక వార్తారచన (Interpretative reporting) అంటారు.

ఈ) **అంపైర్ లా మెలగండి :** మిగతా విలేకరులకు నిర్దిష్టత, స్పష్టత, సంక్షిప్తత, సమగ్రత అవసరమైతే రాజకీయ విలేకరికి 'నిష్పాక్షికత' అనే మరో అదనపు లక్షణం అవసరం. అంటే ఇతరులకంటె ఈయనకే ఈ నిష్పాక్షికత అన్నది ఎక్కువ అవసరమన్నమాట. పార్టీలోని గ్రూపుల విషయంలోనేకాక వివిధ పార్టీల బలాబలాలను అంచనా వేసేప్పుడు విలేకరి నిష్పాక్షికంగా వ్యవహరించాలి. పక్షపాతానికి చోటిస్తే గౌరవం కోల్పోతారు. ఈ విలేకరి అంపైర్ వంటివారు అన్న భావం క్రమేణా అదృశ్యమైపోతుంది. మీరెంత 'నిష్పాక్షికంగా రాస్తే పాఠకులూ, పార్టీలు, యాజమాన్యమూ మిమ్మల్ని అంతగా గౌరవిస్తారు.

**ఉ) మీ మెదడే యాంటెనా :** రాజకీయ విలేకరికి నిరంతర అధ్యయనం అవసరం దినపత్రికలు, వారపత్రికలు, గ్రంథాలు చదవడం ద్వారా తన జ్ఞానపరిధిని విస్తరింపచేసుకోవాలి. చదివితేతప్ప, ఇతరులతో సంభాషిస్తే తప్ప జ్ఞానం పెరగదు. అతడి మెదడు యాంటెనాలాగా పనిచేయాలి. అతడికి ఏ అంశంపైనా పూర్వ నిశ్చితాభిప్రాయాలుండకూడదు. వాస్తవాలను, కొత్త భావాలను గ్రహిస్తూండాలి. తావలచిందే రంభ, తనకు తెలిసిందే వాస్తవం అనుకునే మనస్తత్వాన్ని పెంచుకోకూడదు. రాజకీయ విలేకరులు రాజకీయరంగంతోనే సంతృప్తి చెందకుండా రాజకీయేతర రంగాల్లో వస్తున్న పరిణామాలను, ధోరణులను సైతం ఎప్పటికప్పుడు గమనిస్తూండాలి. సమాజంలో ఏరంగమూ మడికట్టుకున్నట్లు విడిగా ఉండదు. ప్రతిరంగం మధ్య పరస్పర సంబంధాలుంటాయి. ఒకరంగాన్ని మరొకటి ప్రభావితం చేస్తూంటాయి. ఈ పరస్పర ప్రభావాన్ని విశ్లేషించగలిగే శక్తి ఉన్నప్పుడే సమాజం సమగ్రంగా అర్థమవుతుంది.

## బావిలో కప్పలుకావద్దు

పాత్రికేయ వృత్తిలో స్పెషలైజేషన్ వల్ల మేలూ ఉంటుంది. కీడూ ఉంటుంది. మేలు- ఒకే రంగంలో పనిచేస్తూండడంవల్ల, అంటే రాజకీయ విలేకరిగా పనిచేస్తూండడంవల్ల ఆరంగానికి సంబంధించిన జ్ఞానం పెరుగుతుంది. ప్రతిదినమూ అవే వార్తలు రాయడంవల్ల నైపుణ్యం పెరుగుతుంది. కీడు - ఇదే రంగంలో నిత్యం పనిచేస్తోంటే మిగతా రంగాలకు సంబంధించిన సమాచారం గ్రహించకుండాపోయే ప్రమాదం ఉంది. బావిలో ఉన్న కప్ప బావే ప్రపంచం అనుకున్నట్లు రాజకీయ విలేకరి రాజకీయ రంగమే సమస్త ప్రపంచం అని భావించే ప్రమాదం ఉంది. అలాకాకుండా చూసుకోవలసిన బాధ్యత రాజకీయ విలేకరిపై ఉంది.



# ఏ తప్పును ఎలా దిద్దుకోవాలి



**స్వా**తంత్ర్యానంతరం పత్రికల స్వభావం పూర్తిగా మారిపోయింది. ఇప్పుడవి పక్కా పరిశ్రమలా తయారయ్యాయి. ఇతర పరిశ్రమల మాదిరే పత్రికా పరిశ్రమ కూడా లాభార్జనకే ప్రాధాన్యం ఇస్తున్నది. నేటి దినపత్రికలు రచయితలకు పారితోషికం చెల్లిస్తున్నాయి. పారితోషికం అనడం కంటే తృణమో, పణమో చెల్లిస్తున్నాయి అంటే సముచితంగా వుంటుంది. ఎంచేతనంటే - క్వార్టర్ పేజినిండా వ్యాసం రాస్తే ఏ తెలుగు పత్రికా రెండు వందల రూపాయలకు మించి పారితోషికం ఇవ్వడంలేదు. అదే క్వార్టర్ పేజీలో ప్రచురించిన అడ్వర్‌టైజ్‌మెంట్‌కు ఆ పత్రిక దాదాపు పాతిక వేలు వసూలు చేస్తున్నది. అంటే పత్రికలకు వ్యాసాలు రాసే రచయితలకు అడ్వర్‌టైజ్‌మెంట్ ద్వారా లభించే మొత్తంలో నూరోవంతు కూడా ఇవ్వడం లేదన్నమాట. కాసేపు ఈ ఆర్థికాంశాన్ని పక్కన పెడదాం.

పత్రికలకు రాయదల్చుకున్న రచయితలకు ఇతివృత్తాలకు కొదవలేదు. దేశంలో సవాలక్ష సమస్యలు, అంశాలు, వివాదాలు ఉన్నాయి. దేనిమీద అయినా తీరిగ్గా విశ్లేషణాత్మక వ్యాసం రాసి పంపొచ్చు. కాశ్మీర్ సమస్య, రాజకీయ అవినీతి, అవినీతి కేసుల్లో జడ్జీలు, జుడీషియల్ యాక్టివిజం పూర్వాపరాలు, రైతాంగ సమస్యలు, క్రీడలు, కులతత్వం, మతతత్వం, సబ్సిడీల పద్ధతి తాలూకు గుణదోషాలు, రిజర్వేషన్ పద్ధతి మంచి చెడ్డలు వగైరా అంశాలపై చక్కగా రాయొచ్చు. అయితే పత్రికలకు రాసేటపుడు సందర్భోచితమా కాదా అనే విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఉదాహరణకు కాశ్మీర్‌లో తీవ్రవాదులు సామూహిక

హత్యాకాండకు పాల్పడవచ్చు లేదా బాంబుపేల్చి ఇరవై పాతిక మందిని చంపవచ్చు. ఈ ఘటనలు జరిగాక కాశ్మీర్ సమస్య పూర్వాపరాలపై వ్యాసం రాస్తే బాగుంటుంది. అలాగే ఇటీవల అవినీతి ఆరోపణలపై ముగ్గురు, నలుగురు జడ్జీలు సస్పెండ్ అయ్యారు. ఈ వార్తల నేపథ్యంలో 'జుడీషియల్ యాక్టివిజమ్ X జుడీషియరీ కరప్షన్?' అంశంపై రాస్తే సందర్భోచితంగా ఉంటుంది. ఇంగ్లీషు దినపత్రికల్లో లాగా తెలుగు దినపత్రికల్లో 'వార్తా విశ్లేషణ' (News analysis) పద్ధతి ఇంకా బాగా అభివృద్ధి చెందలేదు.

## వార్తా విశ్లేషణ

వార్తా కథనం వేరు, వార్తా విశ్లేషణం వేరు. వార్తలో ఘటన తాలూకు వివరాలే ఉంటాయి. విశ్లేషణలో ఆ ఘటన పూర్వాపరాలను విశ్లేషించడం ఉంటుంది. వార్తలు చదివి చదివి 'బోర్' కొట్టిన పాఠకులకు విశ్లేషణ అందిస్తే వారిక్కాస్త ఉపశమనం లభిస్తుంది. వార్తా విశ్లేషణలో కొత్త విషయాలు తెలుస్తాయి కనుక పాఠకులకు ఒక విధమైన ఆహ్లాదం (delight) దక్కుతుంది. వార్తలో వైవిధ్యం లేనప్పుడు పాఠకులకు నిజంగానే విసుగొస్తుంది. పొద్దున్నే టీ తాగుతూ దినపత్రిక చదువుతున్న ఒక పెద్ద మనిషిని మరో పెద్ద మనిషి ఏమిటి ఏమైనా వార్తలున్నాయా అని ప్రశ్నించాడట. అప్పుడా పెద్ద మనిషి 'నా బొంద రోజూ ఒకే రకం వార్తలే. కాకపోతే స్థలాలు, మనుషులు వేరు' అని సమాధానమిచ్చాడట. వార్తల స్వరూపంలో ఉన్నంత వైవిధ్యం స్వభావంలో ఉండదు. ఆ మధ్య రోజూ కేంద్ర మాజీ మంత్రుల అవినీతి కేసులు వెలుగులోకి వచ్చాయి. ఇటీవల నలుగురైదుగురు జడ్జీల అవినీతి చర్యలు బయటపడ్డాయి. కేసరి, పీవీల మధ్య అంతర్యుద్ధం కొన్ని వారాలపాటు రాజుకుంది. జయలలిత జైలు వార్తల కథాకమామిషు పది రోజుల పాటు కొద్ది పాటి మార్పులతో దర్శనమిచ్చింది. పీవీ, జయలలిత, సుఖ్‌రామ్, సతీష్‌శర్మ అందరిపైనా దాదాపు ఒకే రకం కేసులు. ఇలా ఒకే రకం వార్తలు చదివి బోర్ కొట్టిన పాఠకులకు ఆ వార్తలను విశ్లేషిస్తూ రాస్తే వైవిధ్యం ఉండడమేగాక పాఠకులకు కొత్త సమాచారం అందజేసినట్లవుతుంది. విశ్లేషణాత్మక వ్యాసాలు పాఠకులను ఆలోచింపచేస్తాయి. అయితే ఇలాంటి వ్యాసాలు రాయాలంటే కాస్త పరిశోధన, పరిశీలన అవసరం. పత్రికలకు వ్యాసాలు రాసే సందర్భంగా కొన్ని సూచనలను గుర్తుంచుకోవాలి.

(1) చంక చేతిపొడుగు వ్యాసాలు చదివే కాలం పోయింది. దీర్ఘ వ్యాసాలు ప్రచురించడమూ ఇబ్బందే. చదవడమూ ఇబ్బందే. కాబట్టి సంక్షిప్తంగా రాయడం నేర్చుకోవాలి. సంక్షిప్తంగా కాదు పాఠకుల్ని దగ్గర కూచోబెట్టుకుని చెప్పినట్లుండాలి. ఆసక్తికరంగా ఉండడానికి అవసరమైతే రెండు పాత్రలను ప్రవేశపెట్టి ఆ పాత్రల సంభాషణతో మీరు చెప్పదల్చుకున్న విషయం చెప్పొచ్చు. ఆ పాత్రల సంభాషణలు విషయాన్ని విశ్లేషించే విధంగా ఉండాలి. కథనంలో రెండు పాత్రలు ప్రవేశించగానే కథనానికి జీవం వస్తుంది. ఉపోద్ఘాతాలతో పాఠకుల సమయాన్ని తస్కరించకుండా నేరుగా విషయంలోకి వెళ్ళాలి.

ఇలా పాత్రలు ప్రవేశపెట్టేప్పుడు ముందే ఒక విషయం నిర్ణయించుకోవాలి. విషయం సరదాగా చెప్పాలో మామూలు పద్ధతిలో సీరియస్‌గా చెప్పాలో ముందే నిర్ణయించుకోవాలి. అది రచయిత స్వభావాన్ని బట్టి ఉంటుంది. పత్రికల్లో పనిచేసే జర్నలిస్టులే కాదు, ఇతర ప్రభుత్వ, ప్రైవేటు ఉద్యోగాలు చేసుకునే వాళ్ళు కూడా ప్రచార సాధనాలకు రాయొచ్చు.

## శైలీ సంపద

జర్నలిజం అంటే హడావుడిగా రాసిన సాహిత్యం అని సుప్రసిద్ధ ఇంగ్లీషు సాహితీ వేత్త మాథ్యూ ఆర్నాల్డ్ అన్నంత మాత్రాన ప్రతి జర్నలిస్టూ సాహితీకారుడు కాలేడు. సాహిత్యంలో పోటీ మాట అటుంచితే, పత్రికల్లో వ్యాసాలు, వార్తా కథనాలు స్పష్టంగా, సూటిగా ఉంటేచాలు. సాహిత్యంలో చెప్పే విషయానికి ఎంత ప్రాధాన్యముంటుందో చెప్పే పద్ధతికీ అంతే ప్రాధాన్యముంటుంది. పత్రికల్లో చెప్పే విషయానికి ప్రథమ ప్రాధాన్యం, చెప్పే పద్ధతికి ద్వితీయ ప్రాధాన్యం ఉంటుంది. వార్తా కథనాల్లో, వార్తా విశ్లేషణలో భౌతిక ఘటనల చిత్రణే ఉంటుంది. సాహిత్యంలో వ్యక్తుల ఆంతరిక భావాల చిత్రణ కూడా ఉంటుంది. సాహిత్యంలో పాత్రల మనోలోకపుటావర్తాలను అక్షరబద్ధం చేస్తారు. అందుచేత సాహిత్యంతో జర్నలిజాన్ని గాని, సాహితీ శైలితో జర్నలిజం శైలిని కాని పోల్చలేము. అయినా పత్రికలకు వాటి శైలి వాటికుంటుంది.

ఒక కథలో గాని నవలలో గాని శబ్ద సంపన్న శైలి లోపించినప్పుడు సాహితీ విమర్శకులు ఆ కథ లేక ఆ నవల జర్నలీజ్ (Journalese) గా వుంది అంటుంటారు. అంటే నాసిరకం జర్నలిజంలో వాడే భాషాశైలిని అలా అంటారన్న మాట.

సాహితీ విమర్శకులు చేసిన ఆ విమర్శలో వాస్తవం వున్నమాట నిజమే అయినా పత్రికలకొక ప్రత్యేక శైలి ఉంటుందన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. వార్తా కథనాల్లో ముఖ్యంగా ఇంగ్లీషు దినపత్రికల్లో allegedly, reportedly, according to sources, it is being said వగైరా పదాలు పదే పదే కనిపిస్తుంటాయి. ఈ పదాలను బట్టే సాధారణంగా పత్రికల భాషా శైలిని 'జర్నలీజ్' అని విమర్శిస్తుంటారు. రచయితల్లో ఒక్కో రచయితకు ఒకశైలి ఉంటే అన్ని పత్రికలకు దాదాపు ఒకేశైలి ఉంటుంది. సంపాదకీయాలశైలి భిన్నంగా ఉన్నా వార్తా కథనాల్లో, వ్యాసాల్లోనూ దాదాపు ఒకే రకమైన శైలి ఉంటుంది. దాదాపు ఒకే రకమైన శైలి అంటే పత్రికల శైలుల్లో కొద్దిపాటి తేడాలుంటాయన్నదే భావం. ఈ కింది వాక్యాలు శ్రద్ధగా చదవండి.

'పడక కుర్చీలో కూచున్నట్టుగా ఉంది. కనురెప్పలు లేవడం లేదు. పెద్ద దీపం వెలుగు పల్చగా రెప్పల మీద పడుతోంది. నిద్రలో తనెక్కడికో జారి పోతోంది. చీకటి గుహలు ఎర్రటి సూర్యబింబం వీనస్ గ్రహం గిలగిల తన్నుకుంటున్న దీపం బుడ్డి. పట్టాల మీద రైలు చక్రాల లయ, త్రిమూర్తి వొంటిమీద బీట, సముద్రంలో పిల్ల కెరటం – గాలి, గడ్డి పువ్వు. అతని

గడ్డం మొనలు, తన వక్షంపై తీగలాంటి వేళ్ళు ఎక్కడికో వెళ్ళిపోతున్నట్లుంది. ఆలోచన లేదు. ఊహలేదు. ఏదో చప్పుడు ఎవరో సుత్తితో తన గుండెలపై కొడుతోన్నట్లు అబ్బ, అయ్యో - బాధ, బాధలో సుఖం - నిద్రలోకి నిద్రలోకి - లోకి - కి..'

ఈ వాక్యాలు చదవగానే సాహిత్యంతో కాస్త పరిచయమున్న ఏ పాఠకుడయినా ఇది బుచ్చిబాబు రచన అని ఇట్టే పోల్చుకుంటాడు. ప్రతి రచయితకూ వ్యక్తీకరణలో ప్రత్యేకశైలి అంటూ ఉంటుంది. ఆ శైలిలోనే ఇతర రచయితలకూ ఆ రచయితకూ తేడా ఉంటుంది కాబట్టే, ఆ శైలి ఆ రచయితకు తన వ్యక్తిత్వం నుంచే సంక్రమించింది కాబట్టి "Style is him self' అన్నారు.

చక్కగా దోషాలు లేకుండా వ్యక్తీకరించే శైలి ఎంతో సాధనవల్లగానీ అలవడదు. తప్పులు లేకుండా రాయడం చక్కగా రాయడంలో ముఖ్య భాగం. అనుభవజ్ఞులు కూడా తరుచుగా భాషా దోషాలు రాస్తుంటారు. పత్రికల్లో తరచుగా కనిపిస్తున్న దోషాలేమిటో పరిశీలిద్దాం.

ప్రధాని గుజ్రాల్ ఆదివారం గంగానదిపై రైల్వే వంతెన నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు.

శంఖుస్థాపన కాదు, శంకుస్థాపన అని రాయాలి. దాదాపు అన్ని తెలుగు దినపత్రికల్లోనూ 'శంఖుస్థాపన' అన్న పదం కనిపిస్తుంటుంది. అలాగే కొంత మంది 'చేసారు' అని రాస్తారు. అది తప్పు అనలేము గానీ చేశారు అని రాస్తే బాగుంటుంది. ఏక రూపత కోసం అందరూ 'చేశారు' అని రాయడం సబబు. చేశారు, రాశారు అన్నప్పుడే 'శా' వాడాలి. మళ్ళీ ఆ క్రియాపదం మారిన రూపంలో 'స' అక్షరమే వస్తుంది. చేసి, చేసిన, రాసి, రాసిన మొదలైన పదాల్లో 'స' అక్షరమే వాడాలి.

> కేంద్ర ప్రభుత్వ వైఖరిని నిరసించడానికి 'ఛలో ఢిల్లీ' నిర్వహించాలని తెలుగుదేశం పార్టీ శుక్రవారం నిర్ణయించింది.

'ఛలో' కాదు 'చలో' అని రాయాలి. చలో బదులు ఛలో రాస్తే భాషాదోషం తెలిసిన పాఠకుల దృష్టిలో జర్నలిస్టులు పల్చనైపోతారు.

ఈ వాక్యం చదవండి.

> నిందితుడు మీర్జా తప్పించుకుపోయిన ఘటనలో సెక్యూరిటీ గార్డుపై క్రిమినల్ కేసు <u>నమోదయినట్లు</u>, ఆ మేరకు నగర పోలీసు కమిషనర్ ఆదేశాలు <u>జారీ చేశారని</u> పోలీసు వర్గాలు తెలిపాయి.

ఈ వాక్యంలో మొదట నమోదయినట్లు అని రాసి ఆ తర్వాత చేశారని రాశారు. అలా కాకుండా రెండు చోట్లా ఒకే రకంగా ఉంటే బాగుండేది. అంటే మొదట నమోదయిందని తరువాత జారీ చేశారని రాసుండాల్సింది. లేదా నమోదయినట్లు, జారీ చేసినట్లు అనయినా రాయాలి. ఇలాంటి వాక్యాలు మన పత్రికల్లో తరుచుగా కనిపిస్తుంటాయి. ఆ వాక్యాన్ని ఇలా తిరగ రాయొచ్చు.

నిందితుడు మీర్జా తప్పించుకుపోయిన ఘటనలో సెక్యూరిటీ గార్డుపై కేసు నమోదయిందని, ఆ మేరకు నగర పోలీసు కమిషనర్ ఆదేశాలు జారీ చేశారని పోలీసు వర్గాలు తెలిపాయి.

ఈ వాక్యం చదవండి.

> సి.పి.పి నాయకుని ఎన్నికకు సంబంధించి ఇప్పటికీ షెడ్యూల్ ప్రకటించలేదని ఆ పదవికి పోటీ చేయాలనుకుంటున్న రాజేష్ పైలట్ వాపోయారు.

ఏ దుర్ముహూర్తాన ఈ 'వాపోయారు' అన్న పదం మన పత్రికా పదజాలంలో ప్రవేశించిందో గాని దీనిలాగా మరే పదమూ దుర్వినియోగం కావటం లేదు. 'వాపోయారు' అంటే ఏడ్చు, అరచు అని అర్థం. రాజేష్ పైలట్‌గానీ మరొకరు గానీ ఎందుకేడుస్తారు? వాళ్ళని ఏడిపించడం న్యాయం కాదు. 'వాపోయారు' బదులు విచారం వ్యక్తం చేశారు అంటే హాయిగా ఉంటుంది కదా. ఇంగ్లీషులో regretted అనీ వి lamented అనీ ఉన్నా విచారం వ్యక్తం చేశారు అనాలి. లేదా 'ఆవేదన వెల్లడించారు' అని కూడా అనొచ్చు. ముఖ్యంగా రాజకీయ నాయకుల వార్త రాస్తున్నప్పుడు ఆ పదం రాకుండా చూడండి.

ఈ ఇంగ్లీషు వాక్యం గమనించండి.

The Union Home minister Mr. Indrajith Gupta, talking to reporters, said that B.J.P could not sustain in power.

ఆ వాక్యానికి ఒక తెలుగు దినపత్రికలో వచ్చిన అనువాదం ఇలా వుంది.

> 'కేంద్ర హోంమంత్రి ఇంద్రజిత్ గుప్తా విలేకరులతో మాట్లాడుతూ బి.జె.పి. అధికారంలో కొనసాగలేకపోయిందని అన్నారు'.

ఈ వాక్యంలో కర్త (ఇంద్రజిత్ గుప్తా) ప్రారంభంలోనూ క్రియ (అన్నారు) చివరా ఉన్నాయి. కర్త దగ్గరే క్రియ ఉంటేనే వాక్యం చక్కగా ఉంటుంది. ఇంగ్లీషు వాక్యంలో కర్త మొదట్లో వస్తే తెలుగులో అది సాధారణంగా చివరన వస్తుంది... ఇలా :

> బి.జె.పి అధికారంలో కొనసాగలేక పోయిందని కేంద్ర హోం మంత్రి ఇంద్రజిత్ గుప్తా విలేకరులతో అన్నారు. మరో ఉదాహరణ.

Mr. Mahajan made clear that the Parliamentary Board would meet again in January to review the situation.

తెలుగులోకి వచ్చే సరికి కర్త కిందికి వస్తుంది.

> పరిస్థితిని సమీక్షించడానికి పార్లమెంటరీ బోర్డు తిరిగి జనవరిలో సమావేశమవుతుందని మహాజన్ స్పష్టం చేశారు.

ఈ వాక్యం గమనించండి.

ప్రధాని గుజ్రాల్ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో ప్రసంగిస్తూ...

ఎక్కువ మంది విలేకరులు ఈ పొరపాటు చేస్తుంటారు. అంటే 'స్వాతంత్ర్య దినోత్సవాలు' అనాలి లేదా స్వాతంత్ర్య దినం వేడుకలు అనాలి. ఉత్సవాలు అన్నా ఒకటే వేడుకలు అన్నా ఒకటే. ఉత్సవాలు సంస్కృత పదం, వేడుకలు తెలుగుపదం... అంతే తేడా. ఉత్సవాలు, వేడుకలు రెండూ రాకూడదు. స్వాతంత్ర కాదు స్వాతంత్ర్య అని రాయాలి.

అని ఆయన పేర్కొన్నారు.... అని రాస్తుంటారు. పేర్కొను అన్నది అచ్చ తెలుగు పదం. దీని అర్థం (1) పేరు పెట్టి పిల్చు, (2) పిలుచు, (3) చెప్పు, (4) ఉచ్చరించు. ఇది గ్రాంధిక పదం కనుక వాడకపోవడం మంచిది. అన్నారు, తెలిపారు, చెప్పారు, వివరించారు... ఇన్ని పదాలున్నప్పుడు ఆ గ్రాంధిక పదాన్ని వాడాల్సిన అవసరం లేదు. ఇది చూడండి:

ముఖ్యమంత్రి చంద్రబాబు ఆ విధంగా కార్యకర్తలు, నాయకుల్లో నిబద్ధతాస్ఫూర్తిని..

కార్యకర్తలు, నాయకుల్లో కాదు. కార్యకర్తల్లో నాయకుల్లో అంటే స్పష్టంగా ఉంటుంది. ఇంగ్లీషులో అయితే To అనే విభక్తి, దాని తరువాత వచ్చే అన్ని నామవాచకాలకూ, సర్వనామాలకూ వర్తిస్తుంది. తెలుగులో ఆ సౌలభ్యం లేదు. కార్యకర్తలకు, నాయకులకు లేదా ... కార్యకర్తల్లో, నాయకుల్లో అనాలి.

## బడు ధాతువులు వద్దు

ఇంగ్లీషులో Passive voice ఎక్కువ ఉపయోగిస్తారు. అది ఆ భాషా సంప్రదాయం. తెలుగులో Active voice ఎక్కువ ఉపయోగంలో ఉంది. మన వాళ్ళు తరుచుగా 'బడు' ధాతువు వాడడానికి ప్రధాన కారణం ఇంగ్లీషు ప్రభావమే.

అసలు 'బడు' ధాతువు ఉపయోగించకూడదు అనే వారున్నట్టే దానికి మినహాయింపు ఇచ్చే వారూ ఉన్నారు. అనివార్య సందర్భాల్లో 'బడు' ఉపయోగిస్తే తప్పేమీ లేదంటారు వీరు. ఈ వాక్యాలు చూడండి.

(అ) నగరంలో పార్టీని బలోపేతం చేసేందుకు అవసరమైన అన్ని చర్యలు గైకొనబడతాయని ముఖ్యమంత్రి, తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు తెలిపారు.

(ఆ) తుపాను బాధితుల కడగండ్లు తొలగించడానికి ఆయా జిల్లా కలెక్టర్లచే చర్యలు తీసుకొనబడేలా రాష్ట్ర ప్రభుత్వం చూడాలని రోశయ్య కోరారు.

వాస్తవానికి ఈ రెండు వాక్యాల్లోనూ 'బడు' ధాతువు వాడాల్సిన అవసరమే లేదు.

(అ) నగరంలో పార్టీని బలోపేతం చేసేందుకు అవసరమైన అన్ని చర్యలు

తీసుకుంటామని ముఖ్యమంత్రి, తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు తెలిపారు.

(ఆ) తుపాను బాధితుల కడగండ్లు తొలగించడానికి ఆయా జిల్లా కలెక్టర్లు చర్యలు తీసుకొనేలా రాష్ట్ర ప్రభుత్వం చూడాలని రోశయ్య కోరారు.

కాస్త శ్రద్ధ తీసుకుంటే 'బదు' ధాతువు వాడకుండా వాక్యం రాయడం తేలికే. కావలసిందల్లా శ్రద్ధ.

ఇప్పటికీ కొందరు 'యొక్క' పదం మాటల్లోనూ రాతలోనూ ఉపయోగిస్తుంటారు. ఈ పదాన్ని విధిగా నివారించండి.

'జీవితం యొక్క రెండో పార్శ్వం ఏమిటంటే,..'

ఇక్కడ స్పష్టత కోసం 'యొక్క' వాడానని ఒక రచయిత వాదించాడు. స్పష్టత కోసం యొక్క బదులు అంతగా అవసరమైతే 'తాలూకు' అన్నపదం చేర్చండి. స్పష్టంగా వుంటుంది.

'జీవితం తాలూకు రెండో పార్శ్వం ఏమిటంటే...'

సామాజిక అవసరాలు పెరిగే కొద్దీ, నూతన పరిస్థితులు అవతరించే కొద్దీ కొత్త పదాల సృష్టి అవసరమవుతుంది. పాత పదాలను నిర్మొహమాటంగా వదలుకోవాలి. భాష మీద 'సెంటిమెంట్' ప్రదర్శించకూడదు.

కొంతమంది పండితులు సెంటిమెంటుతో ఈ పదాలు వాడకపోతే అదృశ్యమై పోతాయంటూ ఱ, ఋ, ౠ లు కూడా వాడుతుంటారు. ఆ అక్షరాల వాడకంతో ఇప్పుడు అవసరం లేదు. అవి పుట్టిన నాటి పరిస్థితులు వేరు, ఈనాటి పరిస్థితులు వేరు. కంప్యూటర్ యుగంలో కూడా ఱ, ఋలు వాడడం హాస్యాస్పదం. ఋషిని రుషి అంటే ఆయన రూపం మారిపోదు కదా. గుఱ్ఱం అన్నా అదే అర్థమే గుర్రం అన్నా అదే అర్థమే. ఎందుకు రెండక్షరాలు?

మన భాషలో 'చారిత్రాత్మకం' అన్న పదమే లేదు. చరిత్రాత్మకం ఉంది, చారిత్రకం ఉంది. Historic అంటే చరిత్రాత్మకం, Historical అంటే చారిత్రక. ఆ భేదం గమనించాలి. పొద్దున లేస్తే అన్ని పత్రికల్లోనూ మనకు చారిత్రాత్మకం అన్న పదమే కనిపిస్తుంది. చరిత్రలో లేనిది జరిగినప్పుడే This is historic అంటారు. ఇది చరిత్రాత్మకం అని. చరిత్రలో ఉన్న ఘటనను ప్రస్తావిస్తున్నప్పుడు Historical event అంటారు. Historical evidence is there అంటారు. ఈ వాక్యాలు గమనించండి.

భారత్‌కు క్రయోజనిక్ ఇంజన్లు అందించడం పట్ల తమ ప్రభుత్వం కట్టుబడి ఉందని రష్యన్ అధికారులు పునరుద్ఘాటించారు.

అంతా సరే ఆనీ ఆ అందించడం పట్ల ఏమిటి?

అందించడానికి అంటే హాయిగా ఉండదూ.

'రష్యన్ అంతరిక్ష అధికారులతో క్రయోజనిక్ రాకెట్ల ఒప్పందం విషయమై చర్చలు జరిపేందుకు...

ఈ వాక్యం ఇలా ఉంటే బాగుంటుంది.

క్రయోజనిక్ రాకెట్ల ఒప్పందం విషయమై రష్యన్ అంతరిక్ష అధికారులతో చర్చించేందుకు...

రష్యన్ అంతరిక్ష అధికారులు, చర్చలు ఒకేచోట ఉంటే వాక్యంలో స్పష్టత ఉంటుంది. పైగా చర్చలు జరిపేందుకు అనకుండా చర్చించేందుకు అంటే సరిపోదా. చర్చలు ఒక విశేష్యం జరిపేందుకు మరో క్రియారూపం. రెండెందుకు చెప్పండి. ఒకే ఒక క్రియా రూపం (చర్చించేందుకు లేక చర్చించడానికి) చాలదా.

వివిధ ప్రజోపయోగ అభివృద్ధికర కార్యక్రమాలను అమలుపరచడానికి...

అభివృద్ధికర కార్యక్రమాలు కాదు అభివృద్ధి కార్యక్రమాలు అని రాయాలి. అవి అభివృద్ధికి ఉద్దేశించిన కార్యక్రమాలే కాని అవి అభివృద్ధికరమైన కార్యక్రమాలు కాదు. Development Programmes అంటే అభివృద్ధి కార్యక్రమాలు. ఈ పదాలను మన వాళ్ళు అభివృద్ధికర కార్యక్రమాలనీ, ప్రగతిశీల కార్యక్రమాలని అనువదిస్తుంటారు.

ఎండాకాలంలో కొన్ని జాగ్రత్తలను తీసుకోవడం అవసరమని డ్యాక్టర్ తెలిపారు.

అక్కడ 'జాగ్రత్తలను' అనక్కర్లేదు. జాగ్రత్తలు అంటే చాలు. చర్యలు చేపట్టారు, జాగ్రత్తలు తీసుకోవాలి, వాస్తవాలు వివరించారు, ఆస్తులు స్వాధీనం చేసుకొని. పైవాక్యాల్లో లను అక్కర్లేదు. మనం మాట్లాడేప్పుడు జాగ్రత్తలు తీసుకున్నాం అనే అంటాం. పెన్ను పట్టుకొనే సరికి వాడకు భాష వదిలేసి గ్రాంథికం పట్టుకుంటాం. మిత్రులు, పరిచయస్తులు ఎదురైతే 'నమస్కారమండీ' అంటారు. అదే ఉత్తరం మొదలెట్టేసరికి 'నమస్కారములు' అంటారు అత్యధికులు. చిన్నయ సూరిగారి గ్రాంథిక భాషా ప్రభావం మన మీద అంతగా ఉంది మరి. బెంగాల్‌లో దాదాపు 80 ఏళ్ళ క్రితమే రచయితలు, పత్రికా రచయితలు వాడుక భాష స్వీకరించారు. మనమేమో ఇప్పటికీ యొక్కను మరియునూ, బడునూ వదల్లేక పోతున్నాం. 1914లో జ్ఞానేంద్ర మోహన్‌దాస్ అనే మేధావి మన గురజాడ మహాకవికి రాసిన లేఖలో ఇలా అన్నారు.

'నిత్యమూ చెవిని పడుతున్న మాటలను, సులభంగా అర్థమయ్యే సరళ

పదాలను, నుడికారాన్ని స్వీకరిస్తున్నారు. వారు తమ పుస్తకాలలో వాడుతున్న భాష రైతులకు, రాజులకు, పూజారులకు, పురోహితులకు అందరికీ సుపరిచితమైనట్టిది. ఇప్పుడు బెంగాలులో రచయితలు సరళ సుబోధక శైలిని అనుసరిస్తున్నారు. మామూలు మాటలతో అర్థ గాంభీర్యాన్ని సాధిస్తున్నారు. ఇలాంటి సరళ భాషను వాడుతూ రచనలో కృతకృత్యులు కావాలంటే మాటల పొందిక, ఇమిడిక అవసరం కదా. సొగసయిన పదాలను ఎంచుకోవడంలో, వాటిని అర్థవంతంగా ప్రయోగించడంలో రచయితకున్న నేర్పును బట్టి అతని శైలికి అందం అమరుతుంది'

జ్ఞానేంద్ర చెప్పిన మాటలు పత్రికా రచయితలకు కూడా చక్కగా వర్తిస్తాయి. సరళ పదాలపై చిన్నచూపొద్దు. గ్రాంథిక పదాలను నిర్దాక్షిణ్యంగా వదిలేయండి. ఇంగ్లీషులో నాలుగైదు నామ వాచకాలు రాస్తున్నప్పుడు చివరి నామవాచకం ముందు and అని రాస్తారు. Doctors, villagers, officials and social activists అంటారు. మన వర్థిష్ణు పత్రికా రచయితలు అనుకోకుండానే డాక్టర్లు, గ్రామస్తులు, అధికారులు మరియు సంఘ సేవకులు అని రాస్తుంటారు. ఇంగ్లీషు పలుకుబడి వేరు మన పలుకుబడి వేరు. అక్కడగానీ ఎక్కడ గానీ మరియు పదం అవసరమే లేదు. అది పాఠకుడి అవగాహనకు ఏ విధంగానూ తోడ్పడక పోగా పత్రికల భాషా శైలికి అవరోధంగా తయారవుతుంది.

తుపాను షెల్టర్ల సంఖ్య పెంచాలని ఆయన రాష్ట్ర ప్రభుత్వంను డిమాండ్ చేశారు.

'రాష్ట్ర ప్రభుత్వంను' కాదు రాష్ట్ర ప్రభుత్వాన్ని అని రాయాలి. మన వాళ్ళు తరచుగా 'కేంద్రంను' 'రాష్ట్రంకు' 'అధికారంను' అని రాస్తుంటారు. కేంద్రాన్ని, రాష్ట్రానికి, అధికారాన్ని అని రాయాలి. అలాగే శీర్షికల్లో తరుచుగా ఒక తప్పు కనిపిస్తూంటుంది.

**రోడ్డు ప్రమాదంలో ఇద్దరు మృతి**

**కల్తీ సారా తాగి నలుగురు మృతి**

ఇక్కడ ఇద్దరు బదులు ఇద్దరి ఉండాలి. అలాగే నలుగురు కాదు నలుగురి అనాలి. ఇద్దరి మృతి, ముగ్గురి మృతి, నలుగురి మృతి, ఏడుగురి మృతి

కొంత మంది తెలుగు పదాల స్పెల్లింగ్ దోషాలు పట్టించుకోరు. ఇంగ్లీషు Phonetical language కాదు కనుక స్పెల్లింగ్ గుర్తుంచుకోవడం చాలా కష్టం.

పైగా అది అన్యభాష. ఇంగ్లీషులో ఒక పదం ఉచ్చారణకూ ఆ పదంలోని అక్షరాలకు తేడా ఉంటుంది. పైగా కొన్ని పలకని (Silent) అక్షరాలు కూడా ఉంటాయి. ఉదాహరణకు

Walk, Talk ఈ పదాలలో L పలకదు. పలకని అక్షరాలతో పనేమిటో మనకి తెలీదు కానీ మన తెలుగులో మాత్రం ఈ ఇబ్బంది లేదు. ఉన్న అక్షరాలను ఉన్నట్టే ఉచ్చరిస్తాం. ఈ లెక్కన స్పెల్లింగ్ దోషాలు దొర్లే ప్రమాదం చాలా తక్కువ. అయినా అలక్ష్యం వల్ల కావచ్చు, తెలియక కావచ్చు. మన పత్రికల్లో అక్షర దోషాలు, అనువాద దోషాలు తరుచుగ కనిపిస్తుంటాయి. ఒకసారి ఈ కింది జాబితా చూడండి.

| ఇలా రాయండి | ఇలా రాయొద్దు |
| --- | --- |
| ఆస్తి (Property) | ఆస్థి |
| శాకాహారం | శాఖాహారం |
| నిరసన (Protest) | నిరశన |
| నిరశన లేక నిరశనం (Fast) | నిరసన |
| వినియోగం (Consumption) | వినిమయం |
| వినియోగదారులు (Consumers) | వినిమయదారులు |
| సౌహార్ద్రం (Good will) | సౌహార్ధ్రం |
| అధిష్ఠానం | అధిష్టానం |
| అస్తిత్వం (ఉనికి) | అస్థిత్వం |
| అధీనం | ఆధీనం |
| స్వ+ అధీనం=స్వాధీనం | |
| ఒత్తిడి | వొత్తిడి |
| ధ్రువీకరించారు | ధృవీకరించారు |
| జనార్దనరెడ్డి | జనార్ధనరెడ్డి |
| ప్రతిష్ఠ | ప్రతిష్ట |
| ప్రతిష్టంభన | ప్రతిష్ఠంభన |
| ప్రయాణికులు | ప్రయాణీకులు |
| ప్రశ్నపత్రం | ప్రశ్నాపత్రం |
| ప్రాధాన్యం | ప్రాధాన్యత |
| ప్రాముఖ్యం | ప్రాముఖ్యత |
| పటిష్ఠం (విశేషణం) | పటిష్టం |
| పటిష్ఠత (విశేష్యం) | పటిష్టత |
| చేశారు | చేసారు |
| రాశారు | రాసారు |
| చేసి, చేసిన | చేశి, చేశిన |
| తుపాను | తుఫాను |

| | |
|---|---|
| జయంత్యుత్సవం | జయంతోత్సవం |
| శ్రేష్ఠం | శ్రేష్టం |
| షష్టి (అరవై) | షష్ఠి (ఆరో) |
| షష్టిపూర్తి అని రాయాలి | |
| సంప్రదాయం | సాంప్రదాయం |
| బీభత్సం | భీభత్సం |
| వశం | వసం |
| అయితే | ఐతే |
| అయినా | ఐనా |
| ఉద్దేశం (Purpose or motive) | ఉద్దేశ్యం |
| ఉచ్చారణ | ఉచ్చారణ |
| నుంచి | నుండి |
| కార్‌సేవ | కరసేవ |
| త్రుటిలో | తృటిలో |
| స్తంభం | స్థంభం |
| స్తంభన, స్తంభించు | స్థంభన, స్థంభించు |
| వాయవ్యం | వాయువ్యం |
| విద్యుదీకరణ | విద్యుద్దీకరణ |
| సమర్థంగా | సమర్థవంతంగా |
| శ్రుతి | శృతి |
| సొంతం | స్వంతం |
| Constitution of Congress | Constitution of Congress |
| అంటే కాంగ్రెస్ నిబంధనావళి | అంటే కాంగ్రెస్ రాజ్యాంగం కాదు |
| మద్యనిషేధం | మధ్య నిషేధం |
| బహుమతి ప్రదానం | బహుమతి ప్రధానం |
| ఆదాన ప్రదానం | ఆధాన ప్రధానం |
| కక్ష్య (Orbit) | కక్ష |
| కక్షలు (Factions) | కక్ష్యలు |
| కక్షకు కక్ష్యకు తేడా గమనించండి | |
| భేదం | బేధం |
| బాధ | భాద |
| సమష్టి | సమిష్టి |
| ఆలస్యం | ఆలశ్యం |

| | |
|---|---|
| ఉత్తరం | వుత్తరం |
| ఉపయోగం | వుపయోగం |
| సందిగ్ధం | సందిగ్దం |
| స్వచ్ఛందం | స్వచ్ఛంధం |
| యథాతథం | యదాతధం |
| నిర్బంధం | నిర్భందం |

హస్తి మశకాంతర భేదం అనకూడదు. హస్తిమశకాంతరం అంటే చాలు. అంతరం అంటేనే భేదం, తేడా, హస్తిమశకాంతరం అంటే ఏనుగకూ దోమకూ ఉన్న తేడా. జర్నలిస్టుకు అక్షర దోషాలు తెలియడం ఎంత ముఖ్యమో తనకు తెలిసిన చిన్న చిన్న పదాలనే సొగసుగా సందర్భానికి తగ్గట్లుగా వాడుకోవడమూ అంతే ముఖ్యం. శ్రద్ధగా, దీక్షగా కృషి చేస్తే చక్కగా రాయడం బ్రహ్మవిద్యేమీ కాదు. రచనలో ఆసక్తి ఉన్న వాళ్ళంతా తగిన కృషి చేస్తే చక్కగా రాయగలరు. మిమ్మల్ని ఉబ్బేయడానికి ఇలా అనడం లేదు, గట్టిగా కృషి చేస్తే మీకే తెలుస్తుంది ఈ విషయం. కానీ కృషికి మాత్రం ఈ ప్రపంచంలో ప్రత్యామ్నాయం లేదు. కృషి... కృషి... కృషి... నిత్యం స్మరించుకోతగిన మంత్రం ఇది.

## ముక్తాయింపు

ఇటీవల ఒక ప్రైవేట్ సంస్థ జరిపిన సర్వేలో మనందరికీ ఆందోళన కలిగించే వాస్తవం వెల్లడయింది. ఈ మధ్య దేశంలో టీవీ చానెల్స్ గుమ్మడి పాదులా విస్తరించడం వల్ల పత్రికల సర్క్యులేషన్ మాత్రం తగ్గలేదు కానీ పాఠకులు పఠన సమయాన్ని గణనీయంగా తగ్గించారట. ముఖ్యంగా టీవీ చానెల్స్ రాత్రింబగళ్ళూ రకరకాల వినోద కార్యక్రమాలు ప్రసారం చేస్తున్నాయి. ఇది పాఠకులు పఠనానికి వెచ్చించే సమయాన్ని బాగా తగ్గిస్తున్నది. వారి పఠన సమయాన్ని పెంచడానికి రెండే రెండు ప్రధాన మార్గాలున్నాయి. ఒకటి - వార్తా కథనాల్లో, వ్యాసాల్లో వైవిధ్యం సంపాదించాలి. రెండు - పత్రికా రచనలో ప్రమాణాలను పెంచాలి. ఈ రెండు పనుల ద్వారా మాత్రమే పాఠకుల్ని ఆకట్టుకోవడం సాధ్యం. పత్రికా రచయితలు అంటే విలేకరులు, సబ్ ఎడిటర్లు, గ్రామీణ విలేకరులు అందరూ ఆ రెండు కర్తవ్యాల పరిపూర్తికి త్రికరణ శుద్ధి (మనసా, వాచా, కర్మణా)గా కట్టుబడాలి. సడలని నిబద్ధతతో కృషి చేస్తేనే పాఠకుడిపై పట్టు నిలుపుకోగలం. పాఠకుడిపై పట్టుకోల్పోతే సర్వం కోల్పోయినట్టే. టీవీచానెల్స్ సవాలును తేలిగ్గా తీసుకొంటే ముప్పు ముంచుకొస్తుంది. ఈ సవాలు తీవ్రత పెరిగే కొద్దీ పత్రికల యజమానులు సమర్థులయిన, ప్రతిభా వంతులయిన జర్నలిస్టులనే అంగీకరిస్తారు. కనుక మీ కలాలకు పదును పెట్టుకోక పోతే ప్రమాదం తప్పదు. ఉద్యోగాలను నిలుపుకోడానికయినా వృత్తి నైపుణ్యాన్ని పెంచుకోడం తప్పనిసరి. వృత్తి నైపుణ్యమే మీ జీవనానికి శ్రీరామరక్ష.

# సంకల్పముంటే సంగతులు బోలెడు

రాజకీయేతర వార్తలూ ఉన్నాయిసుమండీ. పాఠకులు టీవీ కాలక్షేప సమయాన్ని తగ్గించి ఆ మేరకు పత్రికా పఠన సమయాన్ని పెంచుకోవాలంటే రెండు పద్ధతులున్నాయని చెప్పుకున్నాం. ఒకటి - వార్తా కథనాల్లో వైవిధ్యాన్ని పెంచడం, రెండు - పత్రికా రచన ప్రమాణాలను పెంచడం. రెండో అంశం గురించి పెద్దగా చెప్పక్కర్లేదు గానీ మొదటి విషయం గురించి రెండు ముక్కలు చెప్పుకోవాల్సిందే. మన టీవీలలో పాఠకుల్ని ఆకర్షిస్తున్నవి వినోద కార్యక్రమాలే. కాబట్టి మనం పత్రికల్లో కూడా వినోద ప్రధాన విషయాలను చెప్పాలి. మన పత్రికలన్నీ రాజకీయ వార్తలకే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నాయి. రాజకీయేతర విషయాలను, సమాచారాన్ని పట్టించుకోవడం లేదు. రాజకీయ వార్తలు చదవడానికే పత్రికలు చూడాలని పాఠకులు భావించేలా చేస్తున్నాయి.

నిజానికి మన సమాజంలో ఆ మాటకొస్తే ఏ సమాజంలో అయినా, రాజకీయేతర సమాచారం, సంగతులు బోలెడున్నాయి. ఆ కన్ను ఉండి చూడాలే గానీ సంఖ్యానేక సాంస్కృతిక, సామాజిక అంశాలు కనిపించక పోవు. ఎటొచ్చీ మీరు చేయాల్సింది కాసేపు రాజకీయ కళ్ళజోడును పక్కన పెట్టడమే. మన సంస్కృతికి సంబంధించినవీ, సంప్రదాయాలకు సంబంధించినవీ, వాణిజ్య వ్యవహారాలకు సంబంధించినవీ అనేక వార్తా కథనాలు భేషుగ్గా రాయొచ్చు. సంకల్పంముండాలే గానీ సంగతులకేం కొదవ? అయితే ఇలాంటి వార్తల్లో విషయం కంటే వివరణ ముఖ్యం. చెప్పేదేదో చక్కగా చెప్పాలి. పాఠకుడి దృష్టిని ఆకట్టుకొనేలా చెప్పాలి. పాఠకుడి ఆసక్తి, అక్షర విన్యాసంలో బందీ అయ్యేలా రాయాలి.

మనం రోజూ తాగే ఇరానీ టీ ఎలా తయారు చేస్తారు, తినే బజ్జీలు, సమోసాలు ఎలా చేస్తారు, మన గ్రనైట్ రాయి ఏ దేశాలకు ఎగుమతి అవుతోంది, ఇటుకలకు బదులు ఆ దేశాలు ఈ రాళ్ళనే ఎందుకు వాడుతున్నాయి, సింగిల్‌నెంబర్ లాటరీల పిచ్చి ఎలా కొంపలు కూల్చుతోంది, మన సంస్కృతీ సంప్రదాయాలపై టీవీ చానెల్స్ ప్రభావం ఏమిటి. కర్నాటక సంగీతానికీ, హిందుస్తానీ సంగీతానికి తేడా ఏమిటి? కళల్లో మనిషిని తీవ్రాతి తీవ్రంగా ప్రభావితం చేసేది సంగీతమే అంటారు ఎందుకని, నగరాల్లో భూగర్భ జలాల వనరులు ఎందుకు తగ్గిపోతున్నాయి, నగరాల్లో ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు ఉదయం నుంచి సాయంత్రం దాకా పడే మానసిక, శారీరక అవస్థలేమిటి, నగర సంస్కృతి దాంపత్య జీవితాన్ని ఎలా ప్రభావితం చేస్తోంది. ఇలా ఆలోచిస్తే అనంత జీవన వైవిధ్యం మన కళ్ళముందు శతకోటి దృశ్యాలతో సాక్షాత్కరిస్తుంది. మీరు చేయాల్సిందల్లా ఈ దృశ్యాలను అక్షరబద్ధం చేసి పాఠకుల ముందుంచడమే.

# ఇంటర్ 'వ్యూ' పాయింట్ ..

వ్యక్తిత్వ చిత్రణలు,

ప్రత్యేక ఇంటర్వ్యూలు



శ్రీ నండూరి రామమోహనరావు

శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు

శ్రీ వి.వాసుదేవ దీక్షితులు



శ్రీ కె. రామచంద్రమూర్తి



శ్రీ జి.కృష్ణ

# పాండిత్యంకన్న పరిజ్ఞానం మిన్న



శ్రీ నండూరి రామమోహనరావుతో
ఇంటర్వ్యూ

ఐదు దశాబ్దాలుగా తాను సాగిస్తున్న అవిశ్రాంత కృషిలో వెనక్కి తిరిగి చూసుకుంటే ఎన్నో మహోజ్జ్వల ఘట్టాలు. సాహితీ ప్రముఖులతో పరిచయాలు. మనసుకు నచ్చిన, జనం మెచ్చిన రచనలు చేశానన్న సంతృప్తి. ఆయన పేరు నండూరి రామమోహనరావు. సైన్స్ విషయాలను అంతరిక్షం నుంచి భూమార్గం పట్టించి తేటతెనుగులో అందించిన ఘనుడాయన. దేశ విదేశీ తత్వవేత్తల సిద్ధాంత సారాన్ని పట్టిచూపిన ప్రతిభామూర్తి ఆయన. తెలుగు కథాసాహిత్యాన్ని పరిపుష్టం చేయటంలో ఆయన కృషి ప్రత్యేకంగా ఎన్నదగింది. ఆంధ్రపత్రిక వీక్లీ ఇన్‌చార్జి ఎడిటర్‌గా ఆయన అనేక మంది కొత్తవారి రచనలను సాహితీ లోకానికి పరిచయం చేశారు. ఓ పక్క ఆంధ్రజ్యోతి దినపత్రికలో పనిచేస్తూనే యాజమాన్యం అనుమతితో జ్యోతి మాసపత్రికను కూడా ఎడిట్ చేసేవారు. జ్యోతి మాసపత్రిక ఐదేళ్లపాటు నండూరి వారి సారథ్యంలో వెలువడింది. నండూరితోపాటు బాపు, ముళ్లపూడి వెంకటరమణ, రావికొండలరావు, వి.ఎ.కె. రంగారావు జ్యోతి సంపాదకమండలి సభ్యులుగా ఉండేవారు. కృష్ణాజిల్లా ఆరుగొలనులో ***1927*** ఏప్రిల్ ***24***వ తేదీన జన్మించిన శ్రీ నండూరి రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీలో బి.ఎ. చదివారు. ***1947*** నవంబర్‌లో శ్రీ నండూరి జర్నలిజానికి శ్రీకారం చుట్టారు. మోచర్ల కృష్ణమూర్తి సంపాదకత్వంలో విజయవాడనుంచి వెలువడే జన్మభూమి దినపత్రికలో నెలకు అరవై రూపాయల జీతంపై పనిచేశారు. అప్పటికే ఆంధ్రపత్రికకు దరఖాస్తు చేసివుండటంతో ఆ ఉద్యోగం వచ్చింది. జన్మభూమిలో సుమారు రెండునెలలు పనిచేసి ***1948*** జనవరి ఒకటోతేదీన మద్రాసులో ఆంధ్రపత్రిక డెయిలీలో చేరారు. మూడేళ్లపాటు దినపత్రికలో పనిచేసిన నండూరి ఆ తర్వాత వీక్లీకి మారారు. పత్రిక వీక్లీకి కొడవటిగంటి కుటుంబరావు ఇన్‌చార్జి ఎడిటర్‌గా వుండేవారు. నండూరి ఆయన దగ్గర అసిస్టెంట్‌గా పనిచేశారు.

కొడవటిగంటి చందమామ ఎడిటర్‌గా వెళ్లడంతో పత్రిక వీక్లీ సంపాదక బాధ్యతలను పూరంపూడి సీతారాం చేపట్టారు. ఆయన తర్వాత నండూరివారు ఇన్‌ఛార్జి ఎడిటర్ అయ్యారు. పత్రిక వీక్లీలో వున్నప్పుడే సవ్యసాచి పేరుతో అక్షరతూణీరం శీర్షికన రాజకీయ వ్యంగ్య గేయాలు రాశారు. ఇవి బాగా ప్రాచుర్యంపొందాయి. శ్రీశ్రీయే మారుపేరుతో ఈ గేయాలు రాస్తున్నాడా అని కొందరు సాహితీవేత్తలు భావించేవారంటేనే ఆ

గేయాలు ఎంత పదునుగా వుండేవో అర్థమవుతుంది. పత్రికలోనే మిత్రలాభం, మిత్రభేదం బొమ్మల కథలకు రెండు మూడేళ్లపాటు గేయరూపంలో రైటప్‌లురాశారు. అవి కూడా నండూరివారికి మంచి పేరు తెచ్చాయి. కథలు నాలుగే రాసినా భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, పిల్లల గేయాలను అనేకం రాశారు ఆయన. మార్క్‌ట్వేన్ నవలలను ఆయన అనువదించారు. అవి పత్రిక వీక్లీలో ధారావాహికంగా ముద్రితమయ్యాయి. *1960* జూలైలో ఆంధ్రజ్యోతి దినపత్రికలో చేరారు. *1994* అక్టోబర్‌లో ఆ పత్రిక ఎడిటర్‌గా రిటైరయ్యారు. ప్రస్తుతం ఆయన ఉదయం దినపత్రికకు గౌరవ ముఖ్య సంపాదకులుగా ఉన్నారు. నార్లవారి ప్రేరణతో ఆంధ్రజ్యోతివార పత్రికలో విశ్వరూపం, నరావతారం అనే రెండు సైన్సు రచనలను సీరియల్‌గా రాశారు. ఆ తర్వాత విశ్వదర్శనం, పాశ్చాత్య భారతీయ చింతనలను ధారావాహికంగా రాశారు. ఇవికూడా నండూరి వారి ప్రతిభను నలుదిశలా చాటాయి. పాత్రికేయుడిగా ఆయన అనేక అవార్డులను అందుకున్నారు. సన్మానాలను, అభినందనలను పొందారు. *1991*లో తెలుగు విశ్వవిద్యాలయం నండూరి వారికి గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. రాష్ట్రప్రభుత్వ ఉత్తమ జర్నలిస్ట్ అవార్డును కూడా పొందారు. ముట్నూరి కృష్ణారావుఅవార్డు, శిరోమణి (న్యూయార్కు) అవార్డు, హార్మోని అవార్డు మొదలైన అవార్డులను శ్రీ నండూరి అందుకున్నారు. ఐదు దశాబ్దాల పాత్రికేయ జీవితంలో ఆయన అనేకమంది ప్రముఖ సాహితీవేత్తలను దగ్గరగా చదివారు. చిన్ననాటి నుంచి తాత్విక చింతనను నరనరాల జీర్ణించుకున్నారాయన. అభిమాన దురభిమానాలకు అతీతంగా ఆయా అంశాల ప్రాతిపదికగా తన సంపాదకీయాల్లో మంచి చెడులను ఎత్తిచూపారు. పదాలతో కయ్యానికి కాలుదువ్వడం ఆయనకు చేతకాని పని. తార్కికంగా తన పాయింట్ ఆఫ్‌వ్యూను బలంగా చెప్పడంలో శ్రీ నండూరి వారిది అందెవేసిన చేయి. మనిషి మృదుస్వభావి. అంతర్ముఖులు. ఓయాభై ఏళ్ల సాహితీ, పాత్రికేయ వ్యవసాయంలో ఆయన పండించని పంటలేదు. ఆ అనుభావాల మధురిమలను ఈ ఇంటర్వ్యూలో మీకూ రుచి చూపిస్తున్నారు.

ప్ర: మీరు రాసిన వాటిల్లో మీకు బాగా నచ్చిన రచన ఏది? ఎందుకు నచ్చింది?

జ: కాకి పిల్ల కాకికిముద్దు అన్నట్లు, నేను రాసినవన్నీనాకు ఇష్టమే.కాని, ఒకటి చెప్పాలి. నేను ఏవో కొన్ని గ్రంథాలు రాసినప్పటికి, అనేక కారణాలవల్ల, రాయదలచిన, రాయగలిగిన వాటిలో సగం మాత్రమేరాశాను. రాసినవాటిలో అన్నిటిలోకి ఏది ఇష్టం అంటే

''విశ్వదర్శనం'' రెండు సంపుటాలను ముందుగా పేర్కొంటాను. మొదటి సంపుటంలో ప్లేటో, అరిస్టాటిల్ వంటి ప్రాచీనకాలపు గ్రీకు తత్వవేత్తలతో మొదలుపెట్టి, నవీన యుగానికి చెందిన కాంట్, హెగెల్, మార్క్స్, సార్త్ర వంటి తత్వవేత్తల వరకు పాశ్చాత్య చింతన ధోరణులను వివరించాను. తెలుగు వారికి అంతగా పరిచయంలేని, చాలా క్లిష్టమైన పాశ్చాత్యతత్వ సిద్ధాంతాలను ఆ గ్రంథంలో సులభగ్రాహ్యమైన శైలిలో వివరించగలిగానను కుంటున్నాను.

ఇక ''విశ్వదర్శనం'' రెండవ సంపుటం ప్రత్యేకించి భారతీయ చింతనకు సంబంధించినది. అందులో ఆర్యుల పూర్వరంగంతో, వేదాలతో, ఉపనిషత్తులతో మొదలుపెట్టి, సాంఖ్యం మొదలైన షడ్దర్శనాలను, భగవద్గీతను, బౌద్ధ, జైన దర్శనాలను, శంకరుని అద్వైతం, రామానుజ విశిష్టాద్వైతం, మధ్వుని ద్వైతం మొదలైన వాటిని సంగ్రహంగా పరిచయంచేస్తూ, ఆధునిక కాలానికి చెందిన అరవిందుడు, గాంధి, జిడ్డుకృష్ణమూర్తి మొదలైనవారి చింతనను నాకు అర్థమైనమేరకు తేటతెల్లం చేయడానికి ప్రయత్నించాను.

వచనశైలిలో, విషయ వివరణలో, తెలుగు పాఠకులకు ఉపయుక్తతలో ''విశ్వదర్శనం'' రెండు సంపుటాలు నాకు బాగా తృప్తి కలిగించాయి. ఇంకా మూడవ సంపుటం రాయవలసి వుంది. అందులో నా స్వీయ దృక్పథాన్ని వివరించాలని ఆశిస్తున్నాను. అది ఎప్పటికి పూర్తిచేయగలనో ఇప్పుడే చెప్పలేను.

*ప్ర: మీకు తెలిసిన విషయాలు పదుగురికీ చెప్పాలన్న తపనకొద్దీ రాశారా? మానసిక ఆనందం కొద్దీరాశారా? మీ రచనలకు ఏది ప్రేరణ?*

జ: నేను మార్క్‌ట్వేన్ నవలలలో అయిదింటిని ( టామ్‌సాయర్, రాజుపేద వగైరా), స్టీవెన్‌సన్ నవల (ట్రెజర్ ఐలెండ్) ఒక దాన్ని (కాంచనద్వీపం పేరుతో) అనువదించాను. అవి నేను ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రికలో పనిచేసేరోజులలో ఉద్యోగధర్మంగా రాశాను. ఇక ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రికలో సీరియల్‌గా ప్రచురించిన విశ్వరూపం, నరావతారం గ్రంథాలు వైజ్ఞానిక రచనలు. ''విశ్వరూపం'' ఆధునిక ఖగోళశాస్త్ర, విశ్వశాస్త్ర (కాస్మాలజీ), అణుశాస్త్ర (న్యూక్లియర్ ఫిజిక్స్) సిద్ధాంతాలను, పరిశోధనా ఫలితాలను సంగ్రహంగా తెలియజేసే గ్రంథం ''నరావతారం'' జీవపరిణామం ఏవిధంగా జరిగిందో, ఆధునిక నరుడు (మోడర్న్ మ్యాన్) ఏవిధమైన పరిణామ క్రమంలో ఆవిర్భవించాడో తెలిపే గ్రంథం. ఆధునిక విజ్ఞాన శాస్త్రాలను తెలుగు పాఠకులకు సులభంగా అర్థమయ్యేభాషలో తెలియజేయాలన్న ఆశయంతోనే ఈ రెండు గ్రంథాలను రాయడం జరిగింది. నా అభిమాన విషయాలు మూడు: మొదటిది సాహిత్యం, ముఖ్యంగా కవిత్వం. కాలేజీ రోజులలో మొదలుపెట్టి ఒక పదేళ్లపాటు కొంత భావ కవిత్వం, కొంత అభ్యుదయ కవిత్వం, మరికొంత

బాలగేయ కవిత్వం రాశానుగాని, నాకు కవిగా అవి గుర్తింపు తేలేకపోయాయి. పట్టుదల లోపంవల్ల కవితా వ్యాసంగం కొనసాగించలేకపోయాను. జర్నలిజానికి, కవిత్వానికి పొసగదేమోనని కవిత్వాన్ని పూర్తిగా వదిలిపెట్టేశాను.

నా రెండవ అభిమాన విషయం పాప్యులర్ సైన్సు. తేలికగా అర్థమయ్యేటట్టురాసిన ఇంగ్లీషు పాప్యులర్ సైన్సు ( జేమ్స్ జీన్స్, గమోవ్ వగైరా) గ్రంథాలను, పత్రికలలో వ్యాసాలను చదవడం చాలా కాలంగా అలవాటు. అది నేను విశ్వరూపం, నరావతారం గ్రంథాలను రాయడానికి స్ఫూర్తి ఇచ్చింది. ఆంధ్రజ్యోతి స్థాపక సంపాదకుడు నార్లవెంకటేశ్వరరావుగారి ప్రోత్సాహం కూడా ఆ రచనలకు తోడ్పడింది.

ఇక మూడవ అభిమాన విషయం తత్వశాస్త్రం. భగవద్గీత, ఉపనిషత్తుల వేదాంతంపై కాలేజీ రోజులనుంచివున్న అభిరుచి ప్రేరణగా ''విశ్వదర్శనం - భారతీయ చింతన'' రాశాను. సుమారుగా 1950-51 సంవత్సరాలలో కాబోలు కీర్తిశేషుడు జి. వి. కృష్ణారావుగారి ప్రేరణతో ఆయన వద్ద తీసుకుని చదివిన బెర్ట్రాండ్ రస్సెల్ గ్రంథం ''ది హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ'' పాశ్చాత్య తత్వశాస్త్రంపై అభిరుచి కలిగించి ''విశ్వదర్శనం - పాశ్చాత్య చింతన'' రచనకు కారణమైంది.

సృజనాత్మక రచయితను కాలేకపోయినా ప్రజలకు ఉపయోగపడగల గ్రంథాలు రాశాననే సంతృప్తి మాత్రం నాకు కలిగింది. ఈ నాలుగు గ్రంథాలు రాయడానికి నేను పడిన అమితశ్రమ వృథాకాలేదనే సంతృప్తి కూడా నాకు మిగిలింది.

*ప్ర: మీలోని రచయిత మీకు ఇష్టమా? మీలోని జర్నలిస్ట్‌మీకు ఇష్టమా?*

జ: జర్నలిజం నా వృత్తి, నా జీవనోపాధి. అది ఇష్టంకాకుండా ఎలా వుంటుంది? జర్నలిజంద్వారా ఎంతో కొంత సాంఘిక బాధ్యతను నిర్వర్తించాననే తృప్తి నాకువుంది. అలాగే సంఘానికి ఉపయోగపడగలవని అనుకున్నకొన్ని గ్రంథాలు .రాశాననే తృప్తి కూడా నాకువుంది. అందుచేత నాలోని జర్నలిస్టు, రచయిత - ఇరువురూ నాకు ఇష్టులే.

*ప్ర:జర్నలిస్ట్‌గా చేసిన రచనలు మీకు సంతృప్తినిచ్చాయా?*

జ: నేను ఆంధ్రపత్రికలో 1948లో ప్రవేశించాను. ఆంధ్రజ్యోతినుంచి 1994లో రిటైర్ అయ్యాను. ఆ మధ్యకాలంలో నేను రాసిన అసంఖ్యాక వ్యాసాలలోను, సంపాదకీయాలలోనూ బాగా రాశానని సంతృప్తి ఇచ్చినవి ఎన్ని వుంటాయో, సాదాసీదాగా, మొక్కుబడిగా రాశానని అనిపించినవీ అన్ని వుంటాయి. రాసిన ప్రతిదీ బాగా రాయగలిగా నన్న స్వాతిశయం నాకు లేదు.

*ప్ర: మీకు ఏ రచయిత శైలి నచ్చుతుంది? ఎందుకని నచ్చుతుంది?*

జ: డెయిలీ జర్నలిజంలో నాకు నార్లవెంకటేశ్వరరావుగారి వచనశైలి ఇష్టం. సృజనాత్మక

సాహిత్యంలోనైతే నేను ఇష్టపడే రచయితలు చాలామందే వున్నారు. చాలా ఏళ్లక్రిందట కృష్ణాజిల్లా తేలప్రోలు నుంచి పాటిబండ మాధవశర్మగారు సంపాదకుడుగా ''వీణ'' మాసపత్రిక వచ్చేది. అందులోనే చలంగారు 'మ్యూజింగ్స్' శీర్షిక ప్రారంభించారు. నా చిన్నతనంలో చలం మ్యూజింగ్స్ ఎంత ఆసక్తితో చదివేవాడినో చెప్పలేను. నన్ను మొట్టమొదటగా ఆకట్టుకున్న వచన శైలి చలంగారిదే. ఇంకా తర్వాత రోజుల్లో కొడవటిగంటి కుటుంబరావుగారి కథనశైలి, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి తొలినాళ్ల కథలలోని వచనశైలి నేనుబాగా ఇష్టపడేవాడిని. అలాగే మహాకవులైన విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీగార్ల వచనశైలి అన్నా నేను చాలా ఇష్టపడతాను. నాకు మరీ మరీ నచ్చే వచనం రాసిన వారిలో ముళ్లపూడి వెంకటరమణగారు ఒకరు.

విశ్వనాథ, చలం భిన్న ధ్రువాల వంటి వారైనా తెలుగుప్రాంతపు ప్రకృతిని అంతగొప్పగా వర్ణించిన వారు మరిలేరు. ముఖ్యంగా 'ఏకవీర'లోని రచనశైలి, వేయిపడగలలోని ప్రకృతి వర్ణన ఘట్టాలు నాకు బాగా ఇష్టం. కుటుంబరావుగారి కథలలో అసలు ప్రకృతి వర్ణనే వుండదు. కానీ, మధ్యతరగతికి చెందిన వ్యక్తుల మనస్తత్వాలను, ముఖ్యంగా 1930ల నాటి ఆంధ్ర ప్రాంతపు జీవితాన్ని ఆయన తన రచనలలోబాగా పట్టుకున్నారు. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ ప్రధానంగా కవులు. కాని గొప్ప కవిత్వం రాసేవారు గొప్ప వచనంకూడా రాయగలరని వారు నిరూపించారు. కృష్ణశాస్త్రిగారి సంభాషణ, ఉపన్యాసాలు ఎంత ఆర్ద్రంగాను, ఎంత చమత్కార పూరితంగాను వుండేవో, వారి వ్యాసరచన శైలికూడా అంత ఆర్ద్రంగాను, అంతచమత్కార పూరితంగాను వుంటుంది. శ్రీశ్రీ కవిత్వంలోని శక్తి ఆయన వచనంలోను కనబడుతుంది. తెలుగులో అంత కోటబుల్ పొయిట్రీ రాసిన వాడు మరొకడులేడు. అలాంటివే వచనంలో ఆయన వాక్యాల కోటబిలిటీ, ''టర్న్ ఆఫ్ ఫ్రేజ్'' లక్షణాలు కూడా.

రావిశాస్త్రిగారు కవికావలసిన వాడు వచన రచయిత అయ్యారు. అంత కవితాత్మకమైన, శక్తిమంతమైన ప్రోజు రాసిన వాడు మరొకడు నాకు కనబడలేదు. రామరాను ఆయన ఉపమావ్యామోహం మితిమీరినప్పటికి, తొలినాళ్ల కథలశైలి ఎన్నటికి నన్ను ఆకర్షిస్తూనే వుంటుంది. ఇక ముళ్లపూడి వారి వచనంలోని హాస్యం, వ్యంగ్యం, శబ్ద చమత్కారం, మరీ ముఖ్యంగా పంచకళ్యాణి గుర్రం పరిగెత్తుతున్నట్టుండే ఆయన వచనంలోని ''రేసీనెస్'' అనితర సాధ్యం.

**ప్ర: జర్నలిస్ట్ సాహితీకారుడు కూడా అయితే అదనపు సౌలభ్యాలు ఏమిటి? ఇబ్బందులు ఏమిటి?**

జ: జర్నలిస్టులు స్వయంగా సృజనాత్మక రచనలు చేసి వుండనక్కరలేదు. కాని, కథలు, నవలలు మొదలైన ప్రక్రియలలో చేయి తిరిగినవారైతే సహజంగానే వారు మంచి వచనం రాయగలుగుతారు. అయితే స్వయంగా సాహిత్యకారులు కాకపోయినా, సాహిత్యాభిరుచి

వుండడం అవసరం. అంటే తెలుగులోని ప్రాచీన, నవీన సాహిత్యాలపట్ల ఆసక్తి, అభిరుచి కలిగి వుండాలి. నా ఉద్దేశంలో జర్నలిస్టుకు తెలుగు సాహిత్యమేకాదు. ప్రపంచంలో తెలుసుకోనక్కరలేని విషయమంటూ వుండరాదు. "I have taken all knowledge to be my province" అని ఫ్రాన్సిస్ బేకన్ అన్నాడు. అలాగే ప్రతి జర్నలిస్టు ప్రతి విషయంగురించి ఎంతో కొంతైనా తెలుసుకుని వుండాలి. అటువంటి ఎన్సైక్లోపీడిక్ నాలెడ్జి అతనికి వృత్తి నిర్వహణలో ఎంతో తోడ్పడుతుంది. ఇక జర్నలిస్టు సాహిత్యకారుడైతే మంచిదే. కాని, ప్రతి జర్నలిస్టు సాహిత్యకారుడు కానక్కరలేదు. సాహిత్యాభిరుచి, సాహిత్య పరిచయం తగుమాత్రంగావుండి, తన అవసరాలకు (అభిప్రాయ వ్యక్తీకరణకు) తగిన వచన శైలిని అలవరచుకుని, వివిధ విషయ పరిజ్ఞానాన్ని ఎప్పటికప్పుడు సంతరించుకుంటూ వుంటే మంచి జర్నలిస్టుగా రాణించవచ్చు.

*ప్ర: బాగా రాశాక వచ్చే సంతృప్తి ఎంతకాలం నిలుస్తుంది? ఆ సంతృప్తి మరో రచనకు ప్రేరణ అవుతుందా? గాప్‌కు దారితీస్తుందా?*

జ: రచయిత ఒక రచన చేసినప్పుడు అదిబాగా రాశాననే సంతృప్తి ముందుగా తనకే కలగాలి. కాని అది చాలదు. దానికి పాఠకుల నుంచి మంచి రెస్పాన్స్ రావాలి. అలా వచ్చిన రెస్పాన్స్‌వల్ల కలిగే సంతృప్తి ఎంతకాలమైనా నిలిచేవుంటుంది. అంతేకాదు. మరొక రచన చేయాలనే ప్రేరణకూడా కలిగిస్తుంది. ఉదాహరణకు నేను నా ఆంధ్రపత్రిక రోజులలో రాసిన టామ్‌సాయర్ వగైరా అనువాదాల సీరియల్స్‌కు పాఠకులనుంచి వచ్చిన రెస్పాన్స్ ఇంతా అంతాకాదు. ఆ రెస్పాన్స్ కారణంగానే శంభుప్రసాద్‌గారు నాచేత వరసగా అనేక అనువాదాలను రాయించి, వారపత్రికలో సీరియలైజ్ చేశారు. అలాగే మామూలుగా కథలకి, నవలల సీరియల్స్‌కి మాత్రమే ప్రాధాన్యం ఇచ్చే ఆంధ్రజ్యోతి వంటి వారపత్రికలో నా ''విశ్వరూపం'' వంటి వైజ్ఞానిక రచన సీరియలైజ్ అవుతుండగా దానికి వచ్చిన రెస్పాన్స్ చెప్పనలవికానిది. పాఠకులనుంచి వచ్చిన ఉత్తరాల పరంపరే దానికి సాక్ష్యం. చాలా మంది పాఠకులు తమ సందేహాలను తీర్చమంటూ ఉత్తరాలు రాసేవారు. ఒక ప్రక్క దిన పత్రికలో పనిచేస్తూ, మరొక ప్రక్క వారపత్రికలో ఏవారానికి ఆ వారం విశ్వరూపం సీరియల్ (వారానికి నాలుగైదు పేజీల చొప్పున) రాస్తూ, ఇంకా పాఠకుల సందేహాలకు సమాధానాలు రాయడం కుదరక ఆ బాధ్యతను కొడవటిగంటి కుటుంబరావుగారికి అప్పగించవలసి వచ్చింది. ఆయన నా పట్ల వాత్సల్యంతో వారంవారం (కొన్ని నెలలపాటు) సమాధానాలు రాసేవారు. ''విశ్వరూపం'' ఇచ్చిన ప్రోత్సాహంతోనే ''నరావతారం'' (మానవ పరిణామ శాస్త్రగ్రంథం) రాయ గలిగాను. అలాగే ''విశ్వదర్శనం'' రెండు సంపుటాలు కూడా.

*ప్ర: డెడ్‌లైన్స్ లేదా ఒత్తిళ్లు ఏరకమైనవైనా మంచి రచనకు ప్రతిబంధకాలా?*

జ: డెడ్‌లైన్ ప్రతిబంధకమవుతుందా కాదా అనేది రచయిత స్వభావాన్నిబట్టి వుంటుంది. కొందరు ఎంత వ్యవధి ఇచ్చినా బాగా రాయలేక పోవచ్చు. కొందరు ఎంత

అర్జంటుగా రాసినా అద్భుతంగా రాయవచ్చు. కొందరు ఎడిటర్లు ఆఖరి నిమిషందాకా రాస్తూనే గొప్ప సంపాదకీయాలు రాయగలుగుతారు. మరికొందరు తీరికగా వాక్యాలు చిత్రికపడుతూ మంచి సంపాదకీయాలు రాస్తారు. కాని సాధారణంగా జర్నలిస్టులకు వాక్యాలు చిత్రికపడుతూ కూర్చునేవ్యవధి, లేదా ఏంరాయాలి, ఎలా రాయాలి ఏ ఆలోచించుకుంటూ గడిపేవ్యవధి వుండదు. ఆలోచించడం, రాయడం దాదాపు ఒకేసారిగా జరిగిపోతూ వుండాలి. డెయిలీ జర్నలిజం చాలా అర్జంటు వ్యవహారం. కొందరికి ఆ అర్జెన్సీలో నుంచే ఎక్సలెన్స్ పుట్టుకొస్తుంది.

*ప్ర: సమర్థ భావవ్యక్తీకరణకు భాషా విషయకంగా జర్నలిస్ట్ చేయాల్సిన సాధన ఏమిటి?*

జ: ఇతర రచయితలకువలెనే పత్రికా రచయితలకు కూడా భాష అనేది ఒక పనిముట్టు, ఒక టూల్. దాన్ని ఎంత పదునుగా వుంచుకోగలిగితే, ఎంత నేర్పుతో ఉపయోగించుకోగలిగితే, అంత మంచి జర్నలిస్టులు అవుతారు. ఇందుకు చేయవలసిన సాధన ఒకే ఒకటి. నిరంతరం చదువుతూ వుండడం. ఇదీ అదీ అనికాదు, పత్రికలు, పుస్తకాలు ఏవి పడితే అవి చదవడం. తెలుగులో గొప్ప వచనం రాసినవారు అనేకులున్నారు. వారిని చదవాలి. వారి శైలిలోని గొప్పదనాన్ని గ్రహించి, ఎవరికివారు సొంతశైలి అంటూ ఒకదాన్ని రూపొందించుకోవాలి. చెప్పవలసిన విషయం అంటూ ఒకటి వుంటే, దానికి తగిన శైలి దానంతట అదేవస్తుంది. తెలుగు జర్నలిస్టులు తెలుగు పత్రికలు, పుస్తకాలేకాదు, ఇంగ్లీషు పత్రికలు, ఇంగ్లీషు సాహిత్యం కూడా బాగా చదవాలి.

*ప్ర: తెలుగు పత్రికల్లో కవిత్వధోరణులను మీరు సమర్థిస్తారా? వ్యతిరేకిస్తారా?*

జ: వార్తా రచనకు సంబంధించినంతవరకు పత్రికలలో కవిత్వభాష అనవసరం, అవాంఛనీయం. శుభ్రంగా మామూలు మాటలలో, అంటే అన్ని స్థాయిల పాఠకులకు సులభంగా అర్థమయ్యే సరళభాషలో వార్తలు రాయాలి. అయితే, సందర్భాన్నిబట్టి భాషను కాస్త ఉదాత్తం చేయవచ్చు. పత్రికలకు వ్యాసాలు రాసేటప్పుడు మామూలు వార్తలలోకంటె కాస్త భిన్నమైన శైలిలో రాయవచ్చు. సాహిత్య, తదితర సాంస్కృతిక రంగాలపై వ్యాసాలను మరికాస్త ఉదాత్తశైలిలో రాయొచ్చు. ఏమైనా సందర్భోచితమైన శైలిని అవలంబించాలి. పాండిత్య ప్రకర్ష పనికిరాదు. అయిన దానికి, కానిదానికి కవితాధోరణి పనికిరాదు.

*ప్ర: వ్యావహారిక భాషాప్రాముఖ్యంలో తెలుగుపత్రికలు తమ పాత్రను దిగ్విజయంగా పోషిస్తున్నాయా?*

జ: వ్యావహారిక భాషను వ్యాప్తిలోకి తీసుకురావడంలో పత్రికలది అత్యంత ప్రముఖ పాత్ర. ఆ పాత్రను అవి కొద్దిపాటి మినహాయింపులతో చక్కగా నిర్వహిస్తున్నాయి. ఆ మినహాయింపు లేమిటంటే, అపశబ్దాలను వాడడం, వాక్యనిర్మాణం సుబోధకంగా లేకపోవడం, వ్యాకరణ విరుద్ధంగా వుండడం, వైరి సమాసాలను విరివిగా రాయడం, ఇంగ్లీషు

నుంచి తర్జుమా చేయడంలో తెలుగు నుడికారాన్ని పాటించకపోవడం, తప్పుగా తర్జుమాచేయడం, అనవసరంగా పెద్దపెద్ద ఇంగ్లీషు మాటల్ని వాడడం వంటి సందర్భాలు పత్రికలలో చాలా తరుచుగా కనబడుతూ వుంటాయి. చక్కని వాడుకభాష రాయడంలో పత్రికా రచయితలకు శిక్షణ ఇవ్వడం చాలా అవసరం.

*ప్ర: పత్రికా భాష ప్రమాణీకరణ కోసం జరుగుతున్న కృషిపై మీ అంచనా?*

జ: తెలుగు పత్రికా భాషను ప్రమాణీకరించడానికి ఏమికృషి జరుగుతున్నదో నాకు తెలియదు. ఒక్కొక్క పత్రిక ఒక్కొక్క విధమైన భాషా విధానాన్ని అనుసరిస్తున్నది. ముఖ్యంగా ఇంగ్లీషు మాటలను తెలిగించడంలోచాలా వైవిధ్యం, వైరుధ్యం కనిపిస్తున్నది. ఈ విషయంలో అన్ని పత్రికలు కూడబలుక్కుని ఒకే తెలుగు అనువాద పదాలను ఉపయోగించడానికి ప్రయత్నించడం మంచిది. కాని, అది ప్రస్తుతం సాధ్యం కాని పనిగా తోస్తున్నది.

*ప్ర: కాలంచెల్లిన అక్షరాలు, పదాలను మీరు ఇంకా వాడాలంటున్నారేం? కారణమేమిటి?*

జ: 'ఋ' అనే అక్షరంపై నాకు పట్టుదల వున్నమాట నిజమే. దానికి కాలం చెల్లిందంటే నేను అంగీకరించ లేను. దాని అవసరం తీరిందనిగాని, దాన్ని నిషేధించాలనిగాని ఎవరైనా అన్నప్పటికీ నేను ఒప్పుకోను. అలు, అలూలకు, బండి ఱకు కాలం చెల్లిందేమోగాని, ఋ, ౠలకు చెల్లలేదు. వార్తాపత్రికలలో ఋణం బదులు రుణం అని, ఋజువర్తన బదులు రుజువర్తనఅని, ఋషిబదులు రుషి అని, ఇత్యాదిగా ''ఋ'' బదులు ''రు'' కనబడినప్పుడల్లా నాకు చివుక్కుమనిపిస్తుంది. ''ఋ''కు కాలం చెల్లిందనేవారు కూడా హృదయం, కృష్ణుడు, సంతృప్తి, తృష్ణ, మాతృభూమి, పితృదేవతలు, కృశించు అని ఇంకా రాస్తున్నారుతప్ప, హ్రుదయం, క్రుష్ణుడు, సంత్రుప్తి, త్రుష్ణ, పిత్రుదేవతలు, మాత్రుభూమి, క్రుశించు ఇత్యాదిగా రాయడంలేదే? ఈ మాటలలో ''ఋ''కారం ఇంకావాడుతున్నారుకదా? ''ఋ''ను నిషేధిస్తే వీటి స్పెల్లింగులు కూడా మార్చాలికదా? అసలు తెలుగులిపిని ఇలా ఎందుకు ఖూనీ చేయాలిట? అలు, అలూలను, బండి ఱ ను వదలివేసినా, అనవసరంగా మనం పరిత్యజించిన చ, జలను రాయడంలోను, అచ్చులోను పునరుద్ధరించాలని, అది అవసరమని నేను అభిప్రాయపడుతున్నాను.

*ప్ర: మీరు మౌలికంగా జర్నలిస్టా? సాహితీవేత్తా?*

జ: కడచిన ఏభయ్యేళ్లలో దినపత్రికలలోను, వార, మాసపత్రికలలోను పనిచేశాను. ఆంధ్రజ్యోతివంటి ప్రముఖ దినపత్రికకు 18 ఏళ్లు ఎడిటరుగా పనిచేశాను. అలాగే కొంతకాలం కవిత్వంరాశాను. కొన్ని అనువాదాలుచేశాను. కొన్నివైజ్ఞానిక, తాత్విక గ్రంథాలు రాశాను. మరి నేను మౌలికంగా జర్నలిస్టునో, సాహితీవేత్తనో నిర్ణయించే బాధ్యత మీదే.

జర్నలిస్టు అంటే ఒక్క సమకాలిక రాజకీయాల మీద మాత్రమే ఆసక్తికలవాడై వుండాలని మీ నిర్వచనం అయితే, నేను జర్నలిస్టును కానేమో. ఎందుకంటే సమకాలిక రాజకీయాలతోపాటు అనేక ఇతర విషయాలమీద కూడా నాకు ఆసక్తివుంది.

*ప్ర: జీవితంపట్ల మీ దృష్టికోణం ఏమిటి?*

జ: హెగెల్‌ను ఎవరో అడిగారట - ''ఇంతకీ మీ తాత్విక దృక్పథం ఏమిటీ'' అని. దానికి సమాధానంగా హెగెల్ వరసగా పది బృహత్సంపుటాలు రాశాడట. అలాగే నేనుకూడా నా జీవిత దృక్పథం ఏమిటీ'' అని అడిగితే ఒకముక్కలో సమాధానం చెప్పలేను. ఒక పుస్తకం రాయాలి. దాని కోసమే ''విశ్వదర్శనం'' మూడవ భాగం రాయాలనుకుంటున్నాను.

*ప్ర: ప్రముఖ సాహితీవేత్తలతో మీ అనుభవాలు ? ఇంప్రెషన్స్ ?*

జ: జర్నలిస్టును కనుక, దాదాపు 50 ఏళ్లపాటు పత్రికలలో పనిచేశాను కనుక రచయితలలో రెండుమూడు తరాలవారితో నాకు వ్యక్తిగత పరిచయానికి అవకాశం కలిగింది. నేను ఆంధ్రపత్రికలో పనిచేసే రోజులలో కొడవటిగంటి కుటుంబరావు, తెన్నేటి సూరి, పిలకా గణపతిశాస్త్రి, ముళ్లపూడి వెంకటరమణ, విద్వాన్ విశ్వం, తిరుమల రామచంద్ర, వేటూరి సుందరరామమూర్తి వంటి ప్రముఖులు నాకు కొల్లీగ్స్. ఆంధ్రపత్రిక కార్యాలయానికి (తంబుచెట్టి వీథి) వివిధ ఆంధ్రప్రాంతాలనుంచి ఎందరెందరో సాహిత్య వేత్తలు తరుచుగా వస్తూపోతూ వుండేవారు. రాయప్రోలు సుబ్బారావు, నోరి నరసింహశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి, అడివి బాపిరాజు, మునిమాణిక్యం నరసింహారావు, శివశంకరస్వామి ఇలా ఎందరినని పేర్కొనగలను? ఇక మద్రాసులోనే వుండే కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, ఆరుద్ర, అనిశెట్టి, పింగళి నాగేంద్రరావు, సముద్రాల, రజని, బుచ్చిబాబు, ఆచంట జానకిరామ్, బాపు వంటి వారితో పరిచయాలు కలిగే అవకాశం కూడా నాకు కలిగింది. ఆంధ్రజ్యోతికి మారిన తర్వాత 1960లనుంచి మరెందరో ప్రఖ్యాత రచయితలు - రాచకొండ విశ్వనాథశాస్త్రి, చాగంటి సోమయాజులు, కాళీపట్నం రామారావు వంటివారు - పరిచయమయ్యారు. నేను అసలు చూడనివారు, చూడలేకపోయానే అని నేను విచారించేవారు ఇద్దరే ప్రసిద్ధ రచయితలున్నారు. ఒకరు చలం, మరొకరు అబ్బూరి రామకృష్ణారావు. అలాగే అన్నేళ్లు విజయవాడలో వున్నా, నేను సన్నిహితంగా వెళ్లలేకపోయిన మరొక మహారచయిత విశ్వనాథ. అదికూడా నాకు తరుచుగా లోటు అనిపిస్తూ వుంటుంది. ఏమైనా ఇంతకుముందు చెప్పినట్టు నాకు రెండుమూడు తరాల ప్రముఖ రచయితలతో పరిచయభాగ్యం కలగడం నా అదృష్టంగా భావించుకుంటూ వుంటాను.

# ఇప్పుడు
# పత్రికా నిర్వహణ
# ఓ సమాచార వ్యాపారం



శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుతో
ఇంటర్వ్యూ

జగమెరిగిన జర్నలిస్ట్ శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు. *1934* ఫిబ్రవరి *8*వ తేదీన గుంటూరు జిల్లా పొత్తూరులో జన్మించారు. గుంటూరు హిందూ కాలేజిలో ఇంటర్, ఎ.సి.కాలేజీలో బి.ఎస్.సి. చదివారు. *1957* డిసెంబర్ లో శ్రీ కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం సారధ్యంలో ఆంధ్రజనతలో జర్నలిజానికి శ్రీకారం చుట్టారు. *1964* మేలో ఆంధ్రభూమిలో చేరి, *1975* వరకూ అక్కడ న్యూస్ ఎడిటర్‌గా వున్నారు. ఈ మధ్యకాలంలోనే రేడియోలో వార్తలు కూడా చదువుతుండేవారు. *1975* ఫిబ్రవరి నుంచి *1977* మే వరకు ఈనాడు ఎడిటర్‌గా పనిచేశారు. ఆతర్వాత *1980* వరకూ ఆంధ్రప్రభ రెసిడెంట్ ఎడిటర్‌గా వున్నారు. *1982*లో వీక్లీ, దినపత్రికల రెంటి సారధ్యాన్ని చేపట్టారు. *1991*లో ఆంధ్రప్రభ నుంచి పదవీ విరమణ చేశారు. *1993* జూన్‌లో ఉదయం చీఫ్ ఎడిటర్‌గా చేరి *1994* జూన్‌లో రాజీనామా చేశారు. శ్రీ పొత్తూరి జర్నలిజం రంగంలో చేసిన కృషికి గుర్తింపుగా అనేక సంస్థలు ఆయనను అవార్డులతో సత్కరించాయి. జి.ఎన్.రెడ్డి అవార్డు, హార్మోని అవార్డు, మాలతి ట్రస్ట్ అవార్డు వాటిలో కొన్ని. తెలుగు ప్రజల వర్తమాన రాజకీయ చరిత్రను (*1947* నుంచి ఇప్పటివరకూ) శ్రీ పొత్తూరి ప్రస్తుతం రచిస్తున్నారు. పంచెకట్టినా, తెల్లని ప్యాంటు, చొక్కా ధరించినా చూపరులను ఆకట్టుకునే ప్రత్యేకత శ్రీ పొత్తూరి సొత్తు. అరమరికలు లేకుండా, తటపటాయింపులు లేకుండా సూటిగా, స్పష్టంగా తన అభిప్రాయాలను వ్యక్తం చేశారు ఈ ఇంటర్వ్యూలో.

ప్ర: స్వాతంత్ర్యోద్యమకాలంలో పత్రికల సంపాదకీయాలు ప్రజలకు స్ఫూర్తిదాయకాలుగా నిలిచాయి. ఇప్పుడు అనేక సామాజిక అంశాలపై రాస్తున్న సంపాదకీయాలు ఎందుకని అంతగా ప్రభావితం చేయడంలేదు?

జ: పత్రికల ప్రచురణ లక్ష్యాలు మారిపోయాయి. ఒకప్పుడు చాలా పత్రికలు స్వాతంత్ర్యోద్యమానికి చేయూత నివ్వటానికి స్థాపించినటువంటివి. ఇప్పుడు పత్రికా నిర్వహణ అనేది 'సమాచార వ్యాపారం'. కేవలం వ్యాపార దృష్టితోటే పత్రికలను నిర్వహిస్తున్నారు. ఉద్యమాలకోసం ఏర్పడిన పత్రికలంటూ ఇప్పుడు లేవు కనుక ఉద్యమ స్ఫూర్తి ఎక్కడినుంచి వస్తుంది? సంపాదకీయాలద్వారా ఉద్యమాలను సమర్థించడం, సమర్థించకపోవడం అనేది ఆపత్రికా యాజమాన్యం ప్రయోజనాలకు ఎంతమటుకు అనుగుణం అనేదాన్నిబట్టి ఉంటుంది.

పత్రికల్లో వార్తల ప్రచురణ ఉద్యమానికి బలంచేకూర్చిన సందర్భాలున్నాయి. బలమంటే ప్రజలలో చైతన్యం తీసుకురావటంకాదు. ప్రభుత్వ విధానాన్ని ప్రభావితం

వేయడం. ఇందుకు 1993-94లో వచ్చిన మద్య నిషేధ ఉద్యమాన్ని ఉదహరించవచ్చు. పత్రికల్లో వచ్చిన ఉద్యమ ప్రాచుర్యం ప్రభుత్వ విధానాన్ని ప్రభావితం చేయగలిగింది. కానీ ప్రజలలో చైతన్యాన్ని పెంచలేదు. ఈ విషయంలో కూడా సంపాదకీయాల పాత్ర దాదాపు లేదనే చెప్పాలి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత 1967-1972 మధ్యకాలంలో వచ్చిన ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలలో సంపాదకీయ ప్రభావం బొత్తిగా లేకపోవడం ఇందుకు మరో ఉదాహరణ. ప్రజలు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ వార్తలకోసమే పత్రికలను చదివారు. పత్రికల విధానం ఏమిటి, సంపాదకీయంలో ఏంరాశారు. అన్న అంశాలను పట్టించుకోలేదు. కనుక స్వాతంత్ర్యానంతరం సంపాదకీయాలకు ప్రజలను ప్రభావితం చేసే లక్షణం తగ్గిపోయింది. మహాఅయితే సంపాదకీయంలో ఏమి రాశారని చూశారేమోకానీ అభిప్రాయం మార్చు కున్నవారు లేరనే చెప్పవలసి ఉంది.

*ప్ర: ఒకప్పుడు పత్రికలు ఉద్యమాలను నడిపించాయి. ఇప్పుడు ఉద్యమాలే పత్రికలను నడిపిస్తున్నాయి. ఎందుకొచ్చిందీ తేడా?*

జ: అప్పట్లో ప్రజల ముందు లక్ష్యం ఉండేది. ఇప్పుడు జాతికి సమష్టి లక్ష్యాలంటూ లేవు. లక్ష్యాలంటూ ఉంటే అవన్నీ వైయక్తికమైనవే. జాతికి లక్ష్యం ఇవ్వాలనే ప్రయత్నం కూడా ఎవరూ చేయడంలేదు. ఇప్పుడు నాయకులను ప్రజలే నడిపిస్తున్నారు. ఓటర్లకు ఏది ఉపయోగమో నాయకులు చూడటంలేదు. ఓట్లు రాబట్టుకోవటానికి ఏది ఉపయోగమో చూస్తున్నారు. ఈ పరిస్థితిని మార్చటంలో పత్రికలు చేసిందేమీ లేదు.

*ప్ర: గత అర్ధశతాబ్ది కాలాన్ని పరిశీలిస్తే పత్రికారంగం అనేక మార్పులకు లోనవుతూ వచ్చింది. భాషా విషయం దగ్గర్నుంచీ రిపోర్టింగ్‌దాకా అనేక మార్పులు వచ్చాయి. ఈ మార్పుల ప్రక్రియ పరిణతిదశకు చేరుకుందంటారా? భవిష్యత్తులో ఇంతకంటే జరగాల్సిన కృషి ఏమైనా ఉందా?*

జ: భాషకు సంబంధించినంతవరకూ ఒకప్పటికంటే ఇప్పుడు ఎక్కువ పదాలు వాడుకలోకి వచ్చాయి. వార్తలలో వాక్యాలు పదునుగా కూడా ఉంటున్నాయి. కానీ చాలా సందర్భాల్లో పద ప్రయోగ లోపాలు కన్పిస్తున్నాయి. కొన్ని పదాలు అర్థాలు మార్చుకుని వాడుకలోకి వస్తున్నాయి. ఉదాహరణకు అధిగమించి అంటే దాటటం అనే అర్థంలో పత్రికల్లో రాస్తున్నారు. కానీ శబ్దరత్నాకరం ప్రకారం దీనికి అర్థాలు - చదువు, పొందు, లాభం.

రిపోర్టింగ్ రెండురకాలుగా ఉంది. కొన్ని చాలా మంచి రిపోర్టులు. మనిషిలో మానవత్వాన్ని జ్వలింపచేసే, చలింపచేసే వార్తలు వస్తున్నాయి. కానీ ప్రజాసమస్యలకు సంబంధించిన వార్తలలో లోతు కన్పించడంలేదు. లోతుకుపోయి కారణమేమిటో చెప్పలేక పోతున్నాం. కనీసం ఆ రకమైన ప్రయత్నం కూడా జరగడం లేదు. ఆయా పత్రికల విధానాలకు అనుగుణంగా వార్తలకు రంగుపులమడంకూడా కన్పిస్తోంది. సత్యనిష్ఠ తగ్గింది.

పరిశోధనాత్మక వార్తల ప్రచురణకు ఎన్నో అవకాశాలున్నా వాటిని జర్నలిస్టులు - కారణమేదైనా - ఉపయోగించుకోవడం లేదు. ఈ పరిస్థితులను మార్చటానికి ప్రయత్నపూర్వకంగా చేయటానికేంలేదు. పత్రికా వ్యవస్థను ప్రజలు నిలదీసే రోజువస్తుంది.

*ప్ర: సంపాదకీయాన్ని అనుభవజ్ఞుడైన సంపాదకుడే రాస్తాడనే అభిప్రాయం ఒకప్పుడు వుండేది. ఇప్పుడు ఎవరికైనా శిక్షణ ఇప్పించికూడా సంపాదకీయం రాయించవచ్చనే పరిస్థితి ఏర్పడింది. శిక్షణతో సంపాదకులను తయారు చేయవచ్చా? సంపాదకీయాలు రాయించ వీలుందా?*

జ: అభిప్రాయాల కోసం ప్రజలు సంపాదకీయాలు చదవనపుడు ఎవరు రాస్తే ఏమిటి? కన్విక్షన్‌తో రాసే సంపాదకీయాలు కావలసి వచ్చినపుడు సంపాదకుడి వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. సిద్ధాంతాలు, సైద్ధాంతిక బలం కలిగిన విశ్వాసాలు లేనపుడు సంపాద కీయాలు ఎవరు రాసినా ఒకటే.

*ప్ర: చదువరులు తక్కువగావున్న మన రాష్ట్రంలో పత్రికలు ప్రజాభిప్రాయాన్ని మలచ గలుగుతున్నాయా?*

జ: పత్రికలు ప్రజలను ప్రభావితం చేయడం అంటే - ప్రతి వ్యక్తినీ పత్రిక ప్రభావితం చేయడంకాదు. ప్రజల ఆలోచనల్లో మార్పు తెచ్చే వర్గం ఒకటి ఎప్పుడూ ఉంటుంది. జన బాహుళ్యంలోకి వెళ్లి వివిధ వర్గాలతో మాట్లాడి ప్రభావితం చేసే వారిని పత్రికలు ప్రభావితంచేస్తే అది జన సామాన్యాన్ని కూడా ప్రభావితం చేస్తుంది. ఇప్పటికీ అది పరిమితంగానే జరుగుతోంది.

*ప్ర: సమాజ కల్యాణానికి ఉపయోగపడే కార్యక్రమాల్లో సైతం విలువలకు నిబద్ధుడైన ఓ వ్యక్తి ఇచ్చే పిలుపుకంటే ఏ విలువలకూ అంకితంకాని ఓ సినిమా హీరో పిలుపు ఎక్కువ ప్రభావం చూపుతోంది. ఎందుచేత?*

జ: సినిమా హీరోవచ్చాడని జనం రావచ్చేమో కానీ అతడేదో గొప్ప విషయాలు చెబుతాడని కానీ, చెప్పింది విని ఆచరించాలని కానీ జనం అనుకోవడంలేదు. తెరమీద చూసే సినిమా నటుడిని ప్రత్యక్షంగా చూడటం ఒక సరదా. అంతకు మించి సినిమా నటుడి ప్రత్యేకత లేదు. స్వాతంత్ర్య ఉద్యమంలో పనిచేసిన త్యాగధనుల విషయం వేరు. వారేదైనా చెబితే జనం మనసుపెట్టి వినేవారు. చెప్పిన మాటలకు విలువ ఇచ్చేవారు.

*ప్ర: పత్రికా యజమానుల జోక్యం పెరిగిపోయిన ప్రస్తుత పరిస్థితుల్లో ఎడిటర్ పాత్ర ఏమిటి?*

జ: సంపాదకుడికి స్వేచ్ఛ అనే దాని గురించి మాట్లాడుకోనక్కరలేదు. అది ఇప్పుడు చాలా అరుదు. సంపాదకుడి స్వేచ్ఛను ఆదర్శం అంటున్నారు. కనుక యజమానులు తామే సంపాదకులమని ప్రకటించుకుంటున్నారు. దీంతో పత్రిక వాణిజ్య ప్రయోజనాలు,

సంపాదకుడి ప్రయోజనాలు ఒకటే అయ్యాయి. ప్రయోజనాల మధ్య సంఘర్షణ ప్రసక్తేలేదు. ఈ వాతావరణంలో ప్రొఫెషనల్ జర్నలిస్ట్ మూర్తిమత్వానికి స్థానం లేదు.

*ప్ర: ఓ వార్తా సీరియల్‌ను అర్థంతరంగా ప్రచురణను నిలిపివేయాల్సి రావడంతో మీరు 'ఉదయం' నుంచి రాజీనామా చేశారు. ఈ రాజీనామాకు ప్రోది చేసిన కారణాలేమిటి? మీరు నలభైలలో వుంటే ఈ నిర్ణయాన్ని తీసుకోగలిగే వారా?*

జ: అదృష్టవశాత్తూ నలభైలలో నాకు ఇటువంటి పరిస్థితి ఎదురుకాలేదు. అప్పట్లో ఆంధ్రప్రభలో పూర్తిస్వేచ్ఛ ఉండేది. రామ్‌నాథ్ గోయెంకా నాతో ఏకీభవించని పరిస్థితులు వుంటే వుండవచ్చు. కానీ ఏనాడూ ఆయన ఫలానా వార్త ఎందుకు ప్రచురించారని అడగలేదు. ప్రచురించినందుకు బయటకు వెళ్లమని అడిగే ప్రసక్తి అసలే రాలేదు. వార్తలు, ఎడిటోరియల్స్‌లో గోయెంకా ఎన్నడూ జోక్యం చేసుకోలేదంటే నమ్మటం కష్టమేమో కానీ అది అక్షర సత్యం.

'ఉదయం'లో వార్త రాకుండా ఆపటానికి బయటినుంచి ఒత్తిడి రావటంతో రాజీమామా చేశాను. సత్యాన్ని ప్రచురించటానికి పత్రికలు భయపడకూడదు. అందులో విఫలమైతే సమాజానికి మోక్షంలేదు. సత్యనిష్ఠ విషయంలో రాజీపడకూడదన్నది నా ప్రగాఢ విశ్వాసం. వార్తల విషయంలో యజమాని ప్రయోజనాలు, సంపాదకుడి వ్యక్తిగత ప్రయోజనాలు పరిగణనలోకి తీసుకోకూడదు. ఎడిటర్ వ్యక్తిగత ప్రయోజనాలకు విఘాతం కలిగినా వార్త ప్రచురించి తీరాల్సిందే.

*ప్ర: ఆ వార్తా ప్రచురణకు మీరు గ్రీన్ సిగ్నల్ ఇచ్చారా? పర్యవసానాలను కూడా ముందే ఊహించారా?*

జ: నేను గ్రీన్ సిగ్నల్ ఇచ్చాకే ఆ వార్త ప్రచురణ మొదలైంది. నిజానికి ఆవార్తలో రిపోర్టర్‌రాసిన లీడ్ బాలేదనిపించి నేను రీడ్రాఫ్ట్ చేశాను కూడా. పర్యవసానాలకు సిద్ధపడే వార్త ప్రచురణకు అనుమతి ఇచ్చాను. ఈ విషయంలో పూర్తినైతిక బాధ్యతను నేనొక్కడినే తీసుకున్నాను. సహచర ఉద్యోగులు కొందరు కూడా రాజీనామా చేస్తానన్నా వారించాను.

*ప్ర: మీ రాజీనామా నిర్ణయం సబబేనని ఇప్పటికీ భావిస్తున్నారా?*

జ: సబబేనని విశ్వసిస్తున్నాను. ఆత్మ సంతృప్తిని మించిందేముంటుంది?

*ప్ర: ఇటువంటి పరిస్థితుల్లో పరిశోధనాత్మక జర్నలిజానికి స్కోప్ ఏమిటి?*

జ: తెలుగులో పరిశోధనాత్మక వార్తలకు చాలా అవకాశాలు ఉండేవి. కారణాలేమైనాసరే అలాంటి అవకాశాలను మనం ఉపయోగించుకోలేక పోతున్నాం. ఉదాహరణకు ప్రభుత్వ కార్యాలయాల్లో అవినీతి ఉన్నదని మనలో చాలామందికి అనుభవమే. అది ప్రజలను ఎంత బాధిస్తున్నదో జర్నలిస్టులమైన మనకూ తెలుసు. కానీ మనం ఎక్స్‌పోజ్ చేయలేకపోతున్నాం

సరైన సాక్ష్యాధారాలు లభ్యంకాకపోవడం అందుకు కారణం. కోర్టుల చుట్టూ తిరగవలసి వస్తుందన్న భయం మరో కారణం.

*ప్ర: తెలుగులో నాలుగయిదు ప్రముఖ పత్రికలువున్నా ఒక్క 'ఈనాడు' మాత్రమే సర్క్యులేషన్ పరంగా బాగా పుంజుకోవటానికీ, మిగతా పత్రికలు వెనకబడి పోవటానికి కారణమేమిటి? ఓ పత్రిక విజయానికీ సర్క్యులేషన్‌కూ బాటవేసే కారణాలు ఏమిటి?*

జ: ఏపత్రిక విజయానికైనా సర్క్యులేషన్ కొలబద్ద. ఆవిధంగా 'ఈనాడు' విజయం సాధించింది. ఈ విజయానికి ప్రధాన కారణాలు నిర్వహణా సామర్థ్యం. వ్యాపార దక్షత.

*ప్ర: రిపోర్టర్లను సొంత ప్రయోజనాలకోసం పత్రికా యాజమాన్యాలు ఉపయోగించుకోవడం అనేది ఈమధ్య పెరిగిపోయింది. దీనివల్ల సమాచారాన్ని అందించే ప్రధాన వృత్తి ధర్మానికి విఘాతం ఏర్పడటంలేదా?*

జ: దీనికి పరిష్కారం ఏమీలేదు. జర్నలిస్టులకు స్వేచ్ఛలేనపుడే ఇవన్నీ పెరుగుతాయి. ఇతర ప్రయోజనాలులేకుండా కేవలం పత్రికలు నడపటమే పరమోద్దేశంగా పెట్టుకుంటే సత్యనిష్ఠ సాధ్యమవుతుంది.

*ప్ర: ఒకనాటి పత్రికా విలువలకూ ఈనాటి పత్రికా విలువలకూ తేడా ఏమిటి?*

జ: ఒకప్పుడు జర్నలిజంపై అభిరుచితో, అభిమానంతో కొన్ని ఆదర్శాలు పెట్టుకుని వృత్తిలోకి వచ్చేవారు. ఇప్పుడు అది తగ్గిపోయింది. అదే తేడా. ఇతర వృత్తుల మాదిరే ఇదీ ఓ వృత్తి. వృత్తిపరమైన టాలెంట్ ఇంగ్లీషు పత్రికల్లో పెరుగుతోంది. వార్తల ప్రజంటేషన్ చాలా చక్కగా వుంటోంది. అయితే కన్విక్షన్‌కూ దీనికీ సంబంధంలేదు.

*ప్ర: ఇప్పటి రిపోర్టింగ్ ఈ కాలమాన పరిస్థితులకు సరితూగుతుందా? ఏమైనా మార్పులు తేవలసి ఉందా?*

జ: నలభైలలో అయినా యాభైలలో అయినా తొంభైలలో అయినా రిపోర్టింగ్ ప్రిన్సిపుల్స్ ఒక్కటే. అవి మార్పులకు లోనుకావు. ఆబ్జెక్టివిటీ అనేది మార్పులకు లోనయ్యేదికాదు.

*ప్ర: రాజకీయ నాయకులు తరచూ మాటమారుస్తున్నారు. తాము అలా అనలేదంటున్నారు. రిపోర్టర్లు సరిగానే రిపోర్ట్ చేసిన సందర్భాల్లోనూ రాజకీయ నాయకుల ఖండనలను ప్రచురించాల్సివస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో పత్రికా సంపాదకులు సమష్టిగా చేయవలసింది ఏదైనా ఉందా?*

జ: జర్నలిస్టులలో 'కలెక్టివ్ కాన్షస్' జాగృతం కావడంలేదు. పంజాబ్‌లో ఒకే సంస్థకు చెందిన 57మంది జర్నలిస్టులను చంపేశారు. తమ వృత్తికి సంబంధించిన ఇంత ఘోరం

జరుగుతున్నప్పుడు మనందరిలో రావలసిన స్పందన రాలేదు. అలాంటిది ఎప్పటికి వస్తుందో కానీ వచ్చే వరకూ పరిస్థితి ఇంతే.

*ప్ర: మహిళలకు పత్రికారంగంలో ప్రాతినిధ్యం పెంచడంద్వారా మహిళలపట్ల వివక్షను రూపుమాపవచ్చనే అభిప్రాయం ఉంది. మహిళా జర్నలిస్ట్‌ల సంఖ్య పెరిగినంత మాత్రాన మహిళాభ్యుదయం జరుగుతుందా?*

జ: స్త్రీ, పురుష సంబంధాల విషయంలో సమాజదృష్టి మారలేదు. నైట్ డ్యూటీలు వుండే వృత్తుల్లో ఆడపిల్లల జాగ్రత్త అంశం ఒకటుంది. కానీ ఈ ఒక్క కారణంగా ఆడపిల్లల్ని అనర్హులుగా తోసేయకూడదు. అభిరుచి, సామర్థ్యం విషయాల్లో స్త్రీలూ సమానంగా రాణించగలరు. విధి నిర్వహణలో ఏ ఇబ్బందీ ఉండదు. చాలా దేశాల్లో చూశాను. స్త్రీలు జర్నలిజంలో పురుషులతో సమానంగా రాణిస్తున్నారు. మనదేశంలోనూ స్త్రీలలో టాలెంట్‌కు కొదవలేదు. స్త్రీలు జర్నలిజంలోకి వస్తేనే మహిళాభ్యుదయం సాధ్యమవుతుందని నేను అనుకోవడంలేదు. జర్నలిజంలో స్త్రీలు లేకపోతే మహిళాభ్యుదయాన్ని సాధించకూడదా? స్త్రీలు జర్నలిజంలోకి రావడంవేరు. మహిళాభ్యుదయం వేరు. రెండూ అవసరమే. కానీ ఆ రెంటికీ లంకె పెట్టకూడదు.

*ప్ర: టీవీ చానెల్స్ విస్తరణ కారణంగా ఎదురైన పోటీని తట్టుకోవటానికి తెలుగు పత్రికలలో మార్పులు అవసరమా?*

జ: పత్రికల ధర పెరగడంవల్లా, టీవీ, రేడియోలు అందుబాటులోకి రావడం వల్లా పత్రికల మీద ఖర్చుపెట్టకున్నా నష్టంలేదనే అభిప్రాయం జనసామాన్యంలో కలుగుతోంది. ఆ రకంగా పత్రికల సర్క్యులేషన్లపై ప్రతికూల ప్రభావం చూపుతోంది. కానీ టీవీ, రేడియో వార్తలువేరు. పత్రికల్లో చదివిన సంతృప్తి వాటిలో కలగదు. టీవీ పోటీ దృష్ట్యా పత్రికల్లో కొన్ని మార్పులు అవసరమే. వివరాలతో, విశ్లేషణలతోకూడిన వార్తలు ప్రచురించటం ఇలా అవసరమైన ఒకమార్పు. ఫోటో జర్నలిజంలో చాలా అభివృద్ధి వస్తోంది. అర్థవంతమైన ఒక మూడ్ క్యాచ్ చేసిన ఫోటో ప్రజల మనసుపై చెరగని ముద్రవేయగలదు. టీవీ లో ఒక ఫ్లాష్‌గా మాత్రమే కన్పించినపుడు అదే దృశ్యం ప్రజలను అంతగా ప్రభావితం చేయలేక పోవచ్చు. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటివి అన్నీ దృష్టిలో పెట్టుకుని అవసరమైన మార్పులు చేయవలసి వస్తుంది.

*ప్ర: ఫారిన్ మీడియా ప్రవేశం మంచిదేనా?*

జ: అవకాశాలు సమానంగా వుంటే ఫారిన్ మీడియావల్ల మంచే జరుగుతుంది. కానీ చెడు ఉండదు. ప్రతిభ విషయంలో మనం ఎవరికీ తీసిపోం. కానీ మనకు తక్కువ, వారికి ఎక్కువ అవకాశాలు వుండకూడదు. ఇందులో భయపడవలసినదేమైనా వుంటే విదేశీ సంస్థలకు రిసోర్సెస్ ఎక్కువవుండి మనం వెనకబడి పోతామని మాత్రమే.

*ప్ర: వినియోగదారుల వివాదాల స్టేట్ కమిషన్‌లో మీరు సభ్యులుగా పనిచేశారు గదా! అందులో మీ అనుభవం ఏమిటి?*

జ: కమిషన్ సభ్యుడిగా వున్నప్పుడు కొన్ని తీర్పులను రాసే అవకాశం నాకు కూడా లభించింది. సంపాదకీయం రాయటం, తీర్పు రాయటం రెండూ ఒకటేననిపించింది. ప్రతి తీర్పులోనూ మనం న్యాయం చేశామన్న సంతృప్తి ఉండేది. ఏవృత్తికైనా ఈ సంతృప్తిని మించిన పరమార్థంలేదు.

*ప్ర: వ్యక్తిగత ఆధ్యాత్మిక లేదా రాజకీయ విశ్వాసాలు జర్నలిజంపై చూపే ప్రభావం ఏమిటి?*

జ: విశ్వాసాలు, ఆదర్శాలు, అభిప్రాయాల్లో వ్యక్తమవుతాయి. కాకతప్పదు. లక్ష్యశుద్ధితో, సత్యనిష్ఠతో వార్తలను ప్రచురించేటపుడు మాత్రం అందులో స్వంత విశ్వాసాలు, ఆదర్శాలు ప్రతిబింబించవలసిన అవసరం లేదు. వ్యక్తిగత విశ్వాసాలు, నమ్ముతున్న సిద్ధాంతాలు వార్తలను వక్రీకరిస్తే, రంగుపులిమితే అది ప్రజా ప్రయోజనాలకు మంచిదికాదు.

*ప్ర: మీరు గుంటూరు దగ్గర పొత్తూరులో ఆశ్రమం నెలకొల్పారు గదా! ఏ ఉద్దేశాలతోఇది ఏర్పాటైంది?*

జ: ప్రణవం ఆశ్రమంపేరిట దీనిని నెలకొల్పాను. సమాజంలో కులాలనేవి మనుషుల మధ్య పెద్ద అడ్డుగోడలు సృష్టిస్తున్నాయి. నా చిన్నతనంలో వివిధ కులాల వారి మధ్య ప్రేమలు, అభిమానాలు చూశాను. ద్వేషాలు వుండేవికావు. ఇప్పుడు కులద్వేషాలు విపరీతంగా పెరిగిపోయాయి. కులాన్ని మనం ప్రయత్న పూర్వకంగా తొలగించలేం. సమాన ప్రతిపత్తితో అన్ని కులాల వారు కలిసి జీవించటానికి మనం ప్రయత్నం చేయవచ్చు. ఆశ్రమంలో అలాంటి ఓ చిరు ప్రయత్నం ప్రారంభించాను. కలిసి ప్రార్థన చేయడం, కలిసి అధ్యయనం చేయడం, కలిసి భోజనాలు చేయడం అనే మూడు పద్ధతుల ద్వారా ఎంతో కొంత సమాజంలో మార్పు తీసుకురావచ్చని దృఢంగా నమ్ముతున్నాను. ఆర్య సమాజ పద్ధతిలో ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నాను. అన్ని కులాల వారితో యజ్ఞాలు చేయించాను. ఓంకార వైశిష్ట్యాన్ని పదుగురికీ పంచాలన్నదీ లక్ష్యం.

### రచన అనేది ఆత్మతృప్తికే కాదు

"నా ఆనందం కోసం నేను వ్రాసుకున్నాను, ఎవరికర్థంకాక పోయినా, ఎవరు బాగులేదన్నా నాకు లెక్కలేదు" అని నేననుకోలేను. ఏరచయితైనా అట్లా అన్నా అది నేను నమ్మను. నా సమకాలికులలో కొందరు పిన్నలకీ పెద్దలకీ కూడా నే చెప్పదలచుకున్నది అవగాహన కావడం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించడం నాకు ఉత్సాహాన్ని, సంతృప్తినీ కలిగించింది. ఇది నా అదృష్టం.

– బుచ్చిబాబు

# పత్రికా భాష భ్రష్టుపడుతోంది



శ్రీ వి. వాసుదేవ దీక్షితులు తో

ఇంటర్వ్యూ

సర్జన్ కావాలనుకుని శ్రీ వి. వాసుదేవదీక్షితులు సంపాదకుడయ్యారు. *1967*లో శ్రీనీలంరాజు వెంకట శేషయ్య కల్పించిన అవకాశంతో ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్‌గా చేరి అదే పత్రికకు ఎడిటర్‌గా ఎదగగలిగారు. వృత్తిలో చేరిన మొదటి రోజునుంచీ చదువుతూ, రాస్తూ, నేర్చుకుంటూ తనను తాను మలచుకున్నారు. తీర్చి దిద్దుకున్నారు. బెల్లంకొండ రామదాసు, అజంతా, రెంటాల గోపాలకృష్ణ, కాశీనాధుని శ్రీశైలపతి వంటి అనేకమంది దిగ్గజాల సాహచర్యంలో శ్రీ దీక్షితులు తొలి అడుగులు సాగాయి. శ్రీబెల్లంకొండ రామదాసు సాహిత్య విషయాల్లో గట్టిపునాది వేశారు. శ్రీ అజంతా దగ్గర రాతకు సంబంధించిన మెలకువలను తెలుసుకున్నారు. ఇటు ఎడిటింగ్ నుంచి అటురిపోర్టింగ్ వరకూ అన్ని విభాగాల్లో పనిచేసి అనుభవాన్ని సంపాదించారు. ముఖ్యంగా అజంతా శిష్యరికంవల్ల తాను ఎంతో ప్రయోజనం పొందానని శ్రీదీక్షితులు చెప్పారు. ఇవాళ ఏరకమైన పరిస్థితి ఎదురైనా ఏ ఉద్రేకానికి గురికాకుండా ప్రశాంత చిత్తంతో వ్యవహరించగలగటానికి అజంతా వేసిన పునాదే కారణమంటారు. శ్రీ దీక్షితులు చొక్కా మడత నలగనివ్వరు. క్రాపు చెదరనివ్వరు. ఈ వ్యక్తిగత శుభ్రత అనేది ఆయనకు చిన్ననాటినుంచి అలవడింది. 'గోదావరి నాకన్నతల్లి, కృష్ణమ్మ పెంచినమ్మ. ఈ రెండు నదులూ నా శరీరంలో రక్తం రూపంలో ప్రవహిస్తున్నాయి' అని శ్రీదీక్షితులు ప్రగాఢంగా విశ్వసిస్తారు. ఇదో వెర్రి సెంటిమెంట్ అనుకున్నా లక్ష్యపెట్టబోనంటారు. శ్రీ దీక్షితులు ఈ ఇంటర్వ్యూలో పత్రికా భాషనుంచి విలేకరుల అవినీతి వరకు అనేకానేక విషయాలపై దృష్టిసారించారు.

**ప్ర: తెలుగు పత్రికా భాష భ్రష్టుపట్టిపోయిందని మీరు అనేకసార్లు ఆవేదన వ్యక్తం చేశారు. పత్రికా భాషకు సంబంధించి చేయాల్సిన సంస్కరణ ఏమిటి?**

జ: పత్రికా భాష తప్పుదారి పట్టిందని నేను భావిస్తున్నాను. తప్పుదారి పట్టిన పత్రికాభాషను మళ్ళీ సరైన దారిలో పెట్టుకోవటానికి భారీ ప్రయత్నం జరగాలి. కానీ ఆప్రయత్నాన్ని బాధ్యతగా స్వీకరించాల్సిన వాళ్ళు స్వీకరించడంలేదు. విశ్వవిద్యాలయాల్ని

ప్రత్యేకించి తెలుగు విశ్వవిద్యాలయాన్ని నేను అభిశంసిస్తాను. ఇరవై ఇరవై ఐదు సంవత్సరాల క్రితం చలామణిలో ఉన్న తెలుగు మాటలకు ఉన్న అర్థాలను మార్చేసి ఇప్పుడు మనం పత్రికల్లో వాడుకుంటున్నాం.

మనకు తెలియకుండానే కొన్ని మాటల్ని తప్పుదారి పట్టించేసి అదే చలామణీ అయ్యి దీని అసలు అర్థం ఇదే అనిపించే స్థితికి తీసికెళ్ళిపోతున్నాం. పత్రికలకు ఉన్నటువంటి ప్రజలలోకి వెళ్ళే స్వభావాన్ని ఆసరా చేసుకుని భాషను పెడదారి పట్టిస్తున్నాం. మా పత్రికలో తిరుమల రామచంద్ర నిర్వహిస్తున్న పలుకుబడి శీర్షిక చదివి శ్రీబాలాంత్రపు రజనీకాంతరావు నాకో ఉత్తరం వ్రాసారు. 'అగ్నిమాపక శకటం' 'దళం' అనేపదాన్ని గురించి దాంట్లో వ్రాసారు. ఇక్కడ మాపక అంటే అగ్నిని పరిహరించేది అనే అర్థం లేదు అని వారు తెలియజేశారు. ఉష్ణమాపకము అంటే ధర్మామీటరు. ఉష్ణాన్ని సూచించేది. అంటే ఉష్ణ సూచిక అనే అర్థంలో వాడుతున్నాం. ఉష్ణమాపకం అనేది కొద్ది సంవత్సరాల క్రితం మన సైన్సు పుస్తకాలలో కూడా ఉంది. తరువాత తెలుగు పత్రికలలో ఈ ఫైర్ ఫైటింగ్ ఇంజిన్స్ అనే అర్థంలో వచ్చేటప్పటికి అగ్నిమాపక శకటాలు, అగ్ని మాపక దళం అని వ్రాస్తున్నారు. ఈ'మాపక' శబ్దానికి పరిహరించి అనే అర్థం లేదు. ఉష్ణమాపకము అంటే ఉష్ణసూచిని అనే అర్థంలో వాడుకోవాలి కానీ ఈ అగ్నిమాపక అనే శబ్దానికి మనం అనుకున్నటువంటి అర్థంలేదు అని నా అభిప్రాయం అంటూ ఉత్తరం వ్రాసారు వారు. అసలు భాషా సృష్టికర్తలు నిర్దేశించినటువంటి లేదా భావించినటువంటి అర్థాన్ని మనం తప్పించి ఇంకో అర్థం ఇచ్చేసి వాడుకుంటున్నాం. పోనీ మాపక శబ్దానికి అన్ని వేళలా అన్ని సమయాల్లోనూ ఒకే అర్థం ఇచ్చుకుంటున్నామా అంటే లేదు. అగ్ని మాపక అన్నచోట ఒక అర్థం. ఉష్ణమాపక అన్నచోట మరో అర్థం. ఇది భాషాభివృద్ధి అని బుకాయిస్తే నవ్వుతాను నేను. ఏభాషైనా సరే కాలగమనంలో అనేక కొత్తపదాల్ని కొత్తమాటల్ని తెచ్చుకుంటూ అభివృద్ధి చెందుతూ పోవల్సిందే. ఆవిషయంలో అందరం అభివృద్ధి కాముకులమే. కాని భాషను భ్రష్టుపట్టించకూడదన్నదే నా ఉద్దేశం. కొత్త మాటలు మనం తెచ్చివేసుకోవడంలో ఉన్న తెలుగుని నాశనం చేయడం కాదు. దాన్ని పరిపుష్టం చేసుకోవాలి. అటువంటి ప్రయత్నాల్ని తప్పకుండా హర్షిస్తాం. ఇంగ్లీషు శబ్దానికి తెలుగులో ఇంతవరకూ లేకపోతే నలుగురు పండితులు కూర్చుని ఒక శబ్దాన్ని మనకు తయారుచేసి ఇస్తే మనం ఆనందించాల్సిందే. అటువంటి ప్రయత్నాలు చేసే సందర్భంలో పిల్లి అంటే మార్జాలం అనే పోకడ కాకుండా అలాగే అసలు అర్థాన్ని పక్కకు తోసేసి వేరే ఏదో అర్థం ఇవ్వకుండా సగం ఇంగ్లీషు సగం తెలుగు కలిపినటువంటి శబ్దాన్ని సృష్టించకుండా భాషను పరిపుష్టం చేసే శాబ్దిక ప్రయోగాన్ని తప్పకుండా మనం హర్షించవచ్చు. అటువంటి ప్రయోగం చిత్తశుద్ధితో జరగట్లేదని నా అభిప్రాయం. ముఖ్యంగా ఒకేశబ్దంలో సగం ఇంగ్లీషు, సగం తెలుగు కలిపినటువంటి మాటల్ని ఇవాళ పత్రికలు విశృంఖలంగా ప్రచారం చేస్తున్నాయి.

ప్రైవేటీకరణ అనేది అటువంటిదే. నిన్ననో మొన్ననో ఒక పత్రికలో చూశాను. 'కంప్యూటీకరణ' అనే ప్రయోగం. కంప్యూటరీకరణ కూడా కాదు. కంప్యూటరైజేషన్ అన్నమాట అది. కంప్యూటీకరణ ఎలా అవుతుందో మరి నాకు తెలియదు. నేను కాకపోయినా నా తర్వాతి వాళ్లయినా దీన్ని ఒక ఉద్యమంగా తీసుకొని ఈ భాషకు జరుగుతున్న అన్యాయాన్ని ఆపే ప్రయత్నం చేయకపోయినట్లయితే మరో ఇరవై ఏళ్ళు పోయేసరికి ఈ తెలుగుభాష తెలుగుభాషలాగా ఉండదు. దీనికొక ప్రమాణాన్ని తయారు చేసే వ్యక్తులు కనిపించనటువంటి అయోమయస్థితి ఏర్పడుతుందని నా భయం.

ఒక భాషనేది నడవటానికి వ్యాకరణం ఉంటుంది. ఛందస్సులని మనం అంగీకరించినా అంగీకరించకపోయినా అది వేరే విషయంకానీ, ఒక వాక్య నిర్మాణానికి సంబంధించి ఏ భాష అయినప్పటికీ కొన్ని నియమాలుంటాయి. దాన్ని వ్యాకరణం అంటున్నాం. ఆధునిక తెలుగుభాషకు వ్యాకరణం లేదని అంటారు. నిజమే. ఆధునిక లేదా వ్యావహారిక భాషా ఉద్యమ స్రష్టలు వ్యాకరణాల్ని ఛందోబందోబస్తుల్ని నిరసించినప్పటికీ కొన్ని అంతర్గత నియంత్రణల్ని సూచించారు.

అవతలివాడికి అర్థంకావడం ఒక్కటేలక్ష్యం అని వారు చెప్పారుకానీ నలుగురూ అవతలివాడికి అర్థమయ్యేలా మాట్లాడాలి కనుక కొన్ని నియమాలు పాటించాలనికూడా వాళ్లుచెప్పారు. ఆ నియమానుసారంగానే వాళ్లుకూడా వాళ్లుచెప్పిన వ్యావహారిక భాషలో కొన్ని రచనలు చేశారు. ఇవాళ ఆ పుస్తకాలన్నీ తెరిచి చూస్తే తెలుస్తుంది. వాళ్లేంపాడు చేయలేదు భాషని. ఇవాళ మనం చేస్తున్నాం అది.

ఆధునిక వ్యవహార భాషకు మనం పెట్టుకున్న నియమాలు రెండో మూడో ఉంటాయి. మొట్టమొదటిది శ్రవణ సుభగత్వం. అంటే చెవికి వినసొంపుగా ఉండాలి. ఇది వ్యాకరణ సూత్రమే. చిన్నయసూరి చెప్పినా మరొకరుచెప్పినా దాంట్లో ఉండే అర్థం ఏమిటంటే ఒక నియమం పెట్టినట్లయితే అందరూ ఆ నియమాన్ని అనుసరిస్తారు. నియమాలు తెలుసున్నటువంటివాడు నియమబద్ధంగా వాక్యం వ్రాస్తున్నపుడు విషయం చేరుతుంది. భాష ఉద్దేశం ఏమిటి? వాక్యం చెప్పినా, చదివినా అవతలివాడికి అర్థంకావాలి. దానికి కొన్ని నియమాలు కావాలి కాబట్టి వ్యాకరణం అన్నారు. ఇవాళ వాటినన్నిటిని చదివే ఓపిక, తీరిక, శక్తి మనకు లేదు కనుక అవన్నీ పక్కకు తప్పించేసి కేవలం కమ్యూనికేషన్ ఒక్కటే లక్ష్యంగా పెట్టుకుని వ్యావహారిక భాషను అల్లుకున్నాం. తప్పులేదు. కానీ దాంట్లో ఉన్న కొన్ని నియమాలు - శ్రవణ సుభగత్వం అనేది ఒకటిపెట్టారు. అంటే వినటానికి బావుండాలన్నారు. అదొక నియమం. బాల వ్యాకరణం, ప్రౌఢవ్యాకరణం పక్కన పెట్టేసినప్పటికీ మనం పాటిస్తున్నది ఏమిటివాళ? శ్రవణ సుభగత్వం అనే నియమం ఒకటుంది. వినడానికి బావుందా లేదా. అది దుష్టసమాసమా, సంకర సమాసమా ? కొంత

సంస్కృతం కొంత తెలుగూ కలిపాడా ఒకే శబ్దంలో. రెండు పదబంధాల్ని దగ్గరకు చేర్చి ఓ కొత్త పదబంధం చేసేటప్పుడు సంస్కృత శబ్దానికి పక్కన ఏరకమైనటువంటి ప్రత్యయం లేకుండా తెలుగు మాట చేర్చేశాడా? ఈ పట్టింపులు ఛాందసాలు మనకి అక్కర్లేదు. కానీ పాటించవలసిన నియమం ఒకటి ఏమిటంటే వినడానికి బావుందాలేదా? బహూతీపి అనేపదాన్నే తీసుకోండి. బహూతీపి అని మామూలుగా వ్రాయం. కానీ వినడానికి బావుంది కనుక ఉపయోగించవచ్చు. ఆదర్శ పెళ్ళిళ్లు. వినడానికి బాలేదు. మనం వ్రాయం. వినడానికి బావుండే పదబంధాల్ని నువ్వు కట్టుకో. అక్కడ శిష్టసమాసమా. దుష్టసమాసమా. సంకరసమాసమా సరైనదేనా అనేటటువంటి గొడవలు అక్కర్లేదంటాను.

ఇక రెండోనియమం - ఉచ్చారణా సౌలభ్యం. ఉచ్చరించడానికి, చదవడానికి, మాట్లాడటానికి, వ్యక్తీకరించటానికి సులభంగా ఉందాలేదా? అనేది మరో నియమం. అది సాధ్యంకాకుండా ఉచ్చరించడానికి వీలులేకుండా 'చంద్రప్రస్థర సౌధ కేలన' ఇలాంటి సమాసాలతోటి పత్రికల్లో భాషని నడిపించాలనికాదు. మూడు, నాలుగు వత్తులు, రెండు మూడు వత్తులు ఉన్నటువంటి అక్షరాల్ని వరసగా చేర్చేసేసి పాఠకుణ్ణి ఇబ్బంది పెట్టడం అనేది ఎప్పుడూ చేయకూడదు. ఉచ్చారణకు వీలుగా సులభంగా ఉండేవిధంగా చేయమనేది రెండో నియమం. అజంతా లాంటి కవులు మరో అడుగు ముందుకువేసి ఇంకో నియమం పెట్టారు. అచ్చు అయినటువంటి అక్షరం చూడ్డానికి కూడా అందంగా ఉండాలని అన్నారు. ఈ అక్షర దృశ్యం అందంగా ఉందా లేదా అని తేల్చి చెప్పడానికి అది కేవలం ఒక వ్యక్తిగతమైన విషయంగా పరిణమిస్తుంది కనుక ఆ మూడో నియమాన్ని పాటించాలని చెప్పను. వ్యావహారిక భాషా సృష్టికర్తల లక్ష్యానికి విరుద్ధంగా మనం ఇవాళ పత్రికల్లో ఆధునిక భాష అని చెప్పుకుంటూ వాడుకొని పొంగిపోతున్నాం. నిజంగానే ఆ వ్యవహారభాషకోసం పరితపించిన వాళ్ళెవరైనా పుడితే ఈ భాషని చూసి వాళ్లు నడివీధిలో ఉరివేసుకుని చచ్చిపోతారని నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను.

పాఠశాలస్థాయి నుంచి విశ్వవిద్యాలయస్థాయి వరకూ భాషకు సంబంధించి సమూలమైన విద్యాసంస్కరణలను ప్రవేశపెట్టనట్లయితే ఇప్పుడు మన తెలుగు పత్రికల్లో దెబ్బతిన్న భాష తప్పించి మంచి భాష రావడం సాధ్యంకాదు.

***ప్ర: జర్నలిస్ట్ అయినవాడు సాహితీకారుడు కూడా అయితే అదనపు సౌలభ్యాలు ఏమైనా ఉంటాయా?***

జ: జర్నలిస్టుకు భాషా సంబంధమైన పరిజ్ఞానం కలిగిన సాహిత్య ప్రవేశం ఉన్నట్లయితే తప్పకుండా ఉపయోగిస్తుంది. తెలుగు పత్రిక పుట్టిన తొలినాళ్లలో ఇటు సాహిత్య ప్రవేశం లేదా పాండిత్యం, అటు సృజనాత్మక ప్రతిభ కలిగిన వ్యక్తులు జర్నలిజంలోకి రావడంవల్ల పత్రికా భాషకు కొంత ప్రయోజనం కలిగింది. అంచేత మంచిదే అది.

*ప్ర: ఈనాటికీ సంపాదకీయాల్లో సరళమైన భాష వాడటంలేదు. సూటిగా చెప్పాలంటే కొంత సాహిత్య ప్రకర్ష, పదాడంబరంకూడా కనిపిస్తోంది. వార్తాపత్రిక చదువరులు సామాన్యులు కనుక సంపాదకీయాల భాష విషయంలో ఏమైనా మార్పులు రావాల్సిన అవసరం ఉందంటారా?*

జ: ఏమీలేదని నేను నమ్ముతున్నాను. సరళంగా ఉండాలనే ఉద్దేశంతోటే మరీ పేలవంగా తయారుచేసి విడిచిపెట్టేశారు. నార్ల వెంకటేశ్వరరావుగారి సమయం వరకు మీరు వెళ్లి చూడండి. అప్పటిభాష ఆయన ఉపయోగించినటువంటి భాష ఎలా ఉందో చూడండి. నార్ల వెంకటేశ్వరరావుగారు ఛాందసుడు అని అంటే మనం ఒప్పుకోంకదా! ఆధునికుడే ఆయన. ఆధునికుడే అయ్యి తెలుగు జర్నలిజానికి అవసరమైన మాటల్ని కూర్చడంలో ఎంతో కొంత కృషిచేసిన వ్యక్తి అయివుండికూడా, తెలుగుభాషలో ఉండే సొగసు చెడకూడదనే ఉద్దేశంతో సంపాదకీయాల్లో ఒక శైలిని పాటించి ఆయన ఎడిటోరియల్స్ వ్రాసాడు. తర్వాత తర్వాత ఈ వాదన ఎవరో తీసుకువచ్చినట్టున్నారు. మరీమరీ సరళంగా ఉండాలి. మరీ పలచగా ఉండాలి అని ఎవరో చెప్పినట్టున్నారు. అది భ్రష్టుపట్టించే స్థాయికి తీసుకువచ్చి కాంపోజిషన్ స్థాయిలో సంపాదకీయాలు వెలువడే దుస్థితికి మనమే తెచ్చుకున్నాం. ఎడిటోరియల్‌ద్వారా పత్రిక ప్రజాభిప్రాయాన్ని మలచాలి గనుక ఆవేశం ఉండాలి. ఆవేశం అనేది ఇతివృత్తంలో కలిసి పోయి ముందుకు నడిపించాలి. పాఠకుడి చేత అది చదివించగలగాలి. శైలిలో, శైలీ విన్యాసంలో పదాల్ని ఎంచుకోవడంలో వస్తువుని అందచేయడంలో అన్నిటిలోనూ కూడా ఆ ఆవేశం అనేది ఎప్పుడైతే లేదో దానికి పఠనయోగ్యత వస్తుందని అనుకోను. పాఠకుడి చేత చదివింపచేసే లక్షణాన్ని మీరు సంపాదకీయంలో పెట్టి తీరాలి. వార్తను ఉన్నది ఉన్నట్టుగా వ్రాసేయవచ్చు. సంపాదకీయంద్వారా ప్రజల్ని తట్టి లేపాల్సిన బాధ్యత ఉంది కనుక, ఆవేశం అనేది తప్పనిసరి.

*ప్ర: మీరు ఆవేశం అన్నారుకదా! భాషకు సంబంధించినా విషయ్యానికి సంబంధించినా మనకి సందర్భాలు వేరైనపుడు ఆ సందర్భానుగుణంగా భాష వాడటమనేది అవసరం కాదా?*

జ : మీరు చెప్పింది అక్షరసత్యం. దీనినే ఫ్లెక్సిబిలిటీ ఆఫ్ స్టయిల్ అంటారు. ప్రతి సంపాదకీయాన్ని ఒకే బాణీ, ఒకే శైలిలో నడిపించకూడదు. సందర్భాన్నిబట్టి, ఇతి వృత్తాన్నిబట్టి ఆ అంశాన్నిబట్టి, ఆనాటి పరిస్థితులనుబట్టి తప్పకుండా ఆశైలి మారాల్సిందే. రాజకీయపరమైన విషయాన్ని వ్రాసేటపుడు ఒక శైలిని పాటించాలి. ఒక సాహితీ సంబంధమైన విషయాన్ని వ్రాసేటపుడు మరో విధమైన శైలిని పాటించాలి. అలాగే ఒక ప్రధానమంత్రి రాజీనామాచేసినపుడు, లేదా ఒక రాజకీయ సంక్షోభం వచ్చినపుడు వ్రాసే సంపాదకీయంలో ఉండే బాణీకి తప్పకుండా తేడా ఉండి తీరాల్సిందే.

*ప్ర: మీ ఎడిటోరియల్‌పాలసీ ఏమిటి? అంటే యాజమాన్య ఒత్తిడులు ఏమైనా ఉంటాయా?*

జ: తక్కిన పత్రికలలో ఏరకమైన యాజమాన్య ఒత్తిడులు ఉన్నాయేమో కాని నేను ఆ మహానుభావుడు రామ్‌నాథ్ గోయంకా పెట్టిన పత్రికలో ఎడిటర్‌గా ఉంటున్నాను. ఆయన ఎప్పుడూ ఏ ఎడిటర్‌నీ ఖాసా సుబ్బారావు మొదలుకొని నాకు ముందు రిటైరైన పొత్తూరి వెంకటేశ్వరరావుగారి వరకూ ఎవరినీ మీరు ఇలా వ్రాయండి మీరు ఇలా వ్రాయకండి అని శాసించిన దాఖలా ఎక్కడాలేదు. నాకంటే ముందు పనిచేసిన సంపాదకులు ప్రైవేటు సంభాషణల్లో కూడా గోయెంకా వాళ్ళకిచ్చిన స్వేచ్ఛ గురించి ఘనంగా చెప్పారు. అందుచేత యాజమాన్యంవారు ఆంధ్రప్రభ సంపాదకులమీద ఒత్తిడి తీసుకురావడమనేటటువంటిది అబద్ధం. విషయం మంచి చెడులను బట్టే వ్రాస్తుంటాను నేను. ఏపార్టీ ప్రభుత్వం అధికారంలోవున్నా సమదృష్టితోటే చూసి విమర్శించడం అనే సంప్రదాయం పాటిస్తున్న ఏకైక తెలుగు దినపత్రిక నేను సారథ్యం వహిస్తున్న ఆంధ్రప్రభ అని నిష్కర్షగా చెప్పగలను.

*ప్ర: మీ సంపాదకీయాల నిడివి ఎక్కువగా ఉంటుందనే అభిప్రాయం వ్యక్తం అవుతూ ఉంటుంది. దీని మీద మీరేమంటారు?*

జ: నిజమే. దానికి ఒక కారణం ఉంది. తెలుగు పత్రికల్లో ఇంతకు ముందున్న శైలి పద్ధతి మార్చివేసి ఒక కొత్త ధోరణిపెట్టే ప్రయత్నం చేశాను నేను. అదేమిటంటే వాదన తరహా సంపాదకీయ రచన. నేను ఎంచుకున్న ఈపద్ధతిలో అనివార్యంగా విస్తృతి పెరుగుతోంది. ఒకటి, రెండు సందర్భాలలో నేను తగ్గించి చూస్తే, ఆసక్తిగా చదివే పాఠకులు నాకు ఫోన్ చేసి ''అయ్యా! మీరు ఎందుకు ఇది తగ్గించారో మాకు అర్థంకాదు. అనవసరంగా తగ్గించారుదీన్ని'' అని చెప్పిన సందర్భాలు ఉన్నాయి. నిడివి పెరగడం అనేది కొందరికి అసౌకర్యంగా ఉన్నమాట నిజమే. కాని నేను ఎంచుకొన్న శైలిలో అనివార్యంగా అది వచ్చిపడుతోంది. అది ఎవరికైనా అసౌకర్యం కలిగిస్తే క్షంతవ్యుణ్ణి.

*ప్ర: తెలుగు పత్రికారంగం తొలిదశలో పత్రికలు దేశభక్తిని, ఐకమత్యాన్ని, భారతీయ సంస్కృతిని ప్రజలలో ప్రోదిచేశాయి. రానురాను ఆ స్థితి కనుమరుగవుతోంది. దీనికి కారణం ఏమంటారు?*

జ: ఇది పత్రికలకి వేయవలసిన ప్రశ్నకాదు. మీరు అటువైపు తిరిగి సమాజాన్ని అడగాలి. ఇటు పత్రికల నుంచి అటు కార్పొరేట్ సంస్థలదాకా ఈ సమాజం రూపుదిద్దిన వ్యక్తుల నుంచే ఎన్నుకోవల్సి వస్తోంది. ఈ సమాజాన్ని రూపుదిద్దుతున్న కుటుంబం, ఆ కుటుంబం అలా తయారవడానికి కారణమైన సామాజిక జీవనం అందులో భాగంగా మారిన విద్యావ్యవస్థ ఇవన్నీ దృష్టిలో పెట్టుకొనిచూడాలి. ఈ క్షీణత, సర్వరంగాలలోను వచ్చింది. కనుక ఆ రంగాల్నుంచే కొంచెం కొంచెం ముక్కల్నితీసుకుని పత్రికల్లోనూ మీరు పెట్టుకుంటున్నారు. విప్లవ సదృశమైన మార్పు ఒకటి ఈ సమాజంలో రావాల్సిన అవసరం ఉంది. తక్కిన భారతీయ సమాజాలమాట పక్కన పెట్టేయండి మనకనవసరంగానీ,

తెలుగు సమాజం మాత్రం ఆరకమైన విప్లవంవైపు అడుగేయాల్సిన సమయం వచ్చేసిందని నేను అనుకుంటున్నాను. సంస్కృతీ పరమైందికావచ్చు ఏదైనా కావచ్చు అది. ఆ మార్పురానిదే, దేశభక్తిలేనటువంటి వాళ్ళు మళ్ళీవస్తారు. వందమంది చెడ్డవాళ్ళు వస్తే వాళ్ళలో మెరుగైన వారెవరో తీసుకోవలసి వస్తోంది. అంతేగాని ఎడిటర్ దేశభక్తుల్ని సృష్టించలేడు. అటువంటి వ్యక్తులు పత్రికల్లోకి వస్తుంటే వస్తూండవచ్చు. కానీ పత్రికా సంపాదకులే దేశభక్తి లేని వాళ్ళు వస్తున్నారంటే చేతులు జోడించి నమస్కారం చేయాలి.

*ప్ర: అమెరికా, బ్రిటన్ జర్నలిజాన్ని దాదాపు మొదట్నుంచీ భారతీయ జర్నలిజం కూడ మార్గదర్శకం చేసుకుంటూ వస్తోంది. ఇప్పుడు అక్కడ రాజకీయవార్తల ప్రాముఖ్యం బాగా తగ్గిపోయింది. వాళ్ళు సామాజిక అంశాలకు ప్రాధాన్యం ఇస్తున్నారు. కానీ భారతీయ జర్నలిజంలో ఆధోరణి ఇంకా కనిపించకపోవడానికి కారణం ఏమిటి?*

జ: భారతీయపత్రికల్లో రాజకీయాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చివేయడం అనేది ఒక అలవాటైంది. తక్కిన దేశాల్లో రాజకీయాలకంటే ఇతర విషయాలకి అంతగా కాకపోయినా కొంతలో కొంత మనదేశంలో కంటే ఎక్కువగా ప్రాధాన్యమిచ్చే సంప్రదాయం పెట్టుకున్నారు. రాజకీయాలు తగ్గించి సామాజిక అంశాలకు, సాంస్కృతిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి పత్రిక తయారుచేస్తే కట్టలు తిరిగి వచ్చే స్థితి ఈరోజు ఉంది. ప్రతి పేజీలోనూ రాజకీయాలు కావల్సిన సమాజం మనచుట్టూ ఉంది. అందువల్ల పత్రికలు అనివార్యంగా రాజకీయ అంశాలను నింపి తీసుకువస్తున్నాయి. అలాగే ఇక్కడే ఇంకో విషయం చెప్పుకోవాలి. ఇంత టాకిటివ్ రేస్ ప్రపంచంలో ఎక్కడా లేదు. మనవాళ్ళు బాధపడ్తారు ఇలా అంటే. ఏ చిన్న విషయమైనా తీసుకోండి. రిజర్వుబ్యాంకు రూల్సుమీద ఆపార్టీ కార్యకర్త మొదలు జాతీయస్థాయిలో ఉండే పార్టీ అధ్యక్షుడిదాకా ప్రతివాడూ ప్రతి వూళ్ళోనూ స్పందిస్తూ ఉంటాడు. ఆపార్టీ జనరల్ సెక్రెటరీగారు విశాఖపట్నంలో బయల్దేరతాడు. విశాఖపట్నంలో విలేకరుల సమావేశం పెడ్తాడు. తర్వాత రాజమండ్రి, ఏలూరు, విజయవాడ వస్తారు. మూడు నాలుగు రోజులపాటు ఆ ఎక్స్‌గారు వైజాగ్‌లో మొదలుపెట్టి హైదరాబాద్ వచ్చేవరకూ వ్యక్తం చేసిన అభిప్రాయాన్నే మళ్ళీ మళ్ళీ వ్యక్తం చేసుకుంటూ వస్తాడండి. ఇవన్నీ పేపర్లు వేసేస్తుంటాయి. ఇదంతా రాజకీయాలకు సంబంధించిందే. పోనీ ఆయన పార్టీ ప్రధాన కార్యదర్శిగారో, ఉపాధ్యక్షుడుగారో, అధ్యక్షుడుగారో కాబట్టి వేశాం అని అనుకుంటే కిందిస్థాయిలో జాయింటు సెక్రటరీ ఉంటాడు. ఏరియా ప్రెసిడెంటు ఉంటాడు. ఆ ఊరికి టౌన్ పార్టీ ప్రెసిడెంట్ ఎవరో ఉంటాడు. కార్యకర్త ఉంటాడు. ఆకార్యకర్త లేదా కార్యకర్తకి పై హోదా కలిగినటువంటి స్థానిక మహానాయకుడెవడో ఉంటాడు. వాడు ఏదో చెప్తాడు. అన్నిటినీ వేసే దుష్టసంప్రదాయాన్ని ఓ పేపరు తీసుకువచ్చింది. పార్టీ కార్యకర్త మాట్లాడిన

దగ్గర్నుంచీకూడా వేసేయడం. పేపర్లనిండా ఇవే ఉంటాయి. వాళ్లేంచేస్తారంటే, వాడి పేరు అందులో పడిందికదా. ఆ పేపర్లో పేరుపడుతోందికాబట్టి ఆ పేపర్నే కొనమని చుట్టూ ఉన్న పదిమందికి చెప్తాడు వాడు. అందరూ కలిసి ఆపేపర్ని కొంటుంటారు. కార్యకర్త ప్రకటనకి ఇంత ప్రాముఖ్యం ఇచ్చి వేయడం ఏమిటి? ఇది పద్ధతికాదు. ఒక స్థాయి ఉండాలి అని మడిగట్టుకున్న పేపర్లు ఏవైనా ఉంటే వాటి సర్క్యులేషన్ దెబ్బతినడం మొదలైంది. దాంతర్వాత ఈ కంపార్ట్‌మెంటలైజేషన్ ఆఫ్ న్యూస్ అనేది ఒకటొచ్చింది. అంటే అసలు పత్రిక మౌలిక దృక్పథానికి విరుద్ధంగా ఉన్న విషయమిది. పత్రికలో వార్తలంటే ఎక్కడో జరిగిందాన్ని ఇక్కడున్న వాళ్ళకి చెప్పడం అనికదా. కానీ జిల్లా అనుబంధాలు వచ్చాక స్థానికంగా ఉండే వార్తలతో నింపవలసిన అవసరంమరీ పెరిగి పోయింది. అంచేత కొందరు గ్రామీణ స్థాయిలో విలేకరులని పెట్టేసేసి ఆ విలేకరులు వార్తల కోసమని తిరిగి, చివరికి పోలీసు స్టేషను హెడ్‌కానిస్టేబుల్‌ని కూడా పీడించేసి జేబుదొంగల వార్తలు కూడా వ్రాసే స్థితికి పత్రికలను దిగజార్చేశారు. ఏమీ ప్రాముఖ్యం లేని రాజకీయ వార్తలు నింపే స్థితి రావడానికి కారణం ఇది కూడాను. కొంత సమాజం ఆదరించడం. కొంత ఒక పేపరు సృష్టించినటువంటి చెడు సంప్రదాయంవల్ల ఇది జరుగుతోంది. నిజానికి రాజకీయంగా ఏదైనా ముఖ్యమైంది ఉంటే తప్పకుండా ఇవ్వాల్సిందేగానీ ప్రతి చెత్తా రాయాల్సిన పనేంలేదు. ఇది మిగిలిన దేశాల్లో కనిపించదు. పార్టీ అగ్రశ్రేణి నాయకుడు పార్టీవిధానం గురించి మాట్లాడతారు. దానిమీద ప్రతిపక్షం వాళ్లెవరైనా పెద్దవాళ్లు వ్యాఖ్యానిస్తారు. చర్చ జరుగుతుంది. వాటికి సంబంధించినవే వస్తాయి తప్పితే ప్రతి అడ్డమైన వాడూ మాట్లాడినవి పేపర్లో ప్రింటు చేసేయడం అక్కడలేదు.

*ప్ర: ఒకే యాజమాన్యం కింద వివిధ భాషాపత్రికలు ఉంటే అదనపు సౌలభ్యాలు లేదా ఇబ్బందులు ఏమైనా ఉంటాయా?*

జ: ఇబ్బందులు ఉంటాయని నేననుకోను. నెట్‌వర్క్‌కి సంబంధించిన సౌలభ్యాలు ఉంటాయి. ఒకే పత్రికకి దేశంచాలా చోట్ల ఇంగ్లీషులోకాని ఇతర ప్రాంతీయ భాషల్లోకాని ఎడిషన్లు ఉంటే అక్కడున్న విలేకరులు ఈ గ్రూప్‌లో ఉన్న అన్ని పత్రికలకు ఉపయోగిస్తారు కనుక సౌలభ్యమే అది.

*ప్ర: గతంలో మనం వార్తలు అనుకోని ఎన్నో విషయాలు ఇప్పుడు వార్తారూపం సంతరించుకుంటున్నాయి. వేలాది వార్తలు నిత్యం పత్రికల్లో చోటు చేసుకుంటున్నాయి. ఇంతటి సమాచార విస్ఫోటనంలో వార్తని ఏ దృష్టితో పరిశీలించాలి.*

జ: వార్తకు ఒకే ఒక దృష్టి. ఏరకమైన వార్తలు వేలల్లో, కోట్లలో పేపర్లలో వచ్చేసినప్పటికీ కూడా, వార్తవెనుక ఉండవల్సింది నిజం, అదే ప్రాణం. వార్తకు ప్రాణశక్తి నిజం.

*ప్ర: జర్నలిస్టు వ్యక్తిగత, ఆధ్యాత్మిక, రాజకీయ విశ్వాసాలు జర్నలిజం వృత్తిపై చూపే ప్రభావం ఏమిటి?*

జ: ఆ పత్రికను నడిపే సంపాదకుడికి స్వీయ నియంత్రణ లేనపుడు అది పేపరుమీద పడుతుంటుంది. అది తప్పు. వ్యక్తిగతమైన విశ్వాసాలు - పేపరుమీద, దాని ద్వారా సమాజంమీదా రుద్దేహక్కు సంపాదకుడికి లేదని ఖండితంగా చెప్తాను. ఆ సంపాదకుడు ఒక నాస్తికుడుకావచ్చు. అలాగని సమాజంలో ఎక్కువమంది ఆస్తికులు ఉన్నపుడు, సమాజంలో ఉన్న వాళ్లు అది కోరుతున్నప్పుడు లేదా ఆస్తిక సంబంధమైన కార్యక్రమం జరిగినపుడు తొసి పుచ్చే హక్కు సంపాదకుడికి లేదు. కేవలం నాస్తికులకే పత్రిక నడుపుతాను అని ప్రకటించుకొని నడుపుకోవచ్చు. కాని తన వ్యక్తిగత నాస్తిక దృక్పథాన్ని జనం మీద రుద్దే హక్కు అతనికి ఉండదు. అలాగే ఒక ఆస్తికుడు తాను విశ్వసిస్తాను కనుక పత్రికద్వారా ఇదే ఇస్తాను, లేకపోతే ఇదే చేస్తుంటాను అని చెప్పే హక్కులేదు. అటువంటి పత్రికని నిష్పక్షపాత పత్రిక అని అనరు. పక్షపాతంతోటి ఒకేవైపు ఒరిగిపోయి నడుస్తున్న పత్రిక అని అంటారు. ఒకేవైపు ఒరిగిపోయిన పత్రిక అని ఆ సంపాదకుడికి అభ్యంతరం లేకపోయినట్లయితే తప్పకుండా సంపాదకుడు ఆ దారిలోనే పత్రిక నడిపించుకోవచ్చు.

*ప్ర: ఒకప్పుడు జర్నలిజంలోకి జర్నలిజంమీద అభిరుచి, అనురక్తి ఏదో సేవానిరతి ఉన్నవాళ్లు మాత్రమే వచ్చేవాళ్లు. ఇపుడు కేవలం దీన్ని వృత్తిగానే పరిగణిస్తున్నారు. ఈ క్రమంలోనే అనేక రంగాల్లోకి కాలుష్యం ప్రవేశిస్తున్నట్లుగానే ఈరంగంలోకి కూడా అనేక మందివచ్చి చేరుతున్నారు. దీనివల్ల జర్నలిజం విలువలపరంగా ఏమైనా కోల్పోతోందా?*

జ: సమాజానికి సేవచేయాలి అనే నిబద్ధతతోటి, సేవాదృక్పథంతోటి జర్నలిజంలోకి కొందరు వచ్చారు. వాళ్ళందరూ మహనీయులు. వాళ్లకి ఈరోజున ఉన్న జీతాలు ఆరోజుల్లో లేకపోయినప్పటికీ తినో, తినకోవాళ్లు పొద్దుటి నుంచి సిటీ ఎడిషన్ అయ్యేవరకూ అలాగే రాస్తూ ఉండి కేవలం టీ నీళ్లతోటి, సిగరెట్లతోటి జీవితాన్ని కరిగించేసుకున్న మహానుభావులెందరో తెలుగు జర్నలిజంలో పనిచేశారు. ఇవాళ అలా లేదు. కేవలం అన్ని ఉద్యోగాల్లాగానే ఇది ఉంది అనే వ్యక్తులే ఇందులోకి వస్తున్నారు. నేను ఇందాకనే మనవిచేశాను. దీన్ని వేరుచేసి చూడవలసిన విషయంకాదు. ఇవాళ ఉన్న ఈ సమాజాన్ని మొత్తంగా చూడాలి. ఈ సమాజంలోంచి ఒక భాగాన్ని తెచ్చుకుని మీరు ఈ జర్నలిజంలో కూర్చోబెట్టుకోవల్సిందే. నిబద్ధతలేనివాళ్లు ప్రభుత్వ విధానంవలన తయారైన నిరుద్యోగులు. ఏదో ఒక ఉద్యోగం కోసమని జర్నలిజంలోకి వస్తున్నారు. వందమంది వస్తే 95మంది వాళ్లే ఉంటున్నపుడు విధిగా పత్రికలని నిర్వహించే వాళ్లు ఆసరుకునే తీసుకోవల్సివస్తోంది. ఇది సరిదిద్దుకోవల్సిన అవసరం ఉంది. వృత్తిపరమైన నిబద్ధతలేని వాళ్లు జర్నలిజంలోకి నిర్నిరోధంగా ప్రవేశిస్తున్నారు అని కచ్చితంగా చెప్తాను.

*ప్ర: వార్తాపత్రికల్లో సాహిత్య అనుబంధాలు అవసరమంటారా? ఒకప్పుడు పత్రికలు పండిత ప్రకాండులకే పరిమితమయ్యేవి. ఈనాడవి జనసామాన్యానికి ఉద్దేశించినవికదా?*

జ: ఒకప్పుడు పండిత ప్రకాండులకే అంకితమై ఉండొచ్చుగానీ ఇవాళ భాష, సాహిత్యం సమస్తం సామాన్యులకు అంకితమై నడుస్తున్నాయి. సామాన్యులకు అంకితమైన భాషలోనే సాహిత్యం వెలువడుతున్నది. పత్రికలు కూడా అవే అందిస్తున్నాయి. కనుక వాటిని తొలగించవలసిన అవసరం ఉందని నేను అనుకోను.

అందరికీ అర్ధమయ్యే భాషలోనే అందరూ చదువుకుంటున్న భాషలోనే ఈ సాహిత్యం అంతా వస్తోంది. ఆధునిక తెలుగులో క్లాసిక్స్ అనుకున్నవన్నీ కూడా మొట్టమొదట పత్రికల్లో వచ్చినవే. పత్రికలద్వారానే ప్రపంచానికి తెలిసి ఆతర్వాత అవి పుస్తకరూపంలో వచ్చాయి. మన సాహిత్యం ఎటుపోతున్నదో దీంట్లో వస్తున్న ధోరణులు ఏమిటో తెలియజెప్పేవి పత్రికలు. పత్రికలు పూర్తిగావర్తమాన సాహిత్యాన్ని బహిష్కరించాలన్న ఆలోచన చాలా రాక్షసమైనదని నా అభిప్రాయం.

*ప్ర: మిగతా పత్రికలకు భిన్నంగా ఆధ్యాత్మిక విషయాలకు ఆంధ్రప్రభలో పెద్దపీటవేస్తున్నారు. దీనికి కారణం ఏమిటి?*

జ: పాఠకుడిని దృష్టిలో పెట్టుకునే ఇలా చేస్తున్నాం. వారి దృష్టి అలా ఎందుకు మారింది అన్నది సామాజిక పరమైన విషయం. సమాజంలో ఆరకమైన మార్పు వచ్చింది. నాస్తికత్వాన్ని గురించి మీరు ఎంత ప్రచారం చేసినప్పటికీ ఆస్తికుల సంఖ్య పెరుగుతోందన్నది వాస్తవం. నేను ఆస్తికుణ్ణో, నాస్తికుణ్ణో మీకనవసరం. ఒక వాస్తవం అది. ఒక ఆధ్యాత్మిక సమావేశానికి మీరు వెళ్లిచూడండి. ఎవరో సుందరచైతన్యానంద అని పేరు పెట్టుకుందాం. ఆయన ఎక్కడికైనావెళ్తే వేల సంఖ్యలో జనం వస్తున్నారు. రెండేళ్ల క్రితం హైదరాబాద్‌లో అయితే లక్షపైన జనం వచ్చారు. వీళ్లంతా సమాజంలోంచే వచ్చారు. వీళ్లంతా పాఠకులే. ఆంధ్రప్రభ పాఠకుడు కావచ్చు. ఇతర పత్రికల పాఠకులు కావచ్చు. లక్షమంది ఒకే చోట భగవద్గీత ఉపన్యాసాలను వినడానికి వస్తున్నారు. రాగల్గినవాళ్లు లక్షమంది ఉంటే రాకుండా ఇళ్లదగ్గరుండి ఆసక్తి ఉన్నవాళ్లు వీళ్లకి నాలుగైదు రెట్లు ఉండొచ్చు. హైదరాబాద్ నగరంలోనే ఆధ్యాత్మిక విషయాలను చదివేవాళ్లు నాలుగైదు లక్షలమంది ఉన్నారు అని మీరు అనుకోవాలి. ఇంతమంది ఉన్నారని అనుకున్నపుడు ఏ పత్రిక మాత్రం దాన్ని ఉపేక్షించగలదు. చదివే పాఠకులు ఉన్నారు గనుక ఆధ్యాత్మిక విషయాలకు ఇదివరకు లేని ప్రాముఖ్యం ఇవ్వాల్సి వస్తోంది. అన్ని పేపర్లు ఇవాళ ఆధ్యాత్మిక ప్రవచనాన్ని విధిగా ప్రచురించాల్సి వస్తోంది.

*ప్ర: ఇటీవలి కాలంలో విలేకరుల్లో అవినీతి పెరిగిపోయిందనే ఆరోపణలు బాగా వినవస్తున్నాయి. ఈ నేపథ్యంలో జర్నలిజం కోల్పోతున్న విలువలేమిటి. ఈ అవినీతిని - కట్టడిచేయడానికి ఎవరైనా తీసుకోవల్సిన చర్యలేమిటి?*

జ: ఇది నిజానికి అందరూ బాధపడాల్సిన విషయం. వృత్తిపరమైన నిబద్ధత లేకుండా వ్యక్తులు దీంట్లోకి రావడంవల్ల, కొంత వరకు పత్రికలుకూడా తెలుసోతెలియకో ఈ ధోరణిని ప్రోత్సహిస్తుండటంవల్ల ఈ వృత్తి కొంత నవ్వులపాలవుతోందనేది వాస్తవం. జిల్లా ఎడిషన్లతో పత్రికల మధ్యపోటీ పెరిగింది. మారుమూల పల్లెల్లోసైతం విలేకర్లని నియమించాల్సిన అవసరం ప్రతి పత్రికకీ కలిగింది. సరైన విద్య లేని నిరుద్యోగులుగా ఉన్న వ్యక్తులని తీసుకొచ్చి మీరు విలేకరులు అని ఓ చిన్న కార్డు ఇచ్చేసి పంపించడంతోటి వాళ్ల ఇహ ఊళ్లమీదపడి ఈ రకమైన వికృతమైన పనులు చేస్తున్నారు. వాళ్లకి జర్నలిజం పట్ల అవగాహన ఉండట్లేదు. అది తెలుగుకాదు, ఇంగ్లీషుకాదు. ఇక్కడ డెస్క్ దగ్గర తిరగవ్రాసుకోవడం. వార్తంటూ ఇచ్చాడులే అని ముద్రించడం. అతడికి జీతమనేది పత్రికలవాళ్లు ఇచ్చినా ఇవ్వకపోయినా జేబులో లైసెన్సు బిళ్లలాంటి కార్డు ఒకటి పట్టుకొని ప్రభుత్వ అధికారుల దగ్గరికి వెళ్లడం, లేదా ఇతర ప్రైవేటువ్యక్తుల దగ్గరికి వెళ్లడం. మీమీద వార్తలు వ్రాస్తాం అని ఒక రకంగా బ్లాక్‌మెయిల్ చేయడం. వాళ్లదగ్గర్నుంచి సదుపాయాలో మరొకటో తీసుకోవడం, ఇంకా కొందరైతే డబ్బుకూడా తీసుకుంటున్న సంఘటనలు జరుగుతున్నాయి. అటువంటి ఆరోపణలు మా దృష్టికి వస్తున్నాయి. రకరకాలైన బాధలు మేం అనుభవిస్తున్నాం. దీనివల్ల చూసేవాళ్లకి ఏదో చిన్న వస్తువుతో జర్నలిస్టులని కొనేయవచ్చు అనే అభిప్రాయానికి, దుస్థితికి ఇవాళ మనం దిగజారిపోయాం. దీన్ని సంస్కరించి మార్చుకోవల్సిన అవసరం చాలా ఉంది. మేం ఎక్కడికైనా వెడితే మీటింగుల్లో ఇదే విషయం చెప్తున్నాం. మా జర్నలిస్టు కమ్యూనిటీ మీటింగుల్లో కూడా చెప్తున్నాం, మన జర్నలిస్టులమీద చెడ్డమాట పడుతోంది. పడకుండా చూసుకోవల్సిన బాధ్యత మీలో సీనియర్ల మీద ఉంది అని చెప్తున్నాం. నవ్వులపాలవుతున్నారు జర్నలిస్టులు. జర్నలిస్టుల మీద పడినమాట పోవటానికి ప్రయత్నించాలి.

*ప్ర: యువ పాత్రికేయులకు మీరిచ్చేసలహా?*

జ: ఈ వృత్తిలోకి ప్రవేశించేవారికి సామాజిక సేవాసంబంధ నిరతి, నియంత్రణ కావాలి. పత్రికద్వారా సమాజానికి సేవచేయాలనే నిబద్ధత అవసరం. జర్నలిజంలోకి వచ్చే ఏ యువకుడైనా ఆ ప్రతిజ్ఞచేసే ఇందులోకి రావాలి. భాషాజ్ఞానం, ప్రపంచ జ్ఞానం లేకుండా ఈ వృత్తిలోకి రాకూడదు. కావ్యాలను అధ్యయనం చేసినవారికే శబ్దజ్ఞానం ఉంటుంది. ఆ శబ్దజ్ఞానం ఉన్నవారికే శబ్దంమీద అధికారం ఉంటుంది. శబ్దాధికారం ఉన్నవారికే శబ్దాన్ని

స్పృశించే హక్కు ఉంటుందని శ్రీశ్రీ చెప్పారు. కానీ ఇవాళ యువతరానికి వెనకటి సాహిత్యం చదవమని చెప్పడంలేదు. ఈ రకంగా అన్యాయం చేస్తున్నారు. ప్రపంచంలో ఎక్కడ ఏ పరిణామం చోటు చేసుకుంటుందో పత్రికల ద్వారా తెలుసుకోవాలి. భాషాజ్ఞానం తెచ్చుకుని, నిబద్ధతను మనసుకెక్కించుకుని ఈ వృత్తిలోకి రావాలని యువపాత్రికేయ మిత్రులకు ఒక సోదరుడిగా నాసలహా.

## సమాజంలో వార్త రూపురేఖలు

సభ్య సమాజాలలో రాజకీయమైన ఒత్తిడులుంటాయి. వర్గాల అదృశ్య హస్తం వుంటుంది. కనపడే ప్రేరణలుంటాయి. సామాజికమైన ఒరిపిడులుంటాయి. చదువుకున్నవారి మర్యాదలుంటాయి. నాగరికమైన అలవాట్లు నేర్పిన ఆంక్షలుంటాయి. సింహాసనం ప్రమేయంగల వార్తయినా (భుట్టోకి మరణశిక్ష) రోడ్డుమీద దుర్మరణమయినా ఈ వంపుల ద్వారా ప్రసంగించవలసినదే. ఇనుప తెరల దేశమయితే అక్కడ అన్నీ ఆంక్షలేవుంటాయని, భుజకీర్తులు తగిలించుకొన్న ప్రజాస్వామిక దేశమయితే చాలు అన్ని వార్తలు సత్యములే అని భావించనక్కర్లేదు.

– పన్నాల సుబ్రహ్మణ్య భట్టు

# పరిశోధనాత్మక జర్నలిజానికి పరిమితులున్నాయి !



శ్రీ కె. రామచంద్రమూర్తితో

ముఖాముఖి

సెన్సాఫ్ హ్యూమర్ మెండుగా కలిగిన శ్రీ కె. రామచంద్రమూర్తి ఖమ్మంజిల్లా తల్లాడలో జన్మించారు. రాజకీయ శాస్త్రంలో ఎం.ఎ. చేసిన ఆయన ఉస్మానియా యూనివర్సిటీలో జర్నలిజంలో బ్యాచిలర్ కోర్సు పూర్తిచేశారు. *1973*లో ఆంధ్రప్రభలో చేరారు. *1984*లో ఉదయం పత్రిక ప్రారంభం అయినప్పటి నుంచి అందులో కొనసాగుతున్నారు. ప్రస్తుతం ఆ పత్రికకు ఎడిటర్‌గా ఉన్నారు. ఢిల్లీలో ఆంధ్రజ్యోతికి స్పెషల్ కరస్పాండెంట్‌గా పనిచేసిన అనుభవంకూడా శ్రీరామచంద్రమూర్తికి ఉంది.

క్రీడారంగంలో మంచి పరిచయంగల శ్రీ మూర్తి క్రీడా భారతం పేరిట భారతదేశ క్రీడా దృశ్యాన్ని చిత్రించారు. ఉదయంలో రెండేళ్లకుపైగా 'సరదాల పరదా' శీర్షికన వ్యంగ్య రచనలు చేశారు. *1988*లో ఇదే పేరిట ఇవి పుస్తకంగా వెలువడ్డాయి. జర్నలిజం వృత్తికి సంబంధించి రాసిన 'అమీబా' నవల ఉదయం వీక్లీలో ధారావాహికగా ప్రచురితమైంది. వార్తారచన సూత్రాలు, సూచనల పేరిట రిపోర్టింగ్ టెక్నిక్స్‌ను తెలియచెప్తూ ఆయన రాసిన పుస్తకం ప్రాచుర్యం పొందింది. ఆయన ఇంటర్వ్యూను చదవండిక.

*ప్ర: పత్రిక పాలసీ కారణంగా రిపోర్టింగ్‌లో ఆబ్జెక్టివిటీ కోల్పోవడంగానీ విలువల పరంగా పతనంగానీ ఏమైనా ఉంటుందా?*

జ: తప్పక ఉంటుంది. పాలసీ అన్నప్పుడే పరిమితులు అనివార్యంగా చోటుచేసుకుంటాయి. పాలసీ అంటే దానికి అనుగుణంగా లేనిది రాయకూడదనే అర్థం వస్తోంది. సాధారణంగా పత్రిక పాలసీ ఎడిటోరియల్‌కే పరిమితం కావాలి. రాజకీయ పరిణామాలపై వ్యాఖ్యాసహిత వార్తలు రాసేటప్పుడు, బిజినెస్ రిపోర్టింగ్‌లో పాలసీకి అనుగుణమైన మొగ్గుతప్పనిసరి. కొన్ని సామాజిక సమస్యలు ఉత్పన్నమైనపుడు కూడా ఆయా పత్రికా యాజమాన్యాల అభిప్రాయాలూ, అభిరుచులు, నమ్మకాలు రిపోర్టింగ్‌ను ప్రభావితం చేస్తున్నాయి. సోషల్ ఫిలాసఫీ తప్పనిసరి ప్రభావం చూపుతుంది. రాజస్థాన్‌లో 'సతి' జరిగినప్పుడు కొన్ని పత్రికలు ఆ దురాచారాన్ని సమర్థించాయి. సతిని విశ్వసించే అగ్రవర్ణాల చేతుల్లో ఆ పత్రికలు ఉండటమే ఇందుకు కారణం. మన రాష్ట్రంలో జరిగిన కారంచేడు, చుండూరు, నీరుకొండ ఘటనలకు సంబంధించిన రిపోర్టింగ్‌లో కూడా తేడాలు కన్పిస్తాయి.

*ప్ర: ఢిల్లీలో రిపోర్టర్ అనుభవం ఎలా ఉపకరిస్తుంది?*

జ: ప్రతి ఎడిటర్, సీనియర్ జర్నలిస్ట్ కొంతకాలంపాటు ఢిల్లీలో పనిచేయడం

మంచిది. దేశపాలనా వ్యవస్థకు నాడీకేంద్రాలైన పార్లమెంట్, ప్రధాని కార్యాలయం, విదేశాంగ, రక్షణ శాఖలు వంటి కీలక విభాగాల పనితీరును స్వయంగా సన్నిహితంగా చూసే వీలుంటుంది. దేశాన్ని ఎలా పాలిస్తున్నారు? ఫీడ్ బ్యాక్ ఎలా వుంది? ఇటువంటి విషయాలన్నిటిపై స్పష్టమైన అవగాహన ఏర్పడుతుంది. పాలకపక్షం ఆలోచనా ధోరణులు అవగతమవుతాయి. ఢిల్లీలో పనిచేయడం ద్వారా జాతీయ దృక్పథం ఏర్పడుతుంది. వివిధ రాష్ట్రాలు, ఆ రాష్ట్రాల ప్రజల గురించిన విస్తృత అవగాహన ఏర్పడుతుంది. భిన్నత్వంలో ఏకత్వాన్ని ఢిల్లీలో స్పష్టంగా చూడవచ్చు. రాజకీయ వ్యవస్థలకు ఆయువుపట్టు అయిన హిందీబెల్ట్ గురించి మరింతగా అవగాహన చేసుకోవటానికి నాఢిల్లీ రిపోర్టింగ్ అనుభవం ఉపకరించింది. సీనియర్ జర్నలిస్ట్‌లతో కలిసి పనిచేసే వీలుకల్గింది. వారి పని విధానాలను, క్రమశిక్షణను ఆకళించుకునే అవకాశం కల్గింది.

*ప్ర: పత్రికా యజమానులపై తప్పనిసరిగా ఒత్తిడి కూటములు ఉంటాయి. ఇలాంటి సందర్భాల్లో పత్రికా యజమానుల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని ఎడిటర్ పనిచేయాలా? ప్రజా ప్రయోజనాలకు అంకితం కావాలా?*

జ: ఆయా సందర్భాలనుబట్టి ఆయా ఎడిటర్లు వ్యక్తిగతంగా నిర్ణయించుకోవలసిన విషయమిది. ప్రతి ఒక్క సంపాదకుడికీ స్వతస్సిద్ధంగా పరిమితులుంటాయి. ఎడిటర్‌ది కూడా ఉద్యోగమే. అది ఉద్యమంలో ఒక భాగంకాదు. ఇతర వృత్తులమాదిరే ఇదికూడా వృత్తి. ఇతర వృత్తుల్లో కూడా ఇటువంటి సమస్యలు ఎదురవుతుంటాయి. ముఖ్యమంత్రి మాట వినాలా? ప్రజలకు హాని చేయాలా? అన్న సమస్య ఓ ఐ.ఎ.ఎస్. అధికారికి ఎదురైతే తనకుతానే ఆలోచించుకుంటాడు. ఎంతవరకు రాజీపడవచ్చు, యాజమాన్య ప్రయోజనాలను ఎంతవరకు ఎకామ్‌డేట్ చేయగలం అన్నది ఆయా సందర్భానుసారం ఆలోచించి నిర్ణయించుకోవలసిన విషయం. ప్రజల విస్తృత ప్రయోజనాలకు భంగం కల్గించకుండా ఏ ఎడిటర్‌కా ఎడిటర్ తనకున్న పరిమితుల్లో తనకున్న కొలమానాల్తో అనుభవంతో నిర్ణయం తీసుకోవలసివుంటుంది. ఒకటేరకమైన పరిస్థితుల్లో సైతం సంపాదకులందరూ ఒకే రకంగా ప్రతిస్పందించరు. ఎవరి నైతికస్థాయి వారికి ఉంటుంది. అందుకు తగ్గట్టే వారికి సమాజంలో గౌరవం, ఆదరణ ఉంటాయి.

పరిమితులు ఉన్నాయని మనవి చేసుకుంటే ఎవరైనా అర్థం చేసుకుంటారు. అలా కాకుండా బహిరంగంగా భీషణ ప్రతిజ్ఞలు చేస్తూ, నికార్సయిన నీతిమంతులుగా ఉంటామని నమ్మబలుకుతూ, ఇతరులను అవినీతిపరులంటూ అదేపనిగా నిందించే జర్నలిస్టులు వ్యక్తిగత జీవితంలో అవే నియమాలను ఉల్లంఘించినప్పుడే పేచీ వస్తుంది. ఇటువంటి జర్నలిస్టులు ఎంతటి ఉన్నతస్థాయి పదవిలో ఉంటే జర్నలిస్టు జాతికి అంతటి అపకారం జరుగుతుంది. నీతిమంతులైన జర్నలిస్టులకు సైతం అపకీర్తిలో వాటా తప్పదు.

ప్ర: పరిశోధనాత్మక రిపోర్టింగ్‌కు పరిమితులున్నాయా?

జ: గుట్టును బయటపెట్టడం ఒక్కటే పత్రికల పనికాదు. పత్రికల కర్తవ్యాల్లో అదికూడా ఒకటి కావచ్చు. కూపీ లాగడం గూఢచార సంస్థల బాధ్యత. జరుగుతున్నది చెప్పడం, దాన్ని అన్వయించడం పత్రికలు చేయాల్సిన పని. నిజానికి పరిశోధనాత్మక జర్నలిజంలో పత్రికల రాతలన్నీ నిజాలని నిర్ధారించలేం. ఉదాహరణకు మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా అంతూలే ఉన్నకాలంలో ఆయన ఇందిర ప్రతిభా ప్రతిష్ఠాన్ అనే సంస్థపేరిట ముడుపులు వసూలు చేశారని అరుణ్‌శౌరి ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో పదునైన పరుష పదజాలంతో పుంఖాను పుంఖంగా రాశారు. అంతూలే గద్దెదిగేవరకూ అరుణ్‌శౌరి విశ్రమించలేదు. అరుణ్‌శౌరి రచనలవల్ల అంతూలే రాజకీయ జీవితం చిన్నాభిన్నం అయింది. ఆయన ఇంతవరకూ కోలుకోలేకపోయారు. అరుణ్‌శౌరి ఆరోపణలనే కోర్టు పన్నెండేళ్లపాటు విచారించింది. అంతూలే నిర్దోషి అని కోర్టు తేల్చిచెప్పింది. ఇండియన్ ఎక్స్‌ప్రెస్, అరుణ్‌శౌరి నిజం చెప్పినట్లా? న్యాయస్థానాలు నిజంచెప్పినట్లా? అరుణ్‌శౌరి రాతల ద్వారా అంతూలే పతనమైనపుడు సమాజం శభాష్ అంది. కానీ అంతూలేకి జరిగిన నష్టం చెరిపేసినా చెరిగిపోనిది. ఒక వేళ మళ్లీ అరుణ్‌శౌరి అంతూలే నిర్దోషి అంటూ రాసి ఈ అపవాదును పోగొట్టాలన్నా జరిగే పనికాదు. కాబట్టి పరిశోధనాత్మక జర్నలిజానికి పరిమితులున్నాయి. అదో ఆయుధం. దానిని విచక్షణతో ఉపయోగించాలి.

ప్ర: పరిశోధనాత్మక జర్నలిజానికి పరిమితులున్నప్పటికీ మన పత్రికల్లో ఆ తరహా వార్తలు మచ్చుకైనా ఈమధ్య కానరావడంలేదెందుచేత?

జ: పత్రికా యజమానుల ప్రయోజనాలు అటుంచి, వారి ఫిలసాఫికల్ దృక్పథం కూడా ఇందుకు కారణం. మనం పత్రికలద్వారా ఎదుటివారి మనసులను గాయపరచడం ఎందుకులే అనే భావం ఈ వార్తలు వెనకబడటానికి ఒక కారణం. మన పత్రికల్లో పరిశోధనాత్మక వార్తలు లేకపోయినా ఇన్‌డెప్త్ రిపోర్టింగ్ కనిపిస్తోంది. రహస్యఫైళ్లను పత్రికలు బయటపెట్టకపోవచ్చు. కానీ విషయాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి వార్తావ్యాసాలు రాస్తున్నారు. పరిశోధనాత్మక జర్నలిజంలోని ప్రమాదకర పార్శ్వం కూడా యాజమాన్యాలను ఈ విషయంలో నిలువరిస్తుండవచ్చు.

ప్ర: ఎలక్ట్రానిక్ మీడియా విస్తృతి కారణంగా భవిష్యత్తులో ప్రింట్ మీడియా స్వరూప స్వభావాలు ఎలా మారనున్నాయి?

జ: ఎలక్ట్రానిక్ మీడియా కారణంగా ప్రింట్ మీడియాకున్న ప్రాముఖ్యం, ప్రాచుర్యం తగ్గవు. ప్రింట్ మీడియాకున్న సౌలభ్యాలు ఇందుకు కారణం. అచ్చు రూపం తొడిగిన విషయాన్ని భద్రపరచుకోవచ్చు. కావలసినపుడు రిఫర్ చేయవచ్చు. వార్తాపత్రికలు సమాచారాన్ని లోతుగా, విశ్లేషణాత్మకంగా అందించవీలుంది. అమెరికాలోసైతం ఎలక్ట్రానిక్

మీడియా కారణంగా తొలుత కొంతమేరకు ప్రింట్ మీడియా దెబ్బతిన్నా ఆ తర్వాత యధాస్థానానికి వచ్చింది. ఇప్పుడు అక్కడ ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలు నేటికవే పురోగమిస్తున్నాయి. ఎలక్ట్రానిక్ మీడియా వల్ల ఎదురవుతున్న పోటీ, సవాళ్లు ఏవైనావుంటే అది ప్రింట్ మీడియా అభివృద్ధికి సానుకూలంగా దోహదపడేదే. ప్రింట్ మీడియా నవీకరణకు పరోక్షంగా ఎలక్ట్రానిక్ మీడియా దోహదపడుతోంది. వార్తాసేకరణలో వేగం మరింత పెరుగుతుంది. ముద్రణలో మరిన్ని సొగసులు వచ్చి చేరతాయి. ఎలక్ట్రానిక్ విప్లవం కారణంగా పత్రికారంగంలోనూ అనూహ్యమైన మార్పులు రావటం అనివార్య పరిణామం. కాబట్టి ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాల మధ్య వైరుధ్యం లేదు. ఒక మీడియా విస్తరణకు రెండో మీడియా దోహదం చేస్తుంది. సమాచార సేకరణ, సమర్పణలో ఆరోగ్యకరమైన పోటీ ఉంటుంది.

*ప్ర: గతపదేళ్లలో పత్రికారంగంలో వస్తున్న మార్పులేమిటి?*

జ: గత పదేళ్లలోనే పత్రికారంగం చాలా మారింది. ప్రింటింగ్ ప్రమాణాలతోపాటు, ఎడిటోరియల్, రిపోర్టింగ్ ప్రమాణాలు కూడా బాగా పెరిగాయి. వార్తాపత్రికలు మారుమూల పల్లెలకు కూడా అందుతున్నాయి. దేశం నలుమూలల విశేషాలు పత్రికలద్వారా వెలుగుచూస్తున్నాయి. ఇదో విప్లవం. పత్రికల మధ్య పోటీ ఆ రంగం అభివృద్ధికిబాట వేస్తుంది. ఉన్నత వార్తాప్రమాణాల దిశగా పయనింప జేస్తుంది.

*ప్ర: గతపదేళ్లలో రిపోర్టింగ్ తీరుతెన్నులు ఎలా మారాయి?*

జ: రిపోర్టింగ్‌లో పూర్వంకంటే రాశి పెరిగింది. జిల్లా ఎడిషన్లే ఇందుకు కారణం. రాశి పెరిగి వాసి తరగడం ఆందోళనకర పరిణామం. వార్తాసేకరణ, ఎడిటింగ్, ప్రింటింగ్ వగైరాలన్నీ కాలంతో పరుగులు తీస్తూ నిర్ణీత కాలవ్యవధిలో పూర్తిచేయాల్సి వస్తున్నందున వార్తల వాసికి గండిపడుతోంది. జాతీయ, రాష్ట్రస్థాయిల్లో పొలిటికల్ రిపోర్టింగ్ క్వాలిటీ పెరిగింది. దేశ, విదేశాల్లో జర్నలిజంలో ప్రత్యేక శిక్షణ పొందినవారు ఈ రంగంలో కాలిడుతున్నారు. పత్రికా ప్రమాణాలకు నారూ నీరూ పోసే కృషిలో వీరి పాత్ర గణనీయమైనది.

ఈతరం పాత్రికేయులు పొలిటికల్ రిపోర్టింగ్‌లో పాతతరం పాత్రికేయులను మించిన అవగాహనను, పరిణతిని ప్రదర్శిస్తున్నారు. ఇది శుభ పరిణామం. ఒకప్పుడు రాజకీయాలకు, నేరాలకు, సామాజిక రంగానికి మాత్రమే రిపోర్టింగ్ పరిమితమయ్యేది. ఇప్పుడు బిజినెస్, సైన్స్, హెల్త్, కన్స్యూమర్ మార్కెట్, స్పోర్ట్స్ వంటి రంగాలకు విస్తరించింది. రిపోర్టింగ్ డైమెన్షన్ పెరిగింది. గ్రామీణ వార్తల గురించి, విలేకరుల గురించి ఎక్కువ శ్రద్ధతీసుకోవలసిన అవసరం ఉంది. గ్రామీణ విలేకరులకు నిరంతర శిక్షణ ఇవ్వడం ద్వారా ఆరంగంలో ప్రమాణాలు పెంచడానికి పాటుపడాల్సిన అవసరం ఉంది.

*ప్ర: రిపోర్టర్ ఉద్యోగానికి ఇతర ఉద్యోగాలకు తేడా ఏమిటి? బతుకుతెరువుకు ఇదీ ఒకమార్గం అనే అభిప్రాయం సబబేనా? ఇంతకు మించిన అర్థం, పరమార్థం ఏమైనా ఉందా?*

జ: రిపోర్టరయినా సబ్‌ఎడిటర్ అయినా జర్నలిస్ట్ ఉద్యోగం సేల్స్‌మన్ ఉద్యోగానికంటే భిన్నమైనది. ఉపాధ్యాయుడు, న్యాయవాది. సైనిక జవాను వంటి వృత్తులతో జర్నలిజం వృత్తిని పోల్చిచూడవచ్చు. ఉదరపోషణతోపాటు సమాజసేవ కూడా చేయగలిగిన అవకాశం ప్రజల ఆకాంక్షలను ఆశలను గుర్తించడం. ప్రభుత్వం చేపట్టే ప్రజోపయోగ కార్యక్రమాలను వెలుగులోకి తేవడంద్వారా సమాజ శ్రేయస్సుకు జర్నలిస్ట్ పాటుపడవచ్చు. తక్షణ సమస్యల పరిష్కారానికేకాక, అభివృద్ధి ప్రక్రియకూ అతడు దోహదకారి కావచ్చు. సమాజసేవాంకితులైనపుడు సౌఖ్యం, సమయం వగైరాలను త్యాగం చేయకతప్పదు. సేవాభావం లేకపోతే జర్నలిజం సామాజిక పరివర్తన క్రమంలో సాధనం కాకుండా పూర్తిస్థాయి వ్యాపారంగా దిగజారుతుంది.

*ప్ర: 'సోర్స్'గురించి సంపాదకుడికీ, పత్రికాధిపతికీ తెలియచేయాల్సిన బాధ్యత రిపోర్టర్‌కు ఉందా?*

జ: ఉంది. మన దేశంలోనే కాకుండా పత్రికా స్వేచ్ఛను ఫస్ట్ ఎమెండ్ మెంట్ ద్వారా ప్రాథమిక హక్కుగా ప్రసాదించిన అమెరికాలో కూడా సోర్స్ వెల్లడించే బాధ్యత జర్నలిస్ట్‌పై ఉంది. పత్రికాధిపతి, ఎడిటర్‌లేకాదు. న్యాయ స్థానంలో న్యాయమూర్తి అడిగినా సోర్స్ వెల్లడించాల్సిందే. ఎవరికీ సోర్స్ వెల్లడించననడం ఆమోదయోగ్యంకాదు.

*ప్ర: పార్టీ రాజకీయాల్లోవున్నవారు పత్రికలు నడపవచ్చా?*

జ: పార్టీనాయకులు పత్రికలు నిర్వహించడంపై ఎటువంటి ఆక్షేపణాలేదు. పార్టీలే పత్రికలు నడుపుతున్నపుడు పార్టీనేతలు పత్రికలు నడిపితే తప్పు ఏముంది? పార్టీలు నడిపినా, నేతలు నడిపినా పత్రికలకు విశ్వసనీయతే ప్రధానం. పాక్షిక దృష్టితో వార్తలు, వ్యాఖ్యలు వస్తున్నపుడు పార్టీ పత్రికలకు, పార్టీ నాయకత్వానికి విలువవుండదు. అన్నిరకాల అభిప్రాయాలకూ తగిన ప్రాధాన్యం లభిస్తోందనే విశ్వాసం ప్రజల్లో కలిగితే పత్రికలను ఎవరు నిర్వహిస్తున్నారన్నది అప్రస్తుతం అవుతుంది. ఉదాహరణకు - బిర్లాకు ఓ రాజకీయ పార్టీపట్ల మొగ్గువున్నా ఆయన నేతృత్వంలోని హిందుస్థాన్ టైమ్స్ ఢిల్లీలో మిగతా పత్రికల కంటే సర్క్యులేషన్ పరంగా ముందుంది. ఆ పత్రికకు విశ్వసనీయత ఉన్నకారణంగానే ఇది సాధ్యం అయింది.

*ప్ర: కాలమిస్ట్ కష్టాలేమిటి?*

జ: కాలమిస్ట్‌కైనా, సాధారణ జర్నలిస్ట్‌కైనా విశ్వసనీయత చాలా ముఖ్యం. వాస్తవాలను

ప్రాతిపదికగా చేసుకుని నిష్కర్షగా, నిష్కపటంగా వ్యాఖ్యానించడంద్వారా కాలమిస్ట్ విశ్వసనీయతను పెంచుకోగలుగుతాడు. వ్యాఖ్యాత తన వ్యాఖ్యల విషయంలో నిష్పక్షపాతంగా, ఉదాత్తంగా వున్నాడన్న విషయాన్ని పాఠకుడు విశ్వసించాలి. కాలమిస్ట్ వాస్తవ విషయాలపై ఏ కోణంలోనైనా దృష్టి సారించవచ్చు. ఈ సందర్భంలో అన్ని వర్గాల పాఠకులను అతను సంతృప్తి పరచలేకపోవచ్చు. ఉదాహరణకు అయోధ్య పరిణామాలనే తీసుకోండి. ఆర్.ఎస్.ఎస్. అనుకూల వ్యాఖ్యాత చేసే వ్యాఖ్యానాలను కేవలం ఆర్.ఎస్.ఎస్. వారు మాత్రమే విశ్వసించగలుగుతారు. అలాగే వామపక్ష అనుకూల వ్యాఖ్యాత వ్యాఖ్యానాలను ఒక్క వామపక్ష వాదులు మాత్రమే విశ్వసించగలుగుతారు. ఈ ఇద్దరు వ్యాఖ్యాతలు అందరినీ సంతృప్తి పరచలేరు. అయితే వాస్తవాలను అన్ని కోణాలనుంచి విడమరచి చెప్పి పాఠకులకే తీర్పును వదిలివేసే వ్యాఖ్యాతలూ వున్నారు. వీరి విశ్వసనీయతను శంకించే ప్రమాదం తక్కువ. ఇటువంటి కాలమిస్టుల తీర్మానంతో ఏకీభవించలేని పాఠకులు సైతం వారి వాస్తవాలనూ, విశ్లేషణలనూ కాదనలేదు. అదే విశ్వసనీయత అంటే.

ప్ర: కాలమిస్ట్ చేయాల్సిన కృషి ఏమిటి?

జ: ఏదో ఒక రంగంలో కాలమిస్ట్ స్పెషలైజ్ చేయగలగాలి. ప్రతి రంగంమీదా వ్యాఖ్యానించడం కాలమిస్ట్‌కు కానిపని. ఒకరంగంలో నిష్ణాతుడైవుండి ఆరంగానికి సంబంధించిన విషయాలను విశ్లేషించినపుడు ఆ కాలమిస్ట్ వ్యాఖ్యలకు మన్నన, గౌరవం లభిస్తాయి. కాలమిస్ట్ కేవలం సమాచారాన్ని సేకరించుకోవడమే కాకుండా, ఒక పరిణామం జరిగినపుడు దానిపై పరిమిత కాలవ్యవధిలో వ్యాఖ్యానించగల నేర్పుని సంతరించుకోగలగాలి. భవిష్యత్ పరిణామ దృశ్యాన్ని కాలమిస్ట్ మనోనేత్రంతో వీక్షించగలగాలి. ఆయా పరిణామాలపై భూత, వర్తమాన విషయావగాహన కలిగి వుండటం కాలమిస్ట్‌కు అంతర్ దృష్టిని ప్రసాదిస్తుంది. విషయావగాహన కోసం కాలమిస్ట్ ఎంతగా శ్రమిస్తే అంతగా అతడు తన వృత్తిధర్మాన్ని నెరవేర్చగలుగుతాడు. ఈ స్పీడుయుగంలో అన్నిటినీ చదివి, ఆకళింపుకుని నిర్ణయానికి వచ్చే వ్యవధి పాఠకుడికి ఉండటం లేదు. కాలమిస్ట్‌లు పాఠకుల తరఫున తామే అన్ని విషయాలను ఆకళింపుకుని తమ సునిశిత వ్యాఖ్యలు, పరిశీలనలద్వారా పాఠకులు ఆయా విషయాలపై సరైన అవగాహన ఏర్పరచుకునేందుకు దోహదపడుతున్నారు. ఈ సందర్భంలో ఓ ఉదాహరణ చెప్పుకోవచ్చు. పి.వి. నరసింహారావు ప్రధాని హోదాలో జర్మనీ పర్యటనకు వెళ్లినపుడు దూరదర్శన్ వార్తల మధ్యలో ఢిల్లీ కాలమిస్ట్ ఎస్. వెంకటనారాయణ తనకు కేటాయించిన నిమిషం వ్యవధిలో ప్రధాని పర్యటన ప్రాధాన్యాన్ని చారిత్రక దృక్కోణంలో వివరించారు. విభిన్న సందర్భాల్లో వ్యాఖ్యలకున్న ప్రాధాన్యాన్ని ఇది తేటతెల్లం చేస్తున్నది.

ప్ర: యువ రిపోర్టర్లకు మీరిచ్చే సూచనలు, సలహాలు?

జ: జర్నలిజం కేవలం వృత్తి మాత్రమే కాదు. సామాజిక సేవకూడా. సామాజిక

దృక్పథంలో పాత్రికేయులు నడుచుకోవాలి. సత్యానికి కట్టుబడి సీరియస్‌గా వృత్తిధర్మాన్ని నిర్వర్తించగలగాలి. ఇంటెగ్రిటీ అన్నది చాలా ముఖ్యం. ప్రలోభాలకు లొంగకుండా విశాల ప్రజాప్రయోజనాలను పరిరక్షించాలి.

*ప్ర: తెలుగుదేశం అసెంబ్లీ ఎన్నికల్లో ఇంతటి ఘన విజయాన్ని సాధిస్తుందని పత్రికలతో సహా ఎవరూ ఊహించలేదు? దీన్ని బట్టి పత్రికల అంచనాలు వాస్తవానికి దూరం అయినట్లు భావించవచ్చా?*

జ: ప్రజల నాడిని పట్టుకోవడంలో ఆయా పార్టీల నేతలతోపాటు పత్రికలు కూడా విఫలమయ్యాయి. పత్రికలుకూడా నేతల మాదిరే ప్రజలకు, వాస్తవాలకు దూరం అవుతున్నాయి. అయినా పత్రికల అంచనాలు తప్పటం ఇదే మొదటిసారికాదు. అంచనాలు నిజమైన సందర్భాలకన్నా తప్పిన సందర్భాలే ఎక్కువ. ప్రజల మనసులో ఏముందో తెలుసుకోవడం అంత తేలికకాదు.

*ప్ర: మహిళలపట్ల పత్రికలు కూడా చిన్నచూపు చూస్తున్నాయనే వాదన ఉంది?*

జ: ముమ్మాటికీ నిజం. ఇది ఇంకా పురుష ప్రపంచమే. అయితే, వ్యాపార అవసరాల వల్ల కావచ్చు, ప్రజాస్వామ్య ధోరణులవల్ల కావచ్చు మహిళలకు ఇతోధిక ప్రాధాన్యం ఇవ్వాలన్న ప్రయత్నం ఇప్పుడిప్పుడే జరుగుతోంది. మహిళలకోసం ఒక పేజీ ప్రత్యేకించడం ఈ ప్రయత్నంలో భాగమే. ఇందులో కూడా మహిళలకు ఒకే పేజీ కేటాయించి వారిని ఒక్కపేజీకే పరిమితం చేస్తున్నారు. అందులో వంటలు వార్పులు, అల్లికలు, చేతిపనులు, పిల్లల్ని పెంచడం, ఇంటిని అందంగా అలంకరించుకోవడం - తదితర కార్యకలాపాలు మహిళలు మాత్రమే చేయదగినవి అన్నట్టు చూపుతున్నారు. ఈ రకంగా సెగ్రిగేట్ చేయకుండా మహిళలను ప్రభావితం చేసే వార్తలను ఎక్కువగా ఇవ్వడం మంచిది. పత్రికలలో పనిచేస్తున్న సిబ్బందిలో కూడా మహిళల సంఖ్యచాలా తక్కువ. ఎడిటోరియల్ డిపార్టుమెంటులోనూ అంతే. డెస్క్‌దగ్గర సబ్‌ఎడిటర్స్‌గామహిళలను తీసుకుంటున్నారు. కానీ రిపోర్టింగ్ విభాగంలో తీసుకోవడానికి సంకోచిస్తున్నారు. ఈ పరిస్థితి పూర్తిగా మారిపోవాలి.

### జనం మాటే జర్నలిస్ట్ బాట

**ప**త్రికా రచయితల్లో సుశిక్షితులు తయారయినప్పుడు, కమ్యూనికేషన్‌కు అనువుగా వారు జన వ్యావహారికాన్ని ఆకళించుకున్నప్పుడు పత్రికా భాష, పత్రికా శైలీ తెలుగుసాహిత్య పుస్తకాలకు పాఠ్యగ్రంథాలకు మేలు బంతి అవుతుంది. ఒరవడి దిద్దుతుంది. పత్రికా రచయితగా నాకా విశ్వాసం ఉంది.

- రాంభట్ల కృష్ణమూర్తి

# జి.కృష్ణ - మాటల సంచిక



**జి.** కృష్ణ, ఆయన పేరులానే ఆయన వ్యక్తిత్వమూ నిత్యనూతనం. ఆయన రాతల్లానే ఆయన మాటల్లోనూ చురుకుదనం. పరిచయంలేనివారికి ఆయన ఓ పట్టాన మింగుడుపడరు. సన్నిహితులకు ఆయన ఓ పసిపిల్లాడు. చరిత్రలో ఉజ్జ్వల ఘట్టాలెన్నింటికో జి. కృష్ణ సజీవ సాక్ష్యం. ఆయనను కదిలిస్తేచాలు 1942 నాటి స్వాతంత్ర్య సంగ్రామ ఘట్టాలను కళ్లకు కట్టిస్తారు. గాంధీ, నెహ్రూ, జిన్నా, టంగుటూరి, మాడపాటి వంటి ఉద్దండులతోపాత్రికేయ వృత్తి ధర్మంగా తనకెదురైన అనుభవాలను, విషయాలను తనదైన చమత్కార ధోరణిలో చెప్పుకొస్తారు.

కృష్ణాజిల్లా మధురాపురం అగ్రహారంలో 1924 అక్టోబర్ 20న కళ్లుతెరిచిన కృష్ణ సికిందరాబాద్‌లోని మేనమామ ఇంట్లో విద్యాభ్యాసం చేశారు. రాష్ట్రరాజధాని నగరంతోనూ, తెలంగాణప్రాంతంతోనూ ఆయన సన్నిహిత బంధాలను కలిగివున్నారు. ఒకనాటి హైదరాబాద్ చరిత్రనూ, సంప్రదాయాలనూ ఆయన సాధికారికంగా చెప్పగలరు, రాయగలరు. తెలుగు పత్రికలకు ఢిల్లీలో తొలి తెలుగు రిపోర్టర్‌గా పనిచేసిన ఖ్యాతి జి. కృష్ణకే దక్కుతుంది. సింహం తల పొన్నుతోవున్న ఆయన చేతికర్ర నిజాం మేనల్లుడు ముజీబ్‌యార్‌జంగ్ చెలిమి కానుకగా ఇచ్చినది. ఇంగ్లీషు మీజాన్‌లో 1946లో జి. కృష్ణ పాత్రికేయవృత్తిని ప్రారంభించారు. ఆతర్వాత ఫ్రీప్రెస్ జర్నల్, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభల్లో పనిచేశారు. ఆంధ్రప్రభ చిత్తూరు, మద్రాసు ఎడిషన్లకు రెసిడెంట్ ఎడిటర్‌గా ఉన్నారు. ఆతర్వాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్ బ్యూరో చీఫ్‌గా పనిచేశారు. ఎక్స్‌ప్రెస్‌కు రాజీనామా చేసి విజయవాడలో ఫ్రీలాన్స్ జర్నలిస్ట్‌గా సమీక్షలు, వార్తలూ ఎక్స్‌ప్రెస్‌కు అందచేసేవారు. అప్పుడు- ఇప్పుడు, కన్నవి విన్నవి, నాగరికం, తెలంగాణ రత్నాలు, కృష్ణపక్షం, నామ్‌కేవాస్తే వంటి శీర్షికలతో ఆయన వివిధ పత్రికలలో రెండువేలకుపైగా వ్యాసాలు రాశారు. తెలుగు విశ్వవిద్యాలయం వారి కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వకేంద్రం జ్యోతిష్య సంపుటానికి జి. కృష్ణ సంకలన కర్తగా, సంపాదకుడిగా పనిచేశారు.

గణపతి ముని బయోగ్రఫీని ఇంగ్లీషులో 'నాయన' పేరిట రాశారు. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు బయోగ్రఫీని కూడా ఇంగ్లీషులో రాశారు. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, జోసెఫ్ పులిట్జర్, మెడోస్ టేలర్ బయోగ్రఫీలను తెలుగులోకి అనువదించారు. టపాకథలు, వాగ్గేయకారులు, గాంధీతత్వం, మాదన్నమహామంత్రి, హిస్టరీఆఫ్ తెలుగూస్ అండ్ దైర్ కల్చర్ – జి. కృష్ణ కలం నుంచి జాలువారిన మరికొన్ని రచనలు. నలభై, యాభై ఏళ్లనాటి

సంగతులను సైతం నిన్ననే జరిగాయా అన్పించేలా కళ్లకు కట్టినట్లు వివరించగల నేర్పు కృష్ణది. ''ఎవరేనా ఏదేనా చెప్తుంటే బాగా వింటాను. అంతే... అదింక బుర్రలో సుస్థిర ముద్ర వేసుకుంటుంది'' అని అంటారు కృష్ణ. బాగా వినటం అనే ఈ అలవాటును రిపోర్టర్లూ అలవరచుకోవాలి ''రాసుకు బతకండర్రా!'' అని సన్నిహితులతో కృష్ణ తరచూ అనేమాట. ఆయన రిటైరయినా ఈనాటికీ రాసుకునే జీవిస్తున్నారు. అయిదు దశాబ్దాలకు పైబడి సాగిన ఆయన పాత్రికేయ జీవితంలో ఎన్నెన్నో అనుభవాలు. అవి జ్ఞాపకాల దొంతరలమధ్య నుంచి తొంగి చూస్తుంటాయి. జి. కృష్ణ వ్యక్తిత్వాన్ని పట్టి చూపటానికి ఓ సమగ్ర ఇంటర్వ్యూ చేయాలన్నది నా ప్రగాఢకోరిక. సుమారు రెండునెలలపాటు కృష్ణ ఇంటికి రోజూ వెళ్ళి ఈ ఇంటర్వ్యూను పూర్తిచేశాను. కొన్ని సందర్భాల్లో ఆయన ''ఈ విషయం చెప్తే ఫలానా వారు బాధపడతారయ్యా!'' అని అన్నా మీకీ వయసులో ఇంకా బంధనాలేమిటంటూ నేను తోసిపుచ్చడంతో అరమరికలు లేకుండా చెప్పుకొచ్చారు.

*ప్ర: మీరు నాలుగయిదు సంస్థల్లో పనిచేశారు. మేనేజ్మెంట్ పాలసీకి వ్యతిరేకంగా ఎవరినైనా ఇంటర్వ్యూ చేశారా?*

జ: పత్రిక పాలసీకి వ్యతిరేకమైన అభిప్రాయంకోసం ఎవరితోనూ గోష్ఠి జరపలేదు. ఆపెద్దమనిషి మాపాలసీని వ్యతిరేకిస్తూ మాటల్లో మాటగా మాట్లాడి వుండవచ్చు. దాన్ని రిపోర్ట్ చేశాను. ఒక్కోసారి వచ్చేది. ఒక్కోసారి కొట్టేసేవారు. ఉదాహరణకు సంజీవరెడ్డికి ఆంధ్రపత్రిక దాదాపు ప్రచారం చేసిపెట్టింది. కానీ అప్పుడప్పుడు సంజీవరెడ్డి వ్యతిరేకుల భావాలను కూడా వార్తగా తెచ్చాం. ప్రచురించినపుడు ప్రచురించారు. లేనపుడు లేదు.

*ప్ర: బ్రిటీషువాళ్ల మంచి పనుల్ని రిపోర్ట్ చేయగలిగారా?*

జ: బ్రిటీషు వాళ్లు మంచి పనులు ఏమిచేశారు? రైల్వేట్రాక్కు కావల్సిన కంకర ఇంగ్లండ్ నుంచి ఓడల్లో దిగుమతి చేసుకున్నారు. ఇప్పటికీ మనవి కాని రాళ్లు చాలా కనబడతాయి. ఈ రాళ్ల కోసం కోట్లు ఖర్చుపెట్టాం. వాళ్ల పరిపాలన వాళ్లకు అనుకూలంగా సాగటానికి కావలసిన పనులన్నీ బ్రిటీషు వాళ్లు చేసుకున్నారు.

*ప్ర: ఆరోజుల్లో గ్రూప్ రాజకీయాలు ఎలా ఉండేవి?*

జ: పట్టాభిసీతారామయ్యగారి మాటలు చదువుకున్న వాళ్లకి మాత్రమే బుర్రకెక్కేవి. ప్రబోధం కల్గించే ఉపన్యాసాలు, ప్రకటనలు ఆయన చేసేవారు. ప్రకాశం గ్రూప్ పట్టాభిని తిడుతూ బతికింది. పట్టాభిగారు రెడ్డిగ్రూప్ని రెచ్చగొట్టారు. ప్రకాశంగారు కమ్మగ్రూప్ని

రెచ్చగొట్టారు. నరసరావుపేట వైదీకి నియోగి తగాదాల్లో వైదికుల పక్షాన రెడ్లు, నియోగుల తరపున కమ్మవారు పనిచేశారు. వైదీకుల చాకళ్లనీ, నియోగుల చాకళ్లనీ వేర్వేరుగా వుండేవారు. బ్రాహ్మణ్యాన్ని నాశనం చేశారని అయ్యదేవర కాళేశ్వరరావు తన జీవిత చరిత్రలో ఆవేదన వ్యక్తం చేశారు. అయ్యదేవర ఆత్మకథ ఆంధ్రదేశపు ఆత్మకథ. అది చదివి తీరాలి. విభేదాలను అనుసరించి మాట్లాడిన వారు పైకి వచ్చారు. విభేదాలు వద్దన్న వాళ్లని తొక్కేశారు. విభేదాలు వద్దని వారించినందుకు అణగారిన వారికో చక్కని ఉదాహరణ అయ్యదేవర.

*ప్ర: బ్రిటీషు హయాంలో వారికి విధేయులుగా ఉండి ప్రజలను అణచివేసిన భారతీయ అధికారులపట్ల స్వాతంత్ర్యానంతరం ఎలా వ్యవహరించారు?*

జ: నిజాంహయాంలో హోమ్ సెక్రటరీ ఆలీయావర్ జంగ్. దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక జంగ్ కాంగ్రేసుకు, నెహ్రూకు ఇష్టుడయ్యాడు. భారత్ పాకిస్తాన్ దేశాలమధ్య ఆస్తులను అప్పులను పంచి ఇచ్చింది అతడే. స్వాతంత్ర్యోద్యమకాలంలో డప్పుల సుబ్బారావనే పోలీసు అధికారి ఉండేవాడు. కాంగ్రేస్ మీటింగ్‌లను డప్పులు కొట్టి చెదర గొట్టేవాడు. జి. కృష్ణను అరెస్ట్‌చేసింది వాడే. బులుసు సాంబమూర్తి గుండెలమీద ఎక్కి తొక్కి ఒంటేలు పోశాడు. యానాదయ్యను కొట్టిచంపి బావిలో పడేశాడు. ఆడాళ్ల అనేకుల్ని అవమానపరిచాడు. రాజమండ్రి డిప్యూటీ ఎస్.పి. ముస్తఫా ఆలీఖాన్, సీతానగరం సత్యాగ్రహ ఆశ్రమంలో వాళ్లని చావగొట్టి నెత్తురు కారేవాళ్లను గుట్టపోశాడు. ఇలాంటి అధికారులు చిన్నపెద్దా ఇంకా ఉన్నారు. వాళ్ల డ్యూటీ వాళ్లు చేశారని చెప్పి కాంగ్రేస్ వాళ్లు ఈ అధికారులను క్షమించేశారు. అవే పదవుల్లో కొనసాగించారు.

*ప్ర: ఆనాటి కుటీర పరిశ్రమలను బ్రిటీషువారు ఏవిధంగా దెబ్బతీశారు?*

జ: మనదేశానికి మొదట్నించీ పేరుతెచ్చిన వాళ్లలో ముఖ్యులు మన శిల్పులు, పనివారు. ఒకచిన్న ఉదాహరణ చూసుకుంటే సరిపోతుంది. పనివాళ్లు అంటే చేనేత వాళ్లను గురించి విచారిద్దాం. నేతకోసం తగునూలు తయారు చేయడం, అ నూలుకోసం తగు పత్తిని పండించుకోవడం, ఆనూలుకు తగు రంగు వేయటానికి కృషి చేయటం, తయారయ్యేగుడ్డలో ఎన్నివిధాల సొంపులు చూపాలో అవన్నీ ఆలోచించుకోవటం ఇంకా ఎంతెంతో అనుబంధ కృషి చేసుకొనటం చేనేతవాడి పని. ఆ పనులు వాళ్ళు సుష్టుగా చేసుకునేవాళ్లు. దాదాపు శిల్పులలాగానే తమ పనిచేసుకొనేవాళ్లు. ఇట్లా ఇతర అనేక నిర్మాణ కార్యక్రమాలుకూడా ఉండేవి. వీటి ఎగుమతి మూలాన దేశానికి పేరొచ్చింది.

ఇంగ్లండులో పారిశ్రామికీకరణం ప్రారంభమైంది. సామ్రాజ్య విస్తరణ జరిగిపోతున్న సమయమది. వాళ్ల పారిశ్రామిక ఉత్పత్తులను అమ్ముకోవటానికి సామ్రాజ్యం ఎంతో ఉపకరించింది. అంటే ఇతర దేశాలలో తమ ఇష్టానుసారం సరకులమ్ముకుని లాభాలు

సంపాదిస్తూ పారిశ్రామికీకరణం చేసుకున్నారన్నమాట. సామ్రాజ్యంలో ఉన్నదేశాలు విధిగా ఈపారిశ్రామికీకరణకు తోడ్పడవలసి వచ్చేది. తోడ్పాటు అంటే ఎక్కువ ధరలకు ఆ పారిశ్రామిక ఉత్పత్తులు కొనటమేగాక తమదేశాల్లో ఉన్న పరిశ్రమలనుకూడా రద్దు చేసుకోక తప్పదుగదా! ప్రభుత్వం ఇంగ్లీషు వాళ్లది. వాళ్ల మాట వినాల్సిందే. ఆ బ్రిటీషు పరిశ్రమలకు తోడ్పడటానికి మనదేశంలోనే నేతపరిశ్రమ నశించిపోక తప్పలేదు. పత్తిపండించేవాళ్లు, దారంతీసేవాళ్లు, రంగులు తయారు చేసేవాళ్లు, నేసేవాళ్లు ఇందుకు సంబంధించిన పరిశోధన చేసేవాళ్లు ఈ నేసిన గుడ్డలను భుజానేసుకుని అమ్మేవాళ్లు - ఇంతమంది నిరుద్యోగులైపోయినారు. పైన చెప్పను ఇది కేవలం ఉదాహరణ మాత్రమేనని. బ్రిటీష్ సామ్రాజ్య పరిపాలన వలసదేశాలలో ఆర్థిక పరిస్థితిని ఈ విధంగా సర్వనాశనం చేసింది. ఇదిగాక కొత్త పారిశ్రామికోత్పత్తులను వలసలలోకి దిగుమతిచేసి అక్కడి ప్రజలకు కొత్తసోకులు, సొంపులు అలవాటు చేశారు.

గాంధీజీ 1920 నుంచి (స్థూలంగా) కాంగ్రెస్ నాయకత్వాన్ని స్వీకరించి కాంగ్రెస్‌ను సుసంఘటితమైన సంఘర్షణ శక్తిగా రూపొందించాడు. రాట్నాన్ని పునరుద్ధరించాడు. బావుండనీ బావుండకపోనీ మనం తీసిన నూలుతోనే నేసిన గుడ్డను కట్టుకోవాలని ప్రబోధించాడు. ఆకాలంలో దాదాపు 95కోట్లరూపాయల విలువైన గుడ్డను భారతీయులు ఇంగ్లండ్‌నుంచి దిగుమతి చేసుకునేవాళ్లు. గాంధీజీ స్వదేశీ ఉద్యమం ప్రారంభించిన తర్వాత ఖద్దరు ఉపయోగం విస్తృతమై 1930 వచ్చేసరికి 42కోట్లరూపాయల మేరకు దిగుమతి పడిపోయింది. ఇట్లా అనేక బ్రిటీష్ పారిశ్రామిక ఉత్పత్తుల దిగుమతులు పడిపోనారంభించాయి. బ్రిటిష్ పరిశ్రమలలో పలువురికి ఉద్యోగాలు పోనారంభించాయి. 1930లో గాంధీజీ రౌండ్‌టేబుల్ మహాసభకు లండన్ వెళ్లినపుడు అక్కడ ఉద్యోగాలు పోయిన ఉద్యోగులందరూ ఆయన ముందు నిరసన వ్యక్తం చేయాలని కొందరు ప్రబుద్ధులు తీర్మానించుకున్నారు. ఆసంగతి విని గాంధీజీ తానే ఆ ఉద్యోగుల ప్రతినిధుల వద్దకు వెళ్లి బ్రిటీష్ ప్రభుత్వ పారిశ్రామిక విధానం వలన కోట్లాది మంది భారతీయులు నిరుద్యోగులైనారని, ఒక్క పూట భోజనానికి కూడా దిక్కులేకుండా పోయారని వివరించి చెప్పుకున్నాడు.

ఇప్పుడు ఖద్దరు కట్టుకున్నవాళ్లను కొందరు ఆక్షేపిస్తున్నారు. ఇప్పటి సంగతి అట్లా అట్టిపెట్టండి. అప్పట్లో కూడా ఖద్దరు కట్టుకున్నవాళ్లను ఆక్షేపించారు. అవ్యక్తులుంటారు. రవీంద్రనాథ్ టాగోర్‌గార్కి కూడా ఖద్దరు సొగసలేదు. తగుకాలంలో దేశానికి తగుసేవ చేయగల్గడం అదృష్టం.

*ప్ర: బ్రిటీషు వాసనలను ఇప్పటికైనా పోగొట్టుకోగలిగామా?*

జ: మన దేశంలో పరిశోధనశాలలు, ప్రయోగశాలలు అనేకం ఉన్నాయి. కోట్లరూపాయలు ఖర్చుపెడుతున్నారు. కానీ మన చదువులు బ్రిటిష్‌ప్రభుత్వం పెట్టిన

వరవడినుంచి ఇప్పటికీ విముక్తి చెందలేదు. మన ప్రజలలో చాలా మందికి ఆవరవడిపట్ల మోజు మిగిలేవుంది. పెరుగుతూనే ఉంది. ఉదాహరణకు మన డాక్టర్లు చదువు కుంటున్నతీరు, వైద్యం చేస్తున్న తీరు తెలుసుకుంటే సరిపోతుంది. మన డాక్టర్లలో పరిశోధనాసక్తి వున్నవారు చాలా చాలా తక్కువ. మన డాక్టర్లలో డాక్టరేట్లు లేరు. ఉన్నా చాలా తక్కువ. ఇప్పటికీ ఉష్ణమండలవ్యాధులపైన జర్మనీలోనూ, ఇంగ్లండ్‌లోనే పరిశోధనలు జరుగుతున్నాయి. మన డాక్టర్లు ఏకంపెనీ మందులు ఉపయోగించాలా అని ఇంకా తర్జన భర్జనలు పడుతున్నారు. మనం ఇప్పటికీ మందుల తయారీలో బ్రిటీష్‌వాళ్లు పెట్టిన వరవడులనే అనుసరిస్తున్నాం. బ్రిటీష్ కంపెనీలవాళ్లు అందించే పరికరాలపట్లనే మొగ్గుచూపుతున్నాం. అందువలననే మన డాక్టర్లకు ఇతర దేశాల్లోగిరాకీ హెచ్చింది. ఇది మన గొప్ప అనుకుంటున్నాం. ఇతర దేశాల పారిశ్రామికులు మన దేశీయ పరిశ్రమలపై అదుపునెరపడం మనకు మొదట్నుంచీ ఉండనే ఉంది. మనకు స్వంతం ఏదీలేదని అంతా ఇంగ్లండునుంచే నేర్చుకున్నామని చెప్పేడాక్టర్లు నూటికి 90 మంది ఉండనేవున్నారు. దేశకాల పరిస్థితులనుబట్టి పద్ధతులు మారతాయిగానీ ఆదేశ కాల పరిస్థితులను దేశానికి అనుకూలంగా మలచుకోలేని విద్యావంతులు మనదేశంలోనే ఎక్కువగా ఉన్నారు.

ఇప్పుడొచ్చిన బెడద ఏమిటంటే వడియాలు, అప్పడాలు, పచ్చళ్లు, చీరెలు, రవికెలు వగైరాలన్నీ ఇతర దేశాల మూలంగానే మనకు సంప్రాప్తిస్తున్నాయి అని అనుకోగలుగుతున్నాం.

పసుపు ఉపయోగం అమెరికా మూలాన మనకు తెలిసింది అని ఈమధ్యనే అమెరికా శాస్త్రవేత్తలు మనకు తెలియచెప్పారు. మన ఆర్థిక వ్యవస్థకు ఇది నిజంగా పసుపు, కుంకుమ లాంటి సహాయం. మనం వాళ్ల చదువులు చదువుకుంటున్నాం. వాళ్ల దేశాలకు కాశీయాత్రకు వెళ్లినట్లు వెళ్తున్నాం. మన కింతకంటే దక్కేదేముంది?

*ప్ర: ఇప్పుడు ఖద్దరుకు ఉన్న రెలవెన్స్ ఏమిటి?*

జ: అది స్వాతంత్ర్య సమర కాలంలో స్వయం పోషకత్వానికి, స్వాభిమానానికి చిహ్నమైంది. ఇప్పుడు ఖద్దరు కట్టడం దాదాపు లాంఛనం. ఖద్దరు ఇప్పుడు కాంగ్రెస్ వాళ్ల యూనిఫాంగా మారింది. ఇప్పుడు ఖద్దరు ధారణ కేవలం ఒక పూర్వాచారాన్ని పాటించటమే. మన మిల్లులే, మనపరిశ్రమలే వచ్చిన తర్వాత దీని ధారణ అనవసరం. కాకపోతే పాతపద్ధతులు అనుసరించి బతుకుతున్న చేనేత వాళ్లు లక్షలాది మంది ఉన్నారు. పాతతరం అయిపోతోంది. వాళ్లున్నన్నాళ్లు చేనేత గుడ్డలు మనమూ కట్టకతప్పదు.

*ప్ర: రాజకీయాల్లో నేర ప్రవృత్తి ఆరోజుల్లో ఎలా ఉండేది?*

జ: క్రిమినలైజేషన్ ఆఫ్ పాలిటిక్స్ ఆరోజుల్లో లేదనే చెప్పాలి. అది పోరాటకాలం. బ్రిటీష్ ప్రభుత్వంతో పోరాటమే ప్రధానంగానీ వేరేనేరజాతులతో, అసాంఘిక శక్తులతో కలవటం అవసరమేకాలేదు. 1946లో ముస్లింలీగ్ ప్రత్యక్ష చర్య అని ప్రారంభించి

హిందువులను చంపటం ప్రారంభించేవరకూ సంఘవిద్రోహశక్తులు తలెత్తలేదు. నేరంచేసేవాడు ఆ రోజుల్లో సిగ్గుపడేవాడు. రాజకీయాల్లో నేర ప్రవృత్తికి ముస్లింలీగ్ నాంది పలికిందని చెప్పవచ్చు. కొన్ని నేరాలు అధికారంలో వున్నవాళ్లే చేసేవాళ్లు. అప్పటి పరిపాలనలో పోలీసుశాఖలో లాంఛనంగా ఒక అధికార పదవిని అనుభవిస్తూ ప్రతి సమస్యనూ హిందూ ముస్లిం తగాదాగా తీర్చిదిద్దిన ఒక వ్యక్తి వుండేవాడు. వానిపేరు - మజీద్. వాణ్ణి గురించి ఇప్పటికీ పరిశోధన జరగలేదు. రాజప్రతినిధి ఎక్కడికి వెళ్తే వాడూ అక్కడికి వెళ్లేవాడు. వాడు బ్రిటీష్ ప్రభుత్వ పోషణకింద హిందూముస్లిం ఘర్షణలను ఒక పథక ప్రకారం నడపగలిగిన మేధావి.

*ప్ర: ఆరోజుల్లో నేతల్లో ఆత్మాభిమానం పాలు ఎలా ఉండేది?*

జ: పదవీకాంక్ష లేకపోవడమనేది వ్యక్తిత్వానికి చాలా అవసరం. పదవిని సేవకోసం వినియోగించటం ప్రధానం. అట్లా చేయటంలో తన వ్యక్తిత్వం దెబ్బతినకుండా చూసుకోవచ్చు. 1932 ప్రాంతంలో మద్రాసు రాష్ట్రంలో మితవాదుల ప్రభుత్వం ఏర్పడింది. దాన్లో టి.ఆర్. వెంకటరామశాస్త్రిగారు న్యాయశాఖమంత్రిగా నియుక్తులయ్యారు. ఉదయమే ప్రమాణస్వీకారం చేశారు. ఆఫీసుకెళ్లాడు. మొదటిఫైలే శాంతిభద్రతలకు సంబంధించినది. దానిపైన తన అభిప్రాయాలు రాసి ఉత్తర్వుకూడా రాశాడు. ఆ ఉత్తర్వు విధిగా గవర్నర్ ఆమోదం పొందాల్సి ఉంటుందని ముఖ్య కార్యదర్శి వచ్చి చెప్పాడు. మంత్రిగా తన హోదాకు అది భంగమని శాస్త్రిగారి అభిప్రాయం. రాజీనామా చేసేశాడు. కొద్ది గంటలే ఆయన మంత్రిగా ఉన్నాడు.

కాబట్టి ఆత్మగౌరవం కోసం పోటీపడిన వ్యక్తులు ఆరోజుల్లోనూ ఉండేవారు. తన శాఖలో ఏదైనా తప్పుజరిగితే దానికి తనే బాధ్యుణ్ణని అనుకునే నిజాయితీ పరులుండేవారు.

పరిపాలనా దక్షతను, దేశసేవానిరతిని, ఆత్మగౌరవాన్ని మేళవించుకుని మంత్రిగా పనిచేసినటువంటి వ్యక్తి స్వాతంత్ర్య సముపార్జనానంతరం ఒక్కడే కనిపిస్తాడు. అతడు లాల్ బహదూర్ శాస్త్రి. జవహర్‌లాల్‌నెహ్రూ కూడా తన నాయకత్వాన్ని సువ్యవస్థితంచేసుకునే ప్రయత్నంలోవున్నాడు. కాని లాల్‌బహదూర్ అత్మగౌరవం సుప్రతిష్ఠితం చేసుకోవటానికి తంటాలు పడేవాడు. నెహ్రూ తన పేరు ప్రతిష్టలతో కొట్టుకొచ్చాడుగానీ పరిపాలకుడిగా ఆయన చూపిన ప్రత్యేకతలేదు. కానీ లాల్ బహదూర్ వినయ వివేకాలు కలిగిన వ్యక్తి.

లాల్‌బహదూర్ శాస్త్రిగారు ప్రధాన మంత్రి అయినపుడు మనదేశంలో కొందరు పత్రికల వాళ్లు ఆయనకి ఇంగ్లీషురాదని ప్రచారం చేశారు. అంటే ఆయనకు బానిస ప్రధాని అయ్యే యోగ్యత లేదన్నమాట. కానీ ఆయన మాటలు కొన్ని విని ఆయన స్పష్టతను చవిచూసిన మీదట ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంపాదకుడు ఫ్రాంక్‌మోరేస్, ఈ లాల్ బహదూర్ మహాత్మాగాంధీ భాషను మాట్లాడుతున్నాడు అని ప్రశంసించక తప్పలేదు. ఇంతకూ లాల్

బహదూర్‌కు ఆత్మగౌరవం ఉంది. అందువల్ల అరియలూరు రైలు ప్రమాదం బాధ్యత తనే స్వీకరించి రాజీనామా చేశారు.

ఒక చిన్న విశేషం. ఆరైలు ప్రమాదానికి కారకులైనవాళ్లు తర్వాత దొడ్డిదోవన మళ్లీ రైల్వేలో ప్రవేశించారు.

లాల్ బహదూర్‌గారు నాయకుడు. త్యాగి. ఆయన దేశీయులు సోమవారంనాడు ఒకపూట భోజనం చేయరాదు అని విజ్ఞాపన చేస్తే కోట్లాది మంది ఆవిజ్ఞాపనను పాటించారు. ఇవాళ పేచీకోరులు, తెలివిగలవాళ్లు బాధ్యతగల పదవుల్లోకొస్తున్నారు. నాయకత్వ లక్షణాలు ఏకోశానా కానరావు.

ఈ భారతదేశం నిజాయితీకి పేదదైతే కావచ్చు. మన రాజకీయ వాదులు అటువంటి పరిస్థితిని కల్పిస్తున్నారు. జీతం తీసుకోకుండా మంత్రి పదవులు నిర్వహించటానికి ఉత్సహిస్తున్నారు. భారతదేశం జీతం ఇవ్వననలేదు. జీతంతీసుకో - భత్యాలు తీసుకో. భారతదేశాన్ని సేవించు. అంతేగానీ ఒకడు జీతం తీసుకోనంతమాత్రాన మన ఆర్థిక పరిస్థితి మారదు.

మంత్రి పదవుంటే జీతం దేనికి? పెద్దపెద్ద హోటళ్లలో బేరర్లుగాపనిచేయటానికి జీతం దేనికి? టిప్స్‌పైనే బోలెడు డబ్బువస్తుంది.

*ప్ర: స్వాతంత్ర్యోద్యమంలో కమ్యూనిస్టుల వైఖరి ఎలా ఉండేది?*

జ: కమ్యూనిస్టులు ఏనాడూ గాంధీకిగానీ భారతదేశానికిగానీ సుముఖులుకారు. వాళ్లకు ఒక్క భారతదేశ జాతీయ ఉద్యమంతో కూడా సంబంధంలేదు. ప్రముఖ కమ్యూనిస్ట్ నాయకుడు రావినారాయణరెడ్డి ఆత్మకథ లాంటి వ్యాస సంపుటిలో ఇది సువ్యక్తం. ఏనాడూ కమ్యూనిస్టులకు భారతీయ వ్యక్తిత్వంలేదు.

భారతీయ కమ్యూనిస్టులు బ్రిటీష్ కమ్యూనిస్ట్ పార్టీని అనుసరించే లతికారు. ఎక్కడైతే వలసవాదం బలీయంగా వుందో, లాభసాటిగా వుందో అక్కడ కమ్యూనిస్టులు బలపడ్డారు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినా రాలేదని కమ్యూనిస్టులు వాదించారు. ఆర్థిక స్వాతంత్ర్యం అంటే ఏమిటో రాజకీయ స్వాతంత్ర్యమంటే ఏమిటో సాంఘిక స్వాతంత్ర్యమంటే ఏమిటో వారికి తెలియదు. అదే వాదబలం వల్ల హైదరాబాద్ సంస్థానం భారత రాష్ట్రాల సమాఖ్యలో చేరటాన్ని వాళ్లు మనస్ఫూర్తిగా అంగీకరించలేకపోయారు. హైదరాబాద్ విముక్తమైనప్పటికీ వాళ్లు విముక్తంకాలేదనే వాదించారు. రైతుల తిరుగుబాటు అనే పేరుతో రాష్ట్రంలో దౌర్జన్యకాండ చేశారు. అట్లా వ్యతిరేకించటాన్ని కమ్యూనిస్ట్‌పార్టీ సహించలేదు. ఈ దౌర్జన్య ఉద్యమం పూర్తిగా తప్పు అని నారాయణరెడ్డిగారు ఒక వివరణ రాసుకుని దాన్ని ప్రపంచ కమ్యూనిస్ట్ అధినేత స్టాలిన్‌కు ఒక వివరణ పంపించే ఏర్పాటు చేసుకున్నాడు. నారాయణరెడ్డి

వాదాన్ని స్టాలిన్ అమోదించాడు. అప్పటి నుంచి హైదరాబాద్ సంస్థానానికికూడా స్వాతంత్ర్యం వచ్చిందని నమ్మసాగారు కమ్యూనిస్టులు.

కొందరు కమ్యూనిస్టులు, కమ్యూనిస్టుపార్టీతో నిమిత్తం లేకుండానో, కాంగ్రెస్ సోషలిస్టులుగానో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. అంతేగాని కమ్యూనిస్టుపార్టీకి ఏజాతీయ ఉద్యమంతో సంబంధంలేదు. కమ్యూనిస్టులు అప్పుడూ ఇప్పుడూ మారలేదు. కాంగ్రెస్ వాళ్లు కీచులాడుకోకపోతే ఈ దేశంలో కమ్యూనిస్టులకు స్థానంలేదు. ఏదేశంలోనూ ఇప్పుడు కమ్యూనిజానికి రెలవెన్స్‌లేదు. కమ్యూనిస్ట్ దేశాల్లో కమ్యూనిజంవల్ల ప్రజలు బాగుపడలేదని ఇటీవలి విప్లవాలు విదితం చేశాయి.

కమ్యూనిస్టుపార్టీలో సభ్యులై ప్రజాసేవచేయాలని ఎంతో తపన పడిన మానవతా వాదులనేకులు ఆశాభంగం చెంది జీవితం గడిపారు.. తప్పులు జరగడం సహజమే. కానీ భారతీయ కమ్యూనిస్టుపార్టీ అసహజమైన తప్పులు చేసింది. చేస్తున్నది. వ్యక్తిత్వం ఉన్న కమ్యూనిస్టుని ఆ పార్టీ పైకిరానివ్వలేదు. వర్గ సంఘర్షణ కంటే వర్గ అసూయ ప్రబలమైపోయింది.

కమ్యూనిస్ట్, కాంగ్రెస్‌ల పేరుపెట్టుకుని గ్రామసీమల్లో కుటుంబాలకు కుటుంబాలు నాశనమయ్యాయి. బాంధవ్యాలు నాశనమైపోయాయి.

మన దేశంలో నీతివున్న రాజకీయ పక్షమంటూ ఇప్పటికీలేదు. ఒకచిన్న ఉదాహరణ. రాయలసీమలో గూండా నాయకత్వం చిరకాలంగా ఉంది. ఒక్క కమ్యూనిస్టుగానీ, ఒక్క సోషలిస్టుగానీ ఒక్క రాష్ట్రీయ స్వయంసేవక్ గానీ ఇప్పటికీ ఖండించాడా? ప్రజలను అలాంటి గూండానాయకత్వంపట్ల విముఖుల్ని చేయడానికి ప్రయత్నించారా?

ఎవర్ల రాజకీయాలు వాళ్లు ఆడుకోవడంతప్ప ప్రజాశ్రేయస్సుకోసం పనిచేసే రాజకీయ పక్షమేదీ మనదేశంలో లేదు.

విచిత్రమేమంటే మన ఉద్యోగులు కూడా ఒక రాజకీయ పక్షమే.

*ప్ర : రాజకీయ నాయకుల నైతిక స్థాయి ఆ రోజుల్లో ఎలా ఉండేది ?*

జ:స్వాతంత్ర్యం రావడానికి పూర్వం రాజకీయ పక్షాల లక్ష్యం కేవలం స్వాతంత్ర్యలబ్ధి మాత్రమే. స్వాతంత్ర్యం కోసం పోరాడిన వానిని బ్రిటిష్ ప్రభుత్వం క్షమించలేదు. అందువల్ల స్వాతంత్ర్య పోరాటంలో ఉన్న వాళ్లందరూ నిజాయితీతోనే బతకాల్సివచ్చింది. స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొనని వాళ్ళు అధికారాపేక్షులు, మత, కుల సంఘాలు, కమ్యూనిస్టులు. ఇందులో ఏది ఏమైనా కమ్యూనిస్టులు పదవులు అపేక్షించలేదు. మిగతావాళ్లు బ్రిటిషు ప్రభుత్వంవల్ల మేలు పొందినవారే. కొద్దికాలం రాజకీయాల్లో పనిచేసి పేరుతెచ్చుకుని ప్రభుత్వంలో పదవులు సంపాదించుకున్నవాళ్లు అనేకులు ఉన్నారు. వర్ధించే

వాడు మనవాడు అనే సూత్రం ప్రకారం ఇట్లా ప్రభుత్వంలో చేరిన కొందరు బ్రిటిష్‌వాళ్ల సహాయంతో కొన్ని పెద్దపెద్ద పనులు చేసిన మాట నిజమే. ఉదాహరణకు పర్లాకిమిడి జమీందారు కొన్ని తెలుగు జిల్లాలుకూడా కలుపుకుని ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటుచేశాడు. అంతకుముందు నుంచీ భాషారాష్ట్రం కావాలని కోరుతున్న ఆంధ్రా కాంగ్రెస్‌వాదులకు బ్రిటిష్ ప్రభుత్వంవారినుంచి అటువంటి ఆదరం లభించలేదు. ప్రభుత్వ అనుకూలురైన రాజకీయ వాదులు ఆరోజులలో ప్రభుత్వ వ్యతిరేకులను కించపరచటానికి కొన్నికొన్ని పనులు చేసి కొందరి మెప్పుపొందారు.

ఇటువంటి సంఘటనలు చరిత్రలో అనేకం కనపడతాయి. ప్రభుత్వ బిరుదులు సంపాదించుకున్నవాళ్లు ఆ బిరుదు బలంతో బ్రిటిష్ ప్రభుత్వాధికారులకు సన్నిహితులై ప్రజలకు కొన్ని పనులు చేయించి పెట్టేవారు. కాని ఇది చూస్తే ఇప్పుడు పాలకపక్షం వాళ్లు చేస్తున్న అన్యాయాల వంటివి అప్పుడే ఉండేవని తెలుస్తుంది.

ఏమైనా అప్పట్లో కొందరైనా సేవారాజకీయాలను అనుసరించేవారు. అందువల్లే ఈదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది.

*ప్ర: రాజకీయాల్లో గ్లామర్ పాత్ర ఎలా ఉండేది?*

జ: గ్లామర్ అనేది ఎప్పుడూ ఉంటుంది. కాంగ్రెస్ సంస్థను ప్రారంభించిన మొదటి సంవత్సరాల్లోనే అధ్యక్షుడిగా ఎన్నికైన సర్‌ఫిరోజ్‌షా మెహతా కేవలం గ్లామర్ మూలంగానే వచ్చాడు. అతడు ముంబాయికి మకుటంలేని రాజనేవారు. ఆకాలంలో ఇంగ్లీషువాళ్లు సేవించే ఉత్తమ తరగతి మద్యపానీయాలు కేవలం పార్శీ వాళ్ల దుకాణాల్లోనే దొరికేవి. అంతగొప్ప వాడొచ్చి కాంగ్రెస్‌లో కూచోవడమే గొప్పగా భావించేవారు. ఆయన మాటకు ప్రభుత్వంలో చలామణి ఉండేది.

అట్లాగే కాంగ్రెస్‌లోకి ఏ జమీందారు, సంస్థానాధిపతి చేరినా ఆ గ్లామర్‌ను వాళ్లంతా అనుభవించేవాళ్లు. ఈ మాటంటే కొందరికి కోపం వస్తుందిగానీ జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్‌లో చేరినపుడు మోతీలాల్ నెహ్రూ కొడుకుగానే చేరాడు. అదొక పెద్ద గ్లామర్. తర్వాత మారిపోయాడనుకోండి.

ఏమైనప్పటికీ మొదటి రోజుల్లో కాంగ్రెస్‌లో ప్రముఖులుగా చలామణి అయిన పలువురు తమ గ్లామర్‌పైనే ఆధారపడ్డారు. ఇంగ్లీషు బాగా మాట్లాడడం ఒక గ్లామర్. ఇంగ్లీషు వక్తృత్వపుపోటీల మహాసభలాగా ఉంది అని ఒక కాంగ్రెస్ మహాసభను గాంధీజీయే వర్ణించాడు. అన్నట్లు ఇప్పటికీ ఇంగ్లీషులో ఉపన్యసించటమే గ్లామర్ కదా!

ఒక గొప్పవారి అబ్బాయి తమ పార్టీలోకి వచ్చినపుడల్లా రాజకీయపార్టీలు తమకేదో గొప్పదనం కలిగినట్లు చెప్పుకోవడం సర్వసాధారణమై పోయింది.

స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో జస్టిస్‌పార్టీవాళ్లబ్బాయిలు కాంగ్రెస్‌లో చేరడం ఘనంగా చెప్పుకునేవాళ్లు కదా! ఇప్పుడు సినిమా వాళ్లు రావటం ఘనంగా చెప్పుకుంటున్నారు. కొంచెం అతిశయోక్తిగా చెప్తున్నప్పటికీ ప్రభుత్వం చేసేపనులు గొప్పవి అని సినిమా తారలచేత క్రీడాకారులచేత చెప్పించటం గ్లామరస్‌గా వుంటుందని ఇప్పటి రాజకీయవాదులు అనుకుంటున్నట్లు అందరికీ తెల్సిందేకదా.

నాయకత్వం బలహీనపడుతున్నప్పుడు గ్లామర్ ఉన్న వాళ్ల కోసం వెతుక్కోవడం కొంతవరకూ సహజమే. ప్రజలకు కావాల్సిందీ అదే.

*ప్ర: ఆనాడు పాత్రికేయుల నైతిక విలువలు ఎలా ఉండేవి?*

జ: ఏకాలంలో అయినా ధనసంపాదన ప్రధానమైనదే. కానీ అప్పట్లో కొందరు పత్రికారచయితలకు దేశసేవ అంతకంటే ముఖ్యమైనదిగా కానవచ్చేది. అందువల్ల పత్రికారచయితగా ప్రయోజనాలను పొందటం పలువురికి సాధ్యంకాలేదు.

ఆ కాలంలో నిరాడంబరతను జీవితధ్యేయంగా పెట్టుకున్న గాంధీజీ ఆదర్శం పలువురికి ప్రధానమైంది. బ్రిటిషుప్రభుత్వానికి ప్రచారం చేసిపెట్టటానికి నెలకొన్న పత్రికలలో పనిచేసేవారికి ఎక్కువజీతాలు వచ్చేవి. ధనరూపంలో, వస్తురూపంలో బహుమతులుకూడా తరచు లభించేవి. దేశ విముక్తి పోరాటంలో పాత్రలేని అన్ని రాజకీయపార్టీలు పత్రికా రచయితలకు బహుమతిలిచ్చేవి. ఎందువలన? దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారికి ఎట్లాగో ప్రచారం లభిస్తుంది. పాల్గొననివారు ప్రచారం చేయించుకోవాలి. ఆరోజుల్లో సంస్థానాధీశుల మహాసభ ఒకటుండేది. దాన్ని నరేంద్రమండలి అన్నారనుకుంటాను. ఏ నెలకో ఒకసారి వాళ్ల కార్యవర్గసమావేశమో ఏదో జరిగేది. ఎవరో ఒక ప్రకటన చేసేవాళ్లు. ఆవార్త వాళ్లే పంపించుకునేవాళ్లు. ఆ వార్తతోపాటు వంద రూపాయల దక్షిణకూడా వచ్చేది. దేశభక్తి ప్రధానంగా పనిచేసే పత్రికల్లో పనిచేసేవారికి చాలా తక్కువ జీతాలే ఉండేవి.

'కాంగ్రెస్' పత్రిక ఎట్లా నడుస్తుందో చూడటానికి ఒకప్పుడు కోటంరాజు రామారావు ఆపత్రికకు వెళ్లాడు. ఆపత్రికను చందాదారులకు పోస్ట్ చేయాలి గదా? చిరునామాలన్నీ సంపాదకుడు సహాయ సంపాదకులే రాస్తున్నారు. పత్రికలో పనిచేసే కొందరు వాటిని ఊళ్లో అమ్మకానికి తీసుకెళ్లారు. పత్రికలో పనిచేసేవాళ్లందరూ తమ కుటుంబాలతోపాటు పత్రికాకార్యాలయం వద్దనే భోజనం చేస్తున్నారు. ఇదీ ఆపత్రిక పరిస్థితి. ఆపత్రిక చేసిన పనిని శ్లాఘిస్తూ మహాత్మాగాంధీ ''ఇది తగు సందేశాన్ని ప్రజలలోకి తీసుకువెళ్తున్నది'' అన్నాడు.

సంపాదకుడిని పోలీసులు అరెస్టుచేశారు. ఇంకో సంపాదకుడు వ్యవహరించ నారంభించాడు. వారం తిరక్కముందే ఆసంపాదకుడినీ అరెస్టు చేశారు. ఏడువారాలు

ఏడుగురు కొత్త సంపాదకులు వచ్చి పనిచేశారు. అప్పుడు లోగడ అరెస్టయిన సంపాదకుడు విడుదలై సంపాదకత్వం వహించాడు. ఆసంపాదకులపేర్లలో కొన్ని మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, రామచంద్రుని వెంకటప్ప, చంద్రుపట్ల హనుమంతరావు.

ఈపత్రిక పనిచేసేతీరు చూసి కోటంరాజు ఉప్పొంగిపోయాడు. పత్రికలో పనిచేసేవారంతా చదువుకున్నవారే. దేశభక్తులే. చదువు, దేశభక్తి కలిసి ఉన్నవారి కంటే కేవలం చదువుకున్నాం అనుకున్నవారే ఆరోజుల్లో బాగుపడ్డారు.

పత్రికా రచయితలందరూ డబ్బుకు అమ్ముడుపోయేవారుకారు. డబ్బుకు అమ్ముడుపోయే వారసత్వం కొందరికే. వాళ్లు ఎప్పుడూ ఉంటారు. ఈమధ్య కొందరు రాజకీయ వాదులు పనిగట్టుకుని పత్రికా విలేకరులను ప్రలోభపెడుతున్నట్లు తెలుస్తున్నది. ఉత్తరప్రదేశ్‌లో ఇటువంటి అవినీతి చాలా ఎక్కువగా జరిగిందని పత్రికల్లో వార్తలు వెలువడినాయి.

వెనకటికంటే పత్రికలసంఖ్య పెరిగింది. పత్రికల్లో పనిచేసే వారి సంఖ్య పెరిగింది. చదివేవారిసంఖ్య పెరిగింది. అన్నింటికంటే మించి దేశంలో బోలెడు చోట్ల పత్రికా విలేకరులు నియుక్తులవుతున్నారు. ఇటువంటి పరిస్థితిలో అవినీతి ప్రవేశించటం సహజమే.

*ప్ర: మీస్వీయ అభిప్రాయాలకు పత్రిక పాలసీకి వైరుధ్యం తలెత్తిన సందర్భాలున్నాయా ?*

జ: పత్రిక విధానం నాసొంత విధానం కాదు. అది యజమాని విధానం. ఆవిధానాన్ని పాటించినందుకేకదా నేనక్కడ పనిచేయగలిగాను. ఆవిధానం నన్ను ఏవిధంగానూ అంటదు. అందువల్ల ఆవిధాన వ్యతిరేకులతో కూడా సరదాగా గడపగలిగేవాడిని. ఒక్కొక్కప్పుడు మేం ఇచ్చేవార్తలు తమకు బాధాకరంగా ఉంటే ఆ రాజకీయ వ్యతిరేకులు మమ్మల్ని చూసి విసుక్కుండేవారేమో. ఏమైనా చాలావరకు స్నేహంగానే ఉండేవాళ్లం.

పోతాన్ జోసెఫ్ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు సంపాదకుడిగా ఉండేవాడు. అది కాంగ్రెస్ విధానాన్ని అనుసరించే పత్రిక. తీరా ఎక్కువ జీతం ఇస్తామని చెప్పి ముస్లింలీగ్ పత్రిక అయిన డాన్ పత్రికవాళ్లు ఆయనను సంపాదకుడిగా తీసుకెళ్లారు.

పత్రికా రచన అనేది న్యాయవాద వృత్తిలాంటిదే అనే పోతాన్ జోసెఫ్ తనను తాను సమర్థించుకున్నాడు. సామాన్యంగా ఇటువంటి మార్పులు మంచిపేరున్నవాళ్లలోనూ ఏపేరూలేని వాళ్లలోనూ సాధ్యమవుతూ ఉండేది.

ఏ పత్రికలోనైనా చేరినప్పుడు ఆపత్రిక విధానాన్ని అనుసరించటానికే సిద్ధపడే చేరతాంకదా. మరి ఏదో విరుద్ధంగా రాయవలసి వచ్చినపుడు, దానికి మన అంతఃకరణ ఒప్పుకోకపోతే రాజీనామాచేసి బయట కొచ్చేస్తాం. టైమ్స్ ఆఫ్ ఇండియాలో న్యూస్ ఎడిటర్‌గా పనిచేస్తున్న కోటంరాజు రామారావు ఆరోజుల్లో చాలా ఎక్కువ జీతభత్యాలే

పుచ్చుకునేవారు. కానీ సత్యాగ్రహోద్యమం కాలం సమీపించేటప్పటికి అంత మంచి ఉద్యోగానికీ రాజీనామా ఇచ్చి తనకు దేశంపట్ల ఏదో బాధ్యత వుందని నమ్మి చాలా తక్కువ జీతం ఇచ్చే పత్రికలో చేరాడు. ఆపైన అరెస్టు అయ్యాడు. ఏది ఏమైనా డబ్బుకోసం ఆత్మగౌరవాన్ని అమ్ముకునేవాళ్లు అప్పుడూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు.

*ప్ర: నాటికీ నేటికీ మానవుని సంస్కారంలో వచ్చిన మార్పులేమిటి ?*

జ : వాస్తవానికి నేను ఈ కాలంలో కూడా పత్రికా రచయితగానే చలామణి అవుతున్నాను. కాబట్టి నారోజులు అనేవి 50 ఏళ్లనుంచి నడుస్తున్నాయి. నేను పత్రికలు చదవటం ప్రారంభించి 60 ఏళ్లవుతుంది. అప్పటికీ ఇప్పటికీ కూడా మన సంస్కారాన్ని తీర్చిదిద్దుతున్నది ప్రభావితం చేస్తున్నది చచ్చిచావకుండావున్న ఒక గడిచిన కాలం. అసలు ఈ గడిచిన కాలమంటే ఏమిటో ఎవడికీ తెలీదు. అది ఎంతకాలం కింద గడిచిందో ఏవళ్లూ చెప్పరు. ఏమిటో పూర్వం బావుండేది అని లేకపోతే ఏమిటో పూర్వం బాగా వుండేది కాదని ఎవరి అనుభవాన్నిబట్టి వాళ్లు చెప్తుంటారు. పూర్వంగానీ ప్రస్తుతంగానీ అదంతా ఆకాలాల మనుషుల్ని బట్టి బాగోగుల ప్రత్యేక కలయిక మాత్రమే. కాకపోతే యంత్రాలు తెచ్చిపెట్టిన వినూత్నత మానవజాతిని చాలా ప్రభావితం చేస్తున్నది.

ఒక విధంగా ఈ యంత్రాల యుగాన్ని భారతదేశమే సాధ్యం చేసిందని మనం చెప్పుకోవచ్చు. మన నిస్సహాయస్థితి, మన బానిస ప్రవృత్తి వలన ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం వర్ధిల్లింది. అందువలన ఇంగ్లండ్‌కు మనం విపణి, ఆర్థికం, ఇచ్చుకుని, అందుకు అనువైన మానసిక స్థితికూడా అలవరచుకుని వాళ్ల పారిశ్రామిక విప్లవాన్ని వాళ్లకి ఎంతో సానుకూలం చేసి పెట్టాం.

కానీ మన వాళ్లు చేసుకున్న కొన్ని సాంస్కృతిక సంస్కరణలు లేకపోలేదు. మనదేశంలో ఇంగ్లీషు చదువులకి ప్రారంభోత్సవం చేసిన వ్యక్తి రాజారామమోహనరాయ్. అతడు పెట్టిన సంస్కారభిక్ష నేటికీ కొనసాగుతూనే వుంది. మనకు నిజం చెప్పుకోవటమనే ఆచారంలేదు. మనకు ఆచార సంప్రదాయాలు తప్ప శాస్త్ర దృక్పథంలేదు. వివరాలలోకి వెళ్లటంలేదు. అదో గ్రంథమవుతుంది. ఆచార సంప్రదాయాల కోసమని మన పూర్వీకుల్లో కొందరు శాస్త్రాలనే మార్చినట్లు ఇతిహాసం వెల్లడిస్తున్నది. పాలకుల బలవంతం వలన మతం మార్చుకున్న కాశ్మీరు పండితులను తిరిగి పండితులను చేయటానికి కాశీలోని సనాతన పండితులు ఒప్పుకోలేదు. ఈ ముచ్చటను జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో పేర్కొన్నాడు. సంప్రదాయాలకు అనువుగా ధర్మశాస్త్రాన్ని కృష్ణాతీర పండితులు తారుమారు చేసినట్లు మహదేవ గోవింద రనడే మరాఠా చరిత్రలో రాశాడు. విజయనగర సామ్రాజ్య స్థాపనకై ఒక సైన్యాన్నే తిరిగి హిందువులుగా చేసిన విద్యారణ్యుడు దౌర్జన్యం వలన వేరేమతంలో చేరవలసివచ్చిన స్త్రీలను మళ్లీ హిందూ సంఘంలోకి చేర్చటానికి

నిరాకరించాడు. ఇట్లా చెప్పుకుంటూపోతే మన పూర్వీకుల అవకతవకల జాబితా ఒక మహాగ్రంథమవుతుంది. కానీ నేనెరిగిన కాలంలో మాత్రం కొన్ని చెప్పుకోదగిన మార్పులు ప్రజల దృక్పథంలో వచ్చినాయి. దళితులపట్ల మన వైఖరిలో మార్పు సమగ్రంగా వచ్చినా రాకపోయినా మార్పు రావాలి అనే సత్యాన్నయినా ప్రజలు గ్రహించటానికి కారకుడు గాంధీజీ. అసలు మన వర్ణవ్యవస్థ మనదేశానికి శాపం వంటిది. దీని పట్ల మనకున్న ఆదరం ప్రపంచ ఇతిహాసంలోకల్లా చాలా ఆశ్చర్యకరమైనది. వేశ్యలపట్ల తరతరాలుగా మనకు ఒక విధమైన వైఖరి నెలకొని ఉన్నది. ఎనిమిదేళ్ల బాలికలకు పెళ్లిళ్లు చేయవలెననే సంఘంలో ప్రణయక్రీడ అసాధ్యం. కానీ వేశ్యలనే కులంవలన సాహిత్యోపాసకులకు ప్రణయ క్రీడసాధ్యమై దేవతల్లో కూడా వేశ్యలను సృష్టించడం కవి సమయమైంది. గాంధీజీ నాయకత్వం వచ్చిన తర్వాత ఇటువంటి కార్యకలాపం కొంత వెనకపట్టింది. ఎందువలన? ఇంతకంటే ముఖ్య కార్యకలాపం వచ్చిపడినందున. ప్రధానమైనది దేశ స్వాతంత్ర్యమనే భావం ఎల్లెడలా వ్యాపించినందున ప్రతికాంగ్రెస్ సభకు వేశ్యగా పుట్టిన యామినీ పూర్ణతిలకమ్మవచ్చి తమ పట్ల ఈసంఘం చేసిన అత్యాచారాన్ని వివరిస్తూ ఇది ఎంత నిషిద్ధమైన ఆచారమో చెప్తావుంటే తప్పక పలువురు ప్రభావితులై వుంటారు. మరి ఒక సంస్కారణ భాషలో వచ్చిపడింది. ప్రజలలోకి వెళ్లి వాళ్ల అనుభవిస్తున్న అస్వాతంత్ర్యాన్ని గురించి వారు అనుభవించవలసిన స్వాతంత్ర్యాన్ని గురించి దేశభక్తులు నిత్యం ప్రబోధం చేయవలసివచ్చింది. ఈ ప్రబోధం ప్రజలు అర్థంచేసుకునే శైలిలోనేగదా చేయవలసింది. ఈ ప్రబోధాన్ని రాతమూలకంగానో పాటలమూలకంగానో రానురాను ఎంతో విస్తృతం చేయవలసివచ్చింది. తత్ఫలితంగా గ్రంథాల్లో దాగివున్న శైలిదాదాపు పనికిరానిదైపోయింది. ఎంత ఉత్కృష్ట అంశాన్నయినాసరే తేలికగా ప్రజలకు చెప్పటం, ప్రజలు చెప్పుకొనటం ఒక ఉత్తమ సంస్కారమని ఒప్పుకుతీరాలి. గాంధీజీ కొన్ని క్రూరాచారాలను ప్రజలచేత విస్మరింపచేశాడు. అది ఆయన నాయకత్వంలో ప్రజలు సాధించిన సంస్కారం.

ఇప్పుడు విదేశీ అనుకరణలు ఎక్కువైపోయినాయి కాబట్టి సంస్కారసాధన అనేది ప్రధానంగా కానరావటంలేదు. సంస్కారం మనిషిలోంచి పుట్టుకొచ్చేదే. అనుకరణ ఎక్కడినుంచో తెచ్చిపెట్టుకున్నది. అప్పటికీ ఇప్పటికీ ఇంత తేడా వుంది.

***ప్ర : లలిత సంగీతానికి, గ్రామీణ సంగీతానికి తేడా ఉందా ? రెండూ ఒకటేనా ? ఇన్ని సంస్థలు ఉన్నా లలిత సంగీతానికి ప్రోత్సాహం ఎందుకు కొరవడింది ?***

జ: సంగీతం, నాట్యం కూడానూ, ఆమాటకొస్తే చిత్రలేఖనం, అంతదాకా ఎందుకు అన్ని లలితకళలు ఈగంభీర ప్రకృతికి అనుకరణలు, ప్రతికృతులు. మానవుని సుఖ దుఃఖాలు వాస్తవానికి నిసర్గమైనవి. అనుకరణలుకావు. అనుకరించినా, అవి ప్రకృతికి కూడా అనుకరణలు కావాలి.

ఉడత ఒకటి చెట్టెక్కుతూ దిగుతూ ఒక వరసక్రమంలో ఒక ఉదాత్త అనుదాత్త ఫణితిలో అరుస్తున్నది. దానిని ఒక ప్రతిభావంతుడైన మానవుడు ఒక లయక్రమంగా సంభావించి ఒక తాళ క్రమాన్ని రూపొందించుకున్నాడు. అంటే మానవుడు అనుకరించగల తాళక్రమంలో తీర్చిదిద్దుకున్నాడు. అప్పటికి లయ ముఖ్యం.

ప్రాణి మనుగడకు సానుభూతి ఎంతోఅవసరం. మనిషిపట్ల మనిషికి సానుభూతి ఉండాలి. జంతువుపట్లా ఉండాలి. వనస్పతులపట్లకూడా ఉండాలి. ఆ సానుభూతిని ప్రకటించుకునే శబ్దతతి ఉండాలి. మానవుడు ఏదో జాలి గొలిపే శబ్దాలను రాగవరసన పలుకుతున్నాడనుకోండి. ఆశబ్దాలు విన్న జంతువులు కూడా తన్మయత చెంది అతడి రాగాలాపనను వింటూ గడపవచ్చు గదా! భాగవతకారుడు ఒకసానుభూతి ప్రకటనను విన్న చెట్లు కూడా తన్మయతతో ప్రతి ధ్వనులు చేసినవన్నాడు. వృక్షతతికి కూడా మానవులవలే సుఖదుఃఖానుభూతులుంటాయని వృక్షశాస్త్రవేత్తలు చెప్తూనే ఉన్నారు.

వృక్షాలు, జంతువులు ఎంత సహజంగా ప్రవర్తిస్తాయో తెలిసిన వారెవరు? వాటి సన్నిధిలో జీవితాన్ని గడిపే ఆటవికులు, అంటే శబరులు, పుళిందులు వగైరాలు. వాళ్లనే గోండ్లు అని కూడా అంటున్నాంకదా! వాళ్లు పాడే పాటలు వాళ్లు ఆడే ఆటలు గొండ్లినృత్యాలు సంగీతాలు అనవలెగదా. ఆగొండిలీ నృత్యాన్ని నాగరిక సంఘం అభిరుచులకు అనువుగా క్రమబద్ధం చేసినవాడు సోమేశ్వరుడు. అంటే దేశీయమైన ఒక నృత్యాన్ని మార్గీకరించాడన్నమాట. పశ్చిమ చాళుక్యులకి చాలాకాలం కాకతీయులు సామంతులు. కాకతీయులు నిర్మించిన రామప్పదేవాలయంలో ఈ గొండ్లినృత్య భంగిమలు కొన్ని సాక్షాత్కరిస్తాయి.

ఇంతకూ చెప్పేదేమిటంటే ప్రకృతిలో ఉన్న నవరసాలు, మానవుని ప్రజ్ఞలో ప్రవేశించి పాటలైనాయి. ఆటలైనాయి. ప్రకృతికి సన్నిహితంగా ఉన్న ఆటపాటలను నేటివారెందుకో జానపద కళలంటున్నారు. వాటినే మార్గీకరిస్తే శాస్త్రీయ కళలంటున్నారు.

ఇప్పుడు సినిమాపాటలు వగైరాలు జానపదులుకూడా పాడుకుంటున్నారు. వెనకటి రోజులల్లో వాళ్లపాటలు వాళ్లకుండేవి. వాళ్ల సంతోషాలు, దుఃఖాలు, తత్వాలు వాళ్లపాటల్లో వ్యక్తమవుతూ ఉండేవి.

ఇప్పుడు ఈసంగీతాన్ని జానపదమనీ శాస్త్రీయమని ప్రాంతీయమని ఆధునికమని ఇంకా ఎన్నెన్నో విధాలుగా వర్గీకరించి మానవుడు తన ప్రత్యేకతను ప్రదర్శించుకుంటున్నాడు. ప్రకృతికి సన్నిహితమైన కళను మార్చి తనకు సన్నిహితం చేసుకుంటున్నాడు ప్రజ్ఞావంతుడైన మానవుడు. కాని ఏసంగీతమైనా ప్రకృతికి సన్నిహితంగా ఉంటేనే ఆనంద కారకమవుతుంది.

శాస్త్రీయ సంగీతంకానిది లలిత సంగీతమని అంటున్నారు. ఏసంగీతమైనా ఒక

రాగవరసకు ఒదగాల్సిందే గదా! ఏసంగీతమైనా మానవుని హావభావాలను ప్రకటించవలసిందేగదా! సంగీతాన్ని వర్గీకరించేవాళ్లు ఈనిజాన్ని విస్మరిస్తున్నారా అన్పిస్తుంది. మన శాస్త్రాల ప్రకారం పాడుతుంటే అది శాస్త్రీయసంగీతం.

త్యాగరాజు ఎప్పుడైనా తంజావూరు వెళ్లేవాడు. ఒక పర్యాయం వాలాజ, కాంచీపురం, చెన్నపట్నంకూడా వెళ్లాడు. అప్పటికి ఈస్టిండియా కంపెనీ వాళ్లస్థావరాలు ఈ అన్ని చోట్లా నెలకొనే ఉన్నాయి. ఈస్టిండియా కంపెనీ సైనికదళాలు ఈ అన్నిచోట్లా ఉండేవి. వాళ్లవాయిద్యాలు వాళ్లు వాయించేవారు. వాళ్ల ఫణతులు వాళ్లకుండేవి. ప్రతిభావంతుడైన త్యాగరాజు ఆపండితులను కూడా అనుకరించాడు. ఉదాహరణకు కోకిల వరాళిరాగం. అది బ్యాండ్ మేళంలాగానే ఉంటుంది. అట్లాగే పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ కదన కుతూహల రాగంగా రూపొందించాడు. స్వాతి తిరునాళ్ - కుంతల వరాళి రాగాన్ని రూపొందించాడు. ప్రతిభావంతుడైన వాడు నవనవోన్మేషంగా తన ప్రజ్ఞను ప్రదర్శించుకుంటాడు. ఈ రాగాలు మనవికావు కాబట్టి ఇవి లలిత సంగీతం కిందకు వస్తాయని అనగలమా! సంగీత శిక్షణలేని వాళ్లుపాడుకునేవన్నీ జానపద సంగీతాలని అనగలమా? శాస్త్ర ఫణతులుగానే మానవ హావభావ చేష్టలకు సన్నిహితంగాలేని గానాలనన్నింటినీ సంగీతమని అనగలమా? ఇప్పుడు చాలా మంది చేస్తున్న కచేరీలు ఎన్నడైనా త్యాగరాజు భక్తిని, ఆమాటకొస్తే ఎవరి భక్తినైనా, భావాలనైనా చూపగలుగుతున్నవా?

క్షేత్రయ్య మనోజ్ఞమైన తెలుగు భాషలో పదరచన చేశాడు. అర్థవంతమైన నుడికార విరాజితమైన శైలి అతడి సొమ్ము. నిక్కచ్చి అయిన కర్ణాటక బాణిలో అతడి పదాలను పాడాలి. భావాన్ని హృద్గతంచేసుకుని అభినయించడం ఆ పదాల లక్ష్యం. ఇన్ని సహజమైన కట్టుబాట్లు ఉన్నందువల్ల వాటిని పాడటంగానీ అభినయించడంగానీ చేతగాక మన విద్వాంసులు వాటిని వదిలేసుకున్నారు.

కృతకంగా చేసిన వర్గీకరణలు విమర్శకు నిలవవు. శాస్త్రీయ, లలిత, జానపద, ఆధునిక అనేవి కృతకం. ఏది మన హృదయాలను ఆర్ద్రీకరిస్తుందో అది కళ.

*ప్ర: సాంస్కృతికరంగం సుసంపన్నంగా ఉన్నప్పుడు సినిమా ప్రవేశించింది. సాంస్కృతిక రంగంపై, మన సంస్కారంపై సినిమా చూపిన ప్రభావం ఏమిటి ?*

జ: కొన్ని ప్రశ్నలకు అవును కాదు అని ప్రత్యుత్తరం చెప్పలేం. చెప్పరాదుకూడా. అసలు సంస్కారం అంటే ఏమిటి? నాలెక్క ప్రకారం మనిషికి మనిషికి ఉండవలసిన సంబంధాన్ని విధించేది సంస్కారం. ఈ వాక్యం బాగాలేదు. ఏదో ఒక రోజున ఈ వాక్యాన్ని సంస్కరించుకోవాలి.

మతం, జాతి, ప్రాంతీయత, కులం, వర్గం వగైరా తేడాలన్నీ కలిసి కట్టుగానో విడివిడిగానో మానవ సంస్కారాన్ని, పోనీ సంస్కృతినీ రకరకాలుగా చెడగొడుతున్నాయి.

అవసర సంస్కారాన్ని సృజించే, పెంపొందించే మార్గాలనేకం ఉన్నాయి. వాటిల్లో నాటకం ఒకటి. ఆనాటకమే సినిమారూపం దాల్చింది. సినిమా సంగతి తర్వాత చూద్దాం. ముందుగా ఈ మానవ సంస్కారాన్ని పెంపొందించే పదిలం చేసే మార్గాలేవో తెలుసుకుందాం. సంస్కారాన్ని పెంపొందించటానికి, పదిలం చేయటానికి యంత్రాల సహాయం తీసుకునే కాలం వచ్చింది. మనిషి చేసిన యంత్రాలే మనిషికి అతీతమైన శక్తులుగా మనుషులే వర్ణించుకుని మురిసి పోతున్నారు. కానీ యంత్రాలు రాకమునుపే ఎంతో ముందుగానే యాంత్రికమైన ఆలోచనలు నెలకొనే ఉన్నాయి. సందర్భోచితంగా వీటిని గురించి చెప్పుకుందాం.

రాయల కాలంలో ఒక అధికారి ప్రజలపై చేస్తున్న దౌర్జన్యాన్ని ఒక నాటక బృందం తమ యక్షగాన ప్రదర్శనలో వ్యక్తం చేశారట. ఆరాజుగారికి అంతో ఇంతో సంస్కారం ఉన్నందువల్ల ఆ అధికారిని మళ్లీ దౌర్జన్యం చేయకుండా నిరోధించగలిగాడు.

సాహిత్యం, నూత్న ఆలోచనను కలిగించాలని నూతనకాలాన్నే నిర్మించాలని పెద్దలమాట. ''నిర్మాతి నూత్న సమయం, దురితం ధునోతి -'' (కావ్యకంఠుని అవధానంలోంచి)

నేటి పత్రికలకు ఆధారమైనది నిత్యసాహిత్యం. నిత్య సాహిత్యం ఎంత అనిత్యమైనప్పటికీ దానికీ సాహితీ ధర్మాలు కొన్ని ఉంటాయికదా! అది తప్పక నూత్న సమయాన్ని సృజించ గలగాలి. ఈ కాలంలో సంస్కారానికి దారితీసే ప్రబల ఉపకరణం పత్రికలు. పూర్వం వలే కేవలం నాటకాలపైన, కావ్యాలపైన ఆధారపడటంతో తృప్తిపడక నిత్యసాహిత్యంపైన కూడా అంతకంటే మిన్నగా ఆధారపడవచ్చును.

ఇది ప్రజాస్వామ్యకాలం. వివిధ రంగాలలో ముఖ్యంగా పరిపాలన రంగంలో నిత్యం ఏమేమి జరుగుతున్నదో ప్రజలు తెలుసుకొనదగు కాలం. నిత్యం జరిగే సహస్రానేక కార్యక్రమాలను ప్రజలకు తెలియ చెప్పాలంటే ప్రజలకు తేలికగా అర్థమయ్యే భాషలో చెప్పాలి. చెప్పగలగాలి. అందువలన పూర్వపు శైలికంటే ఈ నిత్య సాహిత్య శైలి సుబోధకమవుతున్నది. దీనిని ఒక ప్రజాశైలి అందాం. విస్తృత ప్రజానీకానికి ఉపయోగకారిగా రూపొందిన ఒక భాషా సంస్కారం ఇది.

ఈ శతాబ్ద ప్రారంభంలో మన దేశంలోకి గ్రామఫోను వచ్చింది. గ్రామఫోనుద్వారా పాటలరూపంలో నిత్యసాహిత్యాన్ని, అంటే ప్రజలకు సన్నిహితమైన కార్యక్రమాల వర్ణనలను ప్రసారం చేయనారంభించారు. పాటక జన ప్రవృత్తులనుగురించి, వారికి సములైన ఇతర వర్గాల ప్రజలను గురించి, ముఖ్యంగా స్త్రీలను గురించి అనేక గ్రామఫోను రికార్డులు వచ్చాయి. ప్రజలకు తమను గురించి తాము వినటం ఎంతో వినోద కాలక్షేపం అయింది.

ఇట్లా ప్రజలకు ఒక అవసర ఆత్మ విజ్ఞానాన్ని కల్పించిన ఖ్యాతి వల్లూరి జగన్నాథరావు, మాచిరాజు శ్రీరామమూర్తి, వనజాక్షి అనే నాదోపజీవులకు దక్కుతుంది.

నాటకబృందాలు చాలా వరకు ఒక ఆదర్శసంస్కృతిని తమ ప్రదర్శనల ద్వారా ప్రచారం చేసేవి. దానిని పురాణ సంస్కృతి అందాం. అప్పట్లోనూ సాంఘిక సమస్యలను ఆధారం చేసుకున్న నాటకాలు ప్రదర్శించేవారు. నాటకం చిరకాలం నుంచి కొనసాగుతున్న సాంస్కృతిక ప్రక్రియ. నాటకాలద్వారా ఆయా కాలాల సమస్యలపై రంగస్థలం నుంచి వ్యాఖ్యలు వెలువడేవి. ప్రజలకు కనువిప్పుగా ఉండేవి.

కానీ ప్రజలకు అన్ని సంస్కారాలు ఇష్టంవున్నట్లు కనపడదు. వేశ్యావృత్తిని చింతామణి నాటకం చూసి నిరసించిన జనం ఎందువలననో వరశుల్క దురాచారాన్ని వరవిక్రయాన్ని చూసి ఏవగించుకోలేదు. మధుసేవ చూసి లేక రంగూన్ రౌడిచూసి కొంతమందైనా తాగుడు వ్యసనం నుంచి తాగుడు రసికతలోకి మారివుంటారు. సంస్కారానికి ప్రజలుకూడా సంసిద్ధులై వుండాలికదా!

నాటకాల తర్వాత వచ్చి పడింది సినిమాల యుగం. గ్రామఫోనులుకూడా సాధించలేనంత యాంత్రిక సన్నిధిని సినిమాలు కల్పించగలిగాయి. సినిమాలు సంస్కారాన్ని కల్గించాయని అనేకంటే వినోదాన్ని బాగా కల్గించాయని అనవచ్చు. పైగా యంత్రంద్వారా వెలువడే నాటకం ప్రేక్షకులకు ఎంతో అబ్బురం కల్గిస్తున్నది. సినిమాలలో అబ్బురం కల్గించటానికి తగిన మాయ చాలా ఉంది. దానిలో కనపడే మనిషి ఒకడు, మాట్లాడే వాడు వేరొకడు, పాడేది మరింకొకడు. సినిమాద్వారా చాలా వరకు కనికట్టును సాధించగలిగారు. సినిమాకు మించినది దూరదర్శన్. అయినా సినిమా మతికట్టుకూడా సాధిస్తున్నది. నీచవినోద కల్పనకు రాజకీయ ప్రచారానికి ఉపయోగించకపోతే సినిమా సంస్కార ప్రయోజనాలను సాధించగలుగుతుంది. కానీ కళ పేర మానభంగాన్ని చూపనక్కరలేదు. యంత్ర సామర్థ్యాన్ని నిరూపించటానికి కనికట్టు కొట్లాటలు చూపనక్కరలేదు. ఈ రెండూ అవివేకులైన యువజనంపైన, పిన్నలపైన నెరపుతున్న ప్రభావం చాలా శోచనీయమైనది, ప్రమాదస్థాయికి చేరుకున్నది.

సంస్కారాన్ని మానవ ప్రవర్తన ద్వారా సాధించవలసింది పోయి లాభాల సంపాదన యంత్రంద్వారా సాధించాలనుకుంటే జరిగేది ఇంతే.

సంస్కారం వినోదానికి పరిమితమైనప్పుడు సంఘానికి కొత్త సమస్యలు ఎదురవుతాయి. కుసంస్కారానుకరణ ప్రధానమైపోతుంది. సంస్కారం అప్రధానమై పోతుంది. ప్రస్తుతం మనం అనుభవిస్తున్న పరిస్థితి ఇదే. తంజావూరు, మధుర రాజ్యాలను నాయక రాజులు పాలిస్తున్న కాలం చివరి భాగంలో ఆచారధర్మాల అనుకరణ ప్రబలింది. అప్పట్లో గొప్పనటుడుగా పేరు తెచ్చుకున్న భాగవతుల లచ్చిగాడు ఆడవేషం వేసుకుని ప్రతి

ఇంటికీ వెళ్లేవాడట. అతడు నిత్యం ఎక్కే గుమ్మం దిగే గుమ్మం - ప్రతి ఆడదాన్నీ కలుసుకున్నాడు. అంటే ఏమిటి? ఇప్పటి పరిస్థితులు అందుకు ఏమైనా భిన్నంగా ఉన్నవా? లచ్చిగాడు తంజావూరు, మధురలలోనే తిరిగాడు. ఇప్పటి నటీనటులు దేశమంతా తిరగ గలరుగదా! సినిమాలో వీరుని, సంఘంలో వీరుడి కింద భావించి లొంగిపోవడం నిత్యమైనది కదా! చివరకు ఎంతదాకా వచ్చిందంటే శ్రీరామచంద్రమూర్తి గొప్పవాడని లేక శ్రీకృష్ణుడు గొప్పవాడని సినిమావాళ్లు చెబితేనే నమ్మేకాలం వచ్చిందికదా! ఇది మనందరికీ విదితమైన విశేషం. వివరించి చెప్పక్కర్లేదు. ఇప్పుడు కృత్రిమ బోధకులు సాక్షాత్కారిస్తున్నారు. వెనకటికాలంలో శీలం లేని కవులు, రచయితలు గొప్పవారుకాగా ఇప్పుడు అటువంటి నటీనటులు క్రీడాకారులు మనకు ప్రబోధకులవుతున్నారు.

కాబట్టి సంస్కారమనేది వ్యాపార ప్రవాహంలో తేలియాడే సరుకయింది. అది ఏ ఒడ్డు పడుతుందో ఏ స్థితిలో పడుతుందో మనకు తెలియదు.

ప్రజలుకూడా తమకు కావలసిన సంస్కారాంశాలనే సమయానుకూలంగా స్వీకరిస్తున్నారు.

*ప్ర: యాభైల తర్వాత ఇప్పటికీ పెయింటింగ్, డాన్స్ వంటి వాటిల్లో సొంత ఆంధ్ర శైలి ఏర్పడక పోవటానికి కారణం ఏమిటి ?*

జ: కాలం గడిచిన కొద్దీ కొన్ని ఆచారాలు సంప్రదాయాలు పాతబడతాయి. పరిత్యక్తాలవుతాయి. కొన్ని ఆచార సంప్రదాయాలు సవ్యంగా కనపడి ఆలంబనీయాలవుతాయి.

ఈ సంస్కృతి అనేది మనకు మత, కుల ఆచార వ్యవహారాలతో ముడి పడివుండి మార్పుకు అనువైనదిగా ఉండలేదు. నాటకాల ద్వారా సినిమాల ద్వారా పత్రికల ద్వారా సంప్రాప్తించిన వికాసమే సంస్కృతి అయిపోతున్నది. అనేక సందర్భాలలో పూర్వపు ఆచార సంప్రదాయాలు ఈ కొత్త సంస్కృతితో మిళితమై హాస్యాస్పదమవుతున్నాయి. ఈ స్థితిలో సంస్కృతిని గురించి వార్తలు వెలువడకపోవడం అనేది నిస్సారమైన కించ.

సినిమాని గురించి రాయటం సంస్కృతిని గురించి రాయటమే అవుతోందిగదా! క్రికెట్‌ని గురించి రాయటం ఉన్నత సంస్కృతిని వర్ణించినట్లే అవుతుందిగదా! ఆధునిక పరిశోధనలను పరిశ్రమలను గురించి వ్రాయాలంటే ఆధునికీకరణ లేని భాషలో విదేశీ పదజాలాన్ని జొప్పించి పలువురికి అర్థంకాకుండా రాస్తున్నారు. అదొక సంస్కారం.

చిత్రలేఖనంలో ఏవో ఉద్యమాలు ఉండాలని వాటి ప్రభావం వచ్చి పడాలని వాదించే రాజకీయ వాదులున్నారుకదా! ఆధునికత అనేసరికి పదజాలమేలేదుకదా! ఇదే సత్యం కవిత్వానికి, సాహిత్యానికి కూడా వర్తిస్తుంది. చిత్రలేఖనానికి దేశీయమైన వ్యక్తీకరణ లేకుండా

పోతున్నది. పూర్వం ఏనాడో వేళ్లువారిన సంగీతం, నాట్యకళలే మార్పులేకుండా ఈనాటికీ ప్రదర్శిస్తే అదే సంస్కారం అనుకునే వాళ్లు బోలెడుమంది. త్యాగరాజు గొంతులో వ్యక్తమైన భక్తి ప్రపత్తులు లేకుండా ఒక నిస్సారమైన శాస్త్రీయబాణిలో పాడితే చాలు, అదే సంస్కారం అనే వాళ్లున్నారు కదా!

పూర్వపు బాణీలు కొన్ని అనుకరించలేక, అసలు ఆభాషే అర్థంకాక ఆశైలే అర్థంకాక, ఆ ఓజస్సుతో నర్తించే శక్తిలేక పూర్వపు నాట్య సంప్రదాయాలలో కొన్ని మనకు పనికిరావు అనే వాళ్ల వైఖరికూడా సంస్కార ప్రతిబింబమే అవుతున్నదిగదా! పూర్వానికీ ప్రస్తుతానికి ఏదో కొట్లాట వచ్చింది. ఆ ప్రక్రియలుగానీ ఆప్రమాణాలుగానీ నేడు చాలా మటుకు లేవు. పైగా ఆపూర్వపు కళలతో పరిచయంలేని వాళ్లు రచయితలవుతున్నారు. ఆధునిక సంస్కార ప్రక్రియలకు అనువుగా భాషాశైలి రూపొందటం లేదు. ఇదేదో మార్పు జరుగుతున్నకాలం.

పి.వి. నరసింహారావు ప్రధానమంత్రి అయిన సంవత్సరంలో దాదాపు 72మందికి హైదరాబాద్ రవీంద్రభారతిలో ఆయన వయసుకు సంకేతంగా సన్మానం చేశారు. సన్మానితులలో సినిమావాళ్లున్నారు. రచయితలున్నారు. క్రీడాకారులున్నారు. కళాకారులున్నారు.

ప్రేక్షకులు క్రీడాకారుడు అజరుద్దీన్ కనపడడంతోటే రవీంద్రభారతి కప్పులేచిపోయేటట్లుగా హర్షధ్వానాలు చేశారు. అదేదో వెర్రి అన్పించింది. ఆతర్వాత సినిమానటుడు జి. కృష్ణకానరాగానే మళ్లీ హర్షధ్వానాలు చెలరేగాయి. రచయితలు, కవులు వచ్చినపుడు అట్లా ప్రేక్షకులు ధ్వనించారో లేదో ఇప్పుడు చెప్పలేం. ప్రేక్షకులు వేలం వెర్రి మనుషులనుకోక తప్పలేదు. కానీ కొంతమేర ఈసన్మాన కార్యకలాపం జరిగింతర్వాత అంధవైలెన్ విద్వాంసుడు మారెళ్ల కేశవరావుకు సన్మానం చేస్తున్నారు. ప్రేక్షకులు అంతకుముందు ఏ సందర్భంలోనూ చూపని ఆనందంతో హర్షధ్వానాలు చేశారు. కరతాళ ధ్వనులూ విన్పించారు. ఏమనాలి? గుడ్డివాడు అనిజాలి చూపారా? గొప్ప వయలనిస్ట్ అని ఆనందం ప్రకటించారా? ఏమైనప్పటికీ ప్రజలు పూర్తిగా చెడలేదు. సంస్కారం నివురులో ఉన్న నిప్పులాగా ఉంది అనవచ్చునా ?

*ప్ర: మీ కాలంలో మీరు కృష్ణ శాస్త్రి, బాపిరాజు వంటి భావకవులను, సంప్రదాయ కవులను, చలంవంటి రెబెల్స్‌ను సన్నిహితంగా చూసి ఉంటారు. ఆధునిక సాహిత్య ఉద్యమాలున్నాయి. వీటిని మీరు ఎలా చూస్తున్నారు. పాండిత్యం ఎలా పనిచేస్తోంది ?*

జ: కవి అనేవాడే ఉన్నాడు. భావుకత ప్రకటనాచాతురి అనేవి మాత్రమే ముఖ్యం. మీరు ఎన్నడైనా నేటికాలపు కవిత్వం చదివారా? అబ్బూరాజు ఉమాకాంతం గారనే ఆయన రాశాడు. నన్నయదగ్గర నుంచి నేటిదాక తెలుగువాడికి స్వతంత్ర భావుకతలేదన్నాడు. ఆయన నిర్మొహ మాటం మనకు ఆదర్శంకావాలి.

తెలుగు కవులలో సంప్రదాయాన్ని పాటించేవారు వున్నారని అంటూవుంటాం. ఇది సృష్టికే విరుద్ధం. నాలెక్క ప్రకారం సంప్రదాయాన్ని సుష్టుగా పాటించేది బండమాత్రమే. భాషా శైలి ప్రతి వంద ఏళ్లకు మారుతూ వుంటుందంటారు. భావుకత ఫణితికూడా మారకపోతే భాషా శైలి మాత్రం మారి ప్రయోజనం ఏమిటి? భాషా శైలి మారి భావుకత ఫణితి మారకపోతే హాస్యాస్పదంగా వుంటుంది. ఇంతకూ నేను అనేకుల కవులను రచయితలను కలుసుకున్నమాట నిజం. వాళ్లను గురించి రాసిన మాటా నిజం. నాకు వాళ్లలో ఎక్కువ తక్కువలు ఏమీ కనపడలేదు. కాకపోతే నాకు అభిమాన వ్యక్తులున్నారు. బాపిరాజుగారు అమృతహృదయుడు. మమ్మల్ని ఆయన ప్రేమించినంతగా మేం ఆయనను ప్రేమించలేకపోయామని నాకించ. రెండు మూడు సంవత్సరాల క్రితం ఎక్కడో చదివాను. విప్లవ రచయితగా పేరుపొందిన రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు తన రచనల మూలంగా విప్లవం వస్తుందనిగానీ ప్రజలు మారుతారనిగానీ నమ్మకం లేదన్నాడు. ఆయన సత్యాన్వేషిగా కానవచ్చాడు. రచన అనేది హృదయం నిర్ణయించిన ఒక విధివలే కొనసాగాలి. కానీ ప్రపంచంలో అందరినీ తాను మహా మార్చబోతున్నట్లు అహంకరించేది రచనే కాజాలదు. విశ్వనాథ సత్యనారాయణను చదువుకున్నంతమాత్రాన రాముడిపట్ల భక్తిపుట్టదు. శ్రీ శ్రీని అధ్యయనం చేసినంతమాత్రాన విప్లవానికి ఉద్యమిస్తారనుకోవడం భ్రమ. అన్నట్లు వీరిద్దరూ ఎవళ్ల భావాలనో కాజేసిన బాపతే. ఇద్దరి భాషాశైలి మాత్రం సాంప్రదాయకమైనది. గద్దర్ కవితా కృషి వేరు. ఒక ఉద్యమాన్ని లేవగొట్టటానికి కవిత్వం వెలయించిన వాళ్లలో గరిమెళ్ల సత్యనారాయణ, గద్దర్ చేరివున్నారు. గరిమెళ్ల పాల్గొన్న ఉద్యమం ఫలించటమేగాక ఇప్పుడు దేశభక్తి అవసరంలేకుండా పోతున్నట్లున్నది. పూర్వంకూడా చాలా మంది కవులకు దేశభక్తిలేదు. గద్దర్ కవితల్ని చదివి ఎవడూ విప్లవం నేర్చుకోడు. గద్దర్ కవితలుగానీ వంగపండు ప్రసాద్‌కవితలుగానీ విప్లవం కావాలనేవారే అభిమానిస్తారు. విప్లవం ముగిస్తే ఎట్లా అభిమానిస్తారో తెలీదు.

భావకవులను నేను చాలా మందిని కలిసిన మాట నిజం. వాళ్లలో ఎవ్వడూనాకు ఏ ఉత్తేజాన్ని కలగచేయలేదు. నేను దాదాపు అందరు కవులను కలిశానే. వాళ్లు నాకు ఉత్తేజమే కల్గించి వుంటే నేనుకూడా గొప్ప కవిని అయిపోయి ఉండాల్సింది కదా. ఉత్తేజం కల్గించారా లేదా అనేది అట్లా అట్టిపెట్టి నాకు ఆశ్చర్యం కల్గించిన ఇద్దరిపేర్లు చెబుతాను. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, కాశీ కృష్ణాచార్యులుగారు. వాళ్లను కవులందామూ అంటే మిగిలిన కవులందరూ వాళ్లు తమ వాళ్లేననుకుని పోతారని నాకు బెంగ. వాళ్లు కవులకు కవులు. చలంగారు మాకు అప్పుడు. పురుషాధిక్యం తలల్లో జీర్ణించుకుపోయి వెలయించిన రచనలు మనకు సంప్రదాయిక రచనలుగా కానవస్తున్నాయి. చలంగారు పురుషాధిక్యాన్ని లెక్కపెట్టలేదు. అందువల్ల ఆయన సంప్రదాయకుడుకాడు. మన మర్యాదలన్నీ పెద్దపెద్ద వాళ్ల పెద్దరికాన్ని నిలపటానికి ఉద్దేశించినవి. మా చలంగారు ఈ పెద్దరికాలు పాటించలేదు.

చిన్నరికాలూ పాటించలేదు. ఈమధ్య చలంగారి శతజయంతి జరిగింది. ఆశతజయంతి సంఘంలో నేనొక ఉపాధ్యక్షుణ్ణి. అందవల్ల ఆయనను గురించి విమర్శనా పూర్వకంగా ఎందరు ఏమేమి అనుకుంటున్నారా అని కొద్దిగా పట్టించుకున్నాను. ఈ విమర్శకుల్లో చాలా మంది తమకున్న నమ్మకాల ప్రకారం చలం రాయలేదని ఈసడించిన వాళ్లే. వాళ్లనుకుంటున్నట్లు చలం రాయాలిట. వింత ఏమిటంటే ఇట్లా తామనుకుంటున్నట్లు చలం రాయలేదని తిట్టిపోసిన వాళ్లలో కాలంచేసిన వితంతువులున్నారు (సనాతనులు) కాలాన్ని వితంతువును చేయాలనుకునే వాళ్లున్నారు. (విప్లవ రచయితలు) మన దేశంలో పెద్దగా చెప్పుకోదగిన సాహితీ ఉద్యమాలేమీలేవు. కాకపోతే కొందరు ఏవో ఉద్యమాలున్నాయని అంటూ ఉంటారు. మనదేశంలో స్వార్థం అనేది పెద్ద ఉద్యమం. మెచ్చుకోవటంలో ఉద్యమాలున్నాయి. మన క్లిష్టమున్నా లేకపోయినా ఒక విశేషం విధిగా గ్రహించాలి. ఏదైనా సానుకూల పరిస్థితి సంప్రాప్తించాలంటే అర్థమైనా కాకపోయినా వాల్మీకిరామాయణం సుందరాకాండ పారాయణం చేస్తాం. అంతేగానీ గురజాడ అప్పారావు రాసిన ముత్యాలసరాలు పారాయణం చేయంగదా! కవిత్వానికి కుడా అద్భుత శక్తులు ఉండాలి అని నమ్మటం మన సంప్రదాయం. ఇది కాక కవిత్వం దాన్ని గానం చేసే వాడిలో ఏదో హాయిని కల్గించాలి. లేకపోతే పశువుల కాపరికూడా సరదాగా ''జండాపైకపిరాజు'' 'అల్లుడా! రమ్మని ఆదరమ్మున పిలువ' అనే పద్యాలు గానం చేయటందేనికి? ఒక్కొక్కప్పుడు కవిత్వంలో వచ్చిన మాటలే మనకు సాధారణ సంభాషణల్లో ఉపయోగించే మాటలైపోతాయి. అట్లా ఏదో రాయాలిగానీ నా కవిత్వం చదివిన వాడు పిలకలు పెడతాడు. నాకవిత్వం చదివినవాడు పిలకలు తెగకోస్తాడు అని ఆశించడం కవిధర్మం కాకూడదు.

*ప్ర: సాహితీ ఉద్యమాలకూ, జీవన వాస్తవాలకూ పొత్తు కుదిరిందనే అనుకుంటున్నారా?*

జ: మనదేశంలో సాహిత్యానికి జీవిత వాస్తవాలకూ పొత్తుకుదరదు. మనదేశంలో కుల వ్యవస్థ ఉన్నన్నాళ్లూ పొరబాటునకూడా మానవత వికసించదు. కులాన్ని నిరసించిన వేమనను తమకులం వాడంటే తమకులంవాడని కొట్టుకుచస్తున్నారే - ఈదేశంలో సద్భావన అసాధ్యం. కవిత్వంరాసిన ప్రతివాడూ రుషికాడు. తన జీవితాన్ని ఒకసాధనగా ఒక ఉత్తమ ప్రయోగంగా తీర్చిదిద్దుకొనగలిగినవాడే రుషి అవుతాడు. కవి అవుతాడు. అటువంటి యోగ్యత కొంతవరకైనా మా చలం గారికి తప్ప చాలామందికి లేదు. వేలూరి శివరామశాస్త్రిగారికి కూడా అటువంటి అదృష్టం కొంత పట్టింది. ఈకొంత అనే మాట ఎందుకుపయోగిస్తున్నాను? బాగా చదువుకుని బాగా ఆలోచించి కవిత్వంరాస్తారు కదా! ఆ కవిత్వంబాగా చదువుకోనటువంటి బాగా ఆలోచించనటువంటి వాడికి కూడా నచ్చాలి. చదువుకోనివాడు మెచ్చనిదే చదువుకున్నవాడికి బతుకు లేదు. టాల్‌స్టాయ్ హింసాయుత విప్లవానికి ప్రేరకుడుకాజాలడు. కానీ ఆయన వర్ణించిన రష్యావారి జీవితం విప్లవకారులకు స్ఫూర్తినిచ్చింది. రష్యాలో చదువురానివాళ్లకు కూడా టాల్‌స్టాయ్ పేరు తెలిసిపోయింది.

ఫాదర్స్ అండ్ సన్స్ నవలలో - వాడెవడో తాగుబోతు తనను వర్ణించుకుంటూ టాల్‌స్టాయ్ సాహిత్యంలో గొప్ప వాడయినట్లుగా తను కల్లుపాకలో గొప్ప వాణ్ణని చెప్పుకున్నట్లు జ్ఞాపకం. కడకు టాల్‌స్టాయ్‌ని రైల్వేకూలీలుకదా గొప్పగా ఊరేగించింది. ఇదంతా ఎందువల్ల జరిగింది. వాళ్లంతా ఆయన రచనలు చదివారా? మిత్రుడు కాళోజి నారాయణరావు జైలులో పడ్డాడు. పక్కనే ఒక దొంగ కూడా ఉన్నాడు. వాడు దుర్మార్గుడని కాళోజి వాడిపట్ల నిర్లిప్తుడుగానే వున్నాడు. కానీ వాడు కాళోజిని ఆప్యాయంగా పలకరించాడు. - ''గాంధీ మహారాజు చెప్పిన పనిచేసి జైలుకొచ్చావా?'' (అట్లాంటిమాటేదో) అన్నాడు. కాబట్టి ఒకగొప్ప వాడు గొప్పవాళ్ల నోళ్లలో నలిగినంత మాత్రాన సరిపోదు. ఈరోజుల్లో ఎవడు కల్పించాడో ఒకనికృష్టపు మాట - 'మేధావులు' అని. ఆమేధావి మెచ్చుకుంటే ఒరిగేదేమిటి? అమేధావి మనపట్ల ప్రసన్నుడైనంత మాత్రాన ఏప్రయోజనమూ ఒనగూడదు. మేధావిని మెచ్చుకోవాల్సిన వాళ్లు నిరక్షరాస్యులు. ఆయోగ్యత మన కవులకు ఇప్పటికీ కల్గలా.

*ప్ర: ప్రజలు తమకు కావలసిన పాలకులను ఎన్నుకుంటున్నారు. ప్రజల రాజకీయ చైతన్యం పెరిగిందంటున్నా సమస్యల విషయంలో ప్రజలు పాలకులను నిలదీయటం లేదే ?*

జ: మన దేశంలో ఓటర్లు యోగవాశిష్టంలో వర్ణించిన చేతనామాత్ర జీవులు. అంటే ఇంద్రియాలను సంతృప్తిపరచటానికి బతికే వాళ్లు. ఎక్కువమాటలు పలకగలిగినవాడు మేధావి అవుతున్నాడుగానీ సదాలోచన చేసినంతమాత్రాన కాదు. మన రాజకీయాలు కేవలం స్వార్థంపై ఆధారపడివున్నాయి. వాళ్ల స్వార్థం తీర్చగలిగిన వాళ్లు మన ఓటర్లే. చేతనామాత్ర జీవులు అనే వాళ్లు -- యోగవాశిష్టంలో కానవస్తారు. వాళ్లకో పాపంగానీ పుణ్యంగానీ ఒక వివేచనగానీ ఒక విచక్షణగానీ ఒక విజ్ఞానంగానీ ఏదీ వుండదు. నిశుంభుడు ఏమి చెప్తే వాళ్లు అది చేసేస్తారు. మన ఓటర్లు ధనం, కులం, ఏమని ప్రేరేపిస్తే అది చేస్తారు. ఒక విచిత్రం - ఒకరాజకీయుడు ఓట్లకోసం దణ్ణాలు పెట్టుకుంటూ తిరుగుతాడు. ఎన్నికయిన తర్వాత దణ్ణాలు పెట్టించుకుంటూ తిరుగుతాడు. మన చేతనామాత్రజీవులు ఎన్నికల కాలంలో దణ్ణాలు పెట్టించుకుంటారు. ఆతర్వాత ఐదేళ్లపాటు దణ్ణాలు పెడుతూ తిరుగుతారు. మన రాజకీయాలు రోజురోజుకీ జటిలమైపోతున్నాయి. ఎన్నికల కోసం నిలబడ్డవాడు ఓటర్ల మేధావితనాన్ని మెచ్చుకోవచ్చుగానీ మనం ఎందుకు మెచ్చుకోవాలి. స్వాతంత్ర్యం వచ్చియాభై ఏళ్లయింది. ఎందుకు ఓట్లేస్తున్నారో ఇప్పటికీ జనాలకు తెలీదు. ఈ స్థితిలో పెద్దపెద్ద పసివాళ్లే ఆలోచించుకోలేకుండా పోతుంటే చిన్న చిన్న పసివాళ్లకుకూడా ఓటుహక్కు ఇచ్చారు. ప్రజలకు సేవచేయని రాజకీయవాదిని ఎన్నుకునే ఓటర్లు ప్రజలకు కీడుచేసే వాళ్లే అవుతారు. అంటే తమకు తాము కీడు చేసుకునేవాళ్లు. కాంగ్రెస్‌సంస్థను సేవారాజకీయసంస్థగా తీర్చిదిద్దాలని గాంధీజీ ప్రయత్నించాడు. ఆప్రయత్నం విదితం అయ్యేలోగా ఆయన చనిపోయాడు. అంతే - ఇప్పటికీ కాంగ్రెస్ సేవాసంస్థకాజాలకపోతున్నది. మిగతారాజకీయ పార్టీలన్నీ తమతమ ఓపిక ప్రకారం కాంగ్రెస్‌ను అనుకరించి బతుకుతున్నాయి. ఒక వింత

ఏమిటంటే ప్రతి రాజకీయ పక్షమూ తాను అధికారంలోకి వస్తే ఏదో వెలగబెడతానని చెప్తూ వుంటుంది. ప్రతిరాజకీయ పక్షమూ ఈదేశంలో అధికారం అనుభవించింది. వాస్తవానికి మనకు ప్రతిపక్షమనేదిలేదు. వీళ్లందరూ ఈ ప్రజలు ఎవరోపరాయి వాళ్లయినట్లు వీళ్లకు ఇంతచేశాం, అంతచేశాం అని చెప్పుకుంటారు. పూర్వం బ్రిటిష్‌వాడు ఇట్లాగే చెప్పుకునేవాడు. ఒక్కడుకూడా ఇప్పటికీ విధి నిర్వహణమాత్రమే చేశానని చెప్పుకునే వాడులేడు.

ప్ర: మన వివాహ వ్యవస్థలో రావలసిన మార్పులేమిటి ?

జ: మనదేశంలో సంప్రదాయకులు అని పేరుపెట్టుకుని అమాయకులచేత మర్యాదలు చేయించుకుండే మోసగాళ్లు పలువురున్నారు. వాళ్లు ఏదిచేస్తే అది సంప్రదాయం. ఇప్పుడు రాజకీయాల్లో ఎంత మోసంవున్నదో మన సంప్రదాయాల్లో అంతకంటే మోసంవున్నది. ఉదాహరణకు మనదేశంలో సంప్రదాయకుడెవ్వడూ యువతీ యువకుల్ని పెళ్లి చేసుకోనివ్వడు. యువతీయువకులకు సంప్రదాయకుడు పెళ్లి చేస్తాడు. పెళ్లి చేయటం సంప్రదాయం. పెళ్లి చేసుకొనటం సంప్రదాయంకాదు. నిజంగా సంప్రదాయమే తెలిసివుంటే ఇప్పుడు సంప్రదాయంపేరిట జరుగుతున్న దుర్మార్గాలు జరగేవికావు. పతంజలి భాష్యం చదువుతే పెళ్లికుమార్తెను వెతుక్కుంటూ పెళ్లికొడుకు తిరిగినట్లు విదితమవుతుంది. ఒక్కొక్కచోట పెళ్లికొడుకు కోసం పెళ్లి కూతురు తిరిగివుండచ్చు. పెళ్లికొడుకు తనకు నచ్చిన ప్రయోజకుడైతేనే పెళ్లికూతురు అతడితో మనువుకు సిద్ధపడేది. ఇప్పుడు మనపురుషాధిక్య సంఘంలో పెళ్లికూతురు పార్టీవాళ్లు పెళ్లికొడుకును వెతుక్కుంటూ తిరగాలి. మన సంప్రదాయాలు ఇట్లా తలకిందులైపోతుంటాయి. అసలీ సంప్రదాయమనేదే చాలా విచిత్రమైన మాట. మహాభారతం ఒక సంప్రదాయాన్ని నిర్దేశిస్తున్నదనుకుందాం. మనం ఆంధ్రులం. మనకిష్టమున్నాలేకపోయినా ఆంధ్రులమే. మనం మహాభారతంలో కౌరవుల పక్షం వాళ్లం. మనవలెనే ఉత్తర కాశీప్రాంత ప్రజలు కేవలం కౌరవుల పక్షమేకాకుండా ఇప్పటికీ దుర్యోధనుడికి దేవుడికి చేసినట్లుగా కొలుపులు చేస్తుంటారు. పాండవులు చంద్రవంశం వాళ్లు కాబట్టి మనలను ఒకప్పుడు పరిపాలించిన చాళుక్యులు చంద్రవంశం వాళ్లం అనుకున్నారు కాబట్టి మనం చాంద్రమానం పాటిస్తున్నాం. అంటే మన మాసగణన పద్ధతి చంద్రుడు చలనాలను ఆధారం చేసుకుని ఉంటుంది. సంప్రదాయాలు ఇట్లా ఉంటాయి. సూర్యుణ్ణే ఆధారం చేసుకుని ఏర్పడ్డమాసాల పద్ధతివున్నవాళ్లు ఉన్నారుకదా! వాళ్లకంటే మనం భిన్నులమా? ఇట్లా ఎన్నయినా చెప్పుకుపోవచ్చు. సంప్రదాయవాదులకు సంప్రదాయమనేది చలనం లేని బండ. ఈ సంప్రదాయానికి ఒక్కొక్కపుడు కొందరిని ఎక్కువ చేయటం, కొందరిని తక్కువ చేయటం మామూలు. పెళ్లి చూపులంటే మన సంప్రదాయంలో పెళ్లికూతురు చూపులే. పెళ్లి కొడుకుని చూట్టానికి ఏపెళ్లి కూతురు పార్టీవాళ్లూ ఇప్పటికి రాలేదు. పెళ్లికూతురును

చూట్టానికి వచ్చే అత్తగారు ఇప్పటికికూడా ఆదురదృష్టపు పెళ్లికూతురు మెళ్లో తనే తన నికృష్ట దృష్టులతో తాళికడుతుంది. పెళ్లికొడుకు కట్టే తాళి ఆతర్వాతదే. మంగళ సూత్రం అంటే జ్ఞాపకంవస్తోంది. ఇదేదో చాలా పవిత్రమైనదైనట్టు మనమూ భావిస్తున్నాం. సినిమా వాళ్లూ చెప్తున్నారు. అసలు మంగళసూత్రం అనేది ఎందుకు వచ్చినట్లు? ధర్మశాస్త్రానికి జైమంగళ వ్యాఖ్యలో దీని ప్రస్తావన ఉంది. ఆ ప్రస్తావన చదువుతే ఇదేదో లౌకిక చిహ్నమని తేలుతుంది. ధర్మశాస్త్రాలు రాసిన వాళ్లందరూ రుషులనే మూఢనమ్మకం మనకుంది. వాళ్లు సామాన్య మానవులే అని తెలుసుకుంటే ఈబెడద వుండదు. ఇంతకూ మనకు ఏ సంప్రదాయంపట్లా ఐతిహాసిక దృష్టిలేదు. వాళ్లెవరో దాష్టీకపు వ్యక్తులు ఆచారమే ప్రధమధర్మమన్నారు. అది మనకు జన్మశిక్ష అయింది. అందువలన మనదేశంలో పెళ్లిచేసే వాళ్లేవున్నారుగాని పెళ్లి చేసుకునే వాళ్లు లేకుండాపోయారు. పెళ్లిచేసేవాడున్నాడుగాబట్టి వాడు కట్నం అనేరుసుం తప్పకుండా పుచ్చుకుంటాడు.

*ప్ర: సైన్స్‌కు తత్వశాస్త్రానికివున్న సంబంధం ఏమిటి ?*

జ: మనదేశంలో విజ్ఞానశాస్త్రం తత్వశాస్త్రంతో ముడిపడే రూపొందింది. ముందుగా ఒక విషయం చూద్దాం. అది ఎంత విజ్ఞాన శాస్త్రమైనా అంటే విషయ సంబంధ జ్ఞానమైనా అది ఎంతగా భౌతిక శాస్త్ర లక్షణాలు కలిగినదైనా మనవాళ్లు దానిని దర్శనం కిందే భావించారు. అదికూడా భగవంతుడి దయవల్ల మానవుడికి అబ్బిన ప్రజ్ఞఅనే నమ్మారు. నమ్మించారుకూడాను. ఒక్క చిన్న ఉదాహరణ చెప్పుకుందాం. ఖగోళ శాస్త్రాన్ని గురించి రాసిన భాస్కరుడుకానీ, ఆర్యభట్టుకానీ అది తమకు దేవుడిచ్చిన ప్రజ్ఞగానే భావించారు. ఆర్యభట్టు ''బ్రహ్మదేవుడు ఈ భచక్రాన్ని 360 భాగాల కింద విభజించెను'' అన్నాడు. అంటే 360 డిగ్రీలను మానవుడు పరిగణన సౌలభ్యం కోసం కల్పించుకున్నాడు. ఆడిగ్రీలను భగవంతుడే కల్పించాడని చెబుతున్నాడు. ఈరోజుల్లోవలే కర్తృత్వం కోసం మోజుపడలేదు అంత గొప్ప విశేషం భగవంతునిదయ లేంది తనకెట్లా తెలుస్తుంది అని మరింత వినయమూర్తి అయిపోయినాడు. వినయంలేకపోతే అహంకారమే వస్తుంది. అహంకారం ఫలితం నేటి విజ్ఞాన శాస్త్ర క్షేత్రంలో మనం చూస్తూనే వున్నాం. కాబట్టి విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు మనకు దైవదత్తమైనవనుకుని వినయాన్ని పాటించాలి. ఇది మన పూర్వశాస్త్రవేత్తలు నేర్పిన పాఠం.

*ప్ర: టాగోర్ పట్ల బెంగాలీలు చూపిన ఆదరాన్ని, అభిమానాన్ని తెలుగు ప్రముఖుల పట్ల మనవారు చూపడం లేదు ఎందుచేత ?*

జ: ఇది ఏదో బజారు మాటలాంటిది. రవీంద్రనాథ్‌టాగోర్‌కు బెంగాలీలంతా సహాయం చేశారనుకోవటం పొరబాటు. ఆయన తన గొప్పను తానే ప్రతిష్టించుకున్నారు. ఆతర్వాతనే బెంగాలీ వాళ్లు ఆయనను పొగడటం ప్రారంభించారు. ముందుగా తన రచనలను

ఇంగ్లీషులోకి అనువదింపచేసుకున్నాడు. ఆవిధంగా ముందర ఇంగ్లీషువాళ్లకు తన గొప్ప తెలియచేసుకున్నాడు. ప్రపంచంలోకెల్లా గొప్ప వాళ్లయిన బెంగాలీలు అనేక మందిపుట్టారు. కానీ వాళ్లెవరికీ రవీంద్రనాథ్‌కు పట్టిన అదృష్టం పట్టలేదు. దానికి కారణం ఆయన తన ప్రచారం తాను చక్కగా చేసుకోవటమే. దీన్లో దోషమేంలేదు. ఒకటి రెండు బెంగాలీ వాళ్లవే ఉదాహరణలు చెప్పుకుందాం. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కుమారుడు తండ్రికంటే మించిన పండితుడు. సంస్కృతంలో విజ్ఞాన సర్వస్వమేరాశాడు. దానిపేరు 'వాచస్పత్యం' అది సంస్కృతంలో ఉంది. దాన్ని భారతీయులు చదవరు. ఏజర్మనీ వాళ్లో. చదువుతూవుంటారు. రాజారాధాకాంతదేవ శబ్దకల్పద్రుమం అనే సర్వస్వ ప్రాయమైన నిఘంటువు రాశాడు. అది సంస్కృతంలోనే. దాన్ని ప్రపంచంలో వుండే మహా పండితులందరికీ పంపించాడు. సరస్వతీదేవిని అమ్ముకోరాదనీ ఉచితంగానే అందరికీ ఇచ్చాడు. ఆయనదొక అపూర్వ పాండిత్యం. ఒక అపూర్వ వ్యక్తిత్వం. కాని సంస్కృతంలో రాశాడు. భారతీయులు ఎంతమంది చదువుతారు. ఇతరదేశపండితులు చదువుతారు.

అసలు ఈవిధమైన పరిశోధన ఏదీ లేకుండగానే లోకధర్మాన్ని బాగా ఎరిగిన శరత్‌బాబు రాసిన నవలలు ప్రపంచ మంతటా ఈవాల్టికీ చదువుతున్నారు. కానీ ఆయనకు నోబెల్‌బహుమతిరాలేదు. అందువల్ల ఆయన తక్కువవాడని భారతీయుల అంచనా.

మనవాళ్లకు ఏదో ఒక విధమైన శుష్కవేదాంతం అలవడింది. ఎవడో పొగిడితే తప్ప మనగొప్ప మనకు తెలియదు. మనం పొగడుకోం. అట్లా అని పొగడకుండా ఉండలేం. మనదేశంపై దండయాత్రచేసి స్థిరపడిన పరిపాలకులపట్ల మనకు ఉన్నమోజు పెంపుడుకుక్కకు కూడా వుండదు. ఈస్ట్ ఇండియా కంపెనీవాళ్లు ఎవరిని మెచ్చారో వాళ్లని మెచ్చడం మనకు ఆనవాయితీ అయిపోయింది. ఒకచిన్న ఉదాహరణ చెప్పుకుందాం. త్యాగరాజు అనే తెలుగువాడు తమిళదేశంలో పుట్టిపెరిగాడు. తన గానామృతాన్ని తమిళ దేశీయులకు విన్పించాడు. త్యాగరాజు సమాధికి ఒక తెలుగు నాగరత్నం తన ఆర్జన యావత్తు ధారవోసి మహాక్షేత్రంగా రూపొందించింది. తమిళులు ఈనాటికీ అక్కడ త్యాగరాజు ఉత్సవాలు జరుపుతున్నారు. ఆంధ్రదేశంలో ఏం ఉత్సవాలు జరుపుతున్నాం?

ఇంతకూ త్యాగరాజు ప్రతిభను దేశదేశాలచాటినది తమిళులు --- వాళ్ల సంబంధం మొదలియార్ (త్యాగయ్యను గురించి ఇంగ్లీషులో రాసిన) వాళ్ల డాక్టర్ వి. రాఘవన్, విజయరాఘవాచారి (స్పిరిచువల్ హెరిటేజ్ ఆఫ్ త్యాగరాజ) - వాళ్ల ఎం.ఎస్. సుబ్బులక్ష్మి మరికొందరు చేశారు. రానురాను మనం తెలుగు భాషను మర్చేపోతున్నాం. నోబెల్‌బహుమానమే గొప్ప అనుకోవటంలో ఈ తికమక వస్తోంది. నోబెల్ బహుమానం పొందిన సి. వి. రామన్ మన విశాఖలో చదువుకున్నవాడే గదా! మనం భారతదేశానికి ముగ్గురు రాష్ట్రపతులను ఇచ్చామే.

ఇది పత్రికా రచనకు సంబంధించిన కృషిలో అడుగుతున్నప్రశ్నకదూ! మన కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు ఎం. చలపతిరావు, సి.వై. చింతామణి, బి. హనుమంతరావు, ఖాసా సుబ్బారావు ఇంకా ఎందరో దేశాన్ని పత్రికారచనను కలిపి గొప్పగా సేవించుకున్నారు.

ఏవిధంగాచూసినా తెలుగుదేశంలో గొప్పవాళ్లకు లోటులేదు. అజ్ఞానులు గుర్తించనంత మాత్రాన మనకు లోటులేదు.

*ప్ర : ముస్లిం పాలకుల వలన జరిగిన మంచి ఏమిటి ?*

జ: ఆంధ్రదేశానికి సేవచేసిన పరిపాలకులే చాలా కొద్ది మంది. వాళ్లు హిందువులు కావచ్చు. ముస్లింలుకావచ్చు. ముగ్గురిని మాత్రం పేర్కొంటాను. కడపటి కాకతీయ ప్రభువులు ఎప్పుడూ యుద్ధంలోనే నిమగ్నులైవున్నారు. కానీ యుద్ధానికి యుద్ధమే, పౌరపరిపాలనకు పౌరపరిపాలనే - రెండింటిని విడివిడిగా పరిపాలనకు ఏవిధమైన లోపం రానీయకుండా కట్టుదిట్టం చేశారు. కాకపోతే ఈ ఆంధ్రదేశం బాగున్నదనే అసూయతో ఢిల్లీ ప్రభువులు దండయాత్రలు చేసి సుఖప్రదంగా నడిచిపోతున్న పరిపాలనను నాశనం చేసిపోయారు.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం వాళ్ల దగ్గర పనిచేసిన ఉద్యోగులు, సామంతులు మొత్తం నాలుగు రాజ్యాలు స్థాపించారు. ఒకటి - ఆంధ్రరాజ్యం (రేకపల్లిరాజధాని) ఇంకోటి పద్మనాయకుల రాజ్యం (రాచకొండరాజధాని) మూడోది రెడ్డిరాజ్యం (కొండవీడురాజధాని) నాల్గోది విజయనగర సామ్రాజ్యం (హంపి) వీళ్లందరికీ కాకతీయుల పరిపాలన తీరుతెన్నులు కొంతకొంతగా అవగతమై ఉన్నవే. విజయనగరసామ్రాజ్యం చాలా గొప్ప మంత్రుల్ని చూసింది. పరిపాలనా పద్ధతి ఎట్లావున్నా పరిపాలకుల పద్ధతులు మెరుగ్గా ఉండటం కృష్ణదేవరాయలకాలంలో చూసిన విశేషం.

హైదరాబాద్‌లో ఆఖరి కుతుబ్‌షాహీ పరిపాలకుడు అబుల్ హసన్ తానాషా, అతడి ప్రధానమంత్రి పింగళి మాదన్న. అతడు పరిపాలనను పూర్వ పద్ధతులనుంచి తప్పించి క్రమబద్ధంచేశాడు. పరిపాలనను శాఖలకింద విభజించి ప్రజలకు తికమక లేకుండా చేశాడు. ఎవడి విధివాడు నిర్వహించేట్లు చేశాడు. అది లోగడ పరిపాలనను తమ స్వార్థాలకు ఉపయోగించుకున్న వారికి కన్నెర్ర అయింది. అటువంటి వాళ్లు ఔరంగజేబును పిలిచి రాజ్యం అతడి వశం చేశారు.

ఆ కడపటి ప్రభువు అబుల్‌హసన్ తానాషా కాలంలో తప్ప వేరే ఏముస్లిం ప్రభువు పరిపాలనను ప్రజోపయోగం నిమిత్తం ఒక క్రమపద్ధతిలో నడిపిన వాడంటూ లేడు. ముస్లిమైనా హిందువైనా మన పరిపాలకుల తీరుతెన్నులు బాగున్నంతవరకూ ఇంతకంటే చెప్పుకోవటానికి లేదు. ఇప్పటి మతాతీత వ్యవస్థ పేరిట లేని గొప్పలు కల్పించలేం.

*ప్ర: అసలేమిటీ జీవిత పరమార్థం?*

జ: మనిషి పరిణామదశలో ఉన్నాడు. మహాత్ముడైనవాడు ఈ పరిణామక్రమాన్ని వేగవంతం చేస్తాడు. మంచి మనిషి కనుక అయ్యేటట్లయితే ఈపరిణామ క్రమాన్ని నిరోధించకుండా జీవితాన్ని వెళ్లదీస్తాడు. దుర్మార్గుడు వెనక్కి మళ్లిస్తాడుకూడాను.

అయితే ఈ పరిణామ క్రమానికి మానవుడు ఎట్లాదోహదం చేయాలి? అది తెలుసుకోవటమే ఉత్కృష్టసాధన లేక తపస్సు.

మహాత్ములు తపస్సంటే ఆలోచన అని నిర్వచించారు. తపయితి ఆలోచనమ్. కానీ తపస్సనేదాన్ని కేవలం ఒక లౌకిక కర్మగా ఊహించిన పెద్దలు యోగః చిత్తవృత్తి నిరోధః అంటే మనసుతో చేసే పనులన్నీ ఆపివేయుటమే తపస్సన్నారు. దానివల్ల ఏమైనా చిత్త విశ్రాంతి దొరుకుతుందేమోగానీ దానివలన సాధన తృప్తి కలగదు.

ఇట్లా చెప్పుకుపోతే ఇది పెద్ద గ్రంథమవుతుంది. కాబట్టి కొద్దిలో చెప్పాలంటే మానవ జీవితానికి సమగ్రత కలగటానికి ఆదర్శవంతమైన కృషి చేయటమే పరమావధి.

*ప్ర: మీ జీవితాన్ని వెనక్కి తిరిగిచూసుకుంటే?*

జ: ఈదేశ స్వాతంత్ర్య సమరంలో జైలుకు వెళ్లడం ఒక్కటే నేను చేసిన మంచిపని. మిగతాదంతా - అదొకవిధమైన తప్పొప్పుల తడక. నవ్వులాటకాదుగానీ మన సంఘంలో వుండే పెద్దమనిషి హోదా అనుభవించేవాళ్లని ఎప్పుడనుకరించినా, హాస్యాస్పద వ్యక్తినే అయినాను. నేను స్వతంత్రంగా చేసిన తప్పులు నాకేనాడు పశ్చాత్తాపం కల్గించలేదు. కాకపోతే ఈతప్పు చేయకూడదనే గుణపాఠానికి కారకమైనాయి.

మన సంఘం ఆమాటకొస్తే ఈ ప్రపంచంలో ఉన్న సంఘాలన్నీ మానవ మర్యాదలు పాటించడంలేదు. మాటల్లో, చేతల్లో ఆలోచనల్లో పరస్పర సంబంధాలలో ఒక విధమైన ఫ్యూడల్ పద్ధతినే అనుసరిస్తున్నాయి. ఉదాహరణకు మనవాళ్లకు ఎవరికీ దేవుడికి రాచమర్యాదలు చేయటం ఎబ్బెట్టుగా కనపడటం లేదు. తిరుపతి వెంకటేశ్వరుడికి రాజుగారికి చేసే మర్యాదలన్నీ చేస్తున్నారు. ఎందువలన? దేవుడికి చేయాల్సిన మర్యాదలేవో తెలీక. అదీ ఈ ప్రపంచంలోవున్న మతాలన్నింటిలోపం. ఈ మతం వచ్చిపడి ఆధ్యాత్మిక సాధనను వికృత పరిచింది. మతం వల్ల కులంవల్ల మానవతకు వికృతీకరణ ప్రాప్తించింది.

కాబట్టి మనిషిగా వ్యక్తిత్వం సాధించుకున్న ఎవ్వడైనాసరే ఈ లోకంలో ఒక విడ్డూరమే!

*ప్ర: యోగి ఎవరు?*

జ: సమగ్ర మానవత్వం అనేది దాదాపు అసంభవం అయినా నాకు మానవులుగా కానవచ్చినా కొందరి పేర్లు పేర్కొంటాను. ఆధునిక పురాణాల్లోనివే పేర్కొంటాను.

బ్లావట్స్కీ, రామకృష్ణ పరమహంస, గజానన్ మహారాజ్, రమణ మహర్షి, గణపతి ముని, జిడ్డు కృష్ణమూర్తి, మహాత్మాగాంధీ ఇట్లా కొందరు. దీనికి నేను రామమనోహర్ లోహియా, బెర్నార్డ్‌షా పేర్లుకూడా చేర్చగలను.

వీళ్లల్లో ముచ్చటగొలిపే గుణం ఏమిటంటే వాళ్లు చేసే పనిపట్ల వాళ్లకి సంపూర్ణ అవగాహన సంపూర్ణ అంకితభావం ఉండేవి. వాళ్ల ప్రవర్తన గతానుగతికం కాదు. వ్యక్తిత్వంగల వాళ్లు.

*ప్ర: హుస్సేన్ చిత్రించిన సరస్వతీదేవి చిత్రంపై గొడవ గురించి మీరేమంటారు?*

జ: దాదాపు 70 ఏళ్ల కిందట ప్రమోద్ కుమార్ ఛటోపాధ్యాయ (కౌతా ఆనందమోహన్, కౌతారామమోహన్, అడవి బాపిరాజుగారల గురువు) సరస్వతీదేవి చిత్రం ఒకటివేశాడు. ఆ సరస్వతీదేవి చిత్రాన్ని వినీలవర్ణ ఛాయలలో చిత్రించాడు. రూపంలేని దేవతకు వినీల వర్ణమే ఛాయ అవుతుంది. ఆకాశనీలం మనకు కళ్లకు కనపడే రంగే కానీ అది లేదు. కాబట్టి లేనిరంగులో సరస్వతీదేవిని చిత్రించాడు. పైగా ఆమె దిగంబర. అంటే దిక్కులే వస్త్రంగా కలది. ఆమెను లౌకిక ప్రపంచంలోకి తీసుకురావటానికా అన్నట్లు ఆమె తన దేహానికి అడ్డంగా వీణను పట్టి ఉన్నట్లు చిత్రించాడు. అన్నట్లు ఉలిపిరి కాయితంలాంటి. ఒక వస్త్రం ఆమె దేహానికి అలంకరణగా పైనుంచి. కాళ్లపైన జీరాడేటట్లు వేశాడు. అది ఆకాశనీలమే. ఆవస్త్రం అలంకరణేగానీ ఆచ్ఛాదనకాదు.

ఇంతకీ అంత మహత్తరమైన చిత్రాన్ని మాడరన్ రివ్యూ అనే మాసపత్రిక అట్టపైన వేశారు. నీతులు హక్కులకు పరిమితమైన జనం అప్పుడూ ఉండేవారు ఇప్పుడూ ఉన్నారు. అటువంటి వాళ్లు బ్రిటిష్ రాజ ప్రతినిధి దగ్గరకు వెళ్లి ఆ మాడరన్ రివ్యూ సంచికను దుకాణాల్లో అమ్మకుండా నిషేధింప చేశారు. సరే తర్వాత ఆ నిషేధాన్ని తొలగించటానికి ఎవరో సహాయపడ్డారనుకోండి. ఇంతకూ ఇది మతం మూలాన ఆధ్యాత్మికాలోచనను అణచివేసే ప్రయత్నం. పూర్వం నుంచీ ఇంతే. హుసేన్ వేసిన చిత్రంలో ఆధ్యాత్మికత ఉన్నదా? ఆక్షేపించే వాళ్లకు ఆధ్యాత్మికత ఉన్నదా?

*ప్ర: ఆత్మ, పునర్జన్మ గురించి చెప్పండి?*

జ: ఇంతకు ముందు మహాత్ములపేర్లు చెప్పాను. నా అవగాహనకు అందిన వాళ్లపేర్లు చెప్పాను. మరొక పేరు చెబుతాను. అతడిపేరు బి.ఆర్. లక్ష్మయ్య. అతడు చాలా కాలం హైదరాబాద్ నగర కాంగ్రెస్ సంఘం ఉపాధ్యక్షుడిగా ఉండేవాడు. నగర కాంగ్రెస్‌లో ఎప్పుడు విన్నా పైరవీల ముచ్చటే, ముఠాల ముచ్చటే. అది అతడికి జుగుప్స కలిగించింది. అతడు అంతకు ముందు నిజాం ప్రభుత్వ కాలంలో ఆర్యసమాజ్‌లో పనిచేశాడు. సాహసి. గొప్ప వారితో కలిసి మెలిసి తిరిగేవాడు. ఈ కాంగ్రెస్‌వాళ్ల ముచ్చట్లు అతడికి తానెందుకు బతికున్నాను అనే జిజ్ఞాసను కలిగించినై.

నాచిన్నప్పుడు బన్సీలాల్ పేటలో శవాలు కాలుతుంటే చూసే వాణ్ణి. అకస్మాత్తుగా వర్షంవస్తే శవదహనానికి అంతరాయం వాటిల్లేది - మళ్లీ ఎంతో శ్రమ పడితే కాని ఆచితి అంటుకోదు. పైగా ఆ శ్మశానంలో తేళ్లు, మండ్రగబ్బలు, పాములు, ముళ్లచెట్లు ధారాళంగా ఉండేవి.

మిత్రుడు లక్ష్మయ్య ఈ శ్మశానాన్ని బాగుచేయటం కాంగ్రెస్‌లో పదవిని అలంకరించటం కంటే గొప్ప అనుకున్నాడు. ముందుగా శ్మశానాన్ని పరిశుభ్రం చేశాడు. శవదహనానికి అనువుగా షెడ్లు వేశాడు. అతనికిష్టంవున్నా లేకపోయినా అపరకర్మలు చేసే వాళ్లపట్ల ఆప్యాయతతో కొన్ని అవసర సౌకర్యాలున్న గదులు నిర్మించాడు. ఇప్పటికీ ప్రతిదినం అక్కడికి వెళ్లి దానిని పరలోక దర్శనానికి తీసుకువెళ్లే ఒక అనువైన మజిలీగా తీర్చిదిద్దుతూ వుంటాడు. సహృదయులకు ఆచోటు చనిపోయేలోగా తప్పక ఒక్క రాత్రి అయినా నిద్ర చేయవలసిన పుణ్యక్షేత్రం అని నమ్మకం కుదురుతుంది.

లక్ష్మయ్యతో వాదించటం కష్టం. అతడి నమ్మకాలు మనవికూడా అయితే వాదించనక్కరలేదు కదా! భగవద్గీతలో మరణం అంటే పాతగుడ్డలు వదిలేసి కొత్త గుడ్డలు వేసుకోవటం అని నిర్వచించారు. ఈ ఆత్మచావదు అన్నారు. మరి గరుడ పురాణంలో నరకానికి ప్రయాణం నరకంలోపడే శిక్షలు వర్ణించారే. ఎవరికి ఈ చావులు కలిగేది? అంటీ ముట్టకుండా వుండే ఆత్మకా? బూడిదైపోయిన శరీరానికా?

వేదాంతం పేరు చెప్పి మన పూర్వీకులు ఎంత అజ్ఞానాన్ని మన బుర్రల్లో జొప్పించారో-

**ప్ర: బ్రాహ్మణ వాదం వలన సమాజానికి జరిగిన చెరుపు ఏమిటి ?**

జ: బ్రాహ్మణ వాదం వలన చెరుపు జరిగిందని అనుకునే వాళ్లు చాలామంది ఉన్నారు. బ్రాహ్మణవాదం అంటే కులతత్వం అయివుండాలి. కులతత్వం అంటే నాలుగుకులాల వ్యవస్థను అనుసరించడంకూడా అయి వుండాలి. అది ఏ పరిస్థితులలో ఎవ్వరెవ్వరి ఆమోదంతో ఏర్పడిన వ్యవస్థ అయివుంటుందో ఇప్పటికి తేలలేదు. అప్పుడప్పుడు ఈ దేశంలో ఈ విధమైన కులవ్యవస్థ ఉండకూడదు అనే వాదాలు తలెత్తుతూనే ఉన్నాయి. దానివల్ల కులాలు అంతరించలేదు.

కొందరు మతనాయకులు విజృంభించి కులవ్యవస్థ ఉండకూడదని ప్రబోధాలు చేసినమాట నిజం. అట్లా ప్రబోధించిన వాళ్ల అనుయాయులు ఒక ప్రత్యేక కులం కింద మారిపోయినారు. ఒక్కొక్కప్పుడు ప్రత్యేక కులాలుగా కూడా మారిపోయారు. బౌద్ధము, జైనము కుల నిర్మూలనకు పాటుపడనేలేదు. శంకరాచార్యులు కుల నిర్మూలనకు పాటుపడలేదు. రామానుజాచార్యులు కులాన్ని మెచ్చలేదు. పైగా వైష్ణవులందరూ

ఒకటేనన్నట్లు చాటింపు చేశారు. తీరా ప్రతికులంలోనూ ఒక ఉపకులంగా వైష్ణవం కట్టుదిట్టమైపోయింది. బ్రాహ్మణుల్లో వడగలైలు, తెంగళైలు, వైఖానసులు, చేనేతవారిలో పద్మశాలీలు, దాసరులు, మాల దాసరులు, చాత్తాడ శ్రీవైష్ణవులు వగైరా వగైరా ఉపకులాలు. అట్లాగే బసవేశ్వరుడు కులం వద్దన్నాడు. శివుడే ముఖ్యమన్నాడు. పోనీ మహేశ్వరుడే ముఖ్యమన్నాడు. కానీ బ్రాహ్మణుల్లో ఆరాధ్యులు,శూద్రులలో జంగాలు, చేనేతవారిలో దేవాంగులు ఇతర అన్ని కులాల్లో మహేశ్వరులు, ఇట్లా ప్రతికులంలో శైవం, వైష్ణవం నెలకొన్నాయి. కులాలు ఎక్కువైన కొద్దీ మతగురువుల సంఖ్య కూడా ఎక్కువై ఎక్కువ మందికి తేరగా బతికే అవకాశాలు కలిగినాయి.

మత గురువుల్ని కులాలవారీగా ఏర్పాటు చేసుకొనటం సంప్రదాయమైపోయింది. ఇటువంటి కులవ్యవస్థ వలన వ్యక్తులనేకులు బాగుపడ్డారు. ఎవళ్లూ దేశానికెంత కీడు జరుగుతుందో, సంఘం ఎంత ఛిన్నాభిన్నమైనదో చూసినట్లు కానరాదు.

కులాలన్నీ వృత్తులను బట్టి ఏర్పడినవని కొందరు మేధావులు చెప్తుంటారు. చాలా కులాల వాళ్లకు వృత్తులులేవు. మరి ఆవృత్తులు లేని కులాలు ఏం చేయాలి? పూర్వం వున్న వృత్తుల పద్ధతి ఇప్పుడు చాలా మటుకు లేదు. కాబట్టి లుప్తమైన వృత్తులవాళ్ళు ఏం చేయాలి? కులాల నాయకులు, మతాల నాయకులు చాలా ప్రబలురు. ఎవళ్ల ప్రాబల్యం వాళ్లదైంది. కాకపోతే ఇటువంటి కులవ్యవస్థను ఎట్లా తరతరాలుగా రూపొందించుకుంటూ ఎట్లా కట్టుబాట్లు తమకు అనువుగా మార్చుకుంటూ ఇంత దూరం వచ్చారా అనేది మేధావుల ఊహకు తప్ప సకారణ పరిశోధనకు అందని విశేషం. ఎవడో ఈ పని చేసి పెట్టాడనుకోవడం ఈ నేరాచరణలో తమకు బాధ్యత లేదని సిగ్గువిడిచి చెప్పుకోవటమే అవుతుంది.

*ప్ర: బ్రాహ్మణ ఆధిపత్యం అంటూ ఒకప్పుడు ఉండేదా?*

జ: ఆధిపత్యం ప్రసక్తేలేదు. ఎక్కడో మూఢనమ్మకాలని పురస్కరించుకుని అడుక్కుతినే బ్రాహ్మణులను ఎవరో పూజిస్తే దానిని బ్రాహ్మణాధిపత్యం అనటం ఏమిటి? ఈ మూఢనమ్మకాలు ఎంత దారుణంగా ఉంటాయో చూడండి. అబ్రాహ్మణులలో వైష్ణవులు, వైష్ణవ బ్రాహ్మణులనే గౌరవించారు. అబ్రాహ్మణులలో శైవులు, శైవ బ్రాహ్మణులనే గౌరవించారు. ఇట్లా మూఢనమ్మకాలనుబట్టి ఎవరి మతనాయకులను వారు గౌరవించుకున్నారు. మూఢనమ్మకాలను తొలగిస్తే చాలా వరకు కులమేలేదు. అటువంటపుడు ఒక్క బ్రాహ్మలనే తిట్టటం ఎందుకు? మతపెద్దల్నీ, కులపెద్దల్ని అందర్నీ చుట్టేసి తిట్టాలి. ఆంధ్రబ్రాహ్మణుల్లో 26 శాఖలున్నాయి. ఇటీవలి వరకు వీళ్లలో ఒకళ్లకొకళ్ల మధ్య పంక్తి భోజనాలు కూడాలేవు. ఇప్పుడు కూడా ఎక్కువ మంది ఒకరితో ఒకరు

కలవరు. ఒకరితో ఒకరికి పెళ్లి సంబంధాలు దాదాపు మృగ్యం. ఇటువంటి అసాంఘిక వ్యవస్థ ఏవేవో కుల సంఘాలపై ప్రాధాన్యం వహించిందంటే అది దేశానికి పట్టిన కీడు. లంచం ఇచ్చిన వాడు, పుచ్చుకున్నవాడూ ఇద్దరూ అవివేకులే.

ప్ర: మీరు ఇల్లుకూడా కట్టుకోలేకపోయారని అంటారు?

జ: నాకు ఇల్లు ముఖ్యంకాదు. కానీ ఇప్పుడు నాకొకటి కలుగుతోంది. నేను ఈ ఊరు 1932లో వచ్చా చదువుకోటానికి. 1997 వచ్చింది. నా చదువు ఇంకాపూర్తి కాలేదు ఈజీవితం ఎందుకు నాపాల బడిందో ఇప్పటికీ నాకర్థంకాదు.

నాచదువుపూర్తయి. నేను ఒక ప్రయోజకుణ్ణయి బతకటం ఇంకా ప్రారంభం కాలేదు. ఈ మధ్యలో కొందరు నాకీ హైదరాబాద్ నగరంలో ఇల్లుకూడా లేదే అని అంటూ ఉంటారు. నా చదువుపూర్తయితేగదా నేనిక్కడ ఒక ఇంటివాణ్ణి కావటం. నిజానికి నాకు ఇల్లులేదు అనే బాధ ఇప్పటికీ కలగలేదు. అజ్ఞానంవల్ల ఒక తడవ ఇల్లు కట్టించుకోవాలని ప్రయత్నంచేశాను. నా అదృష్టం కొద్దీ అది విఫలమైంది. నేను బావున్నాను. వానప్రస్థాశ్రమంకూడా చవిచూస్తే తప్ప ఇల్లు కట్టించుకునే ప్రయత్నం చేయను. ఆపైన మిత్రుడు బి.ఆర్. లక్ష్మయ్య దగ్గరకెళ్లి సహాయమడుగుతాను.

గెస్ట్‌కాలమ్ శ్రీ చేకూరి రామారావు

# కవిత్వం మీదున్నంత మోజు వచనం మీద ఏదీ



పత్రికా భాషను గురించి చెప్పే విషయాలన్నీ తెలుగు వచనానికీ అన్వయి స్తాయి. పత్రికా భాషలో ఆధునిక వచనం కన్పిస్తుంది. ఆధునిక వచనాన్ని పత్రికాభాష మలుస్తున్నది. అందువల్ల ఈరెంటి సంబంధం ఒకరకమైన పారస్పర్య సంబంధం. తెలుగు వచనంలోలాగే పత్రికాభాషలో వాడే వచనంలో కూడా అంతవైవిధ్యం లేకపోవటం కొట్టొచ్చి నట్లు కన్పిస్తోంది. వార్తరాసినా, సంపాదకీయం రాసినా విషాద భరిత సంఘటనల గురించి రాసినా మామూలు రాజకీయ విషయం రాసినా అన్నిటికీ ఒకే వచనం వాడుతున్నారు. ఈ వచనంలో కవితా సంబంధమైన పద్ధతులు ఎక్కువగా ఉంటున్నాయి. ఆవేశాన్ని వ్యక్తం చేసే పదజాలమో వాక్యరీతులో తెలుగు సంపాదకీయాల్లో కూడా చోటుచేసు కుంటున్నాయి. అగ్ని ప్రమాదాల గురించి రాసినా, ఆంధ్రదేశ రాజకీయాల గురించి రాసినా ఒకే రకపు ఆవేశం కన్పిస్తుంది. వచనంలోవున్న భావాన్నిబట్టి శైలీ భేదాలుండటం ఇతర భాషల్లోని పద్ధతి. తెలుగులో అన్నిచోట్లా అనవసరమైన వాగాడంబరం కన్పిస్తోంది. ఇంగ్లీషు పత్రికల్లో కన్పించే క్లుప్తత, స్పష్టత, నిరలంకారత తెలుగు పత్రికల వచనంలో లేదు.

ఈ లోపానికి కారణం ఏ ఒక్కరిద్దరిమీదనో పెట్టడం భావ్యంకాదు. తెలుగు వచనం కోసం ఎక్కువ మంది శ్రమపడక పోవడం ప్రధానమైన కారణం. తెలుగువారికి కవిత్వం మీదున్నంతమోజు వచనం మీదలేదు. ఆధునిక నాగరికత అభివృద్ధి చెందిన దేశాల్లో వచన శైలీభేదాలకు చాలా ప్రాముఖ్యం ఇస్తారు. సాధారణమైన పదాలను వాడుతూనే వచన రచనలో అందాన్ని తీసుకువస్తారు. అవసరమైన చోట తగిన మోతాదులో హాస్య ప్రియత్వం, సౌందర్యదృష్టి చూపిస్తారు. తెలుగు వచన రచన ఆధునికమై నిండా ఓ శతాబ్దం కూడా కాలేదు. ఆధునిక వచన రచన కోసం మన దేశంలో ముఖ్యంగా తెలుగులో ఒక యుద్ధమే చేయాల్సి వచ్చింది. మన తెలుగు రచయితల్లో ఇంకా ఆ యుద్ధస్మృతులు పోలేదు. అంటే భాషనింకా గ్రాంధికం, వ్యావహారికం అనే నలుపు, తెలుపు రంగులో చూస్తున్నారు. ఇప్పుడది

సమస్య కానేకాదు. ఈనాటి తెలుగు భాషలో సందర్భోచితంగా ఎంత వైవిధ్యం ప్రదర్శించ గలమనేది ఇప్పుడు కావల్సింది.

ఈ పని కాలమే చేసి పెడుతుందనుకుంటే అది మన అలసత్వానికి గుర్తుగా మిగిలిపోతుంది. ఈసాంకేతిక యుగంలో అన్ని పనులు కాలం చేయదు. మనమే కాలంతో ముందుకు వెళ్లాలి. అందువలన పత్రికా రచయితలు, ఇతర సాహిత్య వేత్తలు వచన రచనలో శ్రద్ధ చూపిస్తే మనకి మంచి వచన రీతులు ఏర్పడే అవకాశం ఉంది.

దీనికి కావాల్సింది – రచనలు చేసేవారు తమ రచనల గురించి జాగ్రత్తగా ఆలోచించడం, తాము రాసిందంతా బంగారం అనుకోకుండా రచనలను ఎడిట్ చేసుకోవడం ముఖ్యమైనవి. ఇవికాక మంచి వచన రచనకు మార్గదర్శకంగావుండే విశ్లేషణాత్మక గ్రంథాలు, పదాల సూక్షసూక్ష్మర్థాల్లో వాటి భేదాలను సమానార్థకాల్లోవున్న అంతర్భేదాలను, విలువలను వివరించే నిఘంటువులు కూడా మనకు లేవు. వీటన్నిటికీ వ్యక్తులు, విద్యాసంస్థలు, రచయితలు, పత్రికలవారు సమగ్రంగానూ, విడివిడిగానూ ప్రయత్నం చేయాల్సిన అవసరం ఉంది.

# అనుబంధం

# జ్ఞానాన్ని సమర్థంగా సముపార్జించడం ఎలా?

శ్రీ ఆర్.సి.రెడ్డి బి.

ప్రత్యేక వ్యాసం

జ్ఞానాన్ని సమర్థంగా సంపాదించడం ఎలా అన్న విషయం తెలుసుకొనే ముందు జ్ఞానం ఆవశ్యకత, నిర్వచనం, పరిధి అనే అంశాలను పరిశీలించాలి.

ముందుగా మనం జ్ఞానం అవసరం గురించి తెలుసుకుందాం. జంతువులు తాము సంపాదించి దాచుకున్న జ్ఞానాన్ని ఉపయోగించుకోలేవు కాబట్టి అవి సుఖాలను అనుభవించలేవు. కానీ, మనిషి సంపాదించి దాచుకొన్న జ్ఞానాన్ని ఉపయోగించుకొని సుఖవంతమైన జీవితాన్ని గడపగలుగుతున్నాడు. విద్యుత్తు ఉపయోగాలైన వెలుతురు, వేడి, చల్లదనం వంటి ఆధునిక సౌకర్యాలు శాస్త్ర, సాంకేతిక విజ్ఞానంతో సాధించిన అభివృద్ధి ఫలాలే. మరొకవైపు సామాజిక శాస్త్రాలు సుఖప్రదమైన జీవితానికి దోహదపడుతున్నాయి. ఉదాహరణకు, బెర్ట్రండ్ రస్సెల్ 'కాంక్వెస్ట్ ఆఫ్ హాపీనెస్ అనే తన పుస్తకంలో ఇచ్చిన సూచనలను ఆచరించటం ద్వారా సుఖవంతమైన జీవితం గడవచ్చు. జ్ఞానం వల్ల అపార ప్రయోజనాలు ఉన్నాయి. కాబట్టి దీన్ని గురించి క్రమబద్ధంగా తెలుసుకుందాం.

జ్ఞానమంటే ఏమిటి?
జ్ఞాన పరిమితులేమిటి?
మనం ఎంతవరకు తెలుసుకోవాలి?
జ్ఞానం ఎలా సంపాదిస్తాం?
జ్ఞానాన్ని సమర్థంగా ఎలా సముపార్జించాలి?
జ్ఞానాన్ని ఏ రకంగా నిలుపుకోవాలి?

ముందుగా మొదటి ప్రశ్నకు జవాబు చెప్పుకుందాం. జ్ఞానమంటే ఏమిటి? స్థూలంగా చెప్పాలంటే దేన్ని గురించైనా ఏమిటి? ఎందుకు? ఎలా? ఎవరు? ఎప్పుడు? ఎక్కడ? అన్న ప్రశ్నలకు సమాధానమే జ్ఞానం. ఉదాహరణకు ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు 'స్వాతంత్ర్యానికి' సంబంధించిన జ్ఞానంగా రూపొందుతాయి. స్వాతంత్ర్యం అంటే ఏమిటి? స్వాతంత్ర్యం ఎందుకు? భారతదేశానికి స్వాతంత్ర్యం ఎలా వచ్చింది? భారతదేశానికి స్వాతంత్ర్యం ఎప్పుడు వచ్చింది? మన స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించిన వారెవరు?

ఇప్పుడు జ్ఞానం ఎంత విశాలమైందో తెలుసుకుందాం. అది విశ్వమంత విశాలమైంది, అనంతం. మనిషి సౌర కుటుంబం, నక్షత్ర వీధులూ మొదలైన విషయాలను గురించి పరిశోధించే కొద్దీ, దానికి సంబంధించిన అతని జ్ఞానం స్థూల పరిధిలో నిరంతరం పెరుగుతూ ఉంది. ఆ రకంగానే, సూక్ష్మస్థాయి పరిధిలో కూడా జన్యువులు, పరమాణువులు, ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు వంటి అంశాలకు సంబంధించి కూడా మనిషి జ్ఞానాన్ని సమీకరించుకుంటున్నాడు. ఈ రకంగా మనిషి

విశేషమైన జ్ఞానాన్ని సముపార్జిస్తున్నాడు. ఫలితంగా మైక్రోబయాలజీ, రేడియో కెమిస్ట్రీ, ఆస్ట్రో-ఫిజిక్స్ మొదలైన శాఖోపశాఖలతో జ్ఞానవృక్షం అభివృద్ధి చెందింది.

ఈ జ్ఞానాన్నంతటినీ సంపాదించడం కేవలం ఏ ఒక్క మనిషికో, మనుషుల సమూహానికో సాధ్యమవుతుందా? అసాధ్యం. జ్ఞానాన్వేషణలో తమ జీవిత కాలాన్నంతటినీ వెచ్చించినా ఏ ఒక్క మనిషి లేదా మనుషుల సమూహం మొత్తం జ్ఞానాన్ని సంపాదించడం సాధ్యం కాదు. జ్ఞానం విశ్వమంత విశాలమయింది కాబట్టి, మనం జ్ఞానంలో ఏ కొంత భాగాన్నో తెలుసుకోగలుగుతాం. ఒక వ్యక్తి అన్ని వస్తువులకు సంబంధించి అన్ని విషయాలను తెలుసుకోవడం కూడా అనవసరమే. ఒక విషయానికి సంబంధించి అంతా తెలుసుకున్న వాడు ఒక కార్డియాలజిస్టుగానో, రేడియాలజిస్టుగానో నిపుణుడు అవుతాడు. అలా కాని పక్షంలో, ప్రతి విషయానికీ సంబంధించి ఏ కొంచమో తెలుసుకున్న వాడు ఒక పరిపాలకుడో, పత్రికా రచయితో అవుతాడు. కాబట్టి, సంపాదించవలసిన జ్ఞానం ఒక వ్యక్తి వృత్తిపైన ఆధారపడి వుంటుంది.

జ్ఞానం ఏ రకంగా సంపాదిస్తాం? అన్నది తరువాత ప్రశ్న. చదవడం, వినడం, పరిశీలించడం, అనుభవం ద్వారా జ్ఞానం సంపాదించ గలుగుతాం. మన సంపాదించే జ్ఞానంలో ఎక్కువ భాగం చదవడం వల్లనే వస్తుంది. ఉపాధ్యాయుల ప్రసంగాలు, రేడియో ఉపన్యాసాలు, ఆడియో క్యాసెట్లు వినడం వల్ల కూడా జ్ఞానం సంపాదించవచ్చు. ఇటీవల టెలివిజన్, రేడియో వంటి దృశ్య, శ్రవణ సాధనాలు కూడా జ్ఞాన సముపార్జనకు దోహదం చేస్తున్నాయి.

కొన్ని రంగాల్లో పరిశీలన, అనుభవం రెండూ జ్ఞాన సంపాదనకు అవసరమవుతాయి. ఒక రైతు బిడ్డ వ్యవసాయానికి సంబంధించిన పరిజ్ఞానాన్ని పరిశీలన, అనుభవం ద్వారా సంపాదించగలుగుతాడు. సంప్రదాయిక సమాజంలో వడ్రంగం మొదలైన వృత్తులకు సంబంధించిన జ్ఞానం కూడా పరిశీలన, అనుభవం ద్వారానే లభిస్తుంది. ప్రస్తుతం ప్రైవేటు స్కూటర్ షాపుల్లో పనిచేసే కుర్రవాళ్ళు కూడా పరిశీలన, అనుభవం ద్వారా జ్ఞానాన్ని సంపాదిస్తున్నారు. అంతేగాకుండా రెండు సన్నిహితమైన వస్తువుల మధ్య వున్న చాలా సున్నితమైన వ్యత్యాసాల్ని కేవలం మాటల ద్వారా మాత్రమే వ్యక్తం చేయడం సాధ్యం కాదు. ఉదాహరణకు 'లడ్డూ', 'రసగుల్లా'ల తీపిదనంలో వుండే సున్నితమైన వ్యత్యాసాన్ని సమర్థంగా మాటల్లో వ్యక్తం చెయ్యడం కష్టం. దాన్ని రుచి చూసిన వాడే ఆ రెండింటి తీపిలో వుండే భేదాన్ని అనుభవించ గలుగుతాడు. అయినా అన్నింటినీ అనుభవం ద్వారా గ్రహించడం కూడా సాధ్యంకాదు. ఉదాహరణకు సయోనైడ్ రుచిని అనుభవించి చెప్పడం సాధ్యం కాదు. ఎందుకంటే అది నాలుకను తాకగానే నిర్జీవుడవుతాడు కనుక.

ఇక మనం జ్ఞానాన్ని సమర్థంగా సంపాదించే విషయానికొస్తే మనం సంపాదించే జ్ఞానం ఎంత అన్నది దాన్ని సంపాదించడానికి మనం వెచ్చించే సమయం మీద, మన సామర్థ్యం మీద ఆధారపడి వుంటుంది.

జ్ఞానాన్ని సమర్థంగా సంపాదించడం అన్నది హేతువాద దృష్టి, ఏకాగ్రత, చక్కని పఠన పద్ధతులు అన్న అంశాల మీద ఆధారపడి వుంటుంది.

హేతువాద దృక్పథం అంటే - ఏమిటి? ఎందుకు? ఎలా? ఎవరు? ఎక్కడ? అన్న ప్రశ్నలు వేసుకొనే మానసిక విధానం. ఉదాహరణకు జ్ఞానానికి సంబంధించే ఈ ప్రశ్నలను అడగవచ్చు. జ్ఞానమంటే ఏమిటి? జ్ఞాన సంపాదన ఎందుకోసం? ఏ రకంగా జ్ఞానాన్ని సంపాదించాలి? మొదలైనవి.

## ఏకాగ్రత అంటే ...

ఒక ప్రత్యేక విషయానికి మన దృష్టి పరిమితం కావడమే ఏకాగ్రత. ఏకాగ్రత ఒక్కో వ్యక్తికి ఒక్కో రకంగా వుంటుంది. ఏకాగ్రతను కొంతవరకు ప్రయత్నించి కూడా అలవరుచుకోవచ్చు. దీన్ని ఏ రకంగా అలవరుచుకోవాలి? చదువుతున్న లేదా వింటున్న విషయాన్ని గురించి హేతువాద స్పందనా దృక్పథంతో కూడా అలవరుచుకోవచ్చు. హేతువాద స్పందన అంటే తాను చెప్తున్న విషయాన్ని ఒక వ్యక్తి ఏ రకంగా సమర్థించుకుంటున్నాడు? ఒక ప్రత్యేక పదాన్ని అతడు ఏ అర్థంతో ఉపయోగిస్తున్నాడు? అతని ఆలోచనలలో తార్కిక క్రమముందా? నా అనుభవం పరిధిలో నేను ఏ రకమైన ఉదాహరణలు ఇవ్వగలుగుతాను? అనే పలు ప్రశ్నలు వేసుకోవడం. ఒక విషయం తీసుకుని ఈ పద్ధతిని అనుసరించడానికి ప్రయత్నిద్దాం.

పెద్ద ఎత్తున అటవీ నాశనం జరుగుతున్నది. 1976 నుండి 1982 దాకా ప్రతి సంవత్సరం 1.3 మిలియన్ హెక్టార్ల అడవులు నశించాయి. అటవీ నాశనం అంటే అడవుల విధ్వంసమే.

మొదటి వాక్యం చదవగానే, మనం ఈ ప్రశ్న వేసుకోవాలి - పెద్ద ఎత్తున అటవీ నాశనం జరుగుతున్నదన్న తన వాదాన్ని అతడు ఏ రకంగా సమర్థించుకుంటున్నాడు? అటవీ నాశనం అంటే ఏమిటి? వెంటనే మనకు రెండో వాక్యం విషయాన్ని సమర్థిస్తున్నదనీ, మూడో వాక్యం అటవీ నాశనమంటే ఏమిటి అనే ప్రశ్నకు సమాధానం చెప్తున్నదనీ తెలిసిపోతుంది.

ఇక మంచి పఠన రీతులను గురించి చెప్పుకుందాం. సాధారణంగా కొన్ని వాక్యాలు ఏదో ఒక విషయానికి సంబంధించిన ఒక అంశం గురించి చెప్తుంటాయి. అంశాన్ని గుర్తించి మార్జిన్‌లో రాసుకోండి. చెప్తున్నది దేన్ని గురించి? అన్న ప్రశ్న వేసుకోవడం ద్వారా అంశాన్ని

బాగా గుర్తుంచుకోవచ్చు. ఉదాహరణకు అటవీ నాశనం అన్న విషయంలో అందుకు కారణాలూ, పరిణామాలూ అనే అంశాలు ప్రధానంగా వుంటాయి. ఆ అంశాలను మనం మార్జిన్‌లో గుర్తుంచుకోవాలి. మనం ఒక అభ్యాసం చేసి చూద్దాం.

**అభ్యాసం:** గ్రామీణ, పట్టణ పేద వర్గాలకు వంట చెరుకు అవసరం అన్నది అటవీ నాశనానికి ఒక ముఖ్య కారణం. ఇందుకోసం ప్రతి సంవత్సరం 55,000 హెక్టార్ల అడవులు నాశనం అవుతున్నాయి.

**కారణాలు:** ఇళ్ళ నిర్మాణం, ఫర్నీచర్, పండ్ల ప్యాకింగ్ మొదలైన కారణాల వల్ల అటవీ నాశనం గణనీయంగా జరుగుతున్నది. కాగితం మొదలైన పరిశ్రమల కోసం చెట్లను నరికి వేస్తున్నారు. ఆనకట్టల నిర్మాణం, గనుల కార్యక్రమాలు, పశువుల పెంపకం కూడా చెప్పుకోదగిన రీతిలో అటవీ నాశనానికి కారణాలవుతున్నాయి. మానవ సంబంధమైన కారణాలే కాకుండా, అడవుల్లో మంటలు కూడా అడవుల నాశనానికి కారణాలవుతున్నాయి. ఇటీవల చైనాలో మంట కారణంగా అడవులు పెద్ద ఎత్తున నాశనమయ్యాయి.

**పరిణామాలు:** అటవీ నాశనం - నేల తరుగుదల, నదులలో నీటి తరుగుదల, వరదలు, తక్కువ వర్షపాతం, వాతావరణంలో అధిక కార్బన్ డైఆక్సైడ్, వంట చెరుకు, పశుగ్రాస కొరత, అరుదైన వృక్ష, ఫల జాతుల వినాశనం మొదలైన వాటికి దారితీస్తుంది.

అంశాల్లోని ముఖ్య విషయాలను కింద గీతలు గీయడం ద్వారా ఉదాహరణల గణాంక వివరాల నుండి వేరు చెయ్యండి. ముఖ్యాంశాల్ని ఒక పదం లేదా పద బంధంతో మార్జిన్‌లో గుర్తుంచుకోండి. ఉదాహరణకు అటవీ నాశనానికి మూల కారణమైన అంశాల్లో పేదలకు వంట చెరుకు ఆవశ్యకత, గనులు, ఆనకట్టల నిర్మాణం మొదలైనవి ఉన్నాయి. వీటిని కింద గీత గీయడం ద్వారా ఉదాహరణల నుంచి, గణాంక వివరాల నుంచి వేరు చెయ్యవచ్చు. వీటిని మార్జిన్‌లో వంట చెరుకు ఆవశ్యకత, గనులు అని సూచించవచ్చు. ముందు చెప్పిన విషయాన్ని పరిశీలిద్దాం.

**అభ్యాసం:**
**ముఖ్యాంశాలు**

| | |
|---|---|
| వంట చెరుకు ఆవశ్యకత | గ్రామీణ, పట్టణ పేదల వంట చెరుకు ఆవశ్యకత అటవీ నాశనానికి ఒక ముఖ్య కారణం. ఈ అవసరం తీర్చడం కోసం ఏటా 55,000 హెక్టార్ల అడవులు నాశనమవుతున్నాయి. |
| ఇళ్ళ నిర్మాణం, ఫర్నీచర్ | ఇళ్ళ నిర్మాణం, ఫర్నీచర్‌ల కోసం కూడా అడవులు గణనీయంగా నాశనం అవుతున్నాయి. |

కాగితం పరిశ్రమ, ఆనకట్టలు, గనులు

కాగితం పరిశ్రమలు, ఆనకట్టల నిర్మాణం, గనుల తవ్వకాలకు కూడా చెప్పుకోదగిన రీతిలో చెట్లను నరికి వెయ్యడం జరుగుతున్నది. మానవ సంబంధమైన ఈ కారణాలకు, అడవుల్లో నిప్పు వంటివి కూడా తోడై వాటిని నాశనం చేస్తున్నాయి. ఇటీవల చైనాలో, అడవుల్లోని నిప్పు పెద్ద ఎత్తున అడవుల వినాశనానికి కారణమయ్యింది.

సంపాదించిన జ్ఞానాన్ని ఏ రకంగా మనం భద్రపరచుకోవాలి అన్నది తరువాతి విషయం. జ్ఞానాన్ని భద్రపరచుకోవడం అంటే జ్ఞాపకముంచుకోవడం. రచయిత లేదా ఉపన్యాసకుడు చెప్పిన ఆలోచనలు లేదా ముఖ్యాంశాలను పాఠకుడూ లేదా శ్రోత పర్యాయ పదాలలోకి మార్చుకోవడం జ్ఞానాన్ని నిలుపుకోవడంలో ముఖ్యమైన పద్ధతి. ఈ రకంగా మార్చుకోవడం, విషయాన్ని సమగ్రంగా అర్థం చేసుకున్నప్పుడే సాధ్యమవుతుంది. కాబట్టి మరిచిపోయే అవకాశ ముండదు. దీన్ని మనం బెట్రండ్ రస్సెల్ రచించిన ఒక విషయానికి అన్వయించి పరిశీలిద్దాం.

తన స్నేహితులకు ద్రోహం చేసి గొప్ప స్థానాన్ని ఆక్రమించిన ఫ్రాన్సిస్ బేకన్ 'అనుభవం నేర్పే పాఠాల్లో ముఖ్యమైనది జ్ఞానమే శక్తి అనడంలో ఏమాత్రం సందేహం లేదన్నాడు. ఇది అన్ని రకాల జ్ఞానాల పట్ల నిజం కాదు. బేకన్ తన దృష్టిలో వుంచుకున్న జ్ఞానం శాస్త్రీయమైంది.

మార్పిడి: జ్ఞానమే శక్తి అన్నది ఫ్రాన్సిస్ బేకన్ ప్రతిపాదన. అంటే శాస్త్రీయమైన జ్ఞానం శక్తికి మూలకారణమవుతుంది.

## తేదీలను, పేర్లను ఎలా గుర్తుంచుకోవాలి

అప్పుడప్పుడూ తేదీలనూ, పేర్లనూ జ్ఞాపకముంచుకోవడంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటూ ఉంటాం. తేదీలనూ, పేర్లనూ గుర్తుంచుకోవటానికి సంబంధం పరిశీలన వంటి కొన్ని విధానాలపై మనం ఆధారపడవలసి వస్తుంది. మనకు ఏమాత్రం పరిచయం లేని తేదీని మనకు పూర్తిగానో, పాక్షికంగానో పరిచయమున్న తేదీతో చేర్చుకుని గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు మనందరికీ 1857 తిరుగుబాటు గురించి తెలుసు. మనకు తెలిసిన ఈ సంవత్సరాన్ని ప్రాతిపదికగా ఉపయోగించుకొని ఏమాత్రం పరిచయం లేని ప్లాసీ యుద్ధం జరిగిన 1757 సంవత్సరం, 1657 షాజహాన్ కుమారులు రాజ్యాధికారం కోసం యుద్ధం చేసిన సంవత్సరం వంటి వాటిని మనం జ్ఞాపకముంచుకోవచ్చు. ఈ రకమైన సమన్వయం లోని సౌలభ్యం ఏమిటంటే 1857కి ఒక శతాబ్ది పూర్వం అంటే 1757లో ప్లాసీ యుద్ధం జరిగింది. రెండు దశాబ్దాల పూర్వం అంటే 1657లో షాజహాన్ కుమారుల మధ్య రాజ్యాధికారం కోసం యుద్ధం జరిగింది.

పాక్షిక సంబంధం అన్న పద్ధతి మీద ఆధారపడటం వల్ల కూడా మనం తేదీలను గుర్తుంచుకోవచ్చు. పాక్షిక సంబంధం ద్వారా ఒక తేదీని మనం పాక్షికంగా గుర్తుంచుకోగలిగితే, తక్కిన భాగాన్ని సులభంగా జ్ఞాపకం తెచ్చుకోవచ్చు. ఉదాహరణకు బహమనీ సామ్రాజ్య స్థాపన జరిగిన సంవత్సరమైన 1347 లోని 47ను మనకు స్వాతంత్ర్యమొచ్చిన 1947లోని 47తో చేర్చుకుని మనం జ్ఞాపకముంచుకోవచ్చు. 1947 మనకు బాగా పరిచయమున్న సంవత్సరం.

తేదీల్లో ఆరోహణక్రమం, అవరోహణ క్రమం అన్న పద్ధతులను పాటిస్తూ పరిశీలించడం చాలా ఉపయోగకరంగా వుంటుంది. ఉదాహరణకు మౌర్య సామ్రాజ్య స్థాపన జరిగిన సంవత్సరమైన క్రీ. పూ. 321నే తీసుకుందాం. ఈ తేదీని కుడివైపు 1 నుండి మొదలు పెట్టి ఆరోహణ క్రమంలో 1, 2, 3 అని అనుకోవడం ద్వారా చాలా సులభంగా గుర్తుంచుకోవచ్చు.

ఫ్రెంచి విప్లవం జరిగిన 1789వ సంవత్సరాన్ని 7, 8, 9 అని పాక్షిక ఆరోహణ క్రమం అన్న పద్ధతి ద్వారా జ్ఞాపకముంచుకోవచ్చు. 7 నుండి 1 చేర్చుకుని వరుసగా పెంచుకుంటూ పోవడం జరుగుతున్నది. మొత్తం సంవత్సరాన్ని మనం గుర్తుంచుకోవాలంటే, ఒక వారాన్ని గురించి ఆలోచించాలి. ఒక వారం అనగానే మనకు ముందుగా 1 గుర్తుకు వస్తుంది. తరువాత 7 గుర్తుకు వస్తుంది. అంటే ఒకటి తరువాత ఏడు, దాని తరువాత మనం పాక్షిక ఆరోహణ క్రమం పైన ఆధారపడవచ్చు. ఈ రకంగా సంబంధం, పరిశీలన అన్న పద్ధతులను ఉపయోగించి మనం సంవత్సరాలను, సంఖ్యలను కూడా జ్ఞాపకముంచుకోవచ్చు.

## దృశ్యరూపం ఇవ్వండి

పేర్లను గుర్తుంచుకోవడంలో సంబంధం, ఆకారంగా మార్చుకోవడం అన్న పద్ధతులపై ఆధారపడవచ్చు. మనకు పరిచయం లేని పేరును ఈ రకంగానే ధ్వనించే మరొక పేరుతోగాని, లేదా పాక్షికంగానైనా ధ్వనుల సామ్యమున్న పేరుతో గాని జోడించుకోవాలి. ఉదాహరణకు, అంగోలా రాజధాని అయిన 'లౌండా'ను ఆ రకమైన ధ్వనులున్న 'లాండ్రీ' అన్న పదంతో జోడించుకుని మనం గుర్తుంచుకోవచ్చు.

పేర్లను ఆకారాలుగా మార్చుకోవడం వల్ల కూడా గుర్తుంచుకోవచ్చు. 'లౌండా' అనునది ఎన్నో 'లాండ్రీ'లున్న నగరంగా మనం ఊహించుకోవచ్చు. ఈ రకమైన సంబంధాలూ, ఆకారాలూ మార్పిడి చెయ్యడాలూ, తర్కవిరుద్ధమైనా, పేర్లను గుర్తుంచుకోవడానికి ఈ పద్ధతులు ఉపయోగపడుతున్నాయి.

**జ్ఞానమే శక్తి. సంపాదించండి. నిలుపుకోండి.**



# చక్రధతీఋం

రెండు ప్రముఖ దిన పత్రికల్లో డెస్క్ ఇన్‌ఛార్జి హోదాలో
పదిహేనేళ్ల అనుభవం. కొన్ని కథలు, ఎన్నో వ్యాసాలు రాశారు.
మీరూ జర్నలిస్ట్ కావచ్చు పుస్తకానికి విశేష పాఠకాదరణ.
కొత్తగా చదువు నేర్చిన వయోజనుల కోసం రాసిన
'సుఖజీవనం' పుస్తకానికి జాతీయ అవార్డు.
శ్రీ కాకాని చక్రపాణితో కలిసి రాసిన
గోరంత దీపం నవల ఆంధ్రప్రభ వీక్లీలో
ధారావాహికంగా ప్రచురితం. జర్నలిజంలో గోల్డ్‌మెడల్.
ప్రస్తుతం రచన జర్నలిజం కళాశాలకు సారథ్యం.
డాక్టర్ వి. కిషన్‌రావు ఆధ్వర్యంలో
తెలుగు పత్రికలపై పరిశోధన.

# రుణానంద లహరి . . .

ఈ పుస్తకం ఇలా అందంగా రెక్కలు కట్టుకుని మీ ముందు వాలటం
వెనక మిత్రులు, శ్రేయోభిలాషులు అందజేసిన సహాయ, సహకారాలు
మరవలేనివి. ఈ రచనను పర్యవేక్షించి కొత్తవన్నెలు అద్దారు
ప్రముఖ సాహిత్య విమర్శకుడు, సీనియర్ జర్నలిస్ట్
శ్రీ సొదుం రామ్మోహన్. కోరగానే ఇంటర్వ్యూలకు సమయం
కేటాయించి ఈ పుస్తకానికి మరింత శోభ తెచ్చారు
శ్రీయుతులు నండూరి రామమోహనరావు, పొత్తూరి వెంకటేశ్వరరావు,
వి. వాసుదేవ దీక్షితులు, కె.రామచంద్ర మూర్తి, జి.కృష్ణ, చేరా.
(ఇంటర్వ్యూలలో వారి వారి భాషా శైలినే అనుసరించాను)
ఈ పుస్తకాన్ని ఆసాంతం చదివి ఆశీస్సులు పలికారు
శ్రీ బూదరాజు రాధాకృష్ణ. కవరూ, కార్టూన్లూ
అందంగా మలిచారు మోహన్. కేరికేచర్లతో కవ్వించారు శంకర్.
ఈ పుస్తకం వెలుగు చూడడానికి నాకంటే ఎక్కువ పరితపించాడు
జి. శ్రీధర్ రెడ్డి. ఇంకా పన్నాల సుబ్రహ్మణ్య భట్టు, పి.వి. రామ్‌కుమార్,
డా. కె.వి.ఎస్. ఆచార్య, కొవ్వలి పద్మనాభ శర్మ, వేగిరెడ్డి హరిచక్రవర్తి,
బాల, కొలిడే మహేశ్, పెన్మెత్స శ్రీహరిరాజు వెన్నుదన్నుగా నిలిచారు.
అచ్చు బాధ్యతను పూర్తిగా భుజాన వేసుకున్నారు శ్రీ మామిళ్లపల్లి
రాంమూర్తి. రచన జర్నలిజం కళాశాల యాజమాన్యం
అండదండలూ మరవలేనివి.
మరెందరో మిత్రులు, శ్రేయోభిలాషులు..
ఈ రుణాన్ని నేను ఎలా తీర్చుకోగలను ?

మీ

**చక్రధర్**

